# ఓగేటి వ్యాసపీఠి







ఓగేటి అచ్యుత రామశాస్త్రి
ఎం.ఏ.,పిహెచ్.డి.

# ఓగేటి వ్యాసపీఠి

## ప్రథమభాగము

అపూర్వములైన వివిధ పరిశోధనా సాహిత్య వ్యాసముల సంపుటి




రచన

రాష్ట్రకవి

డాక్టర్ ఓగేటి అచ్యుతరామశాస్త్రి,
ఎం.ఏ; పిహెచ్.డి.

సాహిత్యసభా ప్రచురణ

H.No. 8-[illegible]-46, ప్రతాప్‌నగర్, పంజగుట్ట, హైదరాబాదు-50048

**OGETI VYASA PEETHI :**

A collection of research and literary essays

By Dr. Ogeti Achyuta Rama Sastry, Rastra Kavi.

---



500 Copies

First Edition, December 1986

Published by :

SAHITYA SABHA

Hyderabad - 500 482.

Copies available at :

1. **Dr. Ogeti Achyuta Rama Sastry**, M.A; Ph. D.
   H No. 8-2-46, Pratap Nagar, Panjagutta,
   Hyderabad - 500 482.

2. **Navayuga Book House,**
   Phone : **44658**
   Sultan Bazar, HYDERABAD-500 195.

Price : **RS. 40-00**

Printed at :

Sri Sharada Enterprises,
H. No 5-1-246, Sunder Bhavan, Jambagh,
Hyderabad - 195.

# విషయానుక్రమణిక

డా॥ పి. యస్. ఆర్. అప్పారావు

సాంస్కృతిక వ్యవహారాల శాఖ — హైదరాబాదు

డైరక్టర్ (రిటైర్డు) — 14-12-1986

# పరిచయం

డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారు సంస్కృతభాషాభిమానులకు, సంస్కృత నాటకరంగాభిమానులకు సుపరిచితులు. సంస్కృత ప్రచారమే జీవిత ధ్యేయంగా వ్యక్తిగతంగా కృషిచేస్తున్న అల్ప సంఖ్యాకులలో వీరొకరు. ప్రచారం మాత్రమే కాక సాహిత్య సృష్టికి, విమర్శకు, పరిశోధనకు నడుంకట్టి, ఎఱ్ఱాప్రగడపై సిద్ధాంత వ్యాసం వ్రాసి డాక్టరేట్ పట్టం పుచ్చుకొన్నారు శాస్త్రిగారు.

'ఓగేటి వ్యాసపీఠి' అనే ఈ సంకలన గ్రంథంలో వివిధ సాహిత్య ప్రక్రియలపై 21 వ్యాసాలున్నాయి, ఒక కథానిక ఉంది. అక్టోబర్ 1955 నుంచి అక్టోబరు 1986 వరకు ఆయా పత్రికలలో ప్రచురించినవి, రేడియోలో ప్రసంగించినవి ఇందులో చోటు చేసుకొన్నాయి. 235 పుటల ఈ గ్రంథంలో 1[illegible] పుటలు "తిక్కనగారి హరిహరనాథుడు తిరుమల వేంకటేశ్వరుడే" అన్న సిద్ధాంత స్థాపనకు సంబంధించిన ఎనిమిది వ్యాసాలు ఆక్రమించినాయి. తక్కిన 127 పుటలలో సంస్కృతభాషా సాహిత్యాలకు సంబంధించిన వ్యాసాలు నాలుగు 35 పుటలు. ఇంక తక్కిన సుమారు 92 పుటలలో తెలుగుభాషా సాహిత్యాలకు సంబంధించిన వ్యాసాలున్నాయి. ఇందులో ఒక కథానిక, రెండు పరిశోధన వ్యాసాలు, తక్కినవి విమర్శలు.

ఈ గ్రంథంలో మొదటి అంశం 'కనపడని కామరాజు' అనే కథానిక. కథానికల పోటీలో ప్రథమ బహుమతి పొందిన రచన ఇది. ముగింపు సహృదయుల గుండెల్ని పిండేస్తున్నది; కథాగమనం ఆసాంతం తదున్ముఖంగానే సాగింది. దృష్టి పెట్టి చదివినప్పుడే ఇందులోని శిల్పవిన్యాసం బోధపడుతుంది. 'గుజ్జాల గోపిరెడ్డి' అనే జానపద వీరునిమీద, 'గోన గన్నారెడ్డి' అనే కాకతీయ సామ్రాజ్య రక్షాదీక్షుని మీద రెండు వ్యాసాలున్నాయి. ఇవి చారిత్రక పరిశోధనకు సంబంధించిన వ్యాసాలు.

అందునా, శాసనాలు ఆధారంగా రచింపబడిన వ్యాసం "గోన గన్నారెడ్డి; శాసన కథావాఙ్మయ సృష్టికి 'నమూనా' కాదగిన వ్యాసమిది. స్వామి వివేకానందుని తత్త్వవేత్తగా. భారతీయ సాంస్కృతిక మహత్త్వమును ప్రపంచ దేశాలన్నింటిచేత గుర్తింపచేసిన మహనీయునిగా లోకం ఎరుగును. అంతేకాదు, ఆయన భావుకుడైన మంచి కవికూడా అని విశదం చేస్తున్నది 'వివేకానందుని సంస్కృతకవిత్వం' అనే వ్యాసం.

శాస్త్రిగారు దుందుభినామ సంవత్సరం ఉగాదినుంచి 'సంస్కృత భారతీ'అనే త్రైమాసిక పత్రిక ప్రచురణను స్వీయసంపాదకత్వంలో ప్రారంభించారు. సంస్కృతంలో తొలిపత్రిక 'కాశీ విద్యాసుధానిధి' అనేది 1861లో ప్రారంభమైంది. నాటినుంచి 1982వ సంవత్సరం వరకు సంస్కృత భాషలో వెలసిన, వెలువడుతున్న పత్రికలను గూర్చి వివరిస్తున్నది 'సంస్కృత పత్రికలు' అనే వ్యాసం. కవిగా, నాటకకర్తగా, ఆలంకారికునిగా, రాజశేఖరునకు సంస్కృతసాహిత్యంలో ప్రత్యేక స్థానం ఉంది; ఆ స్థానాన్ని విశదం చేస్తున్నది 'రాజశేఖరః - సంస్కృత సాహిత్యే తస్య స్థానమ్' అనే వ్యాసం; శాస్త్రిగారు సంస్కృతభాషలో చేసిన రేడియో ప్రసంగం ఇది.

'కవిసమ్రాట్' బిరుదాంచితులు శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు. నవలాశిల్పిగా నాటక కర్తగా, ఆంధ్ర దేవీభాగవత స్రష్టగా నోరివారు సుప్రసిద్ధులు. వారితో శాస్త్రిగారు ముఖాముఖి చేసిన ప్రసంగ సారాంశం 'తెలుగు చరిత్రకు కావ్యత్వం కల్పించిన నవలా శిల్పి నరసింహశాస్త్రి' అనే వ్యాసం. నోరివారు ఆరోగ్యంగా ఉన్నప్పుడు శాస్త్రిగారు వారిని కలిసివుంటే, ఈ వ్యాసం మరింత సమగ్రంగా ఉండి ఉండేది. తెలుగు నాటకరంగంలో తిరుపతి వేంకటకవులు రచించిన 'పాండవోద్యోగ విజయాల'కు ఒక ప్రత్యేకస్థానం ఉంది. ఆ స్థానం దానికి ఎందువల్ల లభించిందో సోదాహరణంగా వివరిస్తూ. మార్పును వాంఛిస్తున్న వ్యాసం "పాండవోద్యోగ విజయములకు పరిమితమైపోయిన పౌరాణిక నాటక రంగం".

మన కావ్యాలలో, ప్రబంధాలలో శృంగారం మితిమీరి వర్ణింపబడిందన్న అపప్రథ ఉంది. ఇది కొంతవరకు నిజమే అయినా ఆ యా రచనలలో ఔచిత్యపరిధిని దాటకుండా శృంగారరస పోషణం మనోజ్ఞంగాజరిగిన ఘట్టాలు కోకొల్లలు. నన్నయ

నాటినుండి చేమకూర వేంకటకవి వరకు శృంగారం ఔచిత్యవంతంగా పోషింప బడిన ఘట్టాలను దిఙ్మాత్రంగా వివరించారు శాస్త్రిగారు 'ప్రాచీన కవితలో శృంగారము- ఔచిత్య పాలనము' అన్న వ్యాసంలో. తెలుగు కావ్యాలలో రాయబారాలను తిర్యక్కులు, స్త్రీలు, పురుషులు ముప్పిధాలుగా నిర్వహించారు. తెలుగు కావ్యాల లోని రమ్యమైన కొన్ని రాయబార సన్నివేశాలను 'తెలుగు కావ్యాల్లో రాయబార ఘట్టాలు' అన్న చిరువ్యాసంలో వివరించారు శాస్త్రిగారు. ఇది రేడియో ప్రసంగంకావటం చేత పరిమితి చిన్నదై పోయింది. ప్రాచీనుడైన నన్నయ మొదలుకొని, అర్వాచీనుడయిన గురజాడ వరకు తెలుగు సాహిత్యంలో ఛందోరీతులు పలుపోకడలతో విలసిల్లినవి; ఆ రీతులను స్పష్టం చేస్తున్న వ్యాసం 'తెలుగులో ఛందోరీతులు'. త్రిభాషా సూత్ర ప్రాముఖ్యాన్ని, తెలుగుభాష ప్రత్యేకతను, భారతదేశానికి అధికారభాష కాగల దాని శక్తిని నిరూపించారు శాస్త్రిగారు 'రెండవ అనుసంధాన భాషగా తెలుగు' అన్న వ్యాసంలో.

హరిహరనాథ సంబంధి ఎనిమిది కాక ఇంక మిగిలినవి:- 1. ప్రాచీన సంస్కృత నాటక సాహిత్యంలో జానపదకళలు, 2. కన్యాశుల్కనాటకము- విశేష విమర్శనము అనే రెండు వ్యాసాలు.

సంస్కృత నాటకాలనగానే రాజులు, రాణులు, వారి శృంగార కలాపం మాత్రమే జ్ఞప్తికి వస్తాయి కొందరికి. కాని, అందులో ఆనాటి దుష్టసంప్రదాయాలను, దురాచారాలను దుయ్యబట్టే అనేక ప్రహసనాలు వెలిసినవని, అసలు నాటకాలలోనే అటువంటి ఘట్టాలు అందునా నాటి జానపద కళలకు అద్దం పట్టే ఘట్టాలు ఉన్నవనీ తెలియదు పలువురికి. కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలంలోని జాలరి, భాసుని పాంచరాత్రంలోని గొల్లపడుచుల నృత్యం, బాలచరితంలోని డప్పుల నృత్యం, శ్రీహర్షుని రత్నావళిలోని గారడీవాడు, విశాఖదత్తుని ముద్రారాక్షసంలో యమపటవేషధారి అయిన వీధిగాయకుడు, పాములవాడు- ఈ ఘట్టాలలో నాటి జానపదకళా రూపాలు ఎట్లా చిత్రింపబడినాయో వివరించి, శాస్త్రిగారు విమర్శకుల కనులు తెరిపించారనటం అతిశయోక్తి కాజాలదు.

సంస్కృత సాహిత్యంలోని మృచ్ఛకటిక తరువాత భారతదేశంలో చెప్పుకోదగిన సాంఘికనాటకం గురజాడవారి 'కన్యాశుల్కం' అనటంలో సహృదయులెవ్వరికి

విప్రతిపత్తి ఉండరాదు. ఈ ప్రశంసకు పాత్రమైంది సంపూర్ణంగా సంస్కరింపబడి 1909 లో ముద్రణ భాగ్యంపొందిన 'కన్యాశుల్కం'. గురజాడ వారికి కవికులగురువైన కాళిదాసు అభిమానకవి అన్న సత్యం వారిడైరీలు, కన్యాశుల్కంలోని ప్రసంగాలు స్పష్టం చేస్తున్నవి. అందుచేత కాళిదాసు రచనల ప్రభావం వారి రచనలమీద తెలిసో తెలియకో ఉండటం అసంభవం కాదు. అందునా, జగత్ప్రసిద్ధి పొందిన అభిజ్ఞానశాకుంతల ప్రభావం వారిమీద తప్పకుండా ఉండి ఉంటుంది. అయితే ఆ నాటకానికి, ఈ తెలుగు ప్రకరణానికి పోలికలు ఉంటాయన్నది ఊహకు కూడా అందని విషయం. కాని, ఇది సత్యమే అని నిరూపిస్తున్నది కన్యాశుల్కం మీద శాస్త్రిగారి 'విశేష విమర్శనము'. బహుశః ఈ దృష్టితో కన్యాశుల్కాన్ని పరిశీలించిన ప్రథములు శాస్త్రిగారే అనుకొంటాను. ఆదిలో సందేహం కలిగినా, అంతంవరకు ఈ వ్యాసాన్ని చదివిన తరువాత శాస్త్రిగారు నిజంగానే ఈ విషయంలో విశేషపరిశ్రమ చేసినారనీ, ఇది నిజంగానే విశేష విమర్శఅనీ అంగీకరింపకతప్పదు. కన్యాశుల్కాన్ని ఇంకా తులనాత్మకంగా అనేక కోణాలనుంచి పరిశీలించవలసి ఉంటుందని కూడా శాస్త్రిగారు హెచ్చరిక చేశారు.

ఇంక మిగిలినవి తిరుమల వేంకటేశ్వరుడు, తిక్కనగారి హరిహరనాథుడు ఒక్కరే అని సిద్ధాంతపర్చే ఎనిమిది వ్యాసాలు. తిక్కన తన పంచమాంధ్రీకరణమును హరిహరనాథునకు అంకితం చేసినాడు. తిక్కన కలలోనికి హరిహరనాథుడు స్వయంగావిచ్చేసి కృతిపతిత్వ మర్థించినాడు; తాను స్వయంగా రావటమే కాక, రికమెండేషన్ కొరకు తిక్కన తండ్రియైన కొమ్మనామాత్యుని వెంటపెట్టుకొని వచ్చినాడట. ఇంతచేసి, ఈ హరిహరనాథుడు ఎక్కడివాడో తిక్కన విశదం చేయలేదు.

తిక్కన తరువాత తమ రచనలను హరిహరనాథునకు అంకితంచేసిన నాచన సోమన, బైచరాజు వేంకటనాథుడు, నారాయణకవి, గోపరాజు, తాళ్ళపాక తిరుమలాచార్యుడు మున్నగువారు— కాని వీరెవ్వరూ ఈ హరిహరనాథుడు ఎక్కడివాడో చెప్పనేలేదు. మఱి దీని భావమేమి తిరుమలేశ!

తమిళదేశమున దివ్యసూరులుగా ప్రసిద్ధినందిన పన్నిద్దఱాళ్వారులలో మూడవవాడగు పేయాళ్వారు (క్రీ.శ. 6వ శతాబ్ది) ఒక పాశురములో తిరుమలవాసుని హరిహరస్వరూపునిగా వర్ణించినాడు; అందునా తొలుత శైవ చిహ్నములనుచెప్పి పిమ్మట

వైష్ణవ చిహ్నములను చెప్పినాడు. (ఈవిధంగానే 'కిమస్థి మాలాం' అన్న శ్లోకములో తిక్కనకూడా వర్ణించినాడు). 8 వ శతాబ్దిలో ఆదిశంకరులు తిరుమలను సందర్శించి శ్రీచక్ర స్థాపనచేసినట్లు ప్రతీతి రూఢిగా ఉన్నది. ఇంక 11 వ శతాబ్దిలో భగవద్రామానుజుల నాటికి తిరుమలవాసుడు శివుడా, విష్ణువా అన్న తగాదా మిన్నుముట్టింది. భగవద్రామానుజులు వైష్ణవులకు నాయకత్వం వహించి, రాజప్రాబల్యము నుపయోగించి, తిరుమలేశుని విష్ణువుగా తీర్మానించినట్లు కొండంతసాక్ష్యం గ్రంథస్థమై ఉన్నది. అప్పటినుండియే తిరుమలేశుడు వేంకటేశ్వరుడుగా ప్రసిద్ధి పొందినాడు. ఇట్లు తిరుమలేశుని విష్ణువుగా తీర్మానించినప్పటికీ, రామానుజులవారు హరిహరాత్మకతకు భంగం రానీయలేదు; నాగాభరణం, జట మొదలయినవి అట్లే ఉన్నవి. నేటికినీ, విష్ణ్వాలయములలో సాధారణముగా జరుగని కొన్ని సేవలు శ్రీ వేంకటేశ్వరాలయంలో జరుగుతున్నవి. ఈ విధంగా తమిళ - తెలుగు కావ్యాలను, ఆళ్వారుల పాశురాలను శాసనాలను, చరిత్రను ఆధారం చేసుకొని త్రోసిపుచ్చటానికి వీలులేని విధంగా తిక్కనయొక్క హరిహరనాథుడు తిరుమల వేంకటనాథుడేయని అచ్యుతరామశాస్త్రి గారు సిద్ధాంతంచేశారు. ఈ విషయం తిక్కన ఎందుకు చెప్పలేదో విశదంచేశారు.

అయితే చర్చకు, సిద్ధాంత స్థాపనకు సంబంధించిన ఈ ఎనిమిది వ్యాసాలు ఆ యా కాలాలలో. భిన్న ప్రయోజనాలను ఆశించి వ్రాసినవి. కావున, విషయవివరణలో పునరుక్తులు, జటిలత్వం, కాలక్రమ వ్యతిక్రమణం తప్పనిసరి అయినవి. ఈ వ్యాసాలను అన్నింటినీ పునః పరిశీలించి, సముచితమైన ప్రణాళిక వేసుకొని, సమ్యగ్విభజనముతో ప్రత్యేక గ్రంథంగా ప్రచురిస్తే. శాస్త్రి గారి ఆశయం, పరిశ్రమ సార్థకం కాగలవని విశ్వసిస్తున్నాను.

పరిమిత గ్రంథంలో విశాల విశ్వాన్ని చూపించిన అచ్యుతరామ శాస్త్రి గారిని అభినందిస్తున్నాను.

(సం.) పోణంగి శ్రీరామ అప్పారావు

ప్రగతిగీతా ప్రవక్త - పుంభావవాణీ సికిందరాబాదు
సత్కవితా కిరీటధారి - ఆంధ్రసాహిత్య సూక్తిరత్నాకర 15 .2-1986
అనేక కావ్యనిర్మాణచాతురీ సవ్యసాచి

**డా॥ నండూరి రామకృష్ణమాచార్య**
ఎం.ఏ. పిహెచ్.డి.

# అభినందన చందనము

"రచయితకు– రచనకు బింబ ప్రతి బింబ భావం ఏర్పడుట సహజం"– అంటారు సాహితీ ప్రియంభావుకులు. ఆ సూక్తిలో ఏమాత్రమైన సత్యం ఇమిడి ఉంటే, డాక్టరు ఓగేటి అచ్యుతరామశాస్త్రి గారి వ్యక్తిత్వం సుకుమార సుందరమైనది– అని పిస్తుంది. వీరి రచనలు- కవితలు- కథానికలు నాటికలు- సాహితీ సమీక్షలు వీరి సర్వతోముఖ సాహితీప్రతిభకు తార్కాణాలు. వీరికి డాక్టరేటు పట్టభద్రత చేకూర్చిన సిద్ధాంత వ్యాసం– "ఎఱ్ఱన అరణ్యపర్వ శేషము". ఎఱ్ఱాప్రెగ్గడకు– తెలుగునాడులో రావలసిన కీర్తి రాలేదు. దానికి కారణం– అతని రచనలు అతని వ్యక్తిత్వాన్ని సమగ్రంగా ప్రతిఫలించలేదు. ఎఱ్ఱాప్రెగ్గడ వ్రాసిన రామాయణం లభించకపోవటంచేత తెలుగు సారస్వతానికి మాత్రమే గాక తెలుగు చరిత్రకు, ఎఱ్ఱాప్రెగ్గడ వ్యక్తిత్వమునకు గూడ తీరని లోటు వాటిల్లింది.

డాక్టరు అచ్యుతరామశాస్త్రి గారికి ఇప్పుడు ఉన్న కీర్తికంటె మునుముందు ఎక్కువ పేరు రాగలదని నా నమ్మకం.

తిక్కన ఆశ్వాసాద్యంత పద్యాలకు వారుచేసిన సంస్కృతీకరణ– అద్యతన భవిష్యత్తులో అచ్చుకాగలదని ఆశించుచున్నాను.

II

డాక్టరు అచ్యుతరామశాస్త్రిగారి హృదయం– తెలుగు సాహిత్యం– సంస్కృత వాఙ్మయం– వేదాంతం– చరిత్ర– చతుర్భుజాలతో ఏర్పడిన హృదయంగమమైన సాహితీ చతురస్రం.

ఈ సువిశాల పరిధిలో– గుఱ్ఱాల గోపిరెడ్డి– వివేకానందుని సంస్కృతరచనలు– నవలా శిల్పం– తెలుగు ఛందోరీతులు– గోన గన్నారెడ్డి– కన్యాశుల్కం– ఎన్నో శీర్షికలకు చోటు సరిపోతుంది.

అయితే–

ప్రకృత రచన

ఓగేటి వ్యాస పీఠిని

రెండు సమ త్రికోణములుగా విభజించే

ఋజురేఖ - చారిత్రక పరిశోధన,

ఇందులో వీరు క్రొత్తగా చేసిన ప్రతిపాదన– "తిక్కన హరిహరనాథుడు తిరుమల వేంకటేశ్వరుడే–"

డాక్టరు అచ్యుతరామశాస్త్రి గారి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు చరిత్ర– సాహిత్యము అని చెప్పవచ్చు. ఈ సిద్ధాంతమును నిరూపించటానికి వీరు చరిత్రను– తెలుగు సాహిత్యమును- తమిళ వాఙ్మయమునుకూడ మథించారు. ఇందులో కొన్ని కలలు- తియ్యని కలవరింతలు ఉన్నాయి. ఎడనెడ చక్కని చమత్కారాలు చోటు చేసుకున్నాయి.

నన్నయ భాషా శిల్పం, తిక్కన భావ స్ఫూర్తి– ఎఱ్ఱన హృదయంలో గంగా యమునలవలె సంగమించాయి. నన్నయ అరణ్యపర్వశేషం– తద్రచనయ కాపూరించిన ఎఱ్ఱన– డాక్టరు అచ్యుతరామశాస్త్రిగారి దృష్టిలో– ఆ శంభుదాన బిరుదాంకుడు గూడ ఆంతర్యంలో హరిహరనాథోపాసకుడు, తిరుమలేశుని భక్తుడు– అని ఈ రచయిత మ్రోగించిన ఘంటారావం. దానికి ఉపపత్తిగా ఈయన చూపించిన తార్థాణ పద్యం– ఎఱ్ఱాప్రెగ్గడ విరచితం.

గిరిశపదభక్తి రసత

త్పరభావము కలిమి శంభుదాసుండనగా

బరగియు గోవింద గుణా

దర సంభృత సౌమనస్య ధన్యుడ వెందున్.

ఇందు శివ కేశవాద్వైత స్ఫూర్తి ప్రస్ఫుటము. అంతటితో అగక ఈ రచయిత ఎగువ తిరుమలలో గిరిశుడు దిగువ తిరుపతిలో గోవిందరాజస్వామికి ఈ పద్యము

భంగ్యంతర ధ్వనిగా అన్వయించుట చక్కని చమత్కారము. ఇది ఒక ఊహమాత్రమే.

అయితే- తమిళ పాశురములు- చారిత్రకాధారములు ఎన్నో కుప్పలుగా రాశి వోసి ఈ రచయిత తేల్చిన సిద్ధాంతము తిరుమలేశుడే తిక్కనగారి హరిహరనాథుడు- కొంగ్రొత్తదైనను యుక్తియుక్తముగా ఉన్నది. శ్రీ శంకర భగవత్పాదులవారి తిరుమలక్షేత్ర సందర్శన- తిరుమల తిరుపతి దేవస్థానములవారి ప్రచురణలు- తిక్కన తిరుపతి యాత్ర- ఆళ్వారుల దివ్యప్రబంధములు- వాచ్యముగా శ్రీ వేంకటేశ్వరుడే హరిహరనాథుడని తిక్కన చెప్పకపోవుటకు కారణములు- ఆశ్వాసాద్యంత పద్యములు ఆళ్వారుల పాశురములలోని సాదృశ్యములు అనుశీలించిన ఈ రచయిత చేసిన పరిశోధన- విలువను సహృదయులు గుర్తించి తలలూపక తప్పదు. అంతేగాదు- మాటవరుసకు మేధావియైన వాడెవడో వకీలుగ ఈ వాదమునకు పూర్వపక్షము నెలకొల్పుటకు యత్నింప వచ్చునేమో గాని- జడ్జిగ ధర్మాసనముపై కూర్చొనిన విద్వాంసుడు ఈరచయిత సిద్ధాంతమునకు అనుకూలముగానే తీర్పుచెప్పుట తథ్యము.

ఇక. సింహావలోకనముగ చెప్పవలసిన సమీక్ష. డాక్టరు అచ్యుతరామశాస్త్రి గారి వాక్కులు "అలతి అలతి మాటలతో కాహళ సంధించినట్లుగ" తేట తెనుగు నుడికారపు వంపు సొంపులతో ఆణిముత్యాల ముగ్గులుగా ముచ్చటగా తీర్చి దిద్దారు. ఇందులో ఎన్నో క్రొంగ్రొత్త ఊహలు ఉన్నాయి. అయితే ఏ ఒక్క ఊహకూడ అసమంజసమైనదిలేదు. ఈ రచయిత క్రాంతదర్శి. ఈయన తెలుగు విద్వాంసులలో ముక్కంటి. చర్మచక్షు ద్వయమే గాక ఈయనకు సమ్యక్ సర్వజ్ఞత ప్రసాదించు మనోనేత్రము ఉన్నది. భావి పరిశోధకులు ఈయన ప్రతిపాదించిన సిద్ధాంతములకు శిలా శాసన సాక్ష్యాధారములు సమకూర్చగలరని నా నమ్మకము. ఒకప్రక్క చరిత్రకారుడు- ఒక పార్శ్వమున సాహిత్యకారుడు- ఈ సాంస్కృతికార్ధ నారీశ్వరుడు మును ముందు మరికొన్ని సారస్వత చారిత్రక పరిశోధనలోగూడ కృతకృత్యుడు కాగలడని నమ్ముచున్నాను.

డాక్టరు అచ్యుతరామశాస్త్రిగారికి నా హృదయ పూర్వకమైన ధన్యవాదములు.

(సం) నండూరి రామకృష్ణమాచార్య

ఆర్షవిద్యా వాచస్పతి
శ్రీవిద్యా రత్నాకర
సర్వతంత్ర స్వతంత్ర

మైసూరు
17-12-1986

# శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

# పురోవాక్

చరిత్రకు తెలిసిన కాలమునుండి తిరుమలపై వేంచేసియున్న శ్రీ వేంకటేశ్వర మూర్తి యే దేవతామూర్తియని వివాద సంవాదములు జరుగుతునేయున్నవి. ఇప్పటి వరకు చివరిమాట పలుకబడలేదు. వైష్ణవమూర్తియని బహుళ ప్రచారమునందున్నప్పటికీ, వైష్ణవాగమములందు కనుపించని, అభిషేకాదులు, శుక్రవార ప్రత్యేకార్చనలు, ఆలయోపరి సింహములు, మొదలగు ఆచారాది కనుపించుచునే యున్నవి. శ్రీనివాసుడన్న ఆయన ప్రసిద్ధనామమునందే బహ్వర్థములు. మరియు వేంకటేశ్వరుడనుటలో, వైష్ణవాభిమతముకాని ఈశ్వర శబ్దము, బాలా(జి)యనుటలో అమ్మవారి పరమైన స్త్రీలింగ శబ్దము నిత్య శ్రవణముగా నున్నవి. అందుచేత అసలాయన మూర్తిలోని రహస్యమేమి? చారిత్రకముగా ఆ విగ్రహ స్వరూప పరిణామములెట్టివి? దేశకాల పరిస్థితులా దేవాలయముపై నెట్టి ప్రభావము నెఱపినవి? అన్న ప్రశ్నలకు నిష్కర్షగానున్న సమాధానములకై పరిశోధించుట, అన్వేషించుట- నేడుకూడ జరుగుటతో సమీచీనము, సమంజసము కానిదేమియు లేదు. పైగా అట్టి అన్వేషణము తీవ్రదృష్టి గల విద్వాంసులు తమ కర్తవ్యముగా భావించుటయు సమంజసమే.

తిక్కన సోమయాజిగారు ఆంధ్ర కవితాశిల్పాభిరమ్యముగ మహాభారతమున అధిక భాగమును, శ్రీ హరిహరనాథునికి అంకితముగా వెలయించినప్పటినుండి- ఆ హరిహరనాథుని సంభావనకు నిగమాగమ నేపథ్యమేమి? పౌరాణిక సమన్వయమేమి? ఆ స్వరూపము కేవలము ఊహామాత్రమైనదా? లేక దానికి ఆధారములు ఆర్షములున్నవా? చారిత్రక సందర్భనమున్నదా? ఈ ప్రశ్నలుకూడ ఆంధ్రసాహిత్య ప్రియంభావుకులను కొంత కొంత వేధించు చున్నవే యనవలయును.

హరిహరనాథ తత్త్వముపై కొంతకాలమునకు మునుపే రెండు గ్రంథములు వెలువడినవి. పండితరాజ శ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రిగారి రచనయొకటి, ఆచార్య (డా.) కేతవరపు రామకోటిశాస్త్రిగారి రచన మరియొకటి. అయితే వారి దృక్పథములు, విశ్లేషణావైఖరులు, సారభూతమైన విషయమును తేల్చుటలు— భిన్న భిన్నముగా నున్నవి.

శ్రీ వేంకటేశ్వరుని గురించి అపరిష్కృతములైన సమస్యలు, హరిహరనాథ తత్త్వ స్వరూపమైన సమస్యలు— ఈ రెంటిని గ్రహించి ద్రవిడ వేదప్రమాణములతో చారిత్రక ఆధారములతో సులభ సమన్వయ సుందరముగా పరిష్కారములను డా॥. ఓగేటి అచ్యుతరామశాస్త్రి గారు వెల్లడించిన గ్రంథమిది.

శ్రీ శాస్త్రిగారు నాపైగల అభిమానము కొలది- తమ గ్రంథముపై నన్ను నాలుగు మాటలు వ్రాయమనిరి. రెండు మూడు సంవత్సరములుగా ఆరోగ్యము తృప్తిగాలేక- మరికొన్ని సంఘటనలవలన మనశ్శాంతికూడ కొంచెము కొరవై— ప్రవాసమునందున్న నేను— ఆయన చూపిన అనురాగమునకు వశుడనై, నాలుగు మాటలు వ్రాయుటకు ప్రయత్నించినాను.

అతి పురాతన తమిళ గ్రంథమైన తొల్కాప్పియము పీఠికయందు తిరుమల ప్రస్తావన మున్నదని శ్రీ శాస్త్రిగారు సూచించిరి. అయితే దీనివలన సమస్యా పరిష్కారమునకు ఉపయోగపడుచున్నదేమియు లేదనిరి. వైష్ణవ భక్తులైన పన్నిద్దఱాళ్వారులలో పదిమంది తిరుమలస్వామిని దర్శించి ఆయనపై 215 పాశురములను చెప్పిరని అందు పేయాళ్వారు (క్రీ.శ. 6వ శతాబ్ది) రచించిన 15 పాశురములలో కీలకమైన పాశురమును ఉదహరించిరి, (నాలాయిర ప్రబంధమున మూడవఆయిరం). తిరుమలస్వామి పేయాళ్వారునకు— కొండసెలయేళ్ళు సమృద్ధిగా చుట్టును పారుచున్న తిరుమలకొండపై వెలసియున్న స్వామి "వ్రేలుచున్న జటలతో, పొడుగైన కిరీటముతో, సుందరమైన పరశువు (గొడ్డలి)తో, చక్రముతో, నడుమును చుట్టుకున్న సర్పముతో! బంగరు మొలత్రాడుతో, హరిహరరూపములు రెండును చేరిన సమైక్యతా రూపమున" దర్శన మనుగ్రహించెనట.

ఈ పాశుర తాత్పర్య విషయమున— తలకు జటలున్నవని, కిరీటమున్నదని, మొలకు సర్పము చుట్టుకొన్నదని, బంగరు మొలత్రాడుకలదని— చెప్పుటలో వివా

దము లేదు. ఇందు హర లక్షణములు, హరిలక్షణములు—క్రమాలంకారముగ చెప్ప బడిన్నవనుటయు సమ్మతమే. ఇక గొడ్డలి, చక్రము — అనుటకు బదులు చేతులందు ఖడ్గము, చక్రము అని చెప్పువారు కలరు: ఇచట నొకవిశేషము- శ్రీ మహావిష్ణువు ఆయుధములలో శంఖ, చక్ర, గదా కోదండములను మాత్రమే హస్తములందు ధరించును. ఖడ్గము (ఒర) నడుమునకు వ్రేలాడునట్లుంచుకొనును. కాబట్టి చేతులందు ఉన్నది గొడ్డలికాదు; ఖడ్గమనుటలో ఔచిత్యములేదు. తమిళమునందున్న పాశుర మున హరిహర శబ్ద ప్రయోగము లేదు గాని- విష్ణువుగా తాను భావించిన రూపమునందిట్లు శైవ చిహ్నములు దర్శనమిచ్చుట ఆళ్వారునకు ఆశ్చర్యము కలిగించి నట్లున్నది. అనగా శైవ వైష్ణవ చిహ్న సంకలిత ఏకాకృతినే ఆళ్వారుదర్శించెననుట నిర్వివాదము. పాశురమున "మలువుమ్" అను తమిళ పదమునకు 'గొడ్డలి' యన్న అర్థమునే తమిళ దేశమున వైష్ణవస్వాములు చెప్పుట నా అనుభవములోని విషయము. (నేను దాదాపు 28 సంవత్సరములు తమిళదేశ నివాసము చేసితిని). అయితే గొడ్డలి బదులు ఖడ్గమని తెలుగు అర్థమును వ్రాసినవారే- *(ఆ గ్రంథము ద్వితీయ సంపుటమున) గొడ్డలి యని దిద్దుకొనిరి. కనుక పేయాళ్వారు దర్శించిన తిరుమల స్వామి శైవ వైష్ణవ ఉభయ చిహ్నాంకితుడని, హరిహరస్వరూపమని నిర్ధారణ. దీనిని శ్రీ శాస్త్రిగారు సమర్థతతో నిర్వహించిరి.

నాథశబ్దము బహ్వర్థములు కలది. సంప్రదాయ భేదము నుబట్టి ఆయా అర్థములు ప్రచార ప్రసిద్ధములైనవి. శ్రీ శాస్త్రిగారు తీసికొన్న అర్థము సమీచీనమే.

శ్రీ శంకర భగవత్పాదుల ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రమున శ్రీశైల మల్లి కార్జున మహాలింగమును గూర్చి లభించిన పాఠాంతరమును గ్రహించి శ్రీ శాస్త్రిగారు "అపి" శబ్దమునకు సంస్కృతమున శాస్త్ర మర్యాదలను అవలంబించి హృద్యముగ వ్యాఖ్యానించిరి; మాధవీయ శంకర విజయమును బట్టి తిరుమలను దర్శించిన భగవత్పాదుల వారా శ్లోకమును రచించుటలోని ప్రాముఖ్యము గమనార్హము. సంస్కృత

---

* శ్రీ టి. కె. టి. వీరరాఘవాచార్య గారిచే రచింపబడి, 1977 లో ద్వితీయ ముద్రణ పొందిన "తిరుపతి చరిత్ర" ప్రథమ సంపుటం 48 వ పుటలో "ఖడ్గము" (Dagger) అని వ్రాసిరి. మరల వారే 1979 లో ద్వితీయ ముద్రణ పొందిన "తిరుపతి చరిత్ర" ద్వితీయ సంపుటం 796 పుటలో "గొడ్డలి" (Ax) అని దిద్దుకొనిరి.

మున వ్యాకరణ మీమాంసాద్వయాది శాస్త్రమర్యాదల నెరిగినవారికిది నిత్యపరిచయమే.

శ్రీ వేంకటేశ్వర దేవాలయమున అఖిల సంవిధానములను సంస్థాపించిన భగవద్రామానుజుల వారును, శైవులును యాదవరాజుకడ చేసిన వివాదమును బట్టి ఆనాటి కింకను శ్రీ వేంకటేశ్వరునికి శైవ చిహ్నములున్నట్లు స్పష్టము. వైష్ణవ శిఖామణులే— భగవద్రామానుజులవారు తమ భక్తి విశేషముచేత శ్రీ వేంకటేశ్వరుని వైష్ణవ చిహ్నములు ధరించునట్లు చేసిరని అంగీకరించు చున్నారు. వైష్ణవ గ్రంథములే చెప్పుచున్నవి. ఇది యంతయు చక్కగా ఉటంకించి శ్రీ శాస్త్రిగారు తమ వాదమును పుష్టి కావించు కొనిరి.

తిక్కనామాత్యుల వారికి తిరుమలతో పరిచయ మున్నదనుట నిర్వివాదమైన విషయము. ఆయన కాలమున నిది పౌత్తపి నాటికి చెందియుండినట్లు చారిత్రకు లనుచున్నారు. ఆ ప్రాంతము తిక్కన గారి కాలమున నెల్లూరు రాజ్యమునందంత ర్భాగమే. తిక్కనగారికి తిరుమలతో నున్న పరిచయము, తరువాత ఎఱ్ఱనగారి కాలమున (౭0 సంవత్సరములు) తిరుమల ప్రసిద్ధ క్షేత్రమని నృసింహ పురాణమున ఉల్లేఖింపబడుట— శంభుదాసుడైన ఎఱ్ఱన గిరిశ పదభక్తి రసతత్పర భావము, గోవింద గుణాదర సంభృత సౌమనస్యము— ఈ మొదలగు వాని నన్నిటిని శ్రీశాస్త్రి గారు సముచితముగ మలచుకొని తమ వాదమునకు ప్రౌఢిమను సంపాదించిరి.

తిక్కనగారి 'కిమస్థి మాల్యాం' శ్లోకమును, ఆయన స్వప్న వృత్తాంతమును కూడ శ్రీ శాస్త్రిగారు తమ వాద గమనమునకు, సొంపు కలిగించునట్లుపయోగించిరి.

ఆలంకారికులు రసధ్వనిని కవితాత్మగా నంగీకరించిరి. సాహిత్యమున ధ్వని కున్న స్థానము అచంచలమైనది. వాచ్యము కన్న వ్యంగ్యమునకే (ధ్వని) అధిక ప్రాముఖ్యము— వైష్ణవాలయములందు దివ్యప్రబంధములను (ద్రవిడవేదము) ప్రశంసించుట ఆరాధనా విశేషము. ఇది సర్వ వైష్ణవలోక సమ్మతము. ఈ వాక్యమున దివ్య ప్రబంధము లనుటకు బదులు పుణ్య ప్రబంధములని ప్రయోగించినచో వాచ్యమట్లుంచి ప్రకరణ ధ్వనిగా వ్యంజితమగుచున్నదేమో? ఈ ధ్వనిని (నాకు సాహిత్య సోదరుడు) కేతవరపు రామకోటి శాస్త్రి గుర్తించుట— దానిని శ్రీ శాస్త్రి గారు సముచిత రమణీయముగ నుపయోగించు కొనుటయు సంతోషకరములు.

తెలుగు సాహిత్యమున హరిహరనాథాంకితముగ రచనలు కావించినవారు

తిక్కనామాత్యులు, నాచన సోమన, భైరవరాజు వేంకటనాథుడు, నారాయణకవి, గోపరాజు, నారపామాత్యుడు మొదలగువారు. మాతృ పితృ గురు వంశములు శ్రీ వేంకటేశ్వరుని కులదైవముగా నుపాసించుచుండగా భైరవరాజు వేంకటనాథుడు హరిహరనాథునితో తనకుగల చనువును గురించి చెప్పికొనుటలోనున్న సాహిత్య మర్మమును శ్రీ శాస్త్రిగారు నిర్దోష స్ఫుటముగా సమన్వయించిరి.

తిక్కనగారి "వ్యాసాది వచోవిభవ" అను పద ప్రయోగమున, వ్యాస భగవానునితోపాటు శ్రీ శంకర భగవత్పాదులనుగూడ నుద్దేశించిరని 'ఆది' శబ్దమునకు అర్థ సమన్వయము చేయుటయు, శాస్త్ర సంప్రదాయానుసారమే. "ఆది' శబ్దమున కిట్టి సమన్వయములు సకలములైన శాస్త్రములందు ప్రదర్శితములగుచున్నవే. శ్రీ శాస్త్రి గారికి గల శాస్త్రవ్యాఖ్యాన పరిచయము వెల్లడింపబడుచున్న దీ సమన్వయమున.

శ్రీ వేంకటేశ్వర సహస్ర నామావళి యందున్న 'విరూపాక్ష' 'కపర్ది' నామములు, శరన్నవరాత్రి సందర్భ బ్రహ్మోత్సవములు— మొదలగు సూక్ష్మాంశముల నన్నిటిని శ్రీ శాస్త్రిగారు కొలబోసి తమ లక్ష్యమును సులభగంతవ్యము చేసికొనిరి.

వేంకటేశ్వరమూర్తి పంచాయతనస్థ పంచదేవతా సంపుటీకృత రూపమని బహుజనాభిప్రాయము. అందుచేతనే సకల శాఖలవారిని ఆకర్షించుచున్నదనియు సారభూతమైన భావము. శ్రీ శాస్త్రిగారీ లోకప్రతీతిని విస్మరింపలేదు.

భగవద్రామానుజులు శ్రీభాష్య మంగళాచరణమునం దనుసరించిన క్రమమును తిక్కనగారనుసరించుట యాదృచ్ఛికము కావచ్చును. ఆ క్రమము తనకు ఆదరణీయమైనను కావచ్చును.

'శేషశేషి' విమర్శనమున శ్రీ శాస్త్రిగారు శ్రీ భగవత్పాదులను అనుసరించిరి. వైష్ణవ నిర్వచనమున కిది కొంచెము భేదము కలది. శ్రీ శంకర భగవత్పాదానుసరణములో దోషమేమియులేదు. తిక్కన సోమయాజిగారు శ్రీ శంకర భగవత్పాదానుయాయియే కదా!

తిక్కన సోమయాజిగారి పద్యములను కొన్నిటిని తీసికొని (శ్రీసంపాదన, అజగవశార్ఙ్గాలంకృత, నిగమకుసుమ, దూరాంతిక, అనపేక్షిత. ఆదిత్యమరుద్వసు, శ్రీసక్తిస్ఫూర్తి) శ్రీ శాస్త్రిగారు కావించిన నిష్కర్షలు, పరిష్కరణలు, సహృదయసమ్మతములు.

తమిళదేశము భక్తిమతమునకు ప్రభవస్థానము. కబీరు మొదలగు ఔత్తరాహ

భక్తులకు గురువైన రామానందుడిట్లే చెప్పెను (భక్తి ద్రవిడసే లాయా). కావేరి ప్రాంతము భక్తిమతమునకు పుట్టినిల్లని కేరళ నారాయణ నంబూద్రి నారాయణీయమున చెప్పెను. తమిళదేశమునకు ఉత్తరపు ఎల్లగానున్న వేంకటాద్రిపై నెలకొన్న వెంకటనాథుని గురించి తమిళ వాఙ్మయమున వేర్వేరు కాలములవారేమేమిచెప్పిరో పరిశీలించుట శ్రీ శాస్త్రిగారి పరిశోధనకు ముఖ్యమైన సోపానమే.

శివభక్తులైన తిరుమూల నాయనారు (క్రీ.శ. 2 లేక 3 శతాబ్ది), కపిలదేవ నాయనారు (క్రీ.శ. 3 లేక 4 శతాబ్దము) మొదలగువారు తిరు వేంకటనాథుని పరమ శివునిగా వర్ణించిరని, అరుణగిరినాథర్ తిరుమలకొండపై నెలకొన్న దేవుని కుమార స్వామిగా సంభావించెనని, తొల్కాప్పియము నందుకూడ నిట్లేయున్నదని, కారైకాలమ్మయారు, శేరమాన్ పేరహళ్నారు తిరువెంగళనాథుని హరిహరాకృతిగా సంభావించిరనియు శ్రీ శాస్త్రిగారు సోపపత్తికముగ నిరూపించిరి.

మంత్రశాస్త్రమున 'మహావిద్య' యనగా వనదుర్గా మహావిద్యా పంచశతి. ఇది పంచశత మహామంత్రముల సంపుటి యైన మాలామహా మంత్రము. ఈ రహస్య విషయమును శ్రీ శాస్త్రిగారు ఉల్లేఖించుట— వారి వైదుష్య లక్షణము.

శ్రీ వేంకటేశ్వరుని సౌందర్యమును గురించి తమిళ వాఙ్మయమునందలి వర్ణనలు తీసికొని తిక్కనగారి పద్యములతో పోల్చుట వలన శ్రీ శాస్త్రిగారు నిగమనము చేయదలచిన విషయము మరింత సులభముగా వెల్లడియైనది.

శక్తి విటంకన్ ధర్మపత్నియగు సమవాయి పెరుందేవి తిరుమలనాథునికి పెక్కు కైంకర్యములు చేసిన మహనీయురాలు, శ్రీ వేంకటనాథునికై యొకధర్మనిధిని యేర్పాటు చేసినది. ఆలయమున ఉత్సవ విగ్రహమును చేయించినది. (మనవాళప్పెరుమాళ్), ఎన్నో భూషణములను చేయించెను. (తిరువాభరణము) పెక్కు ఉత్సవములను వార్షికము చేయుట కేర్పాట్లు కావించెను. ఈమె సమకూర్చి పెట్టిన ధర్మనిధి సంపదకు శ్రీ వేంకటనాథుడు ఆలంబనమైనాడు. ఈ చారిత్రక గాథ తిక్కనగారి హరిహరనాథ పద్యములందు స్ఫురించుచున్నదని శ్రీ శాస్త్రిగారు కావించిన వ్యాఖ్యానము ఆయన వ్యాఖ్యాన చాతుర్యమునకు దీపికగా నున్నది.

తిక్కనగారు సమవాయ పద ప్రయోగము చేసిన రెండు పద్యములలో తొలి పద్యమునను 'సమవాయాలంబమాన' అనుటలో సమవాయి కథా స్ఫురణము బహు

దీప్తిమంతముగా నున్నది. రెండవ పద్యమున (శ్రీ గిరిజా సమవాయ మహాగురు తర) సమవాయి కథాస్ఫురణ మంత ప్రకాశమానముగా లేదు. శ్రీ శాస్త్రిగారు ధ్వని మార్గము నవలంబించి దీనిని వ్యంజితము చేయ పూనుకొనిరి. ఇది సహృదయ హృదయవేద్యము.

ఇందున్న వ్యాసములు ఎనిమిది. వేరు వేరు సభలలో కావించిన ఉపన్యాసములుగా- భిన్న భిన్న పత్రికలలో వచ్చిన వ్యాసములుగానుండుట వలన కాబోలును- చెప్పిన విషయములను మరల చెప్పుట- చూపిన ఉదాహరణములనే మరల చూపుట మొదలగు పునరుక్తులు తప్పలేదు. ఇట్టివి పరిహరించుకొని- తిరిగి వ్రాయుట శ్రీ శాస్త్రిగారికి అభిమతముకాదు కాబోలును. అందుకుకూడ కారణము లుండవచ్చును.

వివిధ ప్రాంతములలో హరిహరాలయములన్న వ్యాసమునందు కొన్ని సంగతులు మరికొంత వ్యగ్రముగా చూడవలసినవి కలవు.

శ్రీ శంకర భగవత్పాదులచే నిర్మింపబడిన చతురామ్నాయ పీఠములలో "తస్య యజురేవ శిరః" అన్న శ్రుతి ప్రమాణముచేత సర్వ శిరః ప్రధాన పీఠమై, ఆదిపీఠమైన శ్రీ శృంగేరీ శారదా పీఠము నందొక ప్రాచీన హరిహర విగ్రహము కలదు. శృంగేరిలో హరిహర వీధియందొక హరిహరాలయము కలదు. ఈ రెండును తిక్కన సోమయాజిగారి కాలము నాటికి ముందున్నవే. తిక్కన సోమయాజిగారు శృంగేరి యాత్ర చేసినట్లు నాకు కొన్ని ఉపపత్తులు గోచరించినవి.

హరిహరపుర మొకటి చిక్కమగళూరునకు 70 కిలో మీటర్ల దూరమున కలదని శ్రీ శాస్త్రిగారు వ్రాసిరి. ఈ 'హరిహరపుర' చిక్కమగళూరు జిల్లాలో కొప్ప పట్టణమునకు- శృంగేరి పురమునకు మధ్య కలదు. కొప్ప పట్టణమునకు 12 మైళ్ళ దూరము. శృంగేరి పురమునకు 9 మైళ్ళ దూరము. చిక్కమగళూరునకు కొప్ప మీదుగా 70 మైళ్ళు- శృంగేరి మీదుగా 66 మైళ్ళు. ఇట్టివి కొన్ని శ్రీ శాస్త్రిగారు సవరించు కొనవలసినవి కలవు.

మొత్తము మీద శాస్త్రిగారి పరిశోధన- వ్యగ్రమైన దృష్టితో, తీవ్రమైన అభినివేశముతో- సమున్నతమైన వ్యుత్పత్తితో- గాఢమైన ప్రతిభతో సాగిన సమంచిత ప్రయత్నమని అంగీకరింపవలసి యున్నది. ఆయన తన ప్రయత్నమున కృతకృత్యుడైనాడని, తిక్కనగారి హరిహరనాథుని తిరుమల కొండపై పట్టుకొనినాడని- ఆ తిరు

మలేశుని యందున్న హరిహర లక్షణ ప్రతీకలను దుమ్ముదులిపి ప్రకాశవంతములు చేసి నాడనియు అంగీకరింపవలసి యున్నది.

అన్ని విధముల దక్షుడైన శ్రీ శాస్త్రిగారిట్లే మరి పెక్కు అపరిష్కృత విషయములను గ్రహించి సమీచీనమైన పరిశోధనలతో తెలుగు వాఙ్మయమును పుష్టి కావింప గలరని విశ్వసించు చున్నాను.

శ్రీః పాలయతు సర్వదా.

(సం) తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

**Prof.** Mukkamala Radhakrishna Sarma,
M.A.; PhD Dip. in Russian,

Professor & Head
Department of Ancient Indian
History Culture & Archaeology
Osmania University, Hyderabad-7 A.P.

P-8, Osmania University
Quarters,
Tarnaka, Hyderabad-7
INDIA.

# అభిప్రాయము

డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారు నాయందు వారికి గల అభిమానంతో 'ఓగేటి వ్యాసపీఠి' గ్రంథంలోని 'వేంకటేశ్వర తత్త్వమే తిక్కన హరిహరనాథ తత్త్వము' అనే అంశంపై అభిప్రాయం చెప్పమన్నారు. విషయం పరిశోధనా దృష్ట్యా చాల గంభీరమైంది, లోతైనది, వివిధ కోణాలలో చూడవలసింది. ఇట్లాంటి అంశాన్ని ఎన్నుకున్నందుకే అచ్యుతరామశాస్త్రి గారిని అభినందించాలి.

పూరీ జగన్నాథక్షేత్రాన్ని దర్శించి వచ్చిన వెంటనే ఈమాటలు వ్రాస్తున్నాను. ఒరిస్సాకు జగన్నాథు డెట్లాగో, ఆంధ్రకు తిరుపతి వేంకటేశ్వరుడు అట్లా. ఇరువురి చరిత్ర గురించి అనేక అపరిష్కృత సమస్యలు మిగిలివున్నవి. రెంటినీ శివ, విష్ణు, శక్తి క్షేత్రాలు మిశ్రితమై పరిణామము చెందినట్లు పరిశోధకులు ఆధారాలను చూపుతున్నారు. జగన్నాథునిగూర్చి జర్మనీకి చెందిన పరిశోధనా బృందం వెలువరించిన విశేషాలు గ్రంథాలుగా ప్రచురితమైనవి. అంతటి కృషి తిరుపతి క్షేత్రమును గురించి కూడ జరుగవలసి యున్నది. అచ్యుతరామశాస్త్రిగారి వ్యాసాలు ఈ అభిప్రాయాన్ని బలపరుస్తున్నవి.

భారతీయ సంస్కృతీ తత్త్వాన్ని నిర్దుష్టంగా చిత్రించవలసిన ఆవశ్యకత నేడు ఎంతైనా వుంది. భారతజాతి పటిష్టత ఈ సంస్కృతీ తత్త్వ అవగాహనపైన ఆధారపడుతుంది. రచనలు పండిత హృదయాలను రంజింప జేయటమే గాక, యువతరానికి సంస్కృతిలో విశ్వాసం కలిగించేవిగా వుండాల్సి వుంటుంది. శాస్త్రిగారు

తిరుపతి, వేంకటేశ్వరస్వామి చరిత్రల గురించి తమిళ, తెలుగు, సంస్కృత సాహిత్యాలను, శాసనాలను, ఇతర చారిత్రక ఆధారాలను పరిశీలించిన తీరు యువ తరానికి చెందిన పరిశోధకులకు చక్కని నమూనా.

గ్రంథకర్త పేర్కొన్న బాదామీ చాళుక్య హరిహరమూర్తిని ముగ్ధుడనై చూస్తూ చాలా సమయం గడిపాను. మహబూబ్‌నగర్ జిల్లాలోని అలంపురంలోనున్న నృసింహ స్వరూపంలో హరిహర ప్రతిమ అతి విశిష్టమైనది. హరిహరస్వరూప తత్త్వాలను సమగ్రంగా అవగాహన చేసుకోగలిగితే తెలుగువారి సంస్కృతికి ఒక నూతన ప్రధాన అధ్యాయం చేర్చవచ్చును. ఇందుకు డా॥ ఓగేటి అచ్యుతరామ శాస్త్రిగారి రచనలు నాందిగా కనిపిస్తున్నవి.

(సం॥) ముక్కామల రాధాకృష్ణశర్మ
20-12-1986

# కృతజ్ఞతలు

ఈ "ఒగేటి వ్యాసపీఠి"ని పాఠకులకు సమర్పిస్తున్నందుకు మహదానందంగా ఉన్నది. గత ముప్పైయేళ్ళ పైచిలుకుకాలంనుండి అప్పుడప్పుడు వెలయించిన వ్యాసాలివి. కొన్ని పత్రికలలో ప్రకటించినవి, కొన్ని ఆకాశవాణిలో ప్రసంగించినవి, మరికొన్ని గోష్ఠులలో ఉపన్యసించినవి. వీటిని వెలువరించి, నా సాహిత్య రచనావ్యాసంగానికి దోహదమొనర్చిన ఆయా పత్రికా సంపాదకులకు, ఆకాశవాణి అధికారులకు, గోష్ఠుల నిర్వాహకులకు కృతజ్ఞతలు సమర్పిస్తున్నాను.

ఈ వ్యాసాలన్నీ ప్రధానంగా కాలసరణినిబట్టీ, ఒక్కచోట మాత్రం హరిహరనాథ తత్త్వానికి సంబంధించినవి హేతుసరణినిబట్టీ ఒకానొక క్రమంలో పొందుపరచబడినవి. ప్రాధాన్యవివక్షచేత ఇది వ్యాససంకలనమే అయినా ప్రారంభంలో ఒక కథకూడ చేర్చబడింది. అది నా మొట్ట మొదటి రచన. దానిమీదున్న మమకారం కొద్దీ, అదిమిగిలిపోకూడదన్న ఆరాటంలో అలాచేయటం జరిగిందని మనవిచేస్తున్నాను.

రచయితగా ఈ వ్యాసాలన్నీ నాకు ప్రాణసమానమైనవే. అయినా హరిహరనాథ తత్త్వానికి సంబంధించిన వ్యాసాల్నిగూర్చి ప్రత్యేకించి కొంత చెప్పాలని ఉన్నది:

మా నాన్నగారు కీ. శే. ఒగేటి సాంబమూర్తిగారు మాకు చిన్నప్పటినుంచీ, తిరుపతి వేంకటేశ్వరుల ప్రసక్తి వచ్చినప్పుడల్లా, ఆయన హరిహర స్వరూపుడని చెబుతూ ఎన్నో ప్రమాణాలు ఉట్టంకిస్తూ ఉండేవారు! అవి వింటూంటే ఎంతో ఆసక్తిదాయకంగా ఉండేది! ఇది ఏనాటి మాటో! ఆ తరువాత చాలాకాలానికి 1975 లో వారు దివంగతులైనారు. దరిమిలా ఆ స్మృతులు పదేపదే మనస్సులో మెదిలి ఈ విషయాన్ని గూర్చి పరిశోధించాలన్న తీవరింపుగలిగింది. ఆనాడు మా నాన్నగారి దగ్గర నాతోపాటు మరొక శ్రోత, సంస్కృతాంధ్రములలో మహాకవి, పూనాలో మహారాష్ట్ర ప్రభుత్వమున తెలుగు భాషాధికారిగా పనిచేయుచున్న మా అన్న పండిత శ్రీ ఒగేటి పరీక్షిత్ శర్మగారితో కలిసి ఆనాటి విషయములు నెమరువేసుకొని పరిశోధనకు పూనుకొంటిని. జ్ఞాపకమున్నంతవరకు మా నాన్నగారు చెప్పినవిషయాల్ని పునాదిగా పెట్టుకొని, యెన్నోసాక్ష్యాధారాలను పరిశీలించిన మీదట "వేంకటేశ్వరుడు హరిహర స్వరూపుడే"అన్న విషయం తేలిపోయింది! అంతటితో నా కుతూహలం ఆగిపోలేదు. అయితే, "మరి తిక్కనగారి హరిహరనాథుడు తిరుపతి వేంకటేశ్వరుడే కావచ్చునా!"

అన్న సరిక్రొత్త ఊహ నా మనస్సులో తళుక్కుమని మెరిసింది. అంతే, మళ్ళీ యీ దృక్పథంతో పరిశోధనకు పూనుకొన్నాను. ఎన్నో ప్రమాణాలనుబట్టి చివరికి ఔనన్న నిష్కర్షకు వచ్చాను. క్రమంగా ఈ వ్యాసాలను వ్రాశాను.

"తిరుపతి వేంకటేశ్వరుడే తిక్కనగారి హరిహరనాథుడా!" అను తొలివ్యాసం వ్రాసిన తరువాత మిత్రులు శ్రీ నోరి హనుమచ్ఛాస్త్రిగారితో కలిసివెళ్ళి వారి తండ్రిగారైన పూజ్యులు, కవిసమ్రాట్ శ్రీ నోరి నరసింహశాస్త్రి గారిని దర్శించి వారికి వినిపించాను. వారు నా వ్యాసాన్ని శ్రద్ధతో ఆసక్తితోను, కుతూహలంతోను విని నేను చూపించిన ఉపపత్తులన్నింటినీ మెచ్చుకొని తాము స్వయంగా ఈ విషయాన్ని ఆమోదించి, నన్నాశీర్వదించారు. వారికి భక్తిపూర్వక శ్రద్ధాంజలి ఘటిస్తున్నాను.

ఆ పిమ్మట ఈ వ్యాసం దక్షిణభారత హిందీ ప్రచారసభవారి "స్రవంతి" పత్రికలో ప్రచురింపబడింది. అది చదివి ఎందరో మహనీయులు నన్నాశీర్వదించారు. వారందరికీ కృతజ్ఞతాభివందనాలు సమర్పిస్తున్నాను.

ఈ గ్రంథానికి "పరిచయం" ఇచ్చిన డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారికి, "అభినందనచందనం" ప్రసాదించిన డా॥ నరదూరి రామకృష్ణమాచార్యగారికి, "పురోవాక్"ని అనుగ్రహించిన శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారికి, "అభిప్రాయం" వెలయిచ్చిన ఆచార్య డా॥ ముక్కామల రాధాకృష్ణశర్మగారికి — మాన్యులైన యీ మహనీయులందరికీ నమోవాకములు సమర్పిస్తున్నాను.

నా సాహిత్యరచనా వ్యాసంగానికి ప్రథమప్రేరకులు మాన్యులు శ్రీ వండారు సదాశివరావుగారు (అధ్యక్షులు, ఆంధ్ర సాహిత్య పరిషత్తు) వారికీ, తదితర మహనీయులకు "ధన్యోస్మి"గా నమస్సులు సమర్పిస్తున్నాను.

ఈ "ఓరేటి వ్యాసముల" ప్రచురణలో నాకు తగిన మార్గదర్శకత్వం వహించిన బృందావన్ ప్రెస్ యజమానులు, మాన్యులు శ్రీ కె.బి. సోమయాజులుగారికి, ఇలా అందంగా ముద్రించియిచ్చిన "శ్రీ శారదా ఎంటర్ ప్రైజెస్" యజమానులు, మిత్రులు శ్రీ పూడోట రామచంద్రరావుగారికి ధన్యవాదాలు సమర్పిస్తున్నాను.

హైదరాబాదు.

[illegible]-[illegible]-1986

# కనపడని కామరాజు

"కామరాజు కనబడ్డంలేదు. కబురంపినా ఐపూ పత్తా లేకుండా దాటేస్తున్నాడదేవనిగా" అంతటి నేస్తంగురించి వెంకట్రావు అలా అక్కసు పడ్డం లింగమూర్తికీ, వీర్రాజుకూ ఆశ్చర్యమేకలిగింది.

"అవును, ఆయిదార్నెల్లయినా అయింది అతగాడిటు ముఖంచూపి. ఏఁవిటొచ్చిందంత వ్యవహారం అతన్తో" లింగమూర్తి అడిగాడు ఆత్రంతో.

"రాదూ! ఆర్నెల్లనుంచి అధమం ఆయిదారు సార్లైనా కబురంపాను. అజా వజా లేందే".

"కామరాజు మొగం చాటువేసే మనిషి కాడే!" వీర్రాజు సందేహపడ్డాడు.

"కొత్తలో అంతే! తర్వాత తెలుస్తుంది...." వెంకట్రావు మాటల్లో విసురు అంత స్పష్టంగా కన్పిస్తుంటే వీర్రాజు, లింగమూర్తీ మరింత ఆశ్చర్యపడరూ?

"అసలు సంగతేంటో చెప్పక ఈ తాలిపలుకుల గూడెందుకోయ్"

"కష్టంలో ఆదుకున్నందుకు గట్టి పాఠమే చెప్పాడు.... పోనీ పెద్దమనిషి.... పసితనంనుంచి ఎరుగున్నవాడు అని...."

"అంత అఘాయిత్యం ఏంచేశాడు కామరాజు. అదేదో ఆడిగేద్దాం. పట్నం పోతున్నా నేనివాళ. "కనపడితే నిలేసి అడిగొస్తా"

"ఆయితే వీర్రాజూ! ఓ సాయం చేసిపెట్టుదూ పుణ్యంవుంటుంది. అతగాడి ఊసెక్కడైనా కన్పిస్తే, సజావుగావచ్చి వ్యవహారం తొందరలో తేల్చుకోపోతే రచ్చకెక్కవలసొస్తుందని గట్టిగా మందలిద్దూ"

'ఇంతకీ బాకీ ఏమైనా ఉన్నాడా నీకు'

'ఉన్నాడా అంటావేం! మూడొందలు నగదు పుచ్చుకున్నాడు. భార్య జబ్బుగా ఉందంటే కాదనలేకపోయా నా సమయంలో పోనీ ఆరునెల్లైంది. కబురంపితే సజావుగా సమాధానమేనా రావచ్చా?'.

కనపడని కామరాజు

'మూడొందలా! వెంకట్రావూ! కామరాజు నీకు బాకీ పడ్డాడా?' అన్నాడు వీర్రాజు.

'నాలిక పీక్కున్నా ఒక దమ్మిడీ ఎరువు తీసుకోడే....' తన నమ్మకాన్ని తెల్పాడు లింగమూర్తి.

'ఇన్నాళ్ళనుంచి ఎరుగుదుం. డబ్బుకు ఎంత గిజాటుపడ్డా ఎప్పుడూ అయిదూ పదైనా అడిగిన పాపాన పోలేదు.' అన్నాడు వీర్రాజు.

'అడపా దడపా మనమే నాలుగు రాళ్ళు అడిగి పుచ్చుకున్నాం' అన్నాడు అనుమానంతో లింగమూర్తి.

'అవునయ్యా! అందుకే అర్నెల్లాగేను. ప్రోనోటుకూడా ఉంది జేబులో. ఎన్నడూ పుచ్చుకోలేదు. కనుకనే నోరంట అడగ్గానే ఇచ్చేశాను. ఇన్నాళ్టి నమ్మకాన్ని ఈవిధంగా తీర్చుకున్నాడు.'

'ఇన్నిసార్లు కలిశాడు. నోరువిడిచి ఎప్పుడూ యీ వూసైనా ఎత్తలేదు.'

'అతగాడి అభిమానం అది. చచ్చినా ఇతరులకి చెప్పుకోడు తనబాధ?'

'అయితే ఇంతకీ అతని భార్యకెలావుందో!'

ఆస్పత్రిలో చేర్చారుట. మొన్న వాళ్ళ మేనమామ కన్పించి చెప్పాడు.'

'అంతవరకు వచ్చిందన్నమాట....'

'అయినా యివ్వాళ వెళ్తున్నాగా. అదేదో అడిగేస్తా....'

'అయితే ఒకవిషయం అతనికి చెప్పు వీర్రాజూ. ఇంతకాలం వెంకట్రావు ఊరుకున్నాడు స్నేహితంవల్ల. పెద్దమనిషి లక్షణం కాదిలా మొగం తప్పించడం. ఓ వారంపదిరోజుల్లో అణా పైసల్తో బాకీ పైసలు చేయకపోతే కోర్టులో....' అని వెంకట్రావు అక్కసుతో అంటుంటే లింగమూర్తి అడ్డుపడ్డాడు.

'అంతవరకు రానివ్వం వెంకట్రావూ! ఈ వూళ్లో మనముగ్గురం ఒకటిగా ఇన్నాళ్లున్నాం. అతగాడి బాధలు మనకెన్నడైనా చెప్పుకున్నాడా? ఎన్నడైనా ఒక పైసా అడిగాడా? అడపాదడపా మనమే పుచ్చుకున్నాం.' అని బాధగా అన్నాడు లింగమూర్తి.

'అసలా మాటకొస్తే ఈ వూళ్ళో స్నేహితుడంటూ అతణ్ణి యాచించని వాడెవడోయ్.' అన్నాడు వీర్రాజు.

'అందుకే వెంకట్రావూ! కొంతనిదానించు. ఈ బాకీమూలంగా మన మైత్రిని పాడుచేసుకోవద్దు. ఇదిగో యివ్వాళ వీర్రాజు పట్నం వెళ్తున్నాడుగా!'

'నాబాధ నాకు తెలుసు. నెలకిందట మా ఆవిడ కారు ప్రమాదంనుంచి బైట పడ్డప్పటినుంచి ఖర్చులమీద ఖర్చు లవుతున్నాయి. రావలసిందిరాదు, పోవలసిందానికి మాత్రం లోపం ఉండదు.' మీమాటమాత్రం ఎందుకు కాదనడం.... చేయండి ....చివరి ప్రయత్నం చేయండి' అంటూ వెళ్ళిపోయాడు వెంకట్రావు.

వీర్రాజూ, లింగమూర్తీ ఓగడియ అలా దిగాలుగా నిల్చుని పార్కువైపునకు నడక సాగించారు. ఇద్దరి ముఖాలూ తెల్లబారి పోయాయి. అవూళ్లో కామరాజంటే తెలీని మనిషిలేడు. మహాఖచ్చితం మనిషి. కష్టాల్లో ఓ అంటే ఓహో అంటూ ఎంత బాధైనా నెత్తికెత్తుకుంటాడు, స్నేహితుడన్న ప్రతివాడూ అతని కేదో రకంగా ఋణపడి వున్నవాడే. వెంకట్రావూ, కామరాజు, లింగమూర్తీ, వీర్రాజూ - ఈ నలుగురూ మంచి స్నేహితులనే విషయం చాల మందికి తెలుసు. ఇంతవరకు గిట్టని వాళ్ళు వీరి మధ్య పొరపులు పెట్టానికి పడ్డపాట్లను చెప్పుకుపోతే ఒక తుమ్మెద పాటో, ఓబాలనాగు కథో తయారవుతుంది. అలాంటి కామరాజును వెంకట్రావు అలా అన్నాడంటే వీర్రాజుకూ, లింగమూర్తికీ బాధ కలుగదు మరి! మెత్తని వెన్న పూస మనసు, అలా కరిగిపోతుంది కామరాజుది. అయినా అంతటివాడికూడా మాట పడక తప్ప లేదు.

* * * *

'అయితే దాదా! ఇంతకీ మరి ఎలా నెట్టుకొస్తున్నాడు ఇంత ఖర్చుని?'

'అదేనండి విచిత్రం! నోరు తెరిచి ఓమాట ఎవరిని సాయం అడగడు మొన్నటికి మొన్న పిల్లాడు జబ్బుపడి మంచంలో మూల్గుతుంటే వాడికి ఇంత రంగు నీళ్ళుకొని పోయడానికి డబ్బులేదు. ఎవరో పూర్వం ఆఫీసు నౌకరుట; దార్లోతటస్థపడి అడగడంతోటే, భార్యకు బత్తాయిపండ్లు తేవడానికి పోతున్నవాడు - కాస్తా, ఆ రూపాయి జేబులోంచి తీసిఇచ్చేశాడు."

'అదోపిచ్చి దాదా! అదోపిచ్చి! మనిషికి విశ్వాసం అంటూ ఉండదు. అందరూ అతణ్ణి వేపుకు తినేవాళ్ళే! అతని కిచ్చేది, పెట్టేది లేదు.'

'మరీ ఆ భార్య జబ్బుకు అంతా హరించుకు పోతున్నది. రాత్రీ, పగలూ ఆవిడ మంచం దగ్గర కూర్చుంటాడు.'

చివరికి తనవొంటికూ్కడా తెచ్చుకుంటాడు.'

'తెచ్చుకొంటాడేంటి బాబూ! తెచ్చుకున్నాడనండి. ఓ గడియకూడా కన్ను మూయకపోతే బండి ఎన్నాళ్ళు నడుస్తుంది?'

'ఏం? ఏవిటొచ్చింది?'

'అయిదారు రోజుల్నుంచి ఏఁవిటో వెన్నుపూస నొప్పిఅంటూ బాధపడు తున్నాడు. అదీ అడగ్గా అడగ్గా తేలిన విషయం.'

'మరి....?'

'ఆ నలుగురైదుగురు పిల్లలు వస్తారు. వాళ్ళకి చదువు చెప్పకోడం. అదీ సంపాదన.'

'అదెంతవస్తుంది దాదా!'

'ఆ పసివాడి మాడు కింత ఆముదానికైనా సరిపోదు.'

'మరెలా నడుపుతున్నాడో....?' అన్నాడు వీర్రాజు కండ్లంట నీరును ఆపు కోడానికి ప్రయత్నిస్తూ.

'అదో ఖర్మ బాబూ! అదో ఖర్మ! తెల్లవారగట్ల నాల్గింటికిలేచి ఇంటి చాకి రంతా చేసుకోవాలి. ఆ పసివాడికి చాకిరంతా చేయాలి. పైగా వంట. ఆస్పత్రికి పోయి భార్యకు మందు తెచ్చుకోవాలి. ఆపైన పిల్లలకు చదువు....'

'ఈనాటికి ఇలా అయ్యాడు....!

'ఏమైనా కొంత సర్దుదామంటే పుచ్చుకోడు ఏం ఖర్మో! బ్రతిమాలినా విని పించుకోడు. 'ఓసారి ఋణపడితే జన్మజన్మలకు తీరదు దాదా! కామరాజు చేయూత ఇస్తాడు చేతైతే. చేయిచాచిమాత్రం బ్రతకడు. అయింది చాలు దాదా! అని బాధగా అంటాడు. అయినా మీ రతని స్నేహితులుకదా! మీ కేమైనా తెలుసా అతగాడి విషయం?" అన్నాడు దాదా.

'తెలియకేం దాదా! తెలిసేవచ్చా! మొదట్నుంచీ అతగాడి వరసే అంత. ఎవరికోసమో తాను బాధపడ్డం!

'అంటే మొదట్నుంచీ అంతేనన్నమాట.'

'అన్నమాటే.... మాటకి చెబుతున్నా! మా అత్తగారికి జబ్బుచేసిందని టెలిగ్రాం వచ్చింది క్రిందటేడు ఆషాఢంలో. నెలరోజులు రెక్కాడితే చివరికోపదిరాళ్ళు చేతిలో పడతాయి. అవెన్నాళ్లుంటాయి? నెలాఖరవడం వల్ల ఓ దమ్మిడీ లేక నలుగురి తలుపులూ తట్టి చివరికి అడగలేక అడగలేక ఏఁవోయ్ కామరాజూ అని అన్నాను. అంతే ....రైలువేళకి తెచ్చి యాభైయిచ్చాడు! అర్నెల్లక్కాని తెలీలేదు భార్యమెళ్లో గొలుసు మార్వాడీదగ్గర పెట్టి తెచ్చాడని! నాభార్యమెళ్లోనూ ఉందోగొలుసు మాట వరుసకి. అబాకీ తీర్చుకునేసరికి పెద్దలు దిగొచ్చారు. అయినా అతగాడు అడిగిన పాపాన పోలేదు.'

'అంతే.... అంతే....'

'సరేనైతే! ఆవిడ మరీ నీరసంగా ఉంది. నేను వెళ్లొస్తా . ఈ యాభై అతనికి నేనిమ్మన్నానని ఇచ్చేయి దాదా!'

పుచ్చుకోడు బాబూ! తెలియని మనిషైతే చెప్పొచ్చు. ఆఘటం తీరు, ప్రాణం పోగొట్టుకుంటాడు కాని పుచ్చుకోడు.:

'అంతేనంటావా దాదా! అంతేనంటావా!'

'మీకు తెలియందేవుంది.?'

'సరే ఓ సాయంచేయి! ఇదో నాఅడ్రసు, అవసరమొస్తే నాకు ఓముక్క వ్రాసి పోస్టుచేయి.'

వీర్రాజు అడుగులు తడబడుతున్నాయి నడుస్తుంటే. పనితెమల్చుకొని కామరాజును చూచి విషయమేదో తేల్చుకొద్దామనుకుంటే ఇంతకథ విన్నాడు. మనస్సు చివుక్కుమన్నది. ఇక్కడ ఒంటరిపాటున ఇంతబాధ పడకపోతే, మొగంతప్పించుకు తిరక్కపోతే వచ్చి అడిగితే ఎవరివ్వరోమూడువందలనుకొని బాధపడ్డాడు. అలాంటి మిత్రుణ్ణి వెంకట్రావు అలా ఆడిపోసుకున్నాడే అని విసుక్కున్నాడు. మూడు గంటలు కూర్చున్నా కామరాజు రాకపోవడంతో కనీసం చూణ్ణైనాలేదే అని బరువు

గుండెతో స్టేషనుకు నడిచాడు వీ్రరాజు.

వెంకట్రావుకు ఏఁవిటీ చెప్పడం? ఎలా అతణ్ణి సముదాయించడం?

* * * *

సాయంకాలం ఆఫీసునుంచి వచ్చి అపుడే ఓగ్లాసు మంచినీళ్లు సేవించి కూర్చున్నాడు లింగమూర్తి "వీర్రాజు ఇంకా రాలేదే చెప్మా" ఆలోచిస్తూ.

"అడుగో, నూరేళ్ళోయ్.... ఇపుడే ఇలా రాలేదేమా అనుకుంటున్నాను!"

"రాత్రే వచ్చాను. కాని పొద్దుట్నుంచీ ఆఫీసు గొడవతోటే సరిపోయింది."

'సరై తే ఆ కామరాజేమన్నాడు? ఖులాసాగా ఉన్నాడా? అతని భార్యకు....'

'ఆగవోయ్ బాబూ! భార్యకేం? మంచం సగమై చివరి గడియలు గుణిస్తున్నది.' అన్నాడు వీ్రరాజు అదో విరక్తిలో.

'ఏఁవిటీ అంత వరకు వచ్చిందన్నమాట....' అన్నాడు అనలేక అనలేక లింగమూర్తి.

'ఏంచెప్పను, కామరాజు ఖర్మ. అదొక మొండిఘటం. ఆవిడకోసం తాను ప్రాణం తీసుకుంటున్నాడు.' అన్నాడు వీ్రరాజు.

'అదీ ఖర్మేమరి! అయినా అడిగినవాడికల్లా అరవచాకిరి చేసేవాడు భార్య .... కట్టుకున్న భార్య జబ్బున పడితే చేతులు నులుపుకుంటూ కూర్చుంటాడూ?'

'అందుకే సగమై చావుదరిని పడ్డాడు.'

'మరి రమ్మనలేక పోయావూ' అన్నాడు లింగమూర్తి.

వీ్రరాజు ముఖం జేవురించింది. ఆజేవురింతలో అనేక భావాలు అలలుగా మారిపోయాయి. ఓ గట్టి నిట్టూర్పు విడిచి 'లింగమూర్తీ! తెలిసే మాయలోపడ్డావు. నీదో పిచ్చికాని కామరాజు వస్తాడా?'

'ఏవఁన్నాడేఁటి' ఆత్రంతో అడిగాడు లింగమూర్తి.

'అసలు కన్పిస్తేగా ఏమైనా అంటానికి!'

'అయితే కలుసుకోకుండానే వచ్చావూ?' అని ఓవిధమైన అదుర్దాతో అడిగాడు లింగమూర్తి.

'మరేం చేయను? అప్పటికీ మూడుగంటలు కూచున్నాను. ఆ దాదా- వాళ్ల యింటి యజమాని.... అతగాడు చెబితే రాత్రి పదింటిదాకా తిరిగిరాడని అపుడు చెప్పవలసిన నాలుగుముక్కలూ అతణ్ణి చెప్పమని చెప్పివచ్చా.'

'ఇంతకూ ఎల్లావుంది అతడి పరిస్థితి.'

'ఎలా ఉంటుంది? కడుపు మాడ్చుకుని భార్యకు ఉపచారం చేస్తున్నాడు. ఆ పసిపిల్లాణ్ణి ప్రక్క ఇంటివాళ్ళ చిన్నమ్మాయికి అప్పచెప్పి వెళ్తున్నాడు సంపాద నకు. ఇంట్లోచూస్తే అంతా మూకుళ్ళచప్పుడే.'

'మరి వెంకట్రావు బాకీమాటో....'

'ఆ(బాకీ మాటే....' ఏవిఁటో అతగాడలా చస్తుంటే ఓనాల్గురోజులాగడానికి ఇతడికి ఓపికలేదు!

'నీవు వెళ్ళిపోయింతర్వాత కలిసి మళ్ళీ నాల్గుమాటలూ అన్నాడు. ముఖం చాటేసుకుని అడవిలో బ్రతక్కపోతే ఇక్కడికివచ్చేయచ్చుకదా! నలుగురూ నాలుగు మెతుకులు ఎవ్వరైనా చేసేవాళ్ళం పూర్వపు స్నేహితాన్నిచూచి అన్నాడు వీర్రాజూ!'

'అంటాడు....అనకేంచేస్తాడు! స్కూల్లో చదువుకునేప్పుడు మామిడి తోటలో పండ్లుకోస్తే వెంకట్రావు, కోసింది నేను అనిచెప్పి వీపు పెళ్లేట్లు దెబ్బలుతిని రక్షిం చాడని జ్ఞాపకంఉంటే....' వీర్రాజు పెదవులు వణికాయి.

'జ్ఞాపకానికేంలేవోయ్! ఆ శకుంతల్ని చూచి పిచ్చెత్తిపోయినప్పుడు కామరా జడ్డుపడి 'ఛీ' అని చెప్పి, అటునుంచి చెప్పించి తప్పించకపోతే ఈపాటికి ఖూనీల వరకు వచ్చివుండేది.'

'జ్ఞాపకం ఉంచుకోడం కష్టమే లింగమూర్తీ! చెల్లెలి పెండ్లికి కట్నం తక్కు వైతే వేళకి పీటలమీద పెండ్లి ఆగకుండా చేసిందెవరు? అతగాడు జబ్బుపడితే నానాబాధలుపడి కంటికి నిద్రలేకుండా కాపాడిందెవరూ?....'

'ఇవన్నీ ఇపుడు చెబితే చెవికెక్కడం ఎలా! ఏమైనాసరే మనమే ఏదో తేల్చేద్దాం.'

'ఆఁ ఫస్టుకు జీతపురాళ్ళు పుచ్చుకోడంతో బాకీ చెల్లిస్తేసరి....'

'తరువాత చూచుకోవచ్చు....'

'అయినా వచ్చే శుక్రవారం వెళ్తా పట్నానికి మళ్ళీ. అపుడు తప్పక కలుసుకునే వస్తాగా'

*   *   *   *

'నేను చెప్పలేదూ! అంతే ఆరకం మనుషులు. ఓ సారి అవసరం తీరితే చాలు.' అన్నాడు వెంకట్రావు, లింగమూర్తి ఇంటివాకిట అరుగుమీద కూర్చుంటూ.

'అతని బాధలు తెలిసీ అలా అనకు వెంకట్రావు! ఇంతవరకు మాటపడి ఎరగని మనిషి. అవమానంకంటే చావు మంచిదనుకునేవాడు. బాధల్లో ఉన్నాడు. నిద్రాహారాలు లేకుండా చిక్కి శల్యమైనాడు. నీకాకీ ఎగేయడం అతనికేం సరదా వెంకట్రావూ?'

'తనవరకొస్తేగాని తెలియదు లేవోయ్, మీకేకాదు నాకూ స్నేహితుడే. మొన్న మటుకు మొన్న నాభార్య కారుక్రింద బడి ఆస్పత్రిలో చేరితే పట్నంలో ఉండీ చూచిపోలేదు. ఎవరో దారినిపోయే ఓ పెద్దమనిషి ఆస్పత్రిలో చేర్చి అనుకోని సహాయంచేశాడు. ఏవిటీస్నేహం! తెలిసోలేదో అంటే తెలుసని వాళ్లింటి యజమానే చెప్పాడు.'

'అతని కేపనివచ్చిందో మరి, అంత తొందరపడి లాభంలేదు. నిదానించి ఆలోచించాలయ్యా! వీర్రాజుకూడా కనబడలేదంటే అతనెంత బాధపడుతున్నాడో....'

'ముఖంచెల్లక. బాధేవిటి, భార్యకు మందిప్పించుకోడంలేదా? ఇంటి అద్దె చెల్లించడంలేదా? తిండితినడంలేదా? ఈమాటలకేంలే' అన్న వెంకట్రావుమాటలు అడుగుప్పుడే లోపల పెట్టిన వీర్రాజు చెవినిపడ్డాయి. వీర్రాజుముఖం ఎఱ్ఱబారిఉంది. చూపులో ఏదో దుఃఖం కన్పిస్తోంది....

'వెంకట్రావూ! ఇదో పట్నంనుంచి ఉత్తరం.... కామరాజు ఇంటి యజమాని దాదా వ్రాశాడు.' అంటూ వీరకితో వెంకట్రావు చేతికందించాడు, లింగమూర్తి ఆదుర్దా, గాభరాతో ముందుకుజరిగి ఏంవ్రాశాడో వినడానికి తొందరపడుతున్నాడని అతనికళ్ళే చెబుతున్నాయి.

మా వీర్రాజుగారికి, నమస్కారములుచేసి దాదా వ్రాయు విన్నపములు:– తమరువెళ్ళిపోయినతర్వాత పరిస్థితులు మరీ చెడ్డాయి. కామరాజుగారిభార్య సత్యవతమ్మగారికి దగ్గుతెరలు ఎక్కువై రాత్రింబగళ్ళు తెరిపిలేకుండా బాధపెట్టింది. ఆ నాలుగురోజులూ–ఏమనివ్రాయడంబాబూ–కామరాజుగారు పసి పిల్లవాడిలా ఏడ్చాడు. ఎవరుకష్టపడ్డా సహించలేని ప్రాణం ఆయనది. మహా ఘోషపడ్డాడు, కంట్లో జ్యోతులు పెట్టుకొని చాకిరీ చేశాడు. అయినా చేయిజారిపోయింతర్వాత అనుకుంటే ఏం లాభం. ఆయిల్లాలు మొన్న బుధవారంనాటిరాత్రి.... అప్పట్నుంచి కామరాజుగారు పూర్తిగా మారారు. మొదట్లో ఈవూరొచ్చినప్పుడు ఎంత ఉత్సాహంగా ఉండేవారు, మాయింట్లో ఒకడై పోయినారు. ఇన్ని బాధల్లో ఓనెలైనా ఇంటిఅద్దె నాగాపెట్టలేదు. బాబూ! ఎన్నోతడవలు చెప్పాను, తర్వాత యివ్వొచ్చు తొందర దేనికని. కాని వినిపించుకునేవాడు కాదు. ఋణబాధ ఉండకూడదు దాదా! అతనిమనస్సుని తినేస్తుంది! మనిషిని చంపేస్తుంది. ఎంత స్నేహితులైనా శత్రువులుగా చేస్తుంది' అని అంటూండేవారు. అలా అంటున్నప్పుడు ఆయన పాలిపోయేవారు. నాకేం తెలుసు బాబూ ఆయన రహస్యాలు?

మరీ భార్యపోయినప్పటినుంచీ చిక్కి శల్యమైపోయారు. తిండి సరిగ్గా తినరు. ఆపసివాణ్ణి ఇంటిప్రక్కవాళ్ళు పెంచుకుంటామని తీసుకున్నారు. వాళ్లకీ మొగపిల్లలెవరూ లేరు. రోజూ గుమ్మంలో కూర్చొని తల మోకాళ్ళ మీద ఆనించి ఏడుస్తుంటాడు. 'మీఊరికిపోరాదు బాబూ' అంటే 'పోతా! పోవాలనే ఇంతప్రయత్నం దాదా! నేను బ్రతికుండగా పోవాలనే ప్రయత్నిస్తున్నా. మళ్ళీ–మళ్ళీ....' ఆగిపోయేవారు.

నిన్న మొన్న ఆయనకు జ్వరం వచ్చింది. ఏదో మగతలో మాట్లాడుతుంటారు. 'ఋణబాధ–ఋణబాధ' అని నాలుగైదుసార్లన్నారు. అలాంటి వ్యక్తికి కూడా ఋణమా బాబుగారూ! మీరోసారివస్తే బాగుంటుందేమో! ఒంటరిగా ఇలా అయిపోనివ్వడం మంచిదికాదు. దిగులుతో–దూరాన–స్నేహితులు–బంధువులూ లేకుండా–నాఅనే మనిషి లేకుండా ఎంత మొండి ధైర్యం ఉన్నా మనిషంటూ ఎన్నాళ్లుండగలడు?

ఇట్లు,
నడింటి దాదారావు,

ముగ్గురు మిత్రులూ రాతిబొమ్మలా కూర్చున్నారు. వీర్రాజు కంట్లోంచి నాలు గైదు నీటి బొట్లు చెక్కిళ్ళమీదికి జారాయి. లింగమూర్తి ముఖానికి రుమాలు అడ్డం పెట్టుకొని గోడకి చేరగిలపడ్డాడు.

వెంకట్రావు ముఖంలో ఏవేవో భావాలు కనపడి మహావేగంగా మారిపోతున్నాయి, వీర్రాజు తటాల్న లేచి నిల్చున్నాడు.

'వెంకట్రావూ! అదీ కామరాజు చేసిన పాపం! అతగాడు నీబాకీ ఎగేద్దామనే చేశాడా వెంకట్రావూ! అతడి మనసులో ఆ పాపం ఉందా! నే నిప్పుడే బయలుదేరుతా పట్నానికి. నీ బాకీ నేనిస్తా దిగులుపడకు, రెండు రోజుల్లో అణా పైసల్తో ఇస్తా.'

వెంకట్రావుకు భూమి గిర్రున తిరుగుతున్నట్లు కన్పించింది, కండ్లనీళ్ళు కమ్మాయి. ఇదంతా తనవల్ల....తనవల్ల....జరిగింది.

వెంకట్రావు ఇహ అక్కడ నిప్పులమీద కూర్చున్నట్లే అనిపించింది. లేచాడు. లేచి ఓ మాటకూడా మాట్లాడకుండా తిరిగి వెళ్లిపోయాడు, లింగమూర్తి, వీర్రాజు లిద్దరూ తలుపు కేసి అలా చూస్తూ నిల్చున్నారు.

* * * *

వీర్రాజు తిరిగి వచ్చాడు. స్టేషనులో దిగి నేరుగా లింగమూర్తి ఇంటికే వెళ్ళాడు. లింగమూర్తి ఇంట్లోలేడు. ప్రొద్దునపోయినవాడింకా తిరిగి రాలేదుట. అక్కడ్నుంచి రిక్షా కట్టించుకుని ఇంటికి బయలుదేరాడు. కామరాజు పట్నంలో కన్పించక పోవడం ఆశ్చర్యంగానే ఉంది. దాదా తిరుపతి వెళ్ళాట్ట మొన్న సాయంకాలమే. పొరిగింటివాళ్లనడిగితే ఏమీ తెలియదని చెప్పారు. వీర్రాజుకు కాళ్లాడ్డంలేదు.

గుమ్మంలోదిగి రిక్షావాడికి డబ్బులిచ్చి లోపలికి అడుగుపెట్టాడు. ఒక్కసారి బావురుమంటూ మంచంమీదకూర్చున్న లింగమూర్తి, వెంకట్రావులు వీర్రాజును కావిలించుకున్నారు. వీర్రాజుకుమతిపోయింది. ఊపిరాడ్డంలేదు.

'ఏమైంది వెంకట్రావూ, ఏమైంది!' అని ఆదుర్దాగా అడగలేక పూడుకొని పోతూన్న గొంతుతో, జారిపోతున్న ధైర్యంతో అడిగాడు. ఎలాగైతేనేం వీర్రాజు అడగ్గలిగేడు. లింగమూర్తి లేచాడు. వెంకట్రావు తలవంచుకుని అల్లాగే అక్కడే కూలబడిపోయాడు.

లింగమూర్తి లేచి ఓ కవరిచ్చాడు. వీర్రాజుకు గుండెలాగిపోయినంత అయినాయి.

'వీర్రాజుగారికి....

నమస్కారములుచేసి దాదా వ్రాయు విన్నపములు:- మనిషి మహా విచిత్రపు ప్రాణి వీర్రాజుగారూ! మనిషిని తేలిగ్గాఅర్థంచేసుకోలేం. మీ స్నేహితుడు కామరాజు కన్పించటంలేదు! వెతికించి వేసారాం. లాభంలేదు.

మొన్న సాయంకాలం జ్వరంలో నన్ను పిల్చారు. పిల్చి దగ్గరే కూర్చోపెట్టు కొని నాకీవిషయం చెప్పారు!

ఆయనగారికి ఎవరో స్నేహితుడున్నాడట. ఆ స్నేహితుడి దగ్గర కామరాజు గారు అవసరంకొద్దీ మూడొందలు తీసుకొని నోటువ్రాసి మూడో నెల్లోతీరుస్తానని మాటిచ్చారట. కామరాజుగారి ప్రవృత్తి మీకు తెలీందికాదుగా బాబూ! అప్పట్నుంచి అదేగొడవ! భార్యకు మందిప్పిస్తూ పిల్లలకు చదువుచెబుతూ రాత్రి ఇద్దరు షావుకార్ల దగ్గర లెక్కపద్దులువ్రాసి ఆ బాకీ తీర్చడానికి డబ్బు ప్రోగుచేశారట. ఖర్మ- కాక పోతే మరేంటి అలాంటి ధర్మరాజుకి బాధలు వ్రాసున్నాయనుకోడం తప్పితే మరేం విటి! ఓనాడు అతను ఆస్పత్రినుంచివస్తుంటే దార్లో ఓకారు రిక్షాను ఢీకొందిట. అందు లోంచి ఓఆడమనిషి, ఓపసిపాప క్రిందపడిపోయారు. వెంటనే కామరాజు వాళ్ళిద్దర్ని అదేకారులో ఎక్కించి ఆస్పత్రిలో చేర్చారు. వాళ్ళకు తగిల్న గాయాలూ, అవీ చూచి గుండె కరిగి బాకీ చెల్లించడానికి తన రక్తమాంసాలుతిని, అర్థాకలితో ప్రోగు చేసిన డబ్బు డాక్టరుకు చెల్లించి, ఎలాగైనా రక్షించండి....ఎలాగైనా రక్షించండి. మా చెల్లెలి ప్రాణాల్ని' అని అన్నారట. ఆడమనిషి తను బాకీ ఉన్న పెద్దమనిషి భార్యేనటబాబూ! మరైతే ఎందుకు చెప్పగూడదు. ఇంత డబ్బిచ్చానని అంటే "డబ్బు దేవుంది దాదా! మాటకావాలి. హృదయంకావాలి, మా వెంకడికోసం ఎన్ని మాటలు పడ్డానో! వాడు సుఖంగా ఉండాలి. నాకండ్లముందు వాడు కష్టాల్లో ఉంటే ఇదో నే పెట్టిన ఖర్చు బాకీక్రింద జమ అనేనా! కామరాజు అలా అని బ్రతకలేడు దాదా" అని అన్నారు.

తరువాత దిండుక్రిందినుంచి ఓకవరు, ఓసంచీతీసి నాచేతికిచ్చి "దాదా! ఇదో మూడువందలు. మా వెంకట్రావుకు పంపించండి. నేను బాగున్నాను. కొంత

నీరసంగా ఉండంతే అని వ్రాయండి" అని చెప్పారు. అడ్రసు యిచ్చారు. ఆడబ్బు యివ్వాళే పంపాను.

తరువాత ప్రొద్దునలేచి చూస్తే తలుపు దగ్గరగా వేసుంది. లోపలికి వెళ్ళాను. వెడితే ఎవరూ లేరు. ఏ అలికిడీ లేదు. చివరికి మంచంమీదున్న కాగితం కన్పించింది:- 'దాదా! నమస్కారాలు. కామరాజు శాంతికోసం వెడుతున్నాడు. ఎక్కడున్నా స్నేహితుల క్షేమం చూచి ఏలోకంలోనైనా ఆనందిస్తాను,' అని వ్రాసుంది. అంతే బాబూ.... నేనేం వ్రాయను? ఏం చేయను?....

మీ,

నడింటి దాదారావు

వీర్రాజు కూలబడ్డాడు. అతని కండ్లముందు చీకట్లలుము కొనిపోయాయి, 'వెంకట్రావూ'! అనిమాత్రం అరవగలిగాడు!

---

"జాగృతి" వారపత్రిక నిర్వహించిన కథానికల పోటీలో
ప్రథమ బహుమతి పొందినకథ.
విజయదశమి విశేష సంచిక
26 అక్టోబరు 1955

జానపద సాహిత్యము

# గుజ్జాలగోపిరెడ్డి

వీరగడ్డయగు పల్నాటి సీమ జానపద సాహిత్యంలో గుజ్జాల గోపిరెడ్డి సాహసకార్యాలు శాశ్వతంగా నిలిచిపోయాయి. ఈ సాహిత్యం నుండి గోపిరెడ్డిని గూర్చి వెలువడిన పాటల్ని మధురంగా పాడుకుంటూ అదోరకమైన కిన్నెరవంటి వాయిద్యాన్ని మీటుతూ జట్లు జట్లుగా ఊరూరా తిరుగుతూ బిచ్చమెత్తుకొనే పాటకజనం ఈనాటికీ ఆయా ప్రాంతాల్లో మనకు కనపడుతూనే ఉంటారు. వాటిల్లోకెల్లా గోపిరెడ్డియొక్క అందచందాల్ని, రాజఠీవిని వర్ణిస్తూ చివరికి అతని విషాద మర ణాన్ని తెల్పే ఈ క్రింది పాట హృదయాల్ని కదిలిస్తుంది.

ఓ గుజ్జాల గోపిరెడ్డీ
దాచేపల్లికే దానమైతివా....
శేరు శేరు ఎండి కడియాల్
సేతులాకూ పెట్టుకొనీ,
కట్టమీదా వస్తావుంటే
కలకపేరు వనుకొంటిర కొడకా....
బంగారు కొడుకా, ఒయ్యారి కొడుకా
దాచేపల్లికే దానమైతీవా....
ఎక్కేదీ ఎర్ర గుర్రం
కట్టేదీ కాయ పంచె,
చుక్కలాంటి నీ చక్కదనము
చూడకళ్ళే సాలవుర కొడకా
ఒయ్యారి కొడకా, బంగారు కొడకా
దాచేపల్లికే దానమైతీవా
ఆ పక్కా ఒక సేను
ఈ పక్కా ఒక సేను

గుఱ్ఱాల గోపిరెడ్డి

నడుమలోనా నాపసేను
సందున నిను నలుగురు పట్టి
నరికిరి కొడకా, ఒయ్యారి కొడకా!
దాచేపల్లికే దానమైతివా—

పల్నాటిసీమలో ముఖ్యంగా పిల్లుట్ల, పిడుగురాళ్ళ, దాచేపల్లి, కేతవరం, రుక్మిణీపురం, రెంటాల, మన్నెసుల్తాన్‌పాలెం, జూలపాడు, గణపవరం, రెంటచింతల మొదలగు గ్రామాల్లో ఆబాలగోపాలం ప్రసిద్ధికెక్కిన ఈ పాట పశువుల కాపర్ల నోళ్ళలో, కూలీ నాలీ చేసుకొనే పాటకజనం నోళ్ళలో ఎప్పుడూ ఆడుతూనే ఉంటుంది. ఒక్క మాటలో అక్కడి కొండగుహల్లోను, నాగులేటి ప్రవాహపు గల గల ధ్వనుల్లోను మార్మోగుతూనే ఉంటుంది!

1850—1900 సం॥ మధ్య కాలంలో సుమారు నలభై సంవత్సరాల స్వల్ప కాలం మాత్రమే జీవించిన గోపిరెడ్డి పిల్లుట్ల గ్రామ మునసబు శ్రీ గుఱ్ఱాల చిన్న కృష్ణారెడ్డి కొడుకు. 'గుఱ్ఱాల' వారి పూర్వీకులు పల్నాటి ప్రభువుల్లో ప్రముఖుడైన మలిదేవరాజు కొలువులో అశ్వదళాధిపతులుగా ఉండేవారని ప్రతీతి. తమ ఏలిక పలుమార్లు చిక్కుపరిస్థితిలో పడినప్పుడు వీరు ప్రభువుకు విశ్వాస పాత్రులై తమ గుఱ్ఱపు దళాల్ని సమర్ధవంతంగా నడిపించి విజయం చేకూర్చిపెట్టినట్లు ప్రచారంలో ఉన్నది. వీరి రాజభక్తిని సేవాభావాన్ని గుర్తించిన ప్రజలు తమ అభిమాన సూచకంగా వీరికి గుఱ్ఱాలవారని పేరు పెట్టారు. దీనికితోడు గోపిరెడ్డి ఎప్పుడూ గుఱ్ఱపు స్వారిచేస్తూ తిరుగుతూ ఉండటంవల్ల ఆ పేరు అక్షరాలా సార్థకమైంది. గుఱ్ఱాల వారి వంశం ఔన్నత్యానికీ, ఔదార్యానికీ దయాదాక్షిణ్యాలకీ భోగభాగ్యాలకీ దాన ధర్మాలకీ పెట్టింది పేరు. వంశపారంపర్యంగా వచ్చిన ఈ సుగుణాలన్నింటిని పుణికి పుచ్చుకొని తోటివాళ్ళలో దొర బిడ్డగా వెలుగొందాడు గోపిరెడ్డి.

బాల్యం నుంచీ ఆడినమాట తప్పనివాడుగానూ కార్యశూరుడుగానూ పేరు పొందాడు గోపిరెడ్డి. చక్కని సంఘటనా కౌశల్యం అతని సొమ్ము. తన చుట్టూ పదిమంది యువకుల్ని కూడగట్టుకొని వాళ్ళను వీర పురుషులుగా తీర్చిదిద్దటంలో ప్రాచీనకాలపు ఆంగ్ల వీరుడు రాబిన్‌హుడ్‌వంటివాడు గోపిరెడ్డి. పల్నాటివీరులు బ్రహ్మనాయుడన్నా, బాలచంద్రుడన్నా ఇతనికి ప్రగాఢమైన అభిమానం.

బ్రహ్మన్న యొక్క అసాధారణ ప్రజ్ఞ, రాజనీతికౌశల్యం. బాలచంద్రుని అంకురిత పరాక్రమం ఇతణ్ణి ఉత్తేజితుణ్ణి చేసినవి.

గోపిరెడ్డి ప్రతి సంవత్సరం తన సహచర బృందంతో కలిసి బ్రహ్మనాయుడు నెలకొల్పిన చెన్నకేశవస్వామి దర్శనార్థం మాచెర్లకు పోతుండేవాడు. అక్కడ స్వామికి కైంకర్యం చేయించి నైవేద్యం పెట్టించి ఆ ఆవాహనలో భక్త్యావేశంలో తన్మయుడైపోయేవాడు. ఇట్లా చేయటంలో తనవారిలో వైష్ణవభక్తిని నింపి దేశ భక్తిని రేకెత్తించి త్యాగసేవా భావాలను నెలకొల్పి వాళ్ళను ఉత్కృష్ట మానవులుగా రూపొందించడమే అతని లక్ష్యం.

పల్నాటి వీరులగు బ్రహ్మన్న బాలచంద్రుల భాస్వంతమగు చరిత్రను ప్రజ లలో వ్యాప్తిచేసే ఉద్దేశ్యంతో సుశిక్షితులైన బుఱ్ఱకథకుల్ని తయారు చేయించి ఊరూరా వాడవాడలా త్రిప్పి ప్రజల్లో వీర రసాన్ని పారించి పౌరుష తరంగాల్ని రేకెత్తించేవాడు గోపిరెడ్డి.

ప్రతి సంవత్సరం సంక్రాంతికి కోడి పందాలు, పొట్టేళ్ళ పందాలు జరిపించటం సంవత్సరం పొడుగునా చెడుగుడు పోటీలు ఏర్పాటు చేయటం మొదలైన కార్యక్రమాల్ని ఎన్నో తలపెట్టేవాడు. ఈ పోటీలలో చుట్టుపట్ల గ్రామాలనుండి అనేకమంది యువకులు జట్లు జట్లుగా పాల్గొని కార్యక్రమాల్ని సఫలం చేసేవాళ్లు. ఇట్లా చేయటంలో తన అనుచరులకు జోదులకుండాల్సిన లక్షణాలు నేర్పడం పజలలో క్రీడాసక్తిని పెంపొందించటం మొదలైనవి అతని లక్ష్యాలు. ఈ కార్య క్రమాల్ని ఏర్పాటుచేయటంలోగాని, వాటిని విజయవంతంగా నెఱవేర్చటంలోగాని ఇతడికి అండదండలుగా నిలిచినవారిలో సవతి తమ్ముడు కోటిరెడ్డి, మేనమామ ఎల్ల మందారెడ్డి ముఖ్యులు.

గోపిరెడ్డి తన ప్రాణాల్ని పందెంలోపెట్టి సాధించిన ఘనకార్యాల్లో ముఖ్య మైనవి రెండున్నాయి. ఒకటి బెబ్బులిని చీల్చటం, రెండవది బందిపోటు దొంగల. ముఠానిఅణచి వేయటం.

ఒకసారి పెద్దపులి ఒకటివచ్చి పిల్లుట్ల గ్రామం పొలిమేరలో తిరుగుతున్నట్లు వార్త పొక్కింది. అది పశువుల్ని మనుషుల్ని పొట్టన పెట్టుకుంటున్నదని రోజు రోజుకు వార్తలు రావటం మొదలు పెట్టినవి. గ్రామవాసులు తమ పశువుల్ని

బీళ్ళల్లో ఉంచటానికిగానీ తాము స్వయంగా గడపదాటి బైటకు రావటానికిగానీ హడలి పోతున్నారు. ఏక్షణాని కాక్షణం అదెక్కడ మీదపడుతుందోనని ప్రాణాలు గుప్పిట్లో ఉంచుకుంటున్నారు. యువ నాయకుడైన గోపిరెడ్డి ప్రజలకి ధైర్యం చెప్పి తన బృందంతో కలిసి దానిపని పట్టటానికి నిశ్చయించుకొన్నాడు. ఆ మూడు నాలుగురోజులు గోపిరెడ్డి బృందానికి నిద్రాహారాలులేవు. వారి హృదయాల్లో ఆదుర్దా, ఉత్సాహం ఒకదాన్నితో ఒకటి పోటీలుపడుతున్నాయి. ఆ క్రూరమృగం నుండి ప్రజా జీవితాన్ని విముక్తం చేయడమనే ఏకైక లక్ష్యం తప్ప రెండో ధ్యాసే లేదు వాళ్ళకి. ప్రయత్నాలు ప్రారంభించిన మూడు నాల్గురోజుల్లోనే పట్టపగలు ఒక జొన్న చేనులో తారట్లాడుతున్న ఆ నరహంతకిని పట్టేశారు వాళ్ళు. గోపిరెడ్డి స్వయంగా తన బల్లెంను దాని గుండెలకు గురిపెట్టి ఒడుపుగా విసిరి చీల్చివేశాడు. అది గాండ్రిస్తూ యమలోకం చేరుకున్నది. ఈ సాహసకార్యంతో అతడు ప్రజలకు మరింత ప్రీతి పాత్రుడైనాడు.

పల్నాటిసీమ ఎటుచూసినా కొండగుట్టలతో మిట్టలతో కూడి జీబుటడవులతో నిండి ఉంటుంది. ఆ యా తావుల్లో క్రూర మృగములేగాక మహాక్రూరులైన బందిపోటు దొంగలకు కూడా స్థావరమైయుండేది ఆ రోజుల్లో. ప్రధానంగా నెమలిపురంకనుమ, గుత్తికొండ కనుమ, పాపాయపాలెం కనుమలు బందిపోటు దొంగలకు నిలయాలుగా ఉండేవి. వాళ్ళు ఆ యా గ్రామాలపై మెఱుపుదాడులు జరుపుతూ ప్రజల ధనప్రాణమానాలకు దినదిన గండం నూరేళ్ళాయుస్సుగా ముప్పుతెచ్చిపెట్టారు. పొలాల్లో సిద్ధంగాఉన్న పంటను ఎత్తుకొని పోవటం. బీళ్ళలో కట్టివేసిన పశువుల్ని తోలుకొని పోవటం మామూలైపోయింది. ప్రజలు మళ్ళా తమ రక్షకుడైన గోపిరెడ్డి వైపు దీనంగా చూశారు. అతడు బందిపోట్లను నేలరాచివేయటానికి ప్రతిన పట్టాడు. తన బృందం సభ్యులతో కలిసి అనుసరించవలసిన పథకం గురించి సమాలోచనలు చేశాడు. ఒకరోజు సర్వసన్నద్ధుడై జాగ్రత్తగా ఏరుకొని ఎన్నుకొన్న ఉక్కుదుందటల్లాంటి వందమంది అనుచరుల్ని తీసికొని చీకటిపడే సమయానికి హఠాత్తుగా దొంగల ముఠాస్థావరంపై మెఱుపుదాడి సాగించాడు. దొంగలు అనుకోకుండా జరిగిన ఈ దాడికి నిశ్చేష్టులై బేజారెత్తిపోయారు.

ఆ పరిస్థితిలో దొంగలముఠా నాయకుడై కొండదొర తన బలంకంటే శత్రు

బలమే మిన్నగా ఉన్నదని గ్రహించాడు. తనకు చిక్కతెచ్చిపెట్టే ఈ అసమయము, అసందర్భము అయిన పోరులో ఇరుక్కోకుండా తప్పించుకొని పారిపోవాలని ఎత్తు వేశాడు. కాని గోపిరెడ్డి శత్రువుల ఎత్తును వమ్ముచేసి పోరు తప్పని పరిస్థితిని కల్పించాడు. అప్పటికి బాగా చీకటిపడింది. ఇరు పక్షాల మధ్య రెండు గంటలపాటు నిర్విరామంగా తీవ్రమైన పోరు కొనసాగింది. దొంగలు పైనుండి గోపిరెడ్డి బృందం మీద పెద్దపెద్ద కొండరాళ్ళను దొర్లించారు. అయినాసరే ఆ రాళ్ళ వర్షాన్ని లెక్క చేయకుండా దొంగలకు నిలయములైన కొండగుహల్లో జొరబడ్డారు గోపిరెడ్డి బృందంవారు. చిక్కిన వాళ్ళను చిక్కినట్లుగా చీల్చిపారేశారు. కొండదొర స్వయంగా చాలా గట్టివాడు. అయినా లాభంలేదని గ్రహించి తనకు చావు మూడు తుందని భయపడి హతశేషులైన కొంతమంది అనుచరులతో పలాయనం చిత్త గించాడు. కాని గోపిరెడ్డికి తీరని నష్టం సంభవించింది. కుడిభుజంలాంటి ఎల్ల మందారెడ్డి వీరమరణం పొందాడు. ఈ విజయంతో గోపిరెడ్డి ప్రజల ఆరాధ్యదైవ మయ్యాడు.

ఏ కథలోగాని విలన్ లేకుండా హీరో వుండడుగదా! మనిషి మనస్సులో ఒకసారి ఈర్ష్యా రక్కసి ప్రవేశిస్తే వాడికి లోకంలో ప్రతిమంచీ చెడుగానే కనపడి గ్రుడ్డివాణ్ణి చేసేస్తుంది. బాల్యంనుండీ గోపిరెడ్డి పొందుతున్న పేరుప్రతిష్టల్నిగాని, ప్రజల హృదయాలలో అతనిపైగల ప్రేమాభిమానాల్నిగాని, అసలతని కుటుంబానికున్న కీర్తిప్రతిష్టల్నిగాని చూసి కొన్ని గొప్పకుటుంబాల పెద్దమనుషులు కళ్ళల్లో నిప్పులు పోసుకోవటం మొదలుపెట్టారు. వాళ్ళలో మన్నెసుల్తాన్‌పాలెం గ్రామ కరణం గోపాలకృష్ణయ్య, పిల్లుట్ల గ్రామానికి చెందిన నందారెడ్డి ముఖ్యులు. వీళ్ళిద్దరూ కలిసి కుట్రలుపన్ని నడివయస్సులో ఉన్న గోపిరెడ్డిని పొట్టన పెట్టుకొని పుణ్యం గట్టుకున్నారు.

గోపాలకృష్ణయ్యకు కూడా గోపిరెడ్డిలో సమానంగానే పచ్చిక బీళ్ళున్నాయ్. ఆ రోజుల్లో గుంటూరు, కృష్ణా జిల్లాల్లో పశుసంపద బాగా ఉన్న పెద్దింటి రైతులు తమ పశువులకు పంవత్సరమంతా సరిపోయ్యేంత గ్రాసం తమ ఊళ్ళల్లో లేనందు వల్ల వాటిని పల్నాటిసీమకు తోలి అక్కడ పుల్లరికితీసుకొన్న బీళ్ళల్లో కొన్నాళ్ళు మేపుతుండేవాళ్ళు. గోపిరెడ్డి యొక్క ఔదార్యాన్ని, మంచితనాన్ని విని వాళ్ళు

సాధారణంగా గోపిరెడ్డితోనే ఎక్కువగా పుల్లరికి సంబంధించిన ఒప్పందాన్ని కుదుర్చుకొనేవాళ్ళు. పై పెచ్చు గోపిరెడ్డి క్రింద పశువులు సురక్షితంగా ఉండగలవనీ, అతడు తమ పశువుల్ని జాగ్రత్తగా తమకు అప్పచెబుతాడన్న నమ్మకం గూడా వాళ్ళకతని మీద వుండేది. ఇందువల్ల పుల్లరిమీద వచ్చే ఆదాయం గోపాలకృష్ణయ్య కంటె గోపిరెడ్డికి ఎక్కువగా ఉండేది. దీంతో ఈర్ష్యతో కాలిపొయ్యేవాడు గోపాలకృష్ణయ్య. ఈర్ష్య విషంగామారి గోపిరెడ్డిని హతమార్చే ప్రయత్నాలు ప్రారంభించాడు.

కామారెడ్డి గోపిరెడ్డికి మేనమామ. ఇతడు గోపాలకృష్ణయ్య గ్రామమైన మన్నె సుల్తాన్ పాలానికి చెందినవాడు. ఇతడికి సుగుణవతి, అందాలరాశియైన మంగమ్మ అనే కూతురుంది. చిన్నప్పటినుంచి మంగమ్మ గోపిరెడ్డికి భార్యగా నిర్ణయింపబడింది బంధువర్గంలో. కాని గోపాలకృష్ణయ్య కామారెడ్డిని తన చెప్పు చేతల్లో ఉంచుకొని గోపిరెడ్డిపై పగసాధించే దుర్బుద్ధితో కామారెడ్డికి ఏమేమో నూరిపోసి ఆ పెళ్ళికాకుండా చెడగొట్టాడు. కాని గోపిరెడ్డిని మనసారా ప్రేమించిన మంగమ్మ ధైర్యంచేసి తన తండ్రిని వదిలిపెట్టి గోపిరెడ్డికి ఇల్లాలైంది. దీంతో కామారెడ్డికి గోపిరెడ్డిమీద విరుచుకు తిందామనేంత ద్వేషం ప్రబలింది. అది అవకాశంగా తీసుకొని గోపాలకృష్ణయ్య కామారెడ్డికి పురెక్కించి గోపిరెడ్డిమీదకి ఉసికొల్పాడు.

నందారెడ్డిది పిల్లుట్ల. వయసు మళ్ళిన వాడు. మంగమ్మను రెండోపెళ్ళి భార్యగా పొందుదామని ఆశపడి ప్రయత్నించాడు. లాభంలేక పోయింది. తనకు దక్కకపోతే మానె ఆ గోపిరెడ్డికి దక్కింది. మొదటినుంచీ గోపిరెడ్డినిచూసి అసలే కుళ్ళుతున్నాడేమో, పగతీర్చుకోటానికి కామారెడ్డితోను, గోపాలకృష్ణయ్యతోను చేతులు కలిపాడు. ఈ దుష్టత్రయము కలిసి కుట్రపన్ని గోపిరెడ్డి ప్రాణాలు తీశారు.

తమ కుట్రను నెఱవేర్చుకోటానికి ఈ ముగ్గురూ కలిసి బందిపోటు దొంగల ముఠానాయకుడు కొండదొరను కలుసుకొని అతని సహాయాన్ని కోరారు. లోగడ గోపిరెడ్డి చేతుల్లో చావుదెబ్బతిన్నందువలన అతనికి సహజంగా గోపిరెడ్డి పైన కసి ఉంటుందని, ఆ కసితీర్చుకోటానికి అతడుకూడా ఎదురు చూస్తూ ఉంటాడని, అంచనా

వేసుకొన్నారు. ఈ ముగ్గురూ, గోపిరెడ్డిని ముఖాముఖి ఎదుర్కొనే దమ్ములు తమకు లేవని, దానికి నీవే సమర్థుడవని, పొగిడి పురెక్కించటానికి ప్రయత్నించారు. వాళ్ళ కడుపులో ఉన్న అసలు మాటేమిటంటే ఒకవేళ హత్యానేరం పట్టుబడే పక్షంలో అది తమ మీదికిరాకుండ కొండదొరనెత్తిన పడేటట్లు చూడటమే. గోపి రెడ్డి తడాఖా లోగడ రుచిచూసిన వాడవటం వల్ల కొండదొర మొదట్లో ఈ అఘా యిత్యానికి ఒప్పుకోలేదు. కాని చివరికి ధనాశకు లొంగిపోయాడు.

గోపిరెడ్డి ప్రతి రోజు ఉదయమే లేచి గుఱ్ఱం మీద బీళ్ళను, పశువుల్ని చూసు కోటానికీ, పనివాళ్ళను హెచ్చరించటానికి బయలుదేరి పోవటం మామూలుగా అలవాటు. కుట్రదార్లకు అతని అలవాట్లు తెలుసుకాబట్టి ఆ సమయంలోనే గోపిరెడ్డిని అంతమొందించడానికి పూనుకొన్నారు.

ఒక రోజు మామూలుగా అలవాటు ప్రకారం గుఱ్ఱమెక్కి పొలాల వెంబడి పోతున్నాడు గోపిరెడ్డి. ఒక చోట దారి ప్రక్కగా ఒక పొదదగ్గఱ చెవులు రెండూ కోయబడి ఆ బాధకు తట్టుకోలేక అంబా అంటూ వణికిపోతూ పడిపోయిన ఒక ఆవు దూడను చూశాడు. ఇది కుట్రదారులు అక్కడ గోపిరెడ్డిని ఆపటంకోసం జాగ్రత్తగా ఆలోచించి అంచనా వేసి పన్నిన ఎత్తుగడ. దయార్ద్ర హృదయుడైన గోపిరెడ్డి దూడనుచూచి ఆగకపోతాడామరి? వారి పథకం చక్కగా పారింది. ఆ దూడను చూచి గోపిరెడ్డి గుండె జాలితో నిండిపోయింది. ఆ దూడను అట్లా చేసిన తుంట రులమీద కోపంకూడా వచ్చింది. ఆ దూడకు సహాయపడి దాని బాధను మాన్పాలనే ఉద్దేశంతో గుఱ్ఱాన్ని ఆపాడు. దిగాడో లేదో ఇంతలో అతనిమీద, గుఱ్ఱం మీద ఉచ్చులు వేశారెవరో! ఆశ్చర్యపోతూ గోపిరెడ్డి తనను తాను కూడదీసుకుంటుండగనే హఠాత్తుగా పొదచాటున నక్కిన నలుగురు దుండగులు అతనిమీద పడి బరిశెలతో దిగబొడిచి అంతలోనే మాయమయ్యారు. గోపిరెడ్డి రక్తపు మడుగులో పొర్లాడు తున్నాడు. గుఱ్ఱానికి దెబ్బలేం తగలలేదు. పాపమాజంతువు ఉచ్చులోంచి బయట పడాలనే పెనుగులాడుతున్నది. అది చూట్టానికి, తన యజమానికి సంభవించిన దుస్థి తినిగూర్చి ఇంటికిపోయి తెలియచేయటానికి ఆదుర్దాగా వ్యర్థ ప్రయత్నం చేస్తున్నదా అన్నట్లున్నది! ఇంతలో ఆ దారినపోయే గోపిరెడ్డి జీతగాడు తన యజమానికి వాటిల్లిన దురవస్థకు దుఃఖిస్తూ పరుగెత్తుకుంటూ పోయి ఇంట్లో చెప్పాడు.

గుత్తాల గోపిరెడ్డి

అది వినంగానే భార్య మంగమ్మ, కుటుంబ సభ్యులు గ్రామవాసులు గుండెలు బాదుకుంటూ గుంపులు గట్టుకొని వచ్చారక్కడికి. ఆ స్థితిలోఉన్న తన స్వామిని చూడగానే గుండె పగిలి మంగమ్మ అతని ప్రక్కనే పడి చచ్చిపోయింది. గోపిరెడ్డిని బ్రతికించాలనే ఆశకొద్దీ వెంటనే దాచేపల్లి ఆసుపత్రికి తీసికెళ్ళారు. దాచేపల్లి పొలిమేర చేరుకోగానే ప్రాణాలు విడిచిపెట్టాడు గోపిరెడ్డి. శవాన్ని పిల్లుట్లకు తీసికొచ్చారు. అక్కడ తన భర్తతో కలిసి అంతిమయాత్ర సాగించటానికి ప్రతీక్షిస్తూ సిద్ధంగా ఉన్నది మంగమ్మ శవం. ఆ రోజు సాయంత్రం సూర్యుడస్త మించిన తరువాత ప్రజల హాహాకారాల మధ్య కన్నీటి జోహార్ల నడుమ ఆ పుణ్య దంపతుల కళేబరాల్ని స్వాహా చేసుకున్నాడు అగ్నిదేవుడు.

గోపిరెడ్డి నిస్సంతు. తన యావదాస్తినీ అతడు పిల్లుట్ల గ్రామాభివృద్ధికి, ప్రజాసౌకర్యాలకు వినియోగించాడు. అతడు చేసిన ధర్మ కార్యాల్లో ప్రధానంగా పేర్కొనవలసింది అతడు పిల్లుట్లలో స్థాపించిన అనాథ శరణాలయం. ఇది చుట్టు పట్లగల గ్రామాల్లోని బాలబాలికల విద్యాభివృద్ధికి ఉద్దేశించబడింది. అతడు మర ణించడానికి కొద్ది రోజుల ముందు తన యావదాస్తినీ అనాథ శరణాలయాని కిచ్చేశాడు. ప్రప్రథమంగా గోపిరెడ్డినిగూర్చి చారిత్రిక విషయాలను వ్రాసినవారు శ్రీరామచంద్ అనునాయన. వారు గోపిరెడ్డి జీవితంమీద, అతని ఆశయాల, ఆదర్శాలమీద పేర్కొనదగిన పరిశోధనలు చేశారు. ఆయన తన రచనల్లో గోపిరెడ్డి ఆరువందల ఎకరాల భూమిని అనాథశరణాలయానికిచ్చివేసినట్లు పేర్కొన్నారు.

గోపిరెడ్డి అన్నగారైన వీరారెడ్డికి కూతుళ్ళతోబాటు గోపాలకృష్ణారెడ్డి అనే ఒక కొడుకుగూడా ఉన్నాడు. అతడు ఇంగ్లాండ్ వెళ్ళి బారిష్టరై తిరిగి వచ్చిం తరువాత శ్రీ కందుకూరి వీరేశలింగంగారి సంఘ సంస్కరణోద్యమంచే ప్రభా వితుడై ఆయనకు శిష్యుడయ్యాడు. పాపం ఆ ఒక్క వంశాంకురంకూడ చాలా చిన్న వయస్సులోనే కీర్తిశేషుడైనాడు.

---

"ఆంధ్రప్రదేశ్" ప్రభుత్వ తెలుగుమాస పత్రిక
ఏప్రిల్ 1970. ఉగాది ప్రత్యేక సంచిక.

# వివేకానందుని సంస్కృత కవిత్వము

స్వామి వివేకానందనుగూర్చి భారతీయ సాంస్కృతిక పునరుజ్జీవనానికి వేగు చుక్కగా, భారతాద్వైతమూర్తిగా, వేదాంతిగా, విశ్వయోగిగా, మానవతావాదిగా, దేశభక్తుడుగా ఆబాలగోపాలం ప్రజలందరికి బాగా తెలుసు. కాని ఆయన కవి యన్న విషయం చాలామందికి తెలియదు. అందులో సంస్కృతంలోకూడా కవిత్వం వ్రాశారన్న సంగతి అసలే తెలియదేమో నంటే అవినయంగాని, అతిశయోక్తిగాని లేదు. కారణం అసలాయనను మన మా దృష్టితో చూడకపోవటమే. జగద్గురు శంకరుల విషయం కూడా ఇంతే. వారు సౌందర్యలహరి, శివానందలహరి వంటి రసవంతములైన స్తోత్రకావ్యాలెన్నో వ్రాశారు. ఆయన అగ్రశ్రేణికి చెందిన మహా కవి. కాని వారిని మనమాదృష్టితో చూడము. ఇదొక విచిత్రమైన మహా విషయం. అవరుసలో వివేకానందుడు కూడా గొప్పకవి. ఇంగ్లీషు, హిందీ, బెంగాలీ, సంస్కృత భాషల్లో గొప్ప కవిత్వాన్ని వెలయించారు. ఆయాభాషల్లో ఆయన వ్రాసిన కవితల సంఖ్య రాశిలో తక్కువే అయినా గుణంలో మాత్రం గరీయమైనవి. ఆధ్యాత్మిక చింతన, జాతీయభావన, విశ్వమానవతాదృక్పథము అన్నవి యీకవితల్లో కనిపించే సామాన్యలక్షణాలు.

విశ్వజనీనమైన భారతీయ సంస్కృతికి సంస్కృతభాష మూలకందమనీ, దీన్ని భారతీయు లందరూ విధిగా అభ్యసించాలని వారి నిష్కర్ష. తాము స్వయంగా అభ్యసించి, అందలి గ్రంథజాలాన్నంతా క్షుణ్ణంగా అధ్యయనం చేసి, తమ మేధా చుంచువుతో అందలి జీవసారాన్ని పీల్చుకొని ప్రాచీన నవీన యుగ సాధుగుణసమ న్వయంతో నొక సమగ్రమైన జాతీయ జీవన దర్శనాన్ని ప్రతిపాదించిన తత్త్వ వేత్తయే గాక గొప్ప కవితా సంపదను కూడ ప్రసాదించిన మహనీయు డాయన. సంస్కృతభాషలో వారు వ్రాసిన కవితల సంఖ్య ఇప్పటికి లభించినవి ఇరువది యాఱు శ్లోకాలు మాత్రమే. మఱికొన్నింటిని వ్రాసియుండవచ్చుననీ, ఏ కారణము చేతగాని అవి ఖిలమైపోయి ఉండవచ్చునని భావింపబడుతున్నది. ఈ లభించిన 26

శ్లోకాలు "అంబాస్తోత్రమ్" "శివస్తోత్రమ్" "Whom to fear?" Hymns to Shri Rama Krishna" "Salutation to Shri Rama Krishna" అన్న శీర్షికల క్రింద పొందుపరచబడినవి.

వివేకానందుడు తన గురువగు రామకృష్ణపరమహంసవలె కాళీమాత ముద్దుబిడ్డ దన్న సంగతి జగద్విదితం. దక్షిణేశ్వరమునందలి కాళీమాతయు, కన్యాకుమారి యందలి అమ్మవారునూ ఆతని ఆరాధనా కేంద్రములు. సర్వమత మహాసభలో పాల్గొనుటకు చికాగో వెళ్ళుటకు ముందు కన్యాకుమారికడ సముద్రగర్భము నందున్న శిలపై ధ్యాననిమగ్నుడై కూర్చుని అనిర్వాచ్యమగు నొకానొక ప్రేరణను పొంది కర్తవ్యోన్ముఖుడైన మహాత్ము డాతడు. కావుననే కాబోలు, ఆతని ముఖతః లొలుత అంబాస్తోత్ర మావిర్భవించినది.

"కాత్వం శుభే శివకరే సుఖదుఃఖహస్తే
ఆఘూర్ణితం భవజలం ప్రబలోర్మిభంగైః
శాంతిం విధాతు మిహ కిం బహుధా విభగ్నామ్
మాతః ప్రయత్నపరమాసి సదైవ విశ్వే"

ఎవరు తల్లీ నీవు? సుఖదుఃఖములను రెండింటినీ చేతులయందుంచుకొన్న ఓ సౌందర్యరాశీ! ఓ మంగళమయీ! ఎవరివమ్మా నీవు? ఈ సంసార సాగరము ప్రబలములై ఉత్తాలములయిన తరంగ భంగములతో ఎలా కలగుండు పడిపోతున్నదో చూడు; పలువిధముల భగ్నమైపోయిన ప్రపంచశాంతిని తిరిగి నెలకొల్పుటకు నిరంతరము ప్రయత్నించుచున్న జగజ్జననివా!

ఇది మొదటి శ్లోకం. ఇందులో మొత్తం ఏడు శ్లోకాలున్నవి. ప్రతి శ్లోకం లోనూ ఆ పరాశక్తి యొక్క లీలావిలాస విన్యాస సంపద క్రమపాకంలో ఒక్కొక్క మెట్టూ పై పైగా ఓతప్రోతంగా వర్ణించబడింది. జగత్తుయొక్క సర్వవ్యాపారములకూ ఆ తల్లియే మూలమనీ ఆమె తప్ప మనకు మఱొక శరణ్యమే లేదనీ "నాశ్రిత్య తాం వద కుతః శరణం వ్రజామః" అన్న వాక్యములద్వారా కంఠోక్తిగా ప్రతిపాదింపబడింది. ఈ చివరి శ్లోకంలో కవియొక్క స్థితప్రజ్ఞలక్షణం మరింత మిన్నుముట్టింది:—

"యా మా మాజన్మ వినయత్యతి దుఃఖమార్గైః
ఆ సంసిద్ధేః స్వకలితైర్లలితైర్విలాసైః
యా మే బుద్ధిం సువిదధే సతతం ధరణ్యామ్
సాంబా సర్వా మమగతిః సఫలేఽ ఫలే వా"

నేను పుట్టిన దాదిగా, ఏతల్లి తన లీలావిలాసార్థము తానుగా నాకు కల్పించిన దుఃఖకరములగు మార్గములద్వారా నన్ను నా లక్ష్యసిద్ధికి భద్రముగ దాటించుచూ చేర్చుచున్నదో, ఏ తల్లి యెల్లప్పుడూ నా బుద్ధిని సరిగ నుంచుచూ నాకు స్ఫూర్తిని ప్రసాదించుచున్నదో, ఆ తల్లి, సర్వమూ తానయైన ఆ తల్లియే నా చేయు కర్మల సాఫల్యమునందుగాని, వైఫల్యమునందుగాని నాకు, దిక్కు: శరణ్యము.

తప్పటడుగులు వేయుచున్న పసిపిల్లవాని చిగురు టాకుల వంటి చిటికెన వ్రేలు పట్టుకొని తల్లి సున్నితముగను, జాగ్రత్తగను నడిపించుకొని పోవు హృద్య మైన దృశ్యము ఈ శ్లోకమున చిత్రీకరింపబడి సుందరమగు దివ్యానుభూతిచి గొల్పుట గమనించవచ్చును. అంబాస్తోత్రమును వ్రాసిన తేదీలు లభించుటలేదు. చికాగో వెళ్ళు టకు ముందు కన్యాకుమారిశిలపై ధ్యాన నిమగ్నుడైనప్పుడు గాని, తిరిగి వచ్చిన పిమ్మట గాని కావచ్చునని నే నూహించుచున్నాను.

శివస్తోత్రము : ఇది రెండవది. దీని రచనాకాలము కూడ తెలిసి వచ్చుటలేదు. అంబాస్తోత్రమైన వెంటనే కావచ్చునని భావించుట లెస్స. జగద్గురు శంకరుని మొదట "సౌందర్యలహరిని" పిమ్మట "శివానందలహరిని" వ్రాసినట్లు ప్రతీతి. ఆ వరుసలో విశ్వయోగి వివేకులు సైతము తొలుత నంబను స్తుతించి మలుత సాంబులు స్తుతించిరి. ఇందు మొత్తము ఆఱు శ్లోకములున్నవి. మొదటి శ్లోకమిది:-

నిఖిల భువన జన్మస్థేమభంగ ప్రరోహాః
అకలిత మహిమానః కల్పితా యత్ర తస్మిన్
సువిమల గగనాభే ఈశ సంస్థేఽప్యనీశే
మమ భవతు భవేఽస్మిన్ భాసురో భావబంధః

ఎవడు, ఈ జగత్తుయొక్క సృష్టి స్థితి లయములకు కారణభూతుడో, ఎవని మహిమలు అనంతములో, ఎవడు ఆకాశమువలె స్వచ్ఛమైన కాంతి గలవాడో,

వివేకానందుని సంస్కృత కవిత్వము

ఎవడు సర్వాత్ముడో, అద్వితీయుడో, అట్టి ఆ పరమేశ్వరునియందు నా యీ జీవిత పరమార్థమగు భక్తి భావబంధము సమర్పింపబడుగాక.

సువిమల గగనాభే = ఆకాశము వలె స్వచ్ఛమైన కాంతికలవాడు; అని చెప్పుట క్రొత్త పోకడ, ఆకాశము నీలముగను, శివుడు తెల్లగను ఉందురు. మఱి యిదెట్లు కుదురును? నిండు పున్నమినాటి యాకాశమువలెనని భావించవలెనని సమాధానము. చంద్రు డాకాశముననే గాదు; శివుని తలపై గూడ నుండు నను సున్నితమైన ధ్వనియు నిచట స్ఫురింపగలదు.

రెండవశ్లోకమున శివునకు "మహాదేవుడు" అన్న పేరు వచ్చుటకు కారణమును, మూడవదానియందు "శివ" శబ్దము యొక్క తత్త్వమును, నాల్గవదానిలో "హర" శబ్దము యొక్క పరమార్థమును భావించిన తీరుగాని, చేసిన తత్త్వానుసంధానము గాని పరమ రమణీయముగ నున్నవి. ఈ ఐదవ శ్లోకమును చిత్తగింపుడు:

గలిత తిమిర మాలః శుభ్రతేజః ప్రకాశః
ధవలకమలశోభః జ్ఞాన పుంజాట్ట హాసః
యమిజన హృదిగమ్యః నిష్కలం ధ్యాయమానః
ప్రణత మవతు మాం సః మానసో రాజహంసః.

చీకటులను చెదరగొట్టువాడును, తెల్లని తేజస్సుతో వెలుగొందువాడును. తెల్లని పద్మశోభగలవాడును, తన అట్టహాసమునుండి జ్ఞానపుంజమును వెలార్చువాడును, నిరంతర ధ్యాననిమగ్నులయిన యోగుల హృదయములయందు సాక్షాత్కరించువాడును, నా మనస్సనెడు మానస సరోవరమున విహరించు రాజహంసయునగు నా పరమశివుడు నన్ను రక్షించుగాక.

మానసో రాజహంసః = అన్నది చక్కని రూపకాలంకారము. రూపకము ఒకానొక భావావేశమున అప్రయత్నముగ పుట్టెడు నలంకారమని ప్రతీతి. ఈ శ్లోకమున వరుస వరుసగా వివిధవిశేషణములచేత పరమేశ్వరుని వర్ణించిన తీరు అట్టి యావేశమును సూచించుచున్నది. కాగా రూపక మ్ముట్టిపడినది. ఈ శ్లోకము, సౌందర్యలహరిలోని సమున్మీలత్సంవిత్కమల మకరందైక రసికం భజే హంస

ద్వంద్వం కిమపి మహతాం మానసచరమ్' అన్న 31వ శ్లోకమునందలి భావముద్రను పుణికి పుచ్చుకొని వ్రాసినట్లున్నది. ఇప్పుడీ చివరి శ్లోకము నరయుదుః:

దురిత దలనదక్షం దక్షజాదత్త దోషం
కలిత కలికలంకం కమ్రకల్హారకాంతం
పరహితకరణాయ ప్రాణ విచ్ఛేద సూత్కం
నతనయననియుక్తం నీలకంఠం నమామః.

పాపములను పోగొట్టగల సమర్థుడును, దాక్షాయణి కల్పించిన దోషముగల వాడును, కలిసూచకమగు కలంకము చేత నొప్పుచున్న వాడును, కమనీయమైన కమలకాంతి వంటి కాంతిచేత మనోహరుడును, పరోపకారము చేయుట కొఱకు ప్రాణములను సైతము పణము పెట్టువాడును, నతులగువారియందు కరుణాకటాక్ష వీక్షణమును బఱపువాడును నగు నీలకంఠునకు నమస్కరించుచున్నాము.

ఇందు "పరహితకరణాయ ప్రాణవిచ్ఛేదసూత్కం" అన్నది ముఖ్యమైనది. స్వార్థరహితమైన సేవానిరతిని ఉపదేశించు వాక్యమిది. "సూత్కం" అన్నది కొంత క్రొత్త ప్రయోగముగ కాన్పించుచున్నది. "కలితకలికలంకం" = కలికాల సూచక మగు కలంకము అని చెప్పుట సమకాలీన సమాజమునందలి అస్తవ్యస్త పరిస్థితిని సూచించుచున్నది. ఈ అంబాస్తోత్ర శివస్తోత్రములు రెండును వివేకానందుడు కేవలము జ్ఞానిమాత్రమేగాక అర్ద్రహృదయుడైన భక్తుడని గూడ తేటతెల్లము చేయుచున్నట్లు భావింపవచ్చును.

Whom to fear? ఇది మూడవది. ఇందులో మొత్తం నాల్గు శ్లోకము లున్నవి. ఇవి 25 సెప్టెంబరు 1894 నాడు తనతోటి శిష్యులకు వివేకుడు వ్రాసిన లేఖలో పొందుపఱచబడి యున్నవి. ఆధునికయుగమున "నేను భగవంతుని చూచితిని" అని చెప్పిన మహాత్ముడు రామకృష్ణపరమహంస. అతని శిష్యుడు గదా వివేకుడు. ఈ మహనీయులిద్దరు జన్మించిన యుగములోనే మనముకూడ జన్మించిన అదృష్ట వంతుల మనుకొన్నప్పుడు గుండెలు పులకరించి పోవును. ఈతడు తోటి శిష్యులకు "నిర్భయత్వమును" ఉద్బోధించుచు వ్రాసిన శ్లోకము లివి. వీటిలో నాస్తిక్యము ఆస్తిక్యము అనువాని భేదమును విశ్లేషించిచెప్పు నీ శ్లోకము తలమానికముగనున్నది:

వివేకానందుని సంస్కృత కవిత్వము

క్షీణా స్మ దీనాః సకరుణా జల్పంతి మూఢా జనాః
నాస్తిక్యం త్విదం తు అహహ దేహాత్మవాదాతురాః
ప్రాప్తా స్మ వీరాః గతభయా అభయం ప్రతిష్ఠాం యదా
ఆస్తిక్యం త్విదం తు చినుమః రామకృష్ణదాసా వయమ్.

దేహాత్మలయొక్క తత్త్వమును, భేదమును తెలియక, రెండునూ ఒకటే యని భావించు మూర్ఖులు మేము హీనులము, దీనులము అని జాలిగా వాపోవుదురు. వాస్తవమున కిదియే నాస్తిక్యము. ఇక మేమో, ఈతత్త్వమును, భేదమును తెలిసికొని భయాని కతీతముగ వర్తించు వీరులం. నిజమునకు ఆస్తిక్యమనగా నిద్దియే. రామకృష్ణుని దాసులమైన మేము ఎన్నుకొన్న మార్గమిదియే సుమా!

"నాయమాత్మా బలహీనేన లభ్యతే" అన్న ఉపనిషద్వాక్యసారమే యీ శ్లోకము. రచన మంచి బిగింపుగానున్నది.

Hyms to Shri Rama Krishna (రామకృష్ణ స్తోత్రమ్) అన్నది నాల్గవది. ఇది 1898 నవంబరు నెలలో బేలూరునందు వ్రాయబడినట్లు తెలియుచున్నది. ఇందులో మొత్తము ఎనిమిది శ్లోకాలున్నయి. మొదటి నాల్గు శ్లోకాల చివరిపాదాలు "తస్మాత్త్వమేవ శరణం మమ దీనబంధో!" అన్న మకుటంలోనూ, చివరి రెండు శ్లోకాలు "యామి గురుం శరణం భవ వైద్యమ్" అన్న మకుటంతోనూ అంతమౌతవి. 5, 6, శ్లోకాలకు ఎట్టి మకుటములు లేవు. ఈ రెండూ రెండు లోకోత్తరశ్లోకాలు. రాముని యొక్క కృష్ణుని యొక్క పేర్లతోబాటు ఆ యిర్వురియొక్క అవతారములు కలిసి "రామకృష్ణ" పరమహంసగా అవతరించెనని వర్ణించు శ్లోకము లివి. ఐదవ శ్లోకమిది:-

ఆచండాలాప్రతిహతరయో యస్య ప్రేమప్రవాహః
లోకాతీతోఽప్యహహ న జహౌ లోకకల్యాణమార్గం
త్రైలోక్యేఽప్యప్రతిమమహిమా జానకీప్రాణబంధో
భక్త్యా జ్ఞానం వృతవరవపుః సీతయా యో హి రామః.

ఏ శ్రీరామునియొక్క ప్రేమ ప్రవాహము తిరుగులేని ఉరవడి పరవడులతో చండాలుని మొదలుకొని సకల ప్రాణికోటులయందును సమభావముతో ప్రవహించు

చుండునో, ఎవడు లోకాతీతుడయ్యును లోక కల్యాణ మార్గమును విడువక నిర్వ హించుచుండునో, ఎవని మహిమ ముల్లోకముల యందును సాటిలేనిదో, భక్తి జ్ఞానమును వరించినట్లు ఎవనిని సీతాదేవి వరించినదో అట్టి ఆ రాముడును—

స్తబ్ధీకృత్య ప్రలయకలితం వాహవోత్థం మహాంతం
హిత్వా రాత్రిం ప్రకృతిసహజా మంధతామిస్రమిశ్రాం,
గీతం శాంతం మధురమపి యః సింహనాదం జగర్జ
సోఽయం జాతః ప్రథితపురుషః రామకృష్ణ స్త్విదానీమ్.

ప్రళయసమయమున నుప్పతిల్లునట్లు, కురుక్షేత్రసంగ్రామమున నుప్పతిల్లిన మహానాదమును స్తంభింపజేసి, అర్జునుని యావరించిన అజ్ఞానాంధకారమును పటాపంచలు చేసి ఎవడాతనికి శాంతముగను, మధురముగను, సింహనాదమువలె గంభీరముగను గీతను ప్రబోధించెనో అట్టి ఆ శ్రీకృష్ణుడును- కలిసి ప్రథితపురుషుడగు ఈ రామకృష్ణుడుగా నవతరించెను.

కావ్యమునకు ఆత్మ ధ్వని యందురు. ఈ రెండు శ్లోకములందును చక్కని వస్తుధ్వనులున్నవి. మొదటి శ్లోకమున భక్తి జ్ఞానమును వరించినట్లు సీత రాముని వరించెనని గదా చెప్పబడినది. అప్పుడు సీతవంటి శారదాదేవి రామునివంటి రామకృష్ణుని వరించినది అన్న మధురమైన ధ్వని సిద్ధించును. రెండవ శ్లోకమున కృష్ణుడు అర్జునునకు గీతోపదేశము చేసెనని గదా చెప్పబడినది. అప్పుడు కృష్ణుని వంటి రామకృష్ణుడు అర్జునునివంటి వివేకానందునకు గీతవంటి ఉపదేశము నేదో చేసినట్లు అందమైన ధ్వని సిద్ధించుచున్నది. ఇట్లీ రెండును రెండు లోకోత్తర శ్లోకములై ఒప్పుచున్నవి.

"Salutation to Shri Rama Krishna" -ఇది అయిదవది. ఇందొకే ఒక శ్లోకమున్నది. ఇది 1898 ఫిబ్రవరిలో హౌరాయందలి నవ గోపాల్ ఘోష్ అను రామకృష్ణుని శిష్యుని యింటిలో పూజామందిరమున అప్రయత్నముగ వివేకుని నోటి నుండి వెలువడినదట!

స్థాపకాయ చ ధర్మస్య సర్వధర్మస్వరూపిణే
అవతారవరిష్ఠాయ రామకృష్ణాయ తే నమః.

వివేకానందుని సంస్కృత కవిత్వము

ధర్మస్థాపకుడవు, సర్వధర్మస్వరూపుడవు, అవతారశ్రేష్ఠుడవు నగు ఓ రామకృష్ణా! నీకు నమస్కారము.

జగద్గురు శ్రీ శంకరుల అవతారమే విశ్వయోగి శ్రీ వివేకానందులు. ఆ మహితాత్ముని కావ్యరసమును చూరలుగొని తరింతుము గాక.

---

"ఆకాశవాణి" హైదరాబాదు వారి సౌజన్యంతో.
ప్రసంగము- ది 31-10-1971.

"సంస్కృత భారతీ" త్రైమాసిక పత్రిక
సంపుటి: 2 సంచిక: 4. జనవరి 1983
నాటి సంచికలో ప్రచురింప బడినది.

"స్వామి వివేకానంద కవితావైభవం" అను
పేరుతో వివరముగా గ్రంథరూపమునకూడా
వెలువడినది. ప్రచురణ: 'యువ భారతి'
5, కింగ్స్వే, సికింద్రాబాదు - 500 001
ప్రథమ ముద్రణ: డిసెంబరు 9, 1983.

# సంస్కృత పత్రికలు

ఒకప్పుడు మనదేశంలో సంస్కృతాన్ని 'మృతభాష' అని యీసడించటం గొప్ప నాగరికతగా భావింపబడేది. ఆ విధంగా మృతభాష మృతభాష అని దీన్ని పొడిచి పొడిచి చంపేస్తున్న రోజుల్లో కొందరు ఎటువంటి నిరుత్సాహానికి లోనుగాక ఏటి కెదురీదినట్లు ఆ భాషను అభ్యసించటమే గాక తత్ప్రచారానికై అనేక మార్గాలను అవలంబించి దాన్ని అమృత భాషగా నిలబెట్టటానికి తీవ్రమైన కృషిచేశారు. వారవలంబించిన అనేక మార్గాలలో సంస్కృతంలో పత్రికలు నడపటం ఒకటి. దాదాపు అన్ని భాషల్లోను వెలువడిన సమయానికే సంస్కృతంలో గూడ పత్రికలు వెలువడినయి. సుమారు నూటపది సంవత్సరాల క్రితం ప్రారంభమైన Sanskrit Journalism ను గూర్చి తెలుసుకుంటున్నప్పుడు ఒక విధమైన కుతూహలము, ఉత్సాహము రేకెత్తటం సహజమే.

ఇప్పటికి అందిన వివరాలను బట్టి మొట్ట మొదటి సంస్కృత పత్రిక 1861లో వెలువడింది. దీనిపేరు ''కాశీవిద్యాసుధానిధి'' దీనిని ''పండితపత్రికా'' అని కూడా పిలిచేవారు. ఇది సంస్కృతంలో కొంత, ఆంగ్లంలో కొంత వెలువడు తుండేది. సంస్కృత విభాగంలో ఎక్కువగా సాహిత్యవ్యాసాలు, శాస్త్ర విషయాలు ప్రచురింపబడుతూ ఉండేవి. ఇంగ్లీషు విభాగంలో గొప్ప గొప్ప పరిశోధ నాత్మక వ్యాసాలు ప్రకటింప బడుతుండేవి. ఈ వ్యాసాలను భారతీయ విద్వాంసులే గాక మేధావులైన విదేశీ పండితులు గూడా వ్రాసేవారు. ఇందులో ప్రచురింపబడిన వ్యాసాలు తరువాత పుస్తకాల రూపేణ ప్రకటింప బడటం కూడా జరిగింది.

దీని తరువాత "విద్యోదయ" అను మరోపత్రిక 1870లో వెలువడింది. బెంగాల్లోని భట్టపల్లి గ్రామానికి చెందిన పండిత హరికేశ శాస్త్రి దీనికి సంపాదకులుగా ఉండేవారు. ఈయన సంస్కృతాంగ్ల భాషల్లో గొప్ప పండితులు. ఈ పత్రికలో వీరుగాని, ఇతర వ్యాస రచయితలు గాని వాడిన సంస్కృత భాష అతి సరళంగాను, అందరికీ అర్థమయ్యేటట్లుగాను ఉండేది. ఇది ప్రధానంగా సంస్కృత

సంస్కృత పత్రికలు

భాషా సాహిత్యాల ప్రచారానికే ఉద్దేశింపబడినా సంఘ సంస్కరణాభిలాషను వ్యక్తం చేసే వ్యాసాలు కూడా వస్తూ ఉండేవి. ఈ పత్రిక యొక్క ఒక సంచికలో శ్రీ హరికేశ శాస్త్రిగారు స్వయంగా వ్రాసిన "ఉద్భిజ్జ పరిషత్" "ఆత్మవాయోః ఉద్గారః" అను వ్యాసాలు తీవ్రమైన సంఘ సంస్కరణాభిలాషను వ్యక్తం చేస్తూ గొప్ప సంచలనాన్ని కలిగించినయి. ఈ విద్యోదయ పత్రిక పండిత హరికేశశాస్త్రిగారి చేతిలో 12సం॥ నిరాఘాటంగా నడిచింది. ఆ తరువాత దానిని "The oriental novility institute of London" అను సంస్థ స్వాధీనం చేసుకొన్నది. మళ్ళీ కొన్నాళ్ళకు ఇండియాకు తీసుకొని రాబడింది. అప్పుడు శ్రీ హరికేశశాస్త్రిగారి కొడుకు (పేరు తెలియదు) దీనికి సంపాదకత్వం వహించి నడిపించారు. ఈ పత్రిక దాదాపు ఏబది సంవత్సరాలు నడిచింది.

19వ శతాబ్దంచివర కొల్హాపూర్‌నుండి పండిత అప్పాశాస్త్రి రాశివేదికర్ గారి సంపాదకత్వంలో "సూనృతవాదినీ" అనువార్తాప్రధానమైన వారపత్రిక వెలిసింది. ఇందులో రాజకీయోద్యమాలు, సాంఘికసమస్యలు, విద్యావిషయాలు చర్చింపబడుతూ ఉండేవి. ఈ సూనృతవాదిని సంస్కృత పత్రికారంగంలో క్రొత్తమలుపును సృష్టించిందని చెప్పవచ్చు. శ్రీ అప్పాశాస్త్రిగారి సంస్కృత పత్రికా రచనను గూర్చి, భాషా పాటవాన్నిగూర్చి శ్రీ. కె. టి. పాండురంగిగారు తాము వ్రాసిన "The Sanskrit Journalism over a Century" అన్న వ్యాసంలో ఇలా పేర్కొన్నారు: "శ్రీ అప్పాశాస్త్రిగారి సంస్కృతరచన దండియొక్క పదలాలిత్యాన్ని, బాణభట్టుని గద్య రచనారీతిని, భారవియొక్క అర్థగౌరవాన్ని, పతంజలియొక్క క్రమబద్ధమగు సంభాషణా చాతుర్యాన్ని పుణికిపుచ్చుకొన్నది" అని. దీనినిబట్టి ఆనాటి కొందరు పత్రికానిర్వాహకులు గాని, పండితులు గాని తమతమ పత్రికల్లో ఆధునిక సమస్యల్ని చేపట్టి చర్చించి నప్పటికీ, సంస్కృత భాషాగౌరవాన్ని, స్థాయిని దిగజార్చటానికి ఇష్టపడినట్లు కనిపించదు.

సంస్కృతపత్రికారంగంలో సుదీర్ఘమైన చరిత్ర గలిగిన ప్రముఖవారపత్రిక "సంస్కృతమ్" అనునది. ఇది అయోధ్యనుండి వెలువడుతూండేది. సంస్కృతం రాజభాషకావాలి అనే ఆదర్శంకోసం తీవ్రంగా కృషిచేసిన ప్రముఖ ఏకైక వారపత్రిక యిది. ఇందులో స్ఫూర్తిదాయకమైన దేశభక్తిగీతాలుగూడ వెలువడుతుండేవి.

1902లో బనారస్‌నుండి "మిత్రగోష్ఠి" అన్న పత్రిక వెలిసింది. దీనికి పండిట్ విధుశేఖర భట్టాచార్య సంపాదకత్వం వహించారు. ఈపత్రిక Indologyకి సంబంధించి ప్రధానభూమికను నిర్వహించింది. ఇందులో భారతీయ చారిత్రక విషయాలు వెలువడుతుండేవి.

1903లో జైపూర్‌నుండి "సంస్కృతరత్నాకరః" అను పత్రిక ప్రారంభింపబడింది. జైపూర్‌లోని "సంస్కృతసాహిత్యపరిషత్" అన్న సంస్థపక్షాన ఇది ప్రచురిత మౌతుండేది. మహామహోపాధ్యాయ శ్రీగిరిధరశర్మ, మధురానాథశర్మ, అను వారలు సంపాదకులుగా పనిచేశారు. ఆతరువాత శ్రీ మండన మిశ్రశాస్త్రిగారు ఈపత్రికను చాలాకాలం నిర్వహించారు. వీరి చేతిలో ఈ పత్రికప్రత్యేకసంచికను సంతరించుకొన్నది. అందులో మన జాతీయ నాయకులైన డా॥ రాజేంద్రప్రసాద్, పం॥ జవహర్‌లాల్ నెహ్రూ, శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి మొదలగువారిపై ప్రత్యేక వ్యాసాలు ప్రచురింపబడి సర్వాంగ సుందరంగా వెలువడిందీపత్రిక.

ఈ విధంగా దాదాపు 1910 నాటికి సంస్కృత పత్రికారంగం బాగా విస్తరించింది. ఒకేవ్యక్తి రెండుపత్రికలకు సంపాదకులుగా పనిచేయటం కూడా జరిగింది. బెనారస్ నుండి వెలువడిన "సూక్తిసుధ" "పద్యవాణి" అను రెండు సాహిత్యమాస పత్రికలకు శ్రీ భవానీప్రసాద్‌శర్మ అనువారు సంపాదకత్వం వహించారు. ఈ రెండు సాహిత్య పత్రికలు ప్రధానంగా ఔత్సాహిక సంస్కృత రచయితల్ని ప్రోత్సహించినవని చెప్పవచ్చు.

1935లో "వల్లరీ" అను మాసపత్రిక వారణాసి నుండి వెలువడింది. పండిత కేశవదత్తపాండే, పండిత తారాదత్తపంత్ అనువారు దీనికి సంపాదకులు. "సంక్షిప్త సమాచారః", "దేవవాణీ", "సంగీతసౌరభమ్" మొదలుగా గల శీర్షికల క్రింద ఆయా వ్యాసాలు వ్రాయబడుతూ ఉండేవి. ఈ పత్రిక యొక్క విశేషమేమంటే ఆధునికభాషా శాస్త్రాన్ని గూర్చి గొప్ప గొప్ప పరిశోధనాత్మక వ్యాసాలు వ్రాయబడుట. ఈ పత్రిక సంవత్సరం పూర్తికాకుండానే ఆగిపోయింది. దీని మొదటి సంచిక బృందావనవిహారి శ్రీకృష్ణుని ముఖచిత్రంతో వెలువడింది.

1936లో ఆగ్రానుండి "కాళిందీ" అను త్రైమాసిక పత్రిక ప్రారంభమైంది. శ్రీహరిదత్తశాస్త్రి ప్రధానసంపాదకులుగా శ్రీజ్వాలా ప్రసాదశాస్త్రి సహాయసంపాదకు

లుగా ఇది నిర్వహింపబడింది. ఆగ్రాలోని ఆర్యసమాజం వారి ఆధ్వర్యం క్రింద నడిచే సంస్కృత మహావిద్యాలయం పక్షాన ఈ పత్రిక నడిచింది. ధనాభావంవల్ల రెండు సంవత్సరాల్లోనే ఆగిపోయింది. ఈ పత్రికలో "సంస్మరణమ్" అను శీర్షిక క్రింద మహా పురుషుల జీవిత చరిత్రలు సచిత్రంగా ప్రచురింప బడినవి. ఒక సంచికలో పం॥ దీనానాథ శాస్త్రిగారు రచించిన "సంస్కృత పత్రాణాం సాధారణ ఇతిహాసః" అను ప్రత్యేక వ్యాసం ప్రచురింపబడింది. ఈ వ్యాసం సంస్కృత పత్రికా రంగం యొక్క చరిత్రను కొంతవఱకు ప్రప్రథమంగా వెలుగులోనికి తెచ్చిందని చెప్పవచ్చు.

1939లో "జ్యోతిష్మతీ" అను పత్రిక వారణాసి నుండి ప్రకాశితమైంది. దీనికి "సర్వస్వతంత్ర" "కవితార్కిక చక్రవర్తి మహోదయ" బిరుదాంకితులైన మహాదేవ శాస్త్రిగారు సంపాదకులుగా పనిచేశారు. ఇది సంస్కృత పత్రికా రంగంలో గొప్ప విప్లవాన్ని తెచ్చిపెట్టింది. ఆనాటి సంస్కృత పండితులు గాని పత్రికా నిర్వాహకులు గాని కాలప్రభావాన్ని, సాంఘిక ప్రయోజనాన్ని గుర్తించి వ్యవహరించిన మహానుభావులు. జన సామాన్యానికి అర్థమయేటట్లు సంస్కృత పత్రికా భాషా రచనను రూపొందించటంలో గాని, సమాజ జీవితాన్ని చైతన్య విలసితం చేయటానికి పనికివచ్చే సంఘ సంస్కరణ కార్యక్రమాల్ని చేపట్టటంలో గాని వారు, నేడు ఆధునికులము, నాగరికులము అనుకొనే వారందరి కంటె ముందున్నారా అనిపిస్తుంది. లోగడ పేర్కొన్న పత్రికల్లో సంఘ సంస్కరణాభిలాషను ఏ విధంగా ప్రోత్సహించారో వివరించటం జరిగింది. ఆ దిశలోనే యీ "జ్యోతిష్మతీ" పత్రికకు ప్రాధాన్యం ఉంది. ఇందులో చక్కని కథానికలు, గేయములు ప్రచురింపబడేవి. "మహిళా స్వాతంత్ర్యమ్" అను శీర్షిక క్రింద స్త్రీల సమస్యలకు కొంత స్థానం కేటాయింప బడింది. వర్తమాన పరిస్థితులన్నింటినీ చర్చించటానికి వివిధ శీర్షికలను ఏర్పరచిన పత్రిక యిది. రాజకీయ, సాంఘిక, చారిత్రక, ధార్మిక, సారస్వత విషయాలు, స్త్రీలకు బాలబాలికలకు, విద్యార్థులకు ఉపయోగపడే రచనలు ఇందులో వచ్చేవి. స్వాతంత్ర్యోద్యమ విషయాలు నిర్భయంగా ప్రకటింపబడేవి. ప్రబోధ గీతములు వ్రాయబడేవి. "స్వరాజ్యసిద్ధి మపహాయ అన్యన్నకామయేఽహమ్" అన్నది ఈ పత్రిక యొక్క ప్రతిజ్ఞ. ఇది మూడు సంవత్సరాల్లోనే

అంతరించి పోయింది. ఈ పత్రిక నడచినంత కాలం మహామనా మాలవీయయొక్క ప్రోత్సాహం దీనికి లభిస్తూ ఉండేది.

ఇక దక్షిణ భారతావనికి వస్తే 19వ శతాబ్దం చివరిభాగంలోనే శ్రీరంగం నుండి "సహృదయ" అను పత్రిక వెలువడుతుండేది. శ్రీకృష్ణమాచార్య అనువారు సంపాదకులుగా ఉండేవారు.

ఈ వరుసలో ప్రధానంగా పేర్కొనవలసిన పత్రిక "ఉద్యానపత్రిక". ఇది శ్రీమాన్ డి. టి. తాతాచార్యగారి సంపాదకత్వంలో తిరువయ్యూర్ నుండి వెలువడుతూ ఉండేది. దాదాపు అర్ధశతాబ్దకాలం నిరాఘాటంగా నడిచిన యీపత్రిక ఈ మధ్యకాలంలోనే ఆగిపోయింది. ఈనాడు సంస్కృతవిద్వాంసులుగా సుప్రసిద్ధులైన మహానుభావులు విద్యార్థిదశలోనున్నప్పుడు వారిమీద ఈ పత్రికాప్రభావం ఎంతగానో ఉండేదని ఒక సుప్రసిద్ధ సంస్కృత విద్వాంసుడు చెప్పటం జరిగింది. ఇందులో కథలు, గేయాలు, శాస్త్రాంశాలు, సాహిత్యవ్యాసాలు వెలువడుతుండేవి.

శ్రీరంగంనుండే 1939లో "శంకరగురుకుల పత్రికా" అను త్రైమాసిక పత్రిక వస్తుండేది. సంపాదకులుగా గురుభక్త శిరోమణి శాస్త్రప్రసార భూషణ - ఇత్యాది బిరుదాంకితులైన శ్రీ టి. కె. బాలసుబ్రహ్మణ్యం అయ్యంగారు ఉండేవారు. పత్రిక నూరు పేజీలకుపైగా వెలువడుతుండేది. ఇందు రెండు భాగాలుండేవి. మొదటి భాగంలో సాధారణ సాహిత్యవ్యాసాలు, శాస్త్రవిషయాలు ప్రచురింపబడేది. రెండవ విభాగంలో అముద్రిత ప్రాచీన సంస్కృత గ్రంథావళి ముద్రింపబడుతుండేది. ఈ పత్రిక యొక్క ప్రథమసంచికలో శ్రీ శృంగేరీ పీఠాధిపతుల "మీనాక్షీస్తుతి" ప్రచురింపబడింది.

"మైసూరు సంస్కృత పాఠశాలా పత్రిక" 1925లో స్థాపింపబడి 1956 వరకు నడిచింది. దీని స్వర్ణోత్సవ సంచిక గూడ వెలువడింది. మైసూరురాష్ట్రంలోని బెల్గాంనుండి "మధురవాణీ" అనేపత్రిక ప్రచురింప బడుతూ ఉండేది. రామాచార్య గాళగళి, శ్రీనివాసాచార్యబర్లి అనువారిరువురూ సంపాదకులుగా పనిచేశారు. 1935లో స్థాపింపబడి పక్షపత్రికగా, మాసపత్రికగా మళ్ళీ పక్షపత్రికగా- ఇలా రకరకాలుగా రూపందాల్చి చివరికి ఆగిపోయింది. "మాసావతరణిక" అను శీర్షిక క్రింద ప్రకృతి సౌందర్యాన్ని గూర్చిన ప్రత్యేక వ్యాసాలు ప్రచురింపబడు తుండేవి.

సంస్కృత పత్రికలు

ఇక ఆంధ్రప్రదేశ్‌కి వస్తే విజయవాడ నుండి "అమృతసందేశః" అనుపత్రిక 1938లో వెలువడింది. శ్రీతిరుమల శ్రీనివాసత్రిలింగ మహా విద్యాపీఠం దీని కార్య స్థానం. సంపాదకులు వైద్యరాజ డా॥ డి. యస్. అవధాని, జి. వి. రెడ్డి అను వారలు. ఇది సంస్కృతాంగ్ల సమ్మిశ్రితంగా వెలువడుతుండేది.

చిత్తూరునుండి "చిత్తూరు సంస్కృత ప్రచారిణీ సభ" ఆధ్వర్యంలో శ్రీ టి. కె. తిరువేంగళాచార్య సంపాదకత్వంలో "గైర్వాణీ"అను మాసపత్రిక వెలువడుతున్నది.

ఈనాడు దేశంలో అనేకతావులనుండి అనేక పత్రికలు వెలువడుతున్నవి. మధ్యప్రదేశ్‌లోని సాగర్ విశ్వవిద్యాలయానికి చెందిన "సంస్కృత పరిషత్" అను సంస్థ ఆధ్వర్యాన "సాగరికా" అన్న త్రైమాసిక పత్రిక వస్తున్నది. సంపాదకులు డా॥ రామ్‌జీ ఉపాధ్యాయ. దీని రెండవ సంపుటంలోని నాల్గవ సంచికలో శ్రీరామ గోపాలమిశ్రా అనువారు వ్రాసిన "సంస్కృత పత్రకారితా" అనేవ్యాసం 1935 నుండి 40 వఱకుగల సంస్కృత పత్రికారంగ చరిత్రను తెలియజేస్తున్నది. జైపూర్‌నుండి 'భారతీ' అను మాసపత్రిక, బొంబాయినుండి "బాల సంస్కృతమ్" పూనా నుండి "శారద" మైసూరునుండి "సుధర్మ" అను దినపత్రిక, హోషియార్‌పూర్ నుండి "విశ్వసంస్కృతమ్" నాగపూర్ నుండి "సంస్కృత భవితవ్యమ్" ప్రయాగనుండి "సంగమణి" ఇలా ఎన్నో వార, పక్ష, మాస, త్రైమాసిక, వార్షిక పత్రికలు దేశం నలుమూలలనుండి వెలువడుతూనే ఉన్నాయి. ఇవి సుమారు 30 పత్రికలకుపైగా మండవచ్చు. స్వాతంత్ర్యంవచ్చి, దేశభాషలకు ప్రాధాన్యత పెరుగుతున్న ఈ రోజుల్లో "తల్లి సమస్తభాషలకు సంస్కృత భాష ధరాతలంబునన్" అని పొగడ బడుతున్న ఈభాషకు ఇతోధిక ప్రోత్సాహము, ప్రచారమూ ఎంతైనా అవసరం.

---

"ఆకాశవాణి" హైదరాబాదు వారి సౌజన్యంతో
ప్రసంగము– ది 14–5–1972.

"సంస్కృత భారతీ" 26 మార్చి 1982 నాటి
ప్రారంభ సంచికలో ప్రచురింప బడినది.
ఈ పత్రిక సంస్థాపక ప్రధాన సంపాదకులు
డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి

## అనుబంధము

"సంస్కృత భారతీ" త్రైమాసిక పత్రిక హైదరాబాదునుండి వెలువడు తున్నది. దీని ప్రారంభసంచిక దుదుంభి ఉగాది 26 మార్చి 1982 నాడు వెలువ డింది. "ది సంస్కృతథియేటర్, హైదరాబాదు" పక్షాన తొలుత ఈ పత్రికను ప్రారంభించి, నిర్వహించుటకు సంస్థాపక ప్రధాన సంపాదకులుగా ప్రభుత్వం నుండి "డిక్లరేషన్" పొందిన వారు డా॥ ఓగేటి అచ్యుతరామ శాస్త్రి.

దరిమిలా కొన్ని యేర్పాట్లు కారణంగా దీని నిర్వహణ బాధ్యత సరస్వతీ విద్యా పరిషత్తు, వేంకట రమణనగర్, హైదరాబాదు - 500 004. వారికోరికపై వారికి అప్పగించటం జరిగింది. వీరి ఆధ్వర్యంలో సంపుటి :1 సంచిక:4 వఱకు పత్రికలు వెలువడినవి.

పిమ్మట జరిగిన మఱికొన్ని యేర్పాట్లు ఫలితంగా సరస్వతీ విద్యాపరిషత్తునుండి "సంస్కృత భాషా ప్రచారసమితి, జి. పుల్లారెడ్డి ఛారిటీస్ ట్రస్టు" వెంకటరమణ నగర్, ఖైరతాబాదు, హైదరాబాదు - 500 004 వారికి బదిలీ చేయటం జరిగింది.

ఎన్ని చేతులుమారినా ప్రారంభించిందిమొదలు నిరాటంకంగా మూడువువ్వు లారుకాయలుగా నడుస్తున్నపత్రికయిది. ప్రధాన సంపాదకులు ఆచార్య డా॥ దివా కర్ల వేంకటావధానిగారు. సంపాదకమండలి సభ్యులలో డా॥ ఓగేటి అచ్యుత రామ శాస్త్రిఒకరు. ఈ పత్రిక ప్రారంభసంచిక సంపాదకీయములో ఆచార్య డా॥ దివాకర్ల వేంకటావధానిగారిట్లు వ్రాసిరి:-

"తొలుదొల్త సంస్కృత నాటకాభినయ పారీణులును, భారతీయ సంస్కృతి ప్రియులును, పండితాగ్రగణ్యులును అయిన శ్రీ ఓగేటి అచ్యుతరామ శాస్త్రి M.A. గారీ పత్రిక నారంభింపదలచియు దయతో దానిని పరిషత్తునకు ప్రసాదించిరి. వారికి మా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు."

ఇదే విషయమును వారు సంస్కృత సంపాదకీయములో కూడ సెలవిచ్చిరి. విస్తరభీతిచే విరమించటమైనది.

## పాండవోద్యోగ విజయములకు పరిమితమైపోయిన

# పౌరాణిక నాటక రంగము

పౌరాణిక నాటకాలనంగానే ప్రప్రథమంగా స్ఫురించేది తిరుపతి వేంకట కవుల పాండవోద్యోగవిజయాలు. ఆ తరువాతనే చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారి గయోపాఖ్యానం. ధర్మవరం కృష్ణమాచార్యులవారి చిత్ర నళీయం. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి పాదుకాపట్టాభిషేకం, బలిజేపల్లి లక్ష్మీకాంతంగారి సత్య హరిశ్చంద్ర మొదలైన నాటకాలు మెదిలేది. పౌరాణికాలనటానికి బదులు పద్య ప్రధాననాటకాలని చెప్పి మఱికొంత విస్తరింపదలిస్తే శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారి బొబ్బిలియుద్ధం, ధర్మవరం వారి సారంగధర మొదలైనవి మఱికొన్ని నాటకాలు, సాక్షాత్కరిస్తవి. మొత్తంమీద ఇవన్నీ కలిపి పదివఱకు ఉండవచ్చు. ఇవన్నీ మహా నాటకాలే. వీటిని సంతరించిన వారందరూ మహనీయులే. కాని పుణ్యంచేత యశస్సు లభిస్తుందన్న ఆర్యోక్తి ననుసరించి వీటికి అబ్బిన కీర్తిప్రతిష్ఠలలో తర తమ భేదం ఉండకపోదు. పాండవోద్యోగవిజయాలు తెలుఁగు పౌరాణిక నాటకాలన్నింటికీ తలమానికంగా వెలుగొందుతున్నాయనేది జగమెరిగిన సత్యం. దీనికి యింతటి కీర్తిప్రతిష్ఠలు దక్కటానికి కారణాలేమిటో పరిశీలించాలి.

1. తిరుపతి వేంకటకవులకు వ్యక్తిగతంగా ఉన్న కీర్తిప్రతిష్ఠలు మొదటి కారణం. ఆధునికయుగంలో తెలుఁగు సాహిత్య పునరుజ్జీవనానికి వీరు చేసిన కృషి నాన్యతో సదృశమైంది, వీరు అద్యతనాంధ్రకవి ప్రపంచ నిర్మాతలు. అందువల్ల ఇతరులెవ్వరికీ లేని కీర్తి వీరికి దక్కింది. వీరికి వ్యక్తి గతంగా లభించిన యశః ప్రభావంవల్లనే వీరి నాటకాలకు ప్రసిద్ధి చేకూరింది.

2. తెలుఁగుదేశంలో మహాభారతానికున్న ప్రాచుర్యం మరోదానికి లేదు. వింటే భారతం వినాలి, తింటే గారెలు తినాలి అన్నంత రుచిగా మనవారు భారత కథను చెవికోసుకొని వింటారు. భారతకథలో కూడా సూటిగా కౌరవ పాండవులకు సంబంధించిన ప్రధాన కథపైనే మక్కువ ఎక్కువ. పాండవోద్యోగవిజయాలు ప్రధాన భారత కథానాటకాలు.

3. అసలు భారతకథలోకూడా కొన్ని ఘట్టాలు మహారసవత్తరంగా ఉండటం మనకు తెలుసు. విరాటోద్యోగ పర్వాలు, యుద్ధపంచకం మొదలైనవి మణిస్తంభాలవంటి ఘట్టాలు. ఇవి వ్యాసభారతంలోనే అంత. వాటికి మఱికొంత మెఱుగుపెట్టి వ్రాశాడు తిక్కన. ఇలా పసందైన ఘట్టాలపై వ్రాసిన ఉద్యోగ విజయాల నాటకానికే ఎక్కువ ప్రసిద్ధి వచ్చిందిక్కడ. ఈ విషయం మఱికొంత వివరిస్తాను. వీరు భారత కథకు సంబంధించిన నాటకాలు ఆఱు వ్రాశారు. పాండవాశ్వమేధము, పాండవ ప్రవాసము, పాండవ జననము, పాండవ రాజసూయము, పాండవోద్యోగము, పాండవవిజయము అను పేర్లతో ఇవి వ్రాయబడినవి. తక్కిన నాటకభాగాలు సోదిలో లేకుండాపోయి పాండవోద్యోగ విజయాలు మాత్రమేప్రసిద్ధి వహించినవి. దీనికి కిటుకు మూలం బాగుండడమే.

4. తిక్కనగారి ఒరవడిలో వీరి రచన సాగటం కూడా ప్రధాన కారణం. వీరి నాటకాల్లోని పద్యాలు కొన్ని భారతంలోని పద్యాలకే వన్నె పెట్టేవిగా ఉన్నవని పెద్దల తలంపు. "బావా! ఎప్పుడు వచ్చితీవు" "అదిగో ద్వారక" మొదలైన పోకడలకు 'క్లూ' వీరికి తిక్కన భారతంలోనే దొరికింది. ఇంతటి కమ్మని పద్య రచనా విధానం ఇంత బాగా వీరి యితర నాటకాల్లో లేకపోవటానికికూడా ఈ ఘట్టాల ప్రభావమే కారణం.

5. సంస్కృతంలో భట్టనారాయణుఁడు రచించిన వేణీసంహార నాటకాన్ని ఒజ్జబంతిగా పెట్టుకొని వ్రాసిన నాటకం వీరిది. ఈ వేణీసంహారానికి సంస్కృత నాటక సాహిత్యంలో ఎంత గొప్పస్థానముందో చెప్పటానికి వీల్లేదు. ప్రాచీనకాలంలో గాని, ఆధునిక కాలంలో గాని సంస్కృత నాటకాలను ప్రయోగించటమంటూ జరిగినట్లయితే వేణీసంహారం ప్రయోగింప బడినంత విరివిగా మరే నాటకమూ ప్రయోగింపబడి ఉండదని ఘంటాపథంగా చెప్పవచ్చు. తెలుఁగు నాటకాలలో పాండవోద్యోగ విజయాలకు ఎటువంటి స్థానం ఉన్నదో సంస్కృత నాటకాలలో వేణీసంహారానికి అటువంటి స్థానముందని ఒక్కముక్క చెబితేచాలు; సంస్కృత భాషా పరిచయంలేని వారికి వేణీసంహారం ఎంత గొప్పదో తెలియటానికి.

6. అసలు తిరుపతి వేంకటకవులను ఈ నాటకాలు వ్రాయటానికి ప్రేరేపించింది వడ్డాది సుబ్బరాయకవిగారి ఆంధ్రీకృత వేణీసంహారమే. వసురాయ

కవిగారు ఈ సంస్కృత వేణీసంహారాన్ని 1883లోనే తెనిగించి తాను స్వయంగా అశ్వత్థామగా, దుర్యోధనుఁడుగా, ధర్మరాజుగా నటిస్తూ కొన్ని వందలసార్లు తెలుఁగు దేశమంతా ఆడి ప్రజల్ని ఉఱ్ఱూత లూగించారు. ఈ ఆంధ్ర వేణీసంహారం దాదాపు 50 సంవత్సరాలకు పైగా తెలుగు నాటకరంగంపై రాజ్యమేలిందని చెప్పవచ్చు. ఈ నాటకాలను చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు ఎన్నోసార్లు చూసి ఏ విధంగా తన్మయత్వం చెందారో తమ స్వీయచరిత్రలో బ్రహ్మాండంగా వ్రాశారు. సంస్కృత వేణీసంహారాన్ని, ఆంధ్రవేణీసంహారాన్ని, అవి తెలుగు నాటకరంగంపై రాజ్య మేలుతున్న వైనాన్ని కళ్ళారా చూసిన తిరుపతికవులు ఉండబట్టలేక ఈ నాటకాలు వ్రాశారు. అయితే వీరుచేసిన చమత్కారం ఒకటున్నది. వేణీసంహారాన్ని ఆడగా ఆడగా చూసి చూసి ప్రజలు విసుగెత్తి ఉన్నరోజుల్లో వీరు తమ పాండవ కథా నాటకాలను వ్రాసి రంగంపైకి వదిలారు. క్రొత్తొక వింతగా ప్రజలు ఉద్యోగ విజయాల వెంటబడ్డారు.

7. పాండవోద్యోగవిజయాలను ఆడటం ప్రారంభించిన నటుల్లోకూడా ఒక విశేషం ఉన్నది. అది అందరూ చదువుకున్నవాళ్ళుకావటం. బెల్లంకొండ సుబ్బారావు గారు వకీలుగా న్యాయవాదవృత్తి చేపట్టి సంఘంలో గౌరవ ప్రతిష్ఠలు ఆర్జించారు. నాటకాల్లో వేషాలువెయ్యటం తప్పుగా భావించే ఆ రోజుల్లో సంఘంలో గౌరవప్రతిష్ఠలు గల వ్యక్తులు ఆ నాటక ప్రయోగాలు చేపట్టటంతో అసలు వీరి నాటకాలకే దశ ఎత్తు కున్నదని చెప్పవచ్చు. ఆ తరువాత వచ్చిన బందా కనకలింగేశ్వరరావుగారుకూడా బాగా చదువుకొని వకీలువృత్తి చేపట్టినవారు కావటం ఈ నాటకాల అదృష్టమే గదా! తిరుపతి వేంకటకవులు కొప్పరపు సోదరకవులతో సవాలుగా "దోసమటం చెరింగి యును దుందుడు కొప్పగ పెంచినారమీ మీసలు" అని మీసాలమీద పద్యంచెప్పారు. సరిగ్గా ఆ రోజుల్లోనే బెల్లంకొండ సుబ్బారావుగారు మీసాలతోనే కృష్ణపాత్రను ధరించి మీసాల కృష్ణుడుగా పేరుపొందారు. ప్రేక్షకులకు ఇదికూడా ఒక తమాషా అనిపించి విపరీతంగా వచ్చేవారట! ఇలాంటి చమత్కారాలెన్నో కలిసివచ్చి ఈ నాటకాలకు మహర్దశను పట్టించాయని చెప్పవచ్చు. ఒకటి మాత్రం నిజం. ఆ మహా నటులవల్ల ఈ నాటకాలకు, ఈ నాటకాలవల్ల ఆ మహానటులకు పేరు ప్రతిష్ఠలు వచ్చిన వన్నటంలో సందేహంలేదు.

ఇన్ని కారణాలు కలిసిరాగా పాండవోద్యోగవిజయాల నాటకం అప్పటికీ యిప్పటికీ నాటక రాజంగా వెలుగొందుతూనే ఉన్నది. ఇన్ని సౌకర్యాలు తక్కిన నాటకాలు వ్రాసిన వారికి లేవు. వీరందరూ కూడా చాలా గొప్పవారే. కాని తిరుపతి వేంకటకవులంతకాదు. అందువల్ల వీరి నాటకాలు పాండవోద్యోగ విజయాల స్థాయిని చేరుకోలేకపోయినవి. చిలకమర్తి వారి గయోపాఖ్యానంకూడా పాండవ కథానాటకం కావటంవల్ల ఒక మెట్టు తక్కువగా వాటికి దీటుగా నిలబడగలిగిందని చెప్పవచ్చు. అయితే ఈ గయుడు, ఈతని మూలకంగా వచ్చిన కృష్ణార్జునయుద్ధం భారతంలో లేని విషయం. కృష్ణార్జునుల యుద్ధమనే చమత్కారమే ఈ నాటకానికి శ్రీరామరక్ష. ఈ కథా చమత్కారంవల్ల ఈ నాటకం వెలువడిందే తడవుగా వరుస వరుసగా లక్షకాపీలు అమ్ముడుపోయినవని చెబుతారు. ఇంతేకాదు ఈ నాటకానికి పట్టిన అదృష్టమేమిటంటే ఉద్యోగ విజయాలను ఆడిన నటులే దీన్నిగూడా ఆడటం. అయినా ఈ నాటకం ఉద్యోగ విజయాలంత విరివిగా ఆడబడటం లేదు. కారణం ఉద్యోగ విజయాలంత తేలికగాదు దీన్ని ప్రయోగించటం. ఉద్యోగవిజయాల్లో సన్నివేశ కల్పనలు, నాటకోచిత సంభాషణల చాతుర్యం బొత్తిగా లేవు. వట్టి పద్యాలున్నవి. ఆ పద్యాలుకూడా సునాయాసంగా సంగీత కచేరీ చేసినట్లు, కొండవీటి చాంతాడంత రాగాలుతీస్తూ కుండపోతగా పాడటానికి అనువుగా ఉంటయ్యేగాని మంచి ముగింపు బరువుగల పద్యాలు గాదు. గద్యం చాలా తక్కువ. ఉన్నది కాస్తా ఎగరగొట్ట వచ్చు. పీసపాటి నరసింహమూర్తి సెంట్రల్ సీనులో సొంతంగా కల్పించిన వచనం చదువుతూ మంచి నాటకీయతను తెచ్చిపెట్టి ఆ నాలుగుపద్యాలు పాడి ప్రేక్షకుల్ని ఒక్క ఊపు ఊపి వెళ్ళిపోవటం మనకు తెలుసు. ఆయన చదివే వచనమే అక్కడ లేకపోతే ఆ సీను అంతగా రక్తి కట్టదు గదా? మఱి అట్టి వచనం నాటకంలో ఎందుకు లేకపోయింది? అదే ఆ నాటకంలో ఉన్న లోపం! ఈదృష్టితో చూచినప్పుడు గయోపాఖ్యానం దానికంటే సర్వాంగ సుందరమైన నాటకం. పద్యము గద్యము, నాటకీయత, పాత్రపోషణ, అన్నీ ఉన్న నాటకం. దీనిని ఆడటం అంత తేలికగాదు. అందుకని దీని జోలికిపోకుండా ఏవో పద్యాలు పాడుకుంటూ ఉద్యోగ విజయాలు ఆడుకుంటున్నారు.

గయోపాఖ్యానంలో కృష్ణుని అర్ఘ్యంలో గయుడు నిష్ఠీవనం చేసినపుడు

కుపితుడైన కృష్ణుడు ఒక బ్రహ్మాండమైన గద్యంచదివి వెంటనే బఱువైన పద్యంపాడి ప్రతిజ్ఞ జేస్తాడు. ఈ గద్యాన్ని నేటి కృష్ణులు ఎంతమంది చక్కగా అనగలరు? నాకు తెలిసినంతవఱకు ఒక్క పీసపాటి నరసింహమూర్తి అనగలడు? కాని అతడు కూడా ఎందుకొచ్చిన శ్రమ అనుకొని కాబోలు ఏదో ఉద్యోగ విజయాలు ఆడుకుంటు న్నాడు. మఱి ఈ మహా నాటకం మూలబడిపోవటంలో ఆశ్చర్యం లేదుగదా?

తెలుఁగు నాటకరంగంలో నిజమైన నాటకరాజం కావలసినది బలిజేపల్లి వారి హరిశ్చంద్ర. ఇందులో పద్యానికి, గద్యానికి కూడా సమానమైన ప్రాధాన్య ముంది. "గద్యానుబంధ రసమిశ్రితపద్యసూక్తి" ఉన్న నాటకమిది. ఇటు పద్యాన్ని భావయుక్తంగా పాడటంలోనూ అటు గద్యాన్ని చక్కని మాడ్యులేషన్‌లో అన కల్గటంలోనూ మొనగాడైతే తప్ప ఈ నాటకం జోలికి రాలేడు. గాయకుడైతే చాలు ఉద్యోగవిజయాల్లో కృష్ణుడువేసి తానొక పెద్ద నటుడైనట్లు పోజుగొట్టవచ్చు. నటుడైతే తప్ప ఇక్కడ హరిశ్చంద్రుడుగా వేయలేడు. మరే తెలుఁగు నాటకానికి లేని ప్రత్యేకత ఇందులో రసదృష్టి. సంస్కృతంలో ఉత్తరరామచరిత్రవంటి నాటక మిది. అక్కడ కరుణరసం ఎంతటి ఉత్తాలంగా ఉన్నదో ఇక్కడా అట్లానే ఉన్నది. పద్యరచనా శిల్పం భవభూతికి ఎంతవున్నదో బలిజేపల్లికి అంత ఉన్నది. ఉద్యోగ విజయాల్లోని పద్యాలు పది చదివితే ఎంత సత్తువ ఖర్చు ఔతుందో అంత సత్తువ ఇక్కడ మూడు నాలుగు పద్యాలకే హరించిపోతుంది. ఒక్క విషయం గమ నించాలి. వరుసగా పద్యాలు పాడటం తేలిక. కాని మధ్య మధ్య గద్యం చదువుతూ, అసిధారావ్రత చర్యగా పాత్రను పోషిస్తూ పద్యాలు చదవటం చాలా కష్టం!

మన నటుల్ని రెండు విధాలుగా విభజింపవచ్చు. ఉద్యోగవిజయాలు ఆడే నటులు: హరిశ్చంద్ర ఆడే నటులు. మొదటి తెగ నటులు హరిశ్చంద్ర నాటకంలో తప్ప మిగతా అన్ని నాటకాల్లోనూ వేషాలు వేస్తూనే ఉంటారు. బందా కనకలింగేశ్వర రావు ఉద్యోగవిజయాల్లోనూ, గయోపాఖ్యానంలోనూ, కృష్ణుఁడుగా, పాదుకలో రాముడుగా సారంగధరలో సారంగధరుడుగా నటించటం మనకు తెలుసు. మాధవ పెద్ది ఉద్యోగ విజయాల్లో దుర్యోధనుఁడుగా, గయోపాఖ్యానంలో గయుఁడుగా, బొబ్బిలిలో రంగారాయుడుగా, రోషనార్‌లో శివాజీగా నటించేవారు. అద్దంకి పాండవోద్యోగవిజయాల్లోనూ, గయోపాఖ్యానంలోనూ ధర్మరాజుగా, పాదుకలో

దశరథుఁడుగా, సారంగధరలో రాజరాజ నరేంద్రుడుగా వేసేవారు. పులిపాటి పాండవ నాటకాల్లో అర్జునుడుగా, బొబ్బిలిలో వెంగళ రాయుఁడుగా వేషం కట్టే వారు. ఇలా ఈ నటులందరూ హరిశ్చంద్రతప్ప తక్కిన నాటకాలన్నింటిలోనూ పాత్రధారణ చేసేవారు. అలాగే ఈ తరం నటులు, పీసపాటి, షణ్ముఖి, ఎ. వి. మొదలైనవారు కూడా తక్కిన అన్ని నాటకాలు వేస్తారు. హరిశ్చంద్ర జోలికిరారు. అలాగే హరిశ్చంద్ర వేసేవారు తక్కిన నాటకాల్లో నటించటంలేదు. హరిప్రసాద రావు, డి. వి. సుబ్బారావు, మల్లాది సూర్యనారాయణ, మద్దూరి సత్యనారాయణ మొదలైనవారు హరిశ్చంద్రకే పెట్టింది పేరు. దాదాపు ఇతర నాటకాల్లోకి వెళ్ళలేదనే చెప్పాలి. ఒక్క అబ్బూరి వరప్రసాదరావుమాత్రం పాండవ నాటకాల్లో కృష్ణుడుగా, హరిశ్చంద్రుడుగా కూడా నటిస్తూ ఉండేవారు. అయితే ఆయన ప్రధానంగా గాయకుడు కావటంవల్ల కృష్ణుడుగా రాణించారు. బొత్తిగా నటుఁడు కాకపోవటంవల్ల హరిశ్చంద్రుడుగా ఎక్కి గాలేదు. ఈ విధంగా రెండు నటకుటుంబాలు మన నాటకరంగంపై గోచరిస్తాయి.

హరిశ్చంద్రలో ఇంకో విశేషం ఉన్నది. ఇందులో చంద్రమతికి హరిశ్చంద్రునితో సమానమైన ప్రాధాన్యం ఉన్నది. ఏ విధంగాను ఆమె పాత్రను తగ్గించటానికి వీల్లేదు. అలాగే స్త్రీ ప్రాధాన్య నాటకాలు సారంగధర, తులాభారం వంటివి ఒకటి రెండు ఉన్నవి. పాండవోద్యోగాలు, గయోపాఖ్యానం, బొబ్బిలివంటి నాటకాల్లో స్త్రీ ప్రాధాన్యం లేదని చెప్పవచ్చు. మన నాటకాలవాళ్ళు ద్రౌపదిపాత్రను తీసిపారేసి ఉద్యోగవిజయాలు ఆడటం చూస్తూనే ఉన్నాము. హరిశ్చంద్రలో చంద్రమతి అలాగాదు. తప్పని సరిగా ఉండటమేగాదు; గద్య పద్యాలను చక్కగా ఉచ్చరింపగలిగి, రసవత్తరంగా అభినయింపవలసిన శక్తి సామర్థ్యాలుగల నటీమణియై ఉండాలి. ఉత్తరరామచరిత్రలో సీతవంటిపాత్ర చంద్రమతిది. ఇవన్నీ సమకూర్చుకోవటం కష్టంగదా! అందువల్ల ఇదంటే భయం! ఈ భయం మరో విధంగా కూడా ఉన్నది; హరిశ్చంద్ర వేసేవాళ్ళు ఎక్కిరావటంలేదు అనేది! ఏ విషయంలో ఎక్కిగావటంలేదు? ఆర్థికంగా ఇది నిజమే. కాని స్థిరకీర్తిని సంపాదించటంలో వీళ్ళు ధృవతారలై వెలుగొందుతూనే ఉన్నారుగదా! ఆర్థికంగా ఎక్కిరాకపోవటానికి ఈ నాటకం ఆడటంలో ఖర్చు ఎక్కువ కావటమే. వచ్చిన డబ్బంతా నాటక ప్రయోగానికే

పాండవోద్యోగ విజయాలు

ఖర్చు అవుతున్నది కాని ఆ బృందం నాయకునికి బొత్తిగా మిగలటంలేదు. మిగుల్చుకొని సుఖపడాలనే దృష్టికూడా వారికి ఉన్నట్లు తోచదు. డి.వి. సుబ్బారావు గారు నెల జీతాలిచ్చి నటుల్ని పోషించి నాటకాలు ఆడటం ఎవరికి తెలీదు? వాళ్ళు కళను ఆరాధించి తరించారేగాని దానివల్ల ఆశించింది లేదు. ఈ డబ్బు సంపాదనకు, పెట్టిందిపేరు ఉద్యోగవిజయాలు. నటుడు కాకుండానే కేవలం గాయకుడై డబ్బు సంపాదించగలగటం ఈ నాటకంలోనే ఉన్నది. పీసపాటి నటుడు. షణ్ముఖి గాయకుఁడు. కృష్ణుడుగా మఱి వీళ్ళలో ఎవరు బాగా డబ్బు సంపాదిస్తున్నారు? ఈ నాటకం వేసే వాళ్ళల్లో కూడా మళ్ళీ ఈ భేదం కనపడుతున్నది. ఈవిధంగా రానురాను ఉద్యోగవిజయాలు సంగీతరూపకంగా తయారౌతూ అదొక్కటే పౌరాణిక నాటకరంగానికి ప్రాతినిధ్యం వహిస్తున్నది. నటన, కళ, ఆరాధనా దృష్టి చచ్చి పోతున్నది. ఈ దృక్పథం మారకపోతే తెలుఁగు పౌరాణిక నాటకరంగానికి చరమ సంధ్య త్వరలోనే వచ్చేస్తుంది.

కాబట్టి త్వరగా మేల్కొని దీన్ని సరియైన నాటకరంగంగా పునర్వ్యవస్థీక రించాల్సిన అవసరం ఉన్నది. సుశిక్షితులైన నటీనటులతో కూడిన బృందాలు రావాలి. ఒకప్పుడు తెనాలిలో త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగారి శిక్షణలో పులి పాటి, మాధవపెద్ది, స్థానం మొదలైన వాళ్ళు తయారైనట్లూ, బందరులో డి.వి. సుబ్బారావుగారు హరిశ్చంద్ర నాటకం కంపెనీని నడిపినట్లు, కొన్ని నాటక వ్యవ స్థలు ఏర్పాటుకావాలి. కొన్నాళ్ళు డబ్బుసంపాదనకు స్వస్తి చెప్పి ఆరాధనాబుద్ధితో నటులు కృషి చేయాలి. ఇంత భారీఎత్తున పునర్వ్యవస్థీకరణ జరగాలంటే ప్రభుత్వ సహకారం లేనిది సాధ్యంకాదు. మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సాంస్కృతిక కార్యక్రమాలను విరివిగా ఏర్పాటుచేస్తూ చక్కని వాతావరణం సృష్టిస్తున్న మాట వాస్తవం. ప్రపంచ తెలుఁగు మహాసభల తరువాత సర్వతోముఖమైన చైతన్యం తెలుగు హృదయాలలో తొణికిసలాడుతున్నది. ఈ తరుణంలో ప్రభుత్వం ఈ బాధ్యతను స్వీకరించి పౌరాణిక నాటకరంగ పురోభివృద్ధికి కృషిచేస్తుందని ఆశిద్దాం.

---

హరిశ్చంద్ర పాత్రధారి

"కీ. శే. మద్దూరి సత్యనారాయణరావు" గారి

సంస్మరణ సంచిక. 23–4–1976.

# ప్రాచీన సంస్కృత నాటక సాహిత్యంలో

# జానపద కళల ప్రస్తావన

జనపదము అంటే గ్రామము, దేశ విభాగము, దేశము అని అర్థం. జానపద మన్నా యిదే అర్థమని విశ్వనిఘంటువులోని "భవేజ్జన పదోజానపదోఽపి జన దేశయోః" అన్న వాక్యంవల్ల సిద్ధిస్తుంది. కాగా జనపదమునందు, జానపదము నందు నివసించు ప్రజలు జానపదులు. జనపదానికి, జానపదానికి, జానపదులకు సంబం దించినది జానపదం.

సుప్రసిద్ధులైన ప్రాచీన సంస్కృత నాటకకర్తలలో ఈ శబ్దాలను ఆయా అర్థాలలో విరివిగా ప్రయోగించటంలో "క్రీడ" సల్పినవాడు మహాకవిభవభూతి. ఉత్తరరామ చరిత్ర ప్రథమాంకంలో దుర్ముఖుడు రామునితో "ఉపస్తువంతిదేవం పౌర జానపదాః" అంటాడు. ఇక్కడ పౌరశబ్దానికి పురవాసులనీ, జానపద శబ్దానికి గ్రామవాసులనీ అర్థం. ఇదొకవిభజన. సప్తమాంకంలోని అంతర్నాటక ప్రారంభంలో లక్ష్మణుడు "భోః, కింనుఖలు భగవతా వాల్మీకినా సబ్రహ్మక్షత్ర జానపదాః ప్రజాః సహాస్మాభిరాహూయ" అన్నాడు. ఇక్కడ బ్రాహ్మణులు, క్షత్రి యులు కూడిన జానపదులైన ప్రజలు అని ఒకర్థం. బ్రాహ్మణులు, క్షత్రియులు, జానపదులు కూడిన ప్రజలని మరో అర్థం. ఇది మరో ముఖ్యమైన విభజన. మాలతీమాధవంలోని చతుర్థాంకంలో, పెద్దపులి తఱుముకొచ్చిన ఘట్టంలో "రేరే, శంకరపుర జానపదాః" అని నేపథ్యంలోనుండి వినపడుతుంది. ఇక్కడ ఈ శంకరపురం, పురం గావచ్చు, గ్రామం గావచ్చు, ఇది మూడో విభజన. ఇదే నాటకంలో, నవమాంకంలోని రెండవ శ్లోకంలో పల్లెపడుచు అనటానికి "జనపద-ప్రమదా" అని వాడబడింది. ఇది నాలుగో విభజన. మహావీర చరితం లోని చతుర్థాంకంలో దశరథుడు పరశురామునితో "జనపద బహిర్నిష్ఠాః" అంటాడు. ఇక్కడ కోసల దేశము అనే అర్థంలో వాడబడింది. ఇది ఐదో విభజన. ఇలాగే యింకా అనేకచోట్ల ఈ శబ్దాల్ని ప్రయోగించాడు భవభూతి.

భాసుడు చెంత నేపూ గ్రామము, దేశము అన్నాడేగాని ఈ జనపద-జానవద

శబ్దాల జోలికి పోలేదు. కాళిదాస నాటక త్రయంలో కూడ వీటి ప్రసక్తి మృగ్యం. మేఘసందేశంలో మాత్రం పల్లెపడుచుకు "జనపదవధూ" (శ్లోకం 16) దేశమునకు "బ్రహ్మావర్తం జనపదం" (శ్లోకం 52) అని ప్రయోగించాడు. శ్రీహర్షుని ప్రియదర్శిక లోని ప్రథమాంకంలో గ్రామార్థంలో 'వింధ్యశిఖరాశ్రితేషుజనపదేషు' అని కనపడు తున్నది. విశాఖదత్తుని ముద్రారాక్షసంలోని షష్ఠాంకంలో దేశము లేక రాజ్యము అనే అర్థంలో "చంద్రగుప్తస్య జనపదెన నృశంసా ప్రతిపత్తిః" అని ఉన్నది. ఇక మృచ్ఛకటిక వేణీసంహారాది తదితర నాటకాల్లో అసలీ ప్రయోగాలున్నట్లేదు. ఒకవేళ ఎవరైనా ఒకచోటనో అరచోటో జనపద శబ్దాన్ని ప్రయోగించారేమోగాని జానపద శబ్దాన్ని ప్రయోగించినట్లు మాత్రం కానరాదు.

కాగా, జానపద శబ్దాన్ని ఇదమిత్థంగా విశ్లేషణచేసి ప్రయోగించిన వాడొక్క భవభూతి మాత్రమే. ఇవాళ తెలుగు దేశంలో ఈ శబ్దం ఏ వ్యవహారంలో రూఢిని పొందిందో సరిగ్గా ఆ వరుసలోనే ప్రయోగించాడా అని కూడ తోస్తుంది. ఉత్తర భారతంలో లోక్‌గీత్, లోక్‌సాహిత్య, లోక్‌కళా అని వ్యవహారంలో ఉండగా తెలుగు దేశంలో జానపద గేయాలు, జానపద సాహిత్యము, జానపద కళలు అని వ్యవహారంలో ఉండటం గమనించాలి. భవభూతి తెలుగువాడనే వాదం ప్రసిద్ధం గానే ఉన్నది. అయితే, తనకాలం నాటికి తెలుగు దేశంలో ప్రసిద్ధంగా ఉన్న ఈ వ్యవహారాన్ని తాను స్వీకరించాడా? లేక అతడు ప్రయోగించిన దాన్నిమనం వాడుకలోకి తెచ్చుకున్నామా? కాక, ఇది కాకతాళీయంగా జరిగిందేనా అనే విచికిత్స పుట్టకమానదు. తెలుగు దేశంలో జానపద సాహిత్యంపై కృషి చేసిన కొందరు ఈ జానపద శబ్ద ప్రయోగాన్నిగూర్చి తడివి ఎఱ్ఱన "జానపదుల్, పురీ జనులు" అని పల్లెవాసులూ పట్టణవాసులూనైన ప్రజలు అనే అర్థంలో వాడినట్లు కనిపెట్టారు. ఇది విన్నప్పుడు భవభూతి వాడిన "పౌరజానపదాః ప్రజాః" అన్న దాన్నే ఎఱ్ఱన స్వీకరించి అటూ ఇటూ మార్చి 'జానపదుల్, పురీజనులు" అన్నా డేమోనని స్ఫురించకపోదు. మొత్తంమీద వీళ్ళ వరుసచూస్తే భవభూతి, ఎఱ్ఱన, అది మొదలుకొని తెలుగువారూ జానపదంలోని జానుతనాన్ని కమ్మగా రుచిమరిగారని చెప్పవచ్చు.

జానపదులచేత సృష్టింపబడి, వారిచేతనే పోషింపబడుతూ, వారియందు

ప్రచారంలో ఉన్న కళలు జానపద కళలు. ఒకవిధమైన విభజనకోసం వీటిని జానపద కళలని వ్యవహరించినా నిజానికివి మనదేశీయమైన ప్రాచీన సాంప్రదాయానికి ప్రతీకలుగా నిలుస్తున్నవని చెప్పవచ్చు. ఈ కళలకు ప్రాతినిధ్యం వహిస్తున్నవారు కొన్ని తెగలకో, కులాలకో చెందినవారు కావటం విశేషం. తోలుబొమ్మలాట, గొల్లసుద్దులు, గంగిరెద్దులవాళ్ళు, పులివేషం, సోది, గొల్లల నృత్యం, గ్రామీణుల డప్పుల నృత్యం, జాలరుల నృత్యం, గారడీ వాడు, వీధిగాయకులు, పాములవాడు, బతకమ్మ పాటలు మొదలైనవి జానపద కళలు కాగా వీటిల్లోకొన్ని ఆయా తెగలకో, కులాలకో పరిమితమైనవిగా కనబడకపోవు. కొన్నింటిని మాత్రం జాతిమత కులాల కతీతంగా ఎవరైనాసరే సొంతం చేసుకొన్న కళలు కూడా కనబడుతవి. ఆటవికుల నృత్యం వంటివి కొన్ని ఆయా ప్రాంతాలకు చెందినవిగా ఉన్నవి. నాగరికులు, విద్యాధికులు ఆదరించినా ఆదరింపకపోయినా వాటినే అంటిపెట్టుకొని జీవిస్తున్న ఆయా జానపద కళాకారులు ఎంతైనా అభినందనీయులు.

సంస్కృతభాషలో గుణంలోనూ, రాశిలోనూ ఉత్తాలమైన నాటక సాహిత్యమున్న మాట యధార్థమే. కాని, పుణ్యంచేత యశస్సు లభిస్తుందన్నట్లు స్థిరకీర్తి నార్జించుకొన్నవి ముప్పైకంటేలేవు. ఇవన్నీ కూడా క్రీ.పూ. ఒకటవ శతాబ్దం మొదలుకొని క్రీ.శ. పదవ శతాబ్దివఱకుగల మధ్యకాలంలో వెలువడినవే. వీటిల్లో జానపదుల జీవితాల్నిగాని, జానపద కళల్నిగాని ప్రస్తావించినవి బహుకొద్ది. ప్రస్తావించకపోవటం నేరంగాదు; ఒక నాటకంలో ఫలానా విషయం ఉన్నదన్నా లేదన్నా ఆ నాటకకర్త స్వీకరించిన ఇతివృత్త స్వరూపం, వేసుకొన్న రచనా ప్రణాళిక, ఆనాటి సాంఘిక పరిస్థితులు, వ్యక్తిగతమైన కష్టనష్టాలు, అభిరుచులు, ఇలా ఎన్నో విషయాలమీద ఆధారపడి ఉంటుంది. పైగా, ప్రతినాటకంలోనూ, ప్రతివిషయమూ ఉండాలనుకోవటం పొరపాటు. అలాగే ఈనాడు మనమాశిస్తున్నట్లుగా అవి లేవనటం కూడా అంత సబబుగాదు. రెండువేల సంవత్సరాలనాటి మృచ్ఛకటికం వంటి నాటకానికి ప్రతిగా ఒక్క కన్యాశుల్కం తప్ప మఱొకటి చూపించలేని పరిస్థితి యివాళ తెలుఁగు సాహిత్యంలో ఉన్నదిమఱి! శాకుంతలంలో జాలరి, నాగానందం తృతీయాంకంలో త్రాగుబోతు శేఖరకుడు మొదలగువారు, మృచ్ఛకటికంలో జూదరులు ఒకవిధంగా శర్విలకుడు జానపద పాత్ర చిత్రణకు గొప్ప ప్రతీకలుగా

నిలుస్తున్నారు. పైన పేర్కొనబడిన జానపద కళల ప్రస్తావనగల నాటకాల్ని కొన్నిం టిని మాత్రమే స్వీకరించి ఈ వ్యాసంలో ముచ్చటించటం జరుగుతున్నది.

భాసుని పాంచరాత్రంలో - గొల్లపడుచుల నృత్యం

ప్రథమ సంస్కృత నాటకకర్తయైన భాసుని పాంచరాత్రమనే నాటకంలో గొల్లపడుచుల నృత్యాన్ని గూర్చిన ప్రస్తావన లభిస్తుంది. ఇందలి ప్రధానేతివృత్తం కౌరవులు పట్టుకొనిపోయిన గోవుల్ని బృహన్నల తిరిగి సాధించి విరటుని కప్పగించటం. ప్రథమాంకములో కౌరవులు గోగ్రహణం చేయటానికి నిశ్చయిస్తారు. ద్వితీయాంకంలో దండెత్తి వస్తారు. ఈ మధ్యలో ద్వితీయాంకం మొదట ప్రవేశ కంలో ఈ గొల్లపడుచుల నృత్యాన్ని పెట్టాడు భాసుడు.

విరాట రాజుయొక్క జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని "వర్షవర్ధన గోప్రదాన" కార్యక్రమాన్ని నిర్వహించటానికి వృద్ధగోపాలుడు, గోమిత్రకుడు మొదలైన గొల్లపెద్దలు నిశ్చయించారు. ఇది నగరోపవన వీధిలో ఏర్పాటు చేయ బడింది. పల్లెపడుచులు, పిల్లలు మంగళచిహ్నాలతో తమ తమ గోవుల్ని అలంకరించి తాము కూడా అలంకరించుకొని సిద్ధమౌతూ ఉంటారు. వృద్ధగోపాల గోమిత్రకులు కలిసి ఇంటింటికిపోయి త్వరగా రావలసిందిగా అందర్నీ హడావిడిగా కేకేసి వస్తారు. వాళ్ళు తమ గోధనాన్ని వెంటపెట్టుకొని బిలబిలమంటూ అక్కడికి చేరుకుంటారు. సదాచారం ప్రకారం కులపెద్దకు నమస్కరిస్తారు. వృద్ధుడు 'ఇప్పుడు మనం పాటలు పాడుతూ నృత్యం చేయాలని' ప్రోత్సహిస్తాడు. (గాయంతో నృత్యంతో భవామః), వాళ్ళు ప్రారంభించి పోను పోను జోరుగా నృత్యం చేస్తూ ఉంటారు. తాను వృద్ధుడు కావటం వల్ల కుఱ్ఱకారుతో కలిసి నృత్యం చేయటానికి ఓపికలేక ప్రక్కనే నిల్లబడి చూస్తున్న గోపాల వృద్ధుడు మధ్యలో పట్టలేని ఉత్సాహం పుట్టుకొచ్చి వాళ్ళతో కలిసిపోయి తానూ నృత్యం చేస్తాడు. అప్పటి వారి సంభాషణ యిది:-

వృద్ధః:- హీహీ, సుష్ఠునర్తితం, సుష్ఠుగీతం, యావదహమపి నృత్యామి. (భలేగా ఉంది నృత్యం! భలేబాగా ఉంది పాట! నేను కూడా నృత్యం చేస్తాను!)

అందర్భూః:- హాహా, హాతులా! అతిమహాన్ రేణురుత్థితః! (హాహా, తాతా, ఎంత దుమ్ము లేచిందో చూడు!)

వృద్ధః:- నఖలు రేణు రేవ, శంఖ దుందుభి ఘోష ఉత్పతితః! (దుమ్మే గాదు! శంఖదుందుభి ఘోష కూడా లేచింది!)

అందరు:- హోహో! మాతుల! దివాచంద్ర ప్రభాపాండు రజోఽవగుంఠిత మండలః సూర్యోఽస్తి చకాస్తి చ.

(ఓహోహో! మావా! ఆవరించిన దుమ్ము మేలిముసుగు కాగా పగటి వెన్నెల తెలుపుతో ప్రకాశిస్తున్నాడు సూర్యుడు!)

తమ నృత్యానికే దుమ్ములేస్తున్నదని వాళ్ళనుకొంటున్నారు. కాని జరిగిందే మంటే కౌరవ సైన్యంవచ్చి పడుతున్నది. ఆ తాకిడికి లేస్తున్న దుమ్ముకూడా వీళ్ల లేపుతున్న దుమ్ముకు తోడైంది. వాళ్ళ ఉత్సాహంలో అది గ్రహించే స్థితిలో లేరు వాళ్ళు. శంఖదుందుభుల మ్రోతగూడా వాళ్ళకు పట్టలేదు! పైగా కోలాహలంగా అప్పటి సూర్యకాంతిని వర్ణిస్తున్నారు. ఆ ఉత్సాహంలో వృద్ధుడు కూడా తొలుత శంఖదుందుభుల మ్రోతను గమనించలేదు. పరవశత్వం నుండి క్రమంగా తేరుకున్న తరువాతనే గుర్తించాడు. ఏదో శత్రుప్రమాదం వచ్చిపడుతున్నదని ఊహించాడే గాని అదేమిటో ఇదమిత్థంగా తెలీదు. కాని ఆదుర్దా కొద్దీ ఆ విషయం రాజుకు తెలియ జెయ్యాలని సంభ్రమంగా పోతాడు. వాళ్ళను నృత్యం ఆపెయ్యమని మాత్రం చెప్పిపోతాడు. వాళ్ళ కోలాహలం క్రమంగా సద్దుమణుగుతుంటి.

ఈ ఘట్టంలో విలువెల్లా గ్రామీణత ఆవరించింది. నాటకంలోని ప్రధానేతి వృత్తానికి పోషకంగా పొందుపరచిన ఈ సన్నివేశంలో ఆ కాలంనాటి పల్లీయుల అమాయకమైన వినోదాత్త ఆనందోద్రేకాలు వెల్లివిరుస్తున్నవి. ముఖ్యంగా ఇక్కడ మనం గమనింపవలసింది వాళ్ళు వృద్ధుణ్ణి మ్మావా! (మాతుల!) అన్ని పిలవటం! ఇది పల్లెటూరి వరసలో, ఏం మావా! అంటే ఏందే పిల్లా! అనో, ఏంటిరా పిల్లగా! అనో అనటంవంటి జానపదత్వం ఉట్టిపడుతున్నది!

బాలచరితంలో గ్రామీణుల దప్పుల నృత్యం

ఇది కూడ భాసుని నాటకమే. ఇందలి ప్రధానేతివృత్తం శ్రీకృష్ణుని బాల్య క్రీడలు. తృతీయాంకం మొదట్లో ప్రవేశకముంటుంది. అందులో ఈ గ్రామీణులతో దప్పుల నృత్యం పెట్టాడు భాసుడు. ఇక్కడ కూడా వృద్ధగోపాలుని పాత్ర ప్రత్యేక మౌతుంది. అతడు సమీకరించగా గొల్ల పడుచులు ఘోషనుండరి, వనమాలి,

సంస్కృత నాటకసాహిత్యంలో జానపదకళలు

చంద్రలేఖ, మృగాక్షి, మొదలైనవారు కృతమంగళా మొదలై నృత్యం చేయటానికి ఒక చోట చేరుతారు. అప్పుడక్కడకు వచ్చిన దామోదరుడు ఆ పడుచుల అందానికి అచ్చెరువందుతూ వాళ్ళతో నృత్యమాడదాం అంటాడు. వాళ్లు "సై" అని ప్రారంభిస్తారు. అక్కడ వాళ్ళ సంభాషణ వినండి:-

దామోదర:- ఘోషవాజీ అనురూపోఽయం హల్లీసక నృత్యబంధ ఉపయుజ్యతామ్.

(పల్లెవాసుల కనురూపమైన హల్లీసకమనే నృత్యబంధం వేద్దాం)

సంకర్షణుడు:- వాద్యతాం ఆతోద్యాని. (అయితే డప్పులు ప్రయోగిద్దాం)

అప్పుడు వృద్ధగోపాలుడు కృష్ణునితో మఱి మీరు నృత్యం చేస్తూఉంటే నేనో? అంటాడు. నీవు చూస్తూ కూర్చో అంటాడు కృష్ణుడు. వాళ్ళు నృత్యం చేస్తూ ఉంటారు. చూస్తూ కూర్చున్న వృద్ధగోపాలుడు మధ్యలో ఉత్సాహం పట్టలేక 'సుష్ఠుగీతః సుష్ఠువాదితం! సుష్ఠునర్తితం! యావదహమపి నృత్యామి' (పాటభలే ఉన్నది! డప్పుమ్రోత బ్రహ్మాండంగా ఉంది. నృత్యం భలేబాగావుంది! నేనూనృత్యం చేస్తాను మఱి!) అంటూ వాళ్ళతో కలిసి కాసేపు నృత్యంచేసి 'పరిశ్రాంతఃఖల్వహమ్' (నేనలసిపోయాను) అని సోలిపోతాడు. వాళ్ళ నృత్యం జోరుగా సాగుతూనే ఉంటుంది. ఇంతలో కృష్ణునిపై కంసుడు ప్రయోగించిన అరిష్టర్షభుడు అనే రాక్షసుడొస్తున్నాడని తెలుసుకొని నృత్యాన్ని ఆపేస్తారు.

పైన చెప్పిన పాంచరాత్ర నాటకంలో ఆట, పాట, ఉన్నాయి గాని వాద్యాలు లేవు. ఈ నృత్యంలో ఈ రెండింటికీ తోడు డప్పుల వాయిద్యం గూడా ఉన్నది. ఇది పక్కా పల్లె నృత్యం. భాసుని యితర నాటకాల్లో యిట్టి జానపద కళానృత్యా లేదు. ఈ రెండుఘట్టాల్ని మూలంలో చదివి ఆనందింప వలసిందే గాని ఇలా చెప్పటం కుదరదేమో ననిపిస్తున్నది!

అభిజ్ఞాన శాకుంతలంలో జాలరిపాత్ర

కాళిదాసు పేరు స్మరిస్తే మేము పులకరించటం అనుభవంలో ఉన్న విషయం. భారతీయ నాట్యకళకు చైతన్యశిఖరం అతని అభిజ్ఞానశాకుంతలం. ఊరక రసా కృతిలో ప్రదహించి పోయే ఈ నాటకంలో అతి వాస్తవికమైన జానపద జీవిత చిత్ర [illegible] ప్రతీకంగా నిలిచిన ఈ జాలరి పాత్రను పెట్టాడు కాళిదాసు. ఈ పాత్ర లేక పోతే [illegible] భారతం వలె అయిపోతుంది. ఈ నాటకం[illegible] దీన్ని పరిశీలిద్దాం[illegible]

షష్ఠాంకంలోని ప్రవేశకంలో ఇతణ్ణి తీసుకొస్తాడు కాళిదాసు. ఒక రక్షక భటాధికారి, ఇద్దరు రక్షక భటులు, వాళ్ళ వెనకాల కస్టడీలో జాలిరి వస్తారు. అతణ్ణి రక్షకభటులు కొడతారు.

ఇతడు శక్రావతారం దగ్గఱ శచీ తీర్థంలో ఒక రోజున చేపలు పట్టగా ఒక రోహిత మత్స్యం దొరుకుతుంది. దాన్ని కోస్తాడు. ఒక ఉంగరం బయటపడుతుంది. దాన్ని అమ్మటానికి అంగడికి తీసుకొనిపోయి నలుగురికీ చూపిస్తూ ఉంటాడు. అది దుష్యంతి నామాంకిత మైన వజ్రపుటుంగరం కావటంవల్ల రక్షకభటులనుమానించి అతణ్ణి పట్టుకొని నిజం కక్కించటానికి చితక బొదుస్తారు,

ఇక్కడ ప్రవేశిస్తుందన్న మాట ఈ పాత్ర. జాలరి స్తిమితంగా, ధైర్యంతో, జరిగిన విషయం చెబుతాడు. రక్షకభటాధికారికి అతను చెప్పిందానిపై నమ్మకం కుదురుతుంది. ఎందుకైనా మంచిదని ఆ ఉంగరం తీసుకొనిపోయి దుష్యంతునికి చూపిస్తాడు. దాన్ని చూడంగానే దుర్వాసుని శాపం తొలగి అతనికి శకుంతల, తక్కిన పూర్వవృత్తాంతం జ్ఞాపకానికొస్తాయి. కళ్ళల్లో గిఱ్ఱున నీళ్ళు తిరుగుతవి. ఆ అధికారిద్వారా జాలరికి ఉంగరానికి బదులు మంచి బహుమానం పంపిస్తాడు దుష్యంతుడు. రక్షక భటాధికారి జాలరికి బహుమతిని అందచేస్తాడు. శూలం మీద దిగబడవలసిన జాలరి ఏనుగునెక్కినందుకు – బహుమానం పొందినందుకు రక్షక భటులు ఈర్ష్యపడతారు. అది గ్రహించిన జాలరి బహుమానంలో సగం వాళ్ళకు పంచిపెడతాడు. అందరూ స్నేహితులైపోయి త్రాగటానికి పానశాలకు వెళతారు.

ఇతివృత్త పోషణకు సంబంధించి ఈ పాత్ర యొక్క ప్రధాన ప్రయోజనం, ఈతడు సంపాదించి పెట్టిన ఉంగరం వల్ల శకుంతలా దుష్యంతుల పునస్సమాగమం జరగటం. ఇక రెండవ ప్రయోజనం, కాళిదాసు కాలంనాటి కొన్ని సాంఘిక పరిస్థితులకిది దర్పణంగా ఉండటం. పై కథా సారాంశంవల్ల ప్రధాన ప్రయోజనం నెఱవేరినట్లు స్పష్టం. ఇక రెండవ ప్రయోజనాన్ని పరామర్శిద్దాం. జాలరికి, రక్షణ భటాధికారికి, జరిగిన ఈ సంభాషణ గమనించండి.

జాలరి:– అహం జాలోద్గాలాదిభిర్మత్స్య బంధనోపాయైః కుటుంబ భరణం కరోమి.

(నేను చేపలను పట్టుకొనుట కుపకరించు జాలము, ఉద్గాలము మొదలగు పరికరములతో కుటుంబాన్ని పోషించుకుంటున్నాను)

రక్షకభటాధికారి:— (విహస్య) విశుద్ధ ఇదానీ మాజీవః (ఎగతాళిగా నవ్వి, భలేపవిత్రమైన వృత్తే నే!),

జాలరి:— భర్తః! మామైవం భణ, (అయ్యా! అలా అనకండి)

'సహజం కిలయద్ వినిందితం నఖలు తత్ వివర్జనీయమ్,

పశుమారణ కర్మదారుణోఽ నుకంపా మృదురపి శ్రోత్రియః॥

(నింద్యమే అయినా పుట్టుకతో వచ్చిన దాన్ని విడిచిపెట్టరాదటగదా! శ్రోత్రియుడు దయాహృదయుడై నప్పటికీ దారుణమైన పశుమారణకర్మ జేస్తాడుగదా!)

ఇది ఆనాడు జరుగుచున్న యజ్ఞయాగాదులు, అందలి పశువధపైన మెత్తని వ్యాఖ్యానం. ఇందలి 'కిల' 'ఖలు' అన్న పదాలవల్ల జాలరి తాను పెద్ద తెలిసినవాడల్లేకాక, తాను విన్నదాన్ని మాత్రమే చెబుతున్నట్లుగా ఉన్నది. సున్నితంగా ఎత్తిపొడవటమే గాని నిందిస్తున్నట్లుగా లేకపోవటం అతని మృదుస్వభావాన్ని తెలియజేస్తున్నది. ఇక్కడొక చమత్కారం గూడా ఉన్నది. నేను నా వృత్తిని మానుకొనవలసిన పనిలేదు. బ్రాహ్మణులు యజ్ఞయాగాదులు చేయటం మానవలసిన పనిలేదు. ఎవరి వృత్తిధర్మం వారిది గనుక. అని బోధిస్తున్నట్లుగా కూడా ఉన్నది. ఇట్లా ఈ జాలరిలో అమాయకత్వం, వృత్తిధర్మ గ్రహణావబోధ, లోకజ్ఞానం మొదలైనవి కొట్టవచ్చినట్లు కనబడుతున్నవి. దీనికితోడు ఆనాడు రక్షకభటుల లంచగొండితనం, త్రాగుడు, పేదవాళ్ళను, అమాయకుల్ని పరిహసించటం, కొట్టడం మొదలైన దుష్కార్యాలు ఈనాడున్నట్లే ఉండేవని తెలియజేస్తూ ఏయుగంలోనైనా ఈ మానవుడింతే అనే నగ్నసత్యాన్ని తెలుపుతున్నట్లుగా తోస్తున్నది!

రక్షకభటాధికారి దుష్యంతుడి దగ్గఱనుంచి వచ్చి, రక్షకభటులతో వీడు చెప్పింది నిజమే. ఇతణ్ణి విడిచిపెట్టండి అంటాడు. రక్షకభటులు విడిచి పెడతారు. ఇంక వాడు వెళ్ళిపోవాలని వాళ్ళ ఉద్దేశం. అప్పుడు జాలరి అధికారిని సమీపించి "భర్తః! అథకిదృశో మే ఆజీవః" మఱి, నా జీవిక ఎట్లా? అంటాడు. అప్పుడు మాత్రమే ఆ అధికారి బహుమానాన్ని ఇస్తాడు. ఇక్కడ ఆ రోజు ఎలా గడవటం తనకు? అనే దిగులు వాడికి పట్టుకొన్నట్లు చూడగానే వాడిమీద మనకు సానుభూతి ముంచుకొస్తుంది. ఆలాగే పోలీసులు వాడు పొందిన బహుమానానికి ఈర్ష్యపడ్డప్పుడు వాడు "ఇతోఽర్ధం యుష్మాకం సుమనో మూల్యం భవతు" (ఇదుగో! ఇందులో సగం

ఒక పువ్వును కాన్కగా ఇచ్చినట్లు ఇస్తున్నాను స్వీకరించండి) అంటాడు. నిజంగా వాడు వాళ్ళకు ఆ సగం ఇవ్వాల్సిన పనిలేదు. అయినా యిచ్చాడు. ఇది వాడి పెద్ద హృదయాన్ని తెలియజేస్తున్నది. ఇలా ఆలోచిస్తూపోతే వీడి పాత్ర చిత్రణ ఒక అద్భుతమైన కళాఖండంగా కనబడుతున్నది.

జాలరులు చేపలుపట్టే దృశ్యమే ఒక కళ. పెద్ద వల విసుర్తాడు. తిన్నగా లాగుతాడు. చిక్కిన వాటిని బుట్టలో వేసుకుంటాడు. ఒక్కొక్కరోజు ఎక్కువ చేపలు దొరుకుతవి. పెద్ద చేపలు కూడా దొరుకుతవి. సంతోషంతో నృత్యం చేస్తాడు. మన యీ జాలరికి రోహితమత్స్యం దొరికింది. ఎఱుపు రంగులో మూడడుగుల చేపయిది. భలే సంతోషించాడు. కోశాడు. ఉంగరం దొరికింది. ఎగిరి గంతులువేశాడు. అంగడిలో ఎగురుకుంటూ అమ్మటానికి చూశాడు. ఇబ్బంది పడ్డాడు. మళ్ళీ బహుమానం దొరికింది. ఉత్సాహం పట్టలేకపోయాడు. సగం వాళ్ళకిచ్చాడు. ఉత్సాహంతో పానశాలకు పోయాడు. తాగి తందనాలుతొక్కాడు. ఇలా ఊహిస్తే ఇది వట్టి జానపద చిత్రణేగాదు; కళాత్వం కూడా ఉట్టిపడే గొప్ప సన్నివేశం. విజయనగరం డి. వై. సంపత్కుమార్‌గారు శాకుంతలంలో ఈ జాలరి పాత్రను ధరించి చేసిన నృత్యాన్ని చూస్తే కాళిదాసు సృష్టించిన ఈపాత్ర మనకు ఇంకా బాగా అర్థమౌతుంది.

## శ్రీహర్షుని రత్నావళిలో గారడీవాడు

ఈ నాటికలోని చతుర్థాంకంలో ఇంద్రజాలికుని ప్రసక్తి వస్తుంది. సాగరికా విరహోత్కంఠితుడైన ఉదయనవత్సరాజుకు (సాగరికయే రత్నావళి) తొలుత వినోదం కల్పించటానికి, పిమ్మట సాగరికా సమాగమాన్ని సమకూర్చి పెట్టటానికి యౌగంధరాయణుడు వేసిన పథకమే ఈ యింద్రజాలికుని ప్రవేశం. ఇతనిపేరు సంవరణసిద్ధి. ఉజ్జయినీవాడు. వాసవదత్త కూడా ఉజ్జయినే. తన ఊరివాడు కావటంవల్ల వీడి గారడీ చూడాలని ఆమె ఉబలాటం. అందువల్ల రాజుగారి దర్శనం వీడికి సులువుగా దొరుకుతుంది. రాజుకూడా "అస్తి నః కౌతుక మింద్రజాలికే తతః శీఘ్రం ప్రవేశయ" (నాకు కూడా ఇంద్రజాలాన్ని చూడాలనే కుతూహలం ఉన్నది. కాబట్టి త్వరగా ప్రవేశపెట్టు) అంటాడు పరిచారకునితో.

ఇంద్రజాలికుడు ఒక పింఛికను తిప్పుతూ రకరకాలుగా హాస్యం ప్రదర్శిస్తూ

ప్రవేశించి "ఇంద్రజాలిక" అను పేరులో ఏ యింద్రుని పేరు ఇమిడి ఉన్నదో ఆ యింద్రుని చరణాలకు నమస్కరించండి. అల్లే, సుప్రతిష్ఠిత కీర్తిమంతుడగు శంబరునకు కూడా నమస్కరించండి అంటాడు. (ఇంద్రజాల విద్య శాంబరీమాయా అని ప్రతీతి) పిమ్మట ఓ మహారాజా, కౌశాంబీపతే, పెక్కు మాటలెందుకు?

"కింధరణ్యాం మృగాంక ఆకాశే మహీ ధరోజలే జ్వలనః
మధ్యాహ్నే ప్రదోషో దర్శయామి దేహ్యాజ్ఞప్తిమ్."

(భూమిపై చంద్రుడు, ఆకాశంలో పర్వతం, నీటిలో నిప్పు, మధ్యాహ్నంలో సాయంత్రం ఏదికావాలి? ఆజ్ఞాపించు చేసి చూపెడతాను) అంటూ కోతలు మొదలు పెడతాడు. విదూషకుడు "మిత్రమా! శ్రద్ధగా విను. భలేతమాషాగా ఉన్నాడు గారడీవాడు. ఏదైనా చూపెట్టేటట్లే ఉన్నాడు" అని తాను స్వయంగా మహా ఉబలాట పడతాడు. విదూషకుని ఉబలాటం చూసిన గారడీవాడు మళ్ళీ మొదలు పెడతాడు కోతలు.

"కిం జల్పితేన బహునా యద్యత్ హృదయే సమీహితం ద్రష్టుం
తత్తత్ దర్శ యామ్యహం గురోర్మంత్ర ప్రభావేణ"

(పెక్కు మాటలువాగి ఏమిప్రయోజనం! గురుమంత్ర ప్రభావంచేత మీకేది చూడాలని కోరికుంటే దాన్ని చూపెడతాను) అంటాడు. వాడి మాటలకు భ్రమసి రాజు వాసవదత్తనుగూడా రమ్మంటాడు చూడటానికి. ఆమెవచ్చి కూర్చుంటుంది. ఆమెతో "దేవి! బహుతర మనేనగర్జితమ్" (వీడు భలే కోసేస్తున్నాడు) సరే చూద్దాం అని గారడీవానితో అన్నివిధాల ఇంద్రజాలాన్ని చూపించు అంటాడు. వాడు మళ్ళీ పింఛికను రకరకాలుగా తిప్పి, నాట్యంచేసి 'ఇదుగో, హరిహరబ్రహ్మాది దేవతల్ని, సిద్ధ విద్యాధర వధూ సమూహంతో నృత్యం చేస్తున్న దేవేంద్రుణ్ణి, చూపిస్తున్నాను చూడండి' అని అందర్నీ చూపెడతాడు. రాజు అన్నీ చూస్తూ ఆశ్చర్యపోతూ ఉంటాడు. వాసవదత్త సంగతి సరేసరి. విదూషకుడు ఇంతా చూసిన తరువాత "ఓరి సన్యాసీ! మాకు వీళ్ళందరూ ఎందుకోయ్! సాగరికను చూపెట్టవోయ్. అప్పుడుగాని రాజు తృప్తి పడడు" అంటాడు. ఇంతలో యౌగంధరాయణుడు పంపిన ఒక వార్త కారణంగా గారడీకి ఆటంకం వస్తుంది. రాజు గారడీ వానితో ఇంకా ఆపెయ్యమంటాడు. వాడు పోతూ పోతూ "ఏకః పునర్మమ ఖేలో ఽవశ్యం

దేవేన ప్రేక్షితవ్యః" (మీరు మరో ఆట నాది తప్పకుండా చూడాలి) అంటాడు. సరేనంటాడు రాజు. తరువాత కొద్దిసేపటికి వాని గారడీవల్లనే అంతఃపురంలో మంటలు, పొగలు లేస్తవి. అందులో చిక్కిందనుకొన్న సాగరికను రాజు మంటల్లో దూకి వెలికి తెస్తాడు. సాగరికా సమాగమం జరుగుతుంది. చివరికి రాజు విదూషకునితో 'స్వప్నోఽయమితిభాతి కిన్విద మింద్రజాలమ్' (ఇది స్వప్నమా! ఇంద్రజాలమా!) అని అడుగుతాడు. విదూషకుడు గారడీవాడు పోతూ పోతూ అన్న మాటను జ్ఞాపకంచేస్తూ ఇది వాడిపనే అంటాడు.

గారడీవాడు ఊరికే కోతలుకోస్తూ అరగంటకో ప్రక్రియ చూపించటం మనం చూస్తూ ఉంటాం. వాడేం చూపిస్తాడో ఏమోగాని వాడి కబుర్లకు మాత్రం తలే వినోదిస్తాం. సరిగ్గా ఇవాళ మనం చూస్తున్న గారడీవాణ్ణే హర్షుడు కొన్ని వందల యేళ్ళనాడు స్వయంగా చూసి ఈ నాటికలో మనకు చూపించాడు.

విశాఖదత్తుని ముద్రారాక్షసంలో

యమపట ప్రదర్శక వేషధారియైన వీధిగాయకుడు.

ఈ నాటకంలోని ప్రథమాంకంలో యమపట ప్రదర్శక వేషాన్ని వేసుకొని ఇంటింటికీ తిరుగుతూ యమపటాన్ని పఱచి ప్రదర్శిస్తూ పాటలుపాడే వానిపాత్ర ఒకటి తటస్థిస్తుంది.

ప్రణమత యమస్య చరణౌ కిం కార్యం దైవతైరన్యైః-
ఏషఖల్వన్య భక్తానాం హరతి జీవం పరిస్ఫురంతమ్.

(యముని చరణాలకు నమస్కరించండి. ఇతర దేవతల్ని కొలిచి ఏమిలాభం! ఇతర దేవతల్ని ఆరాధించేవారి ప్రాణాల్ని సైతం లాగేసేవాడు యముడేగదా?)

పురుషస్య జీవితవ్యం విషమాద్భవతి భక్తిగృహీతాత్—
మారయతి సర్వలోకం యస్తేన యమేన జీవామః.

(మానవుల మనుగడంతా భయంకరుడైన యముని భక్తియందే ఆధారపడిఉన్నది. ఏ యముడు ప్రాణులందర్నీ హరిస్తాడో ఆ యమునివల్లనేకదా మనం జీవిస్తున్నాం.)

"యావదిదం గృహం ప్రవిశ్య యమపటం ప్రదర్శయన్ గీతాని గాయామి." (ఇదుగో ఈ యింటిలో ప్రవేశించి యమపటాన్ని చూపిస్తూ పాటలు పాడతాను) అంటూ ఈ పాత్ర ప్రవేశిస్తుంది.

సంస్కృత నాటకసాహిత్యంలో జానపదకళలు

ఇతడు ప్రవేశించిన ఇల్లు ఎవరిదో గాదు; చాణక్యుడిది. ఈతడెవరోగాదు. చాణక్యుని పంపున పౌర జానపద చరితాన్వేషణకోసం ఈ వేషంలో గూఢచారి చర్యలు జరుపుతున్న చాణక్యుని అనుచరుడు నిపుణకుడనేవాడు. వీడు చాణక్యున కొక ముద్రిక నిచ్చి అది తన కెట్లా లభించిందో చెబుతాడు.

వీడు ఈ యమపటాన్ని తీసుకొని తిరుగుతూ చందనదాసింటికిపోయి యమ పటాన్ని పఱిచి పాటలు పాడటం మొదలు పెట్టాడు. (తత్ర యమపటం ప్రసార్య ప్రవృత్తా నస్మిగీతాని గాతుమ్) అంతట్లో ఐదేళ్ళ పిల్లవాడొకడు ఉబలాటపడుతూ అది చూడటానికి పరుగెత్తుకుంటూ వస్తూ ఉంటాడు. అప్పుడు లోపలున్న స్త్రీలు ఆదుర్దాతో వాణ్ణి వెళ్ళవద్దు అని వారిస్తారు. ఇంతలో ఒకామె అదాటున లోపల్నుంచి వచ్చి వాణ్ణి తీసుకెళ్ళిపోతుంది. ఆ సమయంలో ఆమె వ్రేలినుండి ఒక ఉంగరం జారిపడి వీడి కాళ్ళ దగ్గఱికి వచ్చిపడుతుంది. అది తెచ్చి చాణక్యునకిస్తాడు. ఇదీ సందర్భం. ఈ ఉంగరం రాక్షసమంత్రిది. ఆ బాలుడు అతని కొడుకు. ఆమె అతని భార్య. రాచకార్యనిమగ్నుడైన రాక్షసమంత్రి తన కుటుంబాన్ని ఇక్కడ రహస్యంగా ఉంచాడు.

కథా సంవిధానాని కనుకూలంగా ఈ పాత్రను పెట్టాడు విశాఖదత్తుడు. అతని కాలంనాడు. అంటే క్రీ. శ. 8వ శతాబ్దం ప్రాంతంలో ఈ యమపట వేషధారులైన వీధి గాయకులుండే వారన్నమాట. ఈనాడుకూడా ఉన్నారని చెప్పవచ్చు. యథా తథంగా కాకపోవచ్చు. కొందఱు బిచ్చగాళ్ళు 'జీవు లెనుబది నాల్గులక్షలు జననమందే దిచ్చటా, ఎవరుచేసిన పాపకర్మములనుభవించే దచ్చటా,' అనే మకుటంతో ఇక్కడ చేసిన పాపాలకు యమలోకంలో అనుభవించే అనేక శిక్షల్ని ఏకరూపెడుతూ పాడటం మనంచూస్తూ ఉంటాం. యమపటం మాత్రం వీళ్ళ చేతుల్లో ఇప్పుడుండటం లేదు. కాని యిట్టి పటాలు పెద్ద పెద్ద బొమ్మలతో చిత్రింపబడి చిత్రపటాలమ్మే దుకాణాలలో అమ్మటం ఇప్పటికీ చూడొచ్చు. ఈనాడు అట్టి పటాలు లభిస్తూఉన్నా ఎందుచేతనో అవిలేకుండానే పాడుతున్నారు. కాని ఆ నరకయాతన దృశ్యాలు చిత్రపటంలో చూస్తున్నామా అన్నట్లు కళ్ళకు కట్టేటట్లు పాడుతున్నారు. మనం వినే ఈ తెలుగు పాటలోని తత్వం మరోరూపంలో పైపేర్కొన్న శ్లోకాల్లో ధ్వన్యంతరంగా స్ఫురింపకపోదు. పైగా ఆ శ్లోకాలేగాక ఈ పాత్ర విడిగా కొన్ని పాటలు పాడుతూ

ఉన్నట్లుకూడా (గీతానిగాయన్) పైన చెప్పబడింది. కాగా శతాబ్దాల తరబడి అనూచానంగా వస్తున్న జానపద కళల్లో ఇది కూడా ఒకటి.

పాములవాని పాములాట

ముద్రారాక్షసంలోనే ద్వితీయాంకం ప్రారంభంలో ఈ పాములవాడు ప్రవేశిస్తాడు.

"జానంతి తంత్రయుక్తిం యథా స్థితం మండల మభిలిఖంతి.

యే మంత్ర రక్షణ పరాస్తే సర్పనరాధిపావుపచరంతి."

(ఎవరికి తంత్రాలు తెలుసో, ఎవరు ఎల్లప్పుడూ మంత్రచింతనం చేస్తారో, ఎవరు మంత్రాల్ని రక్షిస్తారో వారే యిటు పాముల్ని, అటు రాజుల్ని సేవింపగల్గుతారు.)

రాజ తంత్రానికి, పాము మంత్రానికీ, అటు రాజులకూ, ఇటు పాములవాళ్ళకూ, సరిపడేటట్లు రెండర్థాలున్న ఈ శ్లోకాన్ని చదువుతూ ప్రవేశిస్తాడన్న మాట. వాడిచుట్టూ జనం పోగౌతారు. వాళ్ళడిగే దానికల్లా సమాధానం చెబుతాడు. నీవెవరి వంటున్నారా? జీర్ణవిషుడనే పాములవాణ్ని. ఈ పెట్టెలో ఏమున్నయ్యంటున్నారా? మాకు జీవనాధారాలైన పాములు. చూడాలనుందా? ఐతే యిది తగినచోటు గాదుగదా! అంతగా చూడాలనుంటే ఇదిగో, యీ యింట్లోకిరండి. ఇది రాక్షస మంత్రి యిల్లు మనలాంటి వాళ్లకి ప్రవేశం లేదంటున్నారా? ఇది నా వృత్తి గాబట్టి తప్పకుండా ప్రవేశముంటుంది. ఇవీ వాళ్ళడిగిన ప్రశ్నలు; వీడు చెప్పిన సమాధానాలు.

ఇలా ప్రవేశించిన పాములవాడు రాక్షస మంత్రి యింటికి పోతాడు. అక్కడ ద్వార రక్షకుడు అడ్డగింపగా నేను పాములవాణ్ణి. రాక్షసమంత్రి యెదుట పాములాట ఆడాలని ఉంది అంటాడు. (ఇచ్ఛా మ్యమాత్యస్య పురతః సర్పైః ఖేలితుమ్), రాక్షసమంత్రి మొదట విసుగ్గా ఉండి పాముల దర్శనం చేసుకోవాలని లేదు, కావాలంటే ఏదైనా బహుమతి తీసుకెళ్ళమని పరిచారకునిద్వారా కబురుచేస్తాడు. తరువాత వెంటనే గ్రహిస్తాడు రాక్షసుడు. వీడు మామూలు పాములవాడు కాదన్నీ, చాణక్యునిపై గూఢచారిచర్య కోసం పాములవాని వేషంలో తాను పంపిన తన అనుచరుడు విరాధగుప్తుడనిన్నూ. వెంటనే ప్రవేశం లభిస్తుంది. ఇంతటితో పాములవానికథ కంచికి పోతుంది.

ఈ విధంగా ప్రాచీన సంస్కృత నాటక సాహిత్యంలో, పట్టి జానపద పాత్రల చిత్రణ ఒకవైపున, జానపదకళల స్వరూప ప్రస్తావన మఱొకవైపున కనబడుతున్నవి. మొదటి విభాగానికి చెందినవాటిని సూచనా మాత్రసారంగా చెప్పి, రెండవవిభాగానికి చెందినవాటినిమాత్రం లభించినంతమేరకు విపులంగా వర్ణించటం జరిగింది. త్రవ్వినకొద్దీ వచ్చే విషయాలు, దృష్టిభేదాన్నిబట్టి ఇంకా అనేకం ఉండవచ్చు. వాటి నన్నింటినీ వెలికి తీసుకొని రావల్సిన అవసరం ఎంతైనా ఉన్నది. ఈ దిశలో మున్ముందు ఇతోధికమైన ప్రయత్నాలు జరగాలి.

---

ఈ వ్యాసముయొక్క ఇంగ్లీషు అనువాదము సంగ్రహముగ
"A Glimpse into the folk arts in classical Sanskrit Drama."
అను పేరుతో ఈ క్రింది సంచికలో ప్రచురింపబడినది:

Indian Folklore Congress, seventh session
December. 27, 28 & 29, 1983 SOUVENIR
Department of Telugu,
Department of Theatre Arts,
Osmania Universiyt, Hyderabad- A. P.

ఈ తెలుగు వ్యాసము తొలుత
"నాట్యకళ" జానపదకళల ప్రత్యేకసంచిక
సంపుటి : 11, సంచిక : 6, జూన్ 1977 లో ప్రచురింపబడినది.
ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రచురణ
కళాభవన్, హైదరాబాదు 500 004.

## తెలుగు చరిత్రకు కావ్యత్వం కల్పించిన

# నవలా శిల్పి నరసింహశాస్త్రి

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి పేరు వినంగానే వారి నారాయణభట్టు, రుద్రమదేవి, మల్లారెడ్డి, కవిసార్వభౌముడు, ధూర్జటి, కవిద్వయము మొదలైన నవలలు మన కళ్ళ యెదుట సాక్షాత్కరిస్తవి. ఆ తరువాతనే వారు దేవీ భాగవత మనే మహాపద్య ప్రబంధాన్ని, సోమనాథ విజయము, భాగవతావ తరణము, పూజా పనము, కన్యాకుమారి, దాగుడు మూతలు మొదలైన నాటకాలనూ, కర్పూరద్వీప యాత్రవంటి రసవత్తరమైన పిల్లల నవలలనూ, "మరువిషయం" వంటి ఉత్తమ కథానికలనూ, వందకు పైగా సాహిత్య వ్యాసాలనూ ఒక వెయ్యి విడివిడి పద్య, గేయాదులనూ వ్రాశారనే విషయం స్ఫురిస్తుంది. వారి కవితా తపస్సు ఆధ్యాత్మిక భావ సంపన్నమై దేవీ భాగవతంలోనూ, కళాసురభిళమై నాటకాల్లోనూ, రెండూ సమ్మిలితమై నవలల్లోనూ పండి రస పరీవాహమైందని చెప్పవచ్చు.

శ్రీ శాస్త్రిగారు వృత్తిరీత్యా న్యాయవాది. గుంటూరు జిల్లా రేపల్లెలో న్యాయవాదిగా జీవితయాత్ర సాగించారు. కాని ఆశ్చర్యమేమంటే గుణంలోనూ, రాశిలోనూ ఉత్తమ సాహిత్యాన్ని సృష్టించి అగ్రశ్రేణి కవిగా రూపొందటం. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమివారు వారిని ఉపాధ్యక్షులుగా ఎన్నుకున్నారు.

వారితో ముఖాముఖి సంభాషించి వారి సాహిత్యానుభవాలను తెలుసుకోవాలనే కుతూహలంతో ఇటీవల వారింటికి వెళ్లాను. జంట నగరాల శివార్లలో తారనాక దాపున ఆర్. ఆర్. లాబ్ నకు అనుకొని ఉన్న స్నేహపురి కాలనీలో తమ కుమారుని ఇంట్లో ఉంటున్నారువారు. వయస్సు 77సంవత్సరాలు. ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. రెండేళ్లనాడు పక్షవాతం వచ్చి కుడిపార్శ్వం పడిపోయింది. దీనికితోడు గొంతు పూర్తిగా మూగపోయింది. శరీరం కృశించి ఏకులాగా మంచానికంటుకొని పోయారు. లేవలేరు. ముఖంలో మాత్రం దివ్య తేజస్సు కొట్టవచ్చినట్లు కనపడుతున్నది. వారు శ్రీదేవీ ఉపాసకులు. శ్రీ కల్యాణానందభారతీస్వామివద్ద దీక్షపొంది "విజ్ఞానానంద" అనే నామం స్వీకరించారు. ఆ ఉపాసనా బలంవల్లనే తేజస్సుఉట్టి పడుతున్నదని ఇట్లే గ్రహించవచ్చు.

జ్ఞాపకశక్తి, శ్రవణశక్తి దివ్యంగా ఉన్నవి. శరతల్పగతుడైన ఆ కురువృద్ధుడికి నమస్కరించి వచ్చినవని చెప్పాను. వారి జ్యేష్ఠపుత్రులు శ్రీహనుమచ్ఛాస్త్రిగారు వారిని మెల్లగా లేపి కూర్చోబెట్టారు. ఈ స్థితిలో వారిని నేనేదైనా అడగాలి. వారు చెప్పాలి. ఇదెలా సాధ్యం? ఒక అట్టమీద ఇంగ్లీష్ ఆల్ఫబెట్స్ వ్రాసిన చార్టు ఉన్నది. అందులోని అక్షరాలు ఒక వరుస క్రమంలో వారు చూపెడితే అవివాక్యాలుగా కూడుకొని దాన్నిబట్టి వారు చెప్పదలచుకొన్న విషయాన్ని అర్థం చేసుకోవాలి. వారి కుమారులకు ఆ సులువు బాగా తెలుసు. ఆ పద్ధతిలో వారి అభిప్రాయాలు తెలుసుకోగలిగాను. వారి మంచం మీద సంస్కృత మహా భారతం, గీత, తులసీ రామాయణాలతో పాటు బైబిలు కూడా ఉండటం చూచి ఆశ్చర్యం వేసి అప్రయత్నంగా "ఇదేమిటి! బైబిలుకూడా ఉన్నదే?" అన్నాను. "ఐ లైక్ ఇట్" అన్నారు వారు. ఒక్క క్షణం వారి ముఖంలోకి చూశాను. వారి బోసి నోటిపై మధుర మందహాసం మెరిసింది.

ప్రశ్న : శాస్త్రిగారూ! అరవై ఏళ్ల సాహిత్యాను భవం మీది. అంత కంటే షష్టిపూర్తి చేసుకొన్న సాహిత్య జీవితమంటే బాగుంటుందేమో. వృత్తిరీత్యా న్యాయవాదులు. పండించిందేమో సాహిత్య నవధాన్యాలు, వీటికి పొత్తెలా కుదిరింది? మీ సాహిత్యానుభవాన్ని — ముఖ్యంగా మీ రచనల్ని — గురించి సెలవిస్తారా?

జ : నవలలతో సహా నా రచనలన్నీ ఇన్నర్ అర్జ్‌తో వ్రాసినవే. ఒక్కొక్కప్పుడు నెలలూ, సంవత్సరాల తరబడి బాగా మధనపడి, ఆలోచించి ఆలోచించి భావాలు పరిపక్వం చెందినతర్వాతనే వ్రాశాను. సత్యమని నమ్మిందే వ్రాశాను. అది తప్పుగావచ్చు, ఒప్పు గావచ్చు. కన్విక్షన్‌తో వ్రాశాను. భారతిలో వ్రాసిన "నిలిచేదీ - నిలవందీ" అనే వ్యాసంలో నా సాహిత్యానుభవాన్ని ప్రమాణంగా పెట్టుకొని విషయాలు కుండబద్దలు కొట్టినట్లు చెప్పాను. పెద్ద దుమారం లేచింది. ఎంతో మందికి కోపం వచ్చింది. అలాగే శంభుప్రసాద్‌ని గురించి వ్రాయమన్నప్పుడు ఏం వ్రాస్తానోనని చాలామంది ఆశ్చర్యపోయారు. వ్రాసింతర్వాత అందరూ సంతోషించారు. "హౌ హి డెపిక్టెడ్ హిమ్" అని. శంభుప్రసాద్ చాలా విచిత్రమైన వ్యక్తి. గుడ్ ఎట్ హార్ట్! నా రచనా వ్యాసంగానికి వకీలువృత్తి పెద్ద ఆటంకమనిపించ లేదు. పైగా ఉపకరించింది. ఆ మెలకువతో నా రచనల్ని చాలా లాజికల్‌గా

వ్రాయగలిగాను.

ప్ర : నారాయణభట్టు, రుద్రమదేవి, మల్లారెడ్డి నవలల్లో మీరు కవిత్రయం వారిని చాలా చక్కగా చిత్రించారు. అయితే మల్లారెడ్డిలో ఎర్రన పాత్రపోషణ పరాకాష్ఠ చెందిందని సహృదయుల అభిప్రాయం. దీనికితోడు విజ్ఞాన సర్వస్వం లోనూ తదితర వ్యాసాల్లోనూ అతన్ని గురించి మీరు వ్రాసిన దాన్ని బట్టి ఎర్రన మిమ్మల్ని బాగా ఆవేశించాడని తోస్తుంది. ఏమంటారు?

జ : సరిగ్గానే ఊహించారు! ఎర్రయ నా అభిమానకవి. అతను ట్రూ పొయట్, స్పిరిచుయవల్ పొయట్. పోతనవంటి మహనీయుడు కూడా కొన్ని ఘట్టాలను ఎర్రయ నుంచి ఎరువు తెచ్చుకున్నారు. "అంబ నవాంబుజోజ్జ్వల" పద్యాన్నే దించుకున్నాడు. పోతనకూడా నాకిష్టుడే. ఎర్రయ గురువు కల్యాణానందులు. నా గురువు కల్యాణానందభారతి అని చెప్పాను. ఎర్రయ విజ్ఞాన శబ్దం ఎక్కువగా ప్రయోగిస్తాడు. "విజ్ఞానానంద" అనేది అతని దీక్షానామం కావచ్చని ఊహిస్తూ లోగడ నేను వ్రాశాను. నా దీక్షానామంకూడా విజ్ఞానానందుడే. ఈ విధంగా అతనికీ నాకూ ఏదో అనుబంధం ఉన్నట్లు అనుభూతి కలుగుతూ ఉంటుంది. (శ్రీ నరసింహశాస్త్రిగారు ఎప్పుడూ "ఎర్రయ" అనే అంటూ ఉంటారు. అదే సరియైన పేరని వారి ఉద్దేశం.)

ప్ర : మీరు నాటకాలు చాలా వ్రాశారు. బహుశా మీ తరం వారిలో అన్ని నాటకాలు వ్రాసిన వారు బహుకొద్ది మందే ఉంటారేమో! కాని వాటిల్లో మంచి కవిత్వం ఉందేకాని అవి ప్రయోగ యోగ్యాలు కావనే అభిప్రాయం ఒకటుంది. అసలు ఫలానా నాటకం ప్రయోగ యోగ్యం, ఫలానాది కాదు అని చెప్పటానికి ప్రమాణం అంటూ ఉన్నదంటారా?

జ : మారిస్ మటర్లింక్ అనే విశ్వవిఖ్యాత నాటకకర్త ఫ్రెంచిభాషలో "బ్లూబర్డ్" అనే గొప్ప నాటకం వ్రాశాడు. ఒక పిల్లవాడు, పిల్ల, దీపం, రొట్టె, కుక్క — ఇవీ అందులోని పాత్రలు. అద్భుతమైన రచన. సహృదయులందర్నీ ఆకర్షించింది. కాని యూరప్‌లోని నాటక ప్రయోక్తలందరూ దాన్ని ప్రదర్శించడం అసాధ్యమని విడిచి పెట్టేశారు. ఒక ప్రదర్శకుడు సాహసించి కొన్ని మిలియన్ల ఫ్రాంకులు ఖర్చు పెట్టి ప్రదర్శించి రక్తి కట్టించాడు. భవభూతి ఉత్తర రామచరితం

ప్రదర్శన యోగ్యం కాదు పొమ్మన్నారు. ఎలా కాదో చూస్తానని మద్రాసులో ప్రయోగింపజేసి సెభాష్ అనిపించారు శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రిగారు. మురారి అనర్ఘ రాఘవం ఎంత అద్భుతమైన కవిత్వం! దీన్నిబట్టి ఏమనుకోవాలో చెప్పండి. రంగస్థలం మీద తెరలూ, రంగులూ, విన్యాసాలూ, పాటలూ ఇవన్నీ తాత్కాలిక మైనవి. క్రమంగా చెదిరిపోయేవే. కాని శాశ్వతంగా నిలిచేది నాటకంలోని శబ్దం మాత్రమే. అంటే కావ్యత్వం అన్నమాట. అవి దృశ్యత్వానికే కాక శ్రవ్యత్వానికి కూడా అతీతమైన మహాగుణం. "ప్రదర్శనార్హత" అనే అవ్యవస్థితమైన మాటకు అతీతంగా అది సహృదయుల్ని ఎల్లప్పుడూ ఆకర్షిస్తూనే ఉంటుంది. నేను "నాటకములు - ప్రదర్శన యోగ్యత" అనే వ్యాసం ఆంధ్రపత్రిక ఉగాది సంచిక లో వ్రాశాను. (1973 - 74) ఒకసారి చూడండి.

ప్ర : మీరు విడిగా వ్రాసిన కవితా ఖండికల్లో ఎక్కువగా మాత్రా ఛందసు. ఉపయోగించారు. "షణ్ణవతి" అనేపద్యనాటిక మాత్రాఛందస్సును ఆశ్రయించి వ్రాసిందే. మాత్రా ఛందస్సు శాస్త్రీయమా కాదా? అనే మీమాంస ఉన్నదిగదా?

జ : మాత్రా ఛందస్సు చాలా ప్రాచీనమైంది. చాలామంది అనుకొంటున్నట్లు ఆధునికమైనది కాదు. కాళిదాసు శాకుంతలంలో ప్రస్తావనలో నటిచేత "ఈషదీష చ్చుంబితాని భ్రమరైః సుకుమార కేసర శిఖాని" అన్న శ్లోకం మాత్రా ఛందస్సులోనే చెప్పించాడు. విక్రమోర్వశీయంలోని చతుర్థాంకంలో చాలా శ్లోకాలు మాత్రా ఛందస్సులోనే ఉన్నవి. వీటిల్లో కొన్నింటికి అంత్యప్రాసలుకూడా ఉన్నవి "దయితారహితోఽధికం, దుఃఖితో, విరహానుగతః పరిమంథరః" అన్నశ్లోకాన్ని "రుద్రమదేవి"లో రుయ్యమ్మ ప్రణయ ఘట్టంలో ఉట్టంకించానుకూడా. అసలు ప్రాకృతంలో దీనికి మంచి స్థానం ఉన్నట్లుగా తోస్తుంది. శాస్త్రీయమైంది కాకపోతే కాళిదాసు వాడతాడా?

ప్ర : ఆధునికుల్లో— అంటే మీతరంలో— గొప్ప కవి ఎవరు?

జ : విశ్వనాథ సత్యనారాయణ. అతనిలో చాలా పొరపాట్లున్నవి. అయినా కవి. హి ఈజ్ ఎ గ్రేట్ క్రియేటర్!

ప్ర : నవ్య కవితా యుగోదయాన్ని గురించి ఆ యుగ కర్తలను గురించి మీ నిర్ణయం చెప్పండి.

జ : తెలుగు సాహిత్యంలోకి నవ్యకవిత్వం వసంత ఋతువులా మలయ పవనంలా, తొలకరి జల్లులా ప్రవేశించింది. స్త్రీలల్లో లావణ్యం, పసిపాపల్లో మిసిమి, యువతలో ఉత్సాహం, యోగుల్లో శాంతి, కావ్యంలో రసం వలె ఇది ఫలానా అని చెప్పటానికి వీల్లేని ఒకానొక విశిష్ట ధర్మం ఉన్న కవిత్వం ఇది. దీనికి తొలిపూజ 1913లో రాయప్రోలువారి "తృణకంకణం"తో ప్రారంభమైంది. ఆయన ఈ నూతన కాంతిబింబాన్ని ముందుగా చూడగలిగిన ద్రష్ట. ఈ వరుసలో దేవులపల్లి, శివశంకరులు, వేదుల మొదలైన వారు వస్తారు. అయితే ఇందులోనుంచే భావ కవిత్వం అనే పాయ కృష్ణశాస్త్రి వెంట ప్రవహించింది. భావకవిత్వమూ, కృష్ణశాస్త్రీ ప్రేయసీ ప్రియులు.

ప్ర : వచన కవిత్వాన్ని గురించి, అభ్యుదయ కవిత్వాన్ని గురించి కూడా కొంచెం చెప్పండి.

జ : వచన కవిత్వానికి భవిష్యత్తు లేదు, అభ్యుదయ కవిత్వం కమ్యూనిస్టుల ప్రచార కవిత్వం. ప్రచార కవిత్వం కవిత్వమా?

ప్ర : ఉత్తమ కవికి ఉండవలసిన ప్రధాన గుణం ఏమిటి?

జ : ఉత్తమ శీలం.

శ్రీ నరసింహశాస్త్రిగారు "విజయపురి" పేరుతో ఒకనవల వ్రాయటానికి సంకల్పించి విషయం సేకరించారు. ఇంతలో ఆరోగ్యం దెబ్బతిన్నది. "నా ప్రాజెక్టులో విజయపురి చివరిది. ఇప్పుడింక వ్రాయలేను" అన్నారు. వీరు వందకు పైగా అమూల్యమైన సాహిత్య వ్యాసాలూ, ఉత్తమ కళా ఖండాలనదగిన పదిహేను పైచిలుకు నాటకాలూ, వెయ్యికి పైగా స్త్రే పోయమ్స్ వ్రాశారు. వీటిలో ఎక్కువ భాగం గత ముప్ఫయి నలభై ఏళ్ళలో ఆయా సాహిత్య పత్రికల్లో ప్రచురింపబడినవే. ఇవన్నీ పుస్తకాల రూపంలో వెలువడటం చాలా అవసరం.

మధ్య మధ్య కొద్దిపాటి విశ్రాంతితో నాలుగు గంటల పాటు జరిగిన ఈ సమావేశం ఎంతో ఉల్లాసంగా గడిచిపోయింది. వారి ఆశీస్సులు పొంది సెలవు తీసుకున్నాను.

---

'ఆంధ్రప్రభ' దినపత్రిక: సాహిత్యప్రభ–ముఖాముఖి
నవంబరు 3 గురువారం 1977

తిరుపతి వేంకటేశ్వరుడే

# తిక్కనగారి హరిహర నాథుడా!

ఔను! తిరుపతి వేంకటేశ్వరుడే తిక్కనగారి హరిహరనాథుడు! ఆ రోజులలో నెల్లూరులో నొక హరిహరనాథ దేవుడుండెననియు నాతనికే తిక్కన తన భారతము నంకిత మిచ్చెననియు నిప్పటివఱకూ మన మనుకొనుచూ వచ్చినది సరిగాదు. భగవద్రామానుజులవారు తిరుమల స్వామిని విష్ణువుగా తీర్మానించి తదారాధనా విధానమును పరిష్కరించి పెట్టుటకు పూర్వము "హరిహరంబగు రూపము దాల్చి విష్ణురూపాయ నమశ్శివాయయని పల్కెడు భక్తజనంబు వైదిక ధ్యాయిత కిచ్చ మెచ్చు పరతత్త్వమై" వెలుగొందిన తిరుపతి వేంకటేశ్వరుడే తిక్కనగారి హరిహరనాథుడు! అతనికే తిక్కన తన కృతి నిచ్చినది. ఈ యథార్థమును నిరూపించుటకు తిరుపతి క్షేత్రముయొక్క పూర్వచరిత్రను వలసినంత పరామర్శించుట మిక్కిలి యవసరము.

### తొల్కాప్పియము

ద్రావిడ వాఙ్మయమున తిరుమలను గూర్చి ప్రశంసించిన తొలిగ్రంథము తొల్కాప్పియము. ఇది క్రీ. శ. రెండవ శతాబ్దినాటిదని విమర్శకు లూహించిరి. దీని కర్తయగు తొల్కాప్పియనారుకు సహాధ్యాయుడైన పాయంబారనార్ అను నాతడు దీనికి వ్రాసిన పీఠికయందు తమిళదేశపు టెల్లలు చెప్పుచూ "దివేఙ్గడం తెన్కుమరి అయిడై తమిళ్ కూరు నల్లులహం" (ఉత్తరమున వేఙ్గడమునకును, దక్షిణమున కన్యాకుమారికిని మధ్యగల దేశము తమిళదేశము) అని వ్రాసెను. ఆనాటికి వేఙ్గడము తమిళ వడుగుదేశముల సరిహద్దు ప్రాంతములందు దుర్గమారణ్య ప్రదేశములలో నుండుటవలన తమిళవీరులు ధనకాంక్షచేత గాని విజయకాంక్షచేత గాని యచ్చటికి పోవుట యుక్తముకాదని తలంచుచుండెడి వారనియు, అట్లుపోయినచో వారి స్త్రీలు హృదయారాటమున క్రుంగుచుండెడి వారనియు నా గ్రంథకర్త సూచించి యున్నాడని చెప్పుచూ, అచ్చటి స్వామినిగూర్చి యాతడేమియు వర్ణించలేదని కీ. శే. కోరాడ రామకృష్ణయ్య గారు తిరుమల తిరుపతి దేవస్థానము వారు

1952 లో ప్రకటించిన "శ్రీ వేంకటేశ్వర స్తుతి రత్నమాల" ద్వితీయ సరమునందు వ్రాసిరి.

ఆళ్వారుల పాశురములు

తమిళదేశమున దివ్యసూరులుగా ప్రఖ్యాతి కెక్కిన విష్ణుభక్తులు పన్నిద్దరాళ్వారులు. వీరు క్రీ. శ. 7వ శతాబ్దినుండి 10వ శతాబ్ది వఱకు నా యా శతాబ్దులలో విలసిల్లినట్లు చరిత్రకారు లంచనా వేసిరి. వీరిలో తొండరడిప్పొడి, మధురకవి యను నిద్దరు తప్ప తక్కిన పది మందియు తిరుమలను సేవించి వేంకటేశ్వరుని విష్ణువుగా భావించి తాము రచించిన పాశురములను (కీర్తనలను) గానము చేసిరి. ఇవన్నియు కలిపి సుమారు రెండువందల పదిహేను వఱకు గలవు. ఈ యాళ్వారులలో మూడవ వాడగు పేయాళ్వారు (క్రీ. శ. 6వ శతాబ్ది), వేంకటేశ్వరునిపై చెప్పిన పాశురములు పదిహేను. వీనిలో వేంకటేశ్వరుని హరిహర స్వరూపునిగా వర్ణించిన యీ క్రింది పాశురము మిక్కిలి కీలకమైనది.

పేయాళ్వారు లనుభవించిన
వేంకటేశ్వరుని హరిహర స్వరూపము :

"తాయశడైయుమ్ నీళ్ముడియు మొణ్మయవుమ్ శక్కరముమ్
శూయరవు మ్పొన్నాణుమ్తోన్టుమాల్—శూయమ్
తిరణ్డరువిపాయుమ్ తిరుమలై మేలెన్దైక్కు
ఇరణ్డురువు మొన్దాయిశైన్దు."

పాశురము 63 మూణ్డాంతిరువన్దాది.
మూడవఆయిరంనాలాయిర ప్రబంధము.

"చుట్టూ పాఱుచున్న సమృద్ధములైన కొండ కాలువలు ప్రవహించుచున్న తిరుపతి యందుండెడి స్వామికి వ్రేలుచున్న జటలును, ప్రౌఢుగైన కిరీటమును, సుందరమైన గొడ్డలియు, చక్రంబును, నడుమును చుట్టుకొనియున్న సర్పంబును, స్వర్ణమయమైన మొలత్రాడును, ఈ రెండు హరిహర్ల రూపములు చేరి యొకటియై తోచుచున్నది; ఆశ్చర్యము!"

పండిత వంగోలు వేంకటరంగయ్య బి.ఏ., బి.యల్. గారు 1925

వేంకటేశ్వరుడే తిక్కన హరిహర నాథుడా!

సెప్టెంబరు భారతిలో వ్రాసిన "ద్వాదశలింగములు—విశేష విమర్శనము" అను వ్యాసము నందిచ్చిన యర్థమే యిది. శ్రీ వైష్ణవ ముద్రాపక సభ లిమిటెడ్ వారు 1901వ సంవత్సరమున ప్రకటించిన గ్రంథమునందు ఈ పాశురమును, దీని తమిళాన్వయ క్రమమును, ఈ తెలుగర్థమును ఇచ్చియున్నారనిచెప్పి, వారు. ఈ మూడింటిని తమ వ్యాసము నందుల్లేఖించిరి.

తమిళ మూలమున హరిహర శబ్దములేదు. తెలుగర్థమున నున్నది. వస్తుస్థితి హరిహర స్వరూపమే గాన తిక్కనగారి పుణ్యమాయని మన కలవాటైన యా శబ్దమునే సద్యస్ఫూర్తి కొఱకు అనువాదకులు తెలుగర్థమున నిచ్చి యున్నారని భావింప వచ్చును. ఇక మూలమున గల 'అల్' అనుదానికి ఆశ్చర్యమని యర్థము చెప్పబడినది. తనకు ముందువారగు పొయ్ గై యాళ్వారు, పూదత్తాళ్వారు చెప్పిన దానిని బట్టి తిరుమల స్వామి విష్ణువేయని తలపోసి విచ్చేసిన పేయాళ్వారులకు కొట్టవచ్చినట్లు హరి హరమూర్తి కాన్పింపగనే ఆశ్చర్యము కలుగుట సహజమే! తొలుత శైవ చిహ్నములను చెప్పి పిమ్మట వైష్ణవ చిహ్నములను పేర్కొనుటవలన వేంకటేశ్వరుని యందు ఉత్కట ఏకకోటి తరముగ శైవచిహ్నములు ప్రాధాన్యము వహించినవాయను శంకయు బొడముచున్నది. ఇదంతయు పేయాళ్వారుల చిత్తశుద్ధికి తార్కాణముగా భావింపవచ్చును. విశేషమేమన ఈ పాశుర మిప్పటికిని నాలాయిర ప్రబంధమున భద్రముగా నున్నది! దివ్య ప్రబంధము లన్నియు వేద ఋక్కులుగా పరిగణింపబడుట వలన భగవద్రామానుజుల వారు సైతము ఈ పాశురమును,ఇందలి తత్త్వమును విధిగా శిరసావహించిరని తోచుచున్నది. కావుననే వేంకటేశ్వరుని విష్ణువుగా మార్పించిన సందర్భమున శైవ చిహ్నములగు నాగాభరణములను తొలగింపక నట్లేయుంచి స్వామియొక్క హరిహర స్వరూపమును స్థిరపరచిరని భావింప వచ్చును. అయితే, పేయాళ్వారుల పాశురమున సర్పము నడుముకు చుట్టుకొని యున్నట్లుంతగా రామానుజులు చేసిన మార్పువలన నవియిప్పుడు హస్తముల నలంకరించినవి. కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు అన్నమాచారి చరిత్ర పీఠికయందు "శ్రీ వేంకటేశ్వర మూర్తిని ఆళ్వారాచార్యుల యభివర్ణనామగుణముగా విష్ణు మూర్తిగా శ్రీ రామానుజాచార్యులవారు క్రీ.శ. పదకొండవ శతాబ్దిలో విఖ్యాత పఱచిరి" అని సెలవిచ్చిరి. ఇదిట్లయైనచో పేయాళ్వారుల పాశురానుసారముగనే

స్వామియందలి నాగాభరణముల నట్లేయుంచి హరిహర స్వరూపమును కాపాడి రనియు నిర్ధారణగా భావింపవలసి యున్నది। సారాంశమేమన నాలాయిర ప్రబంధ మున పేయాళ్వారుల హరిహర పాశుర మిప్పటికినీ నిలిచియున్నది. వేంకటేశ్వరుని హరిహర స్వరూపముగూడ నిప్పటికీ నిలిచియున్నదనుట।

ఇక పేయాళ్వారులు తాను చెప్పిన తక్కిన పదునాల్గు పాశురములలోను వేంకటేశ్వరుని విష్ణువుగానే స్తుతించిరి. దీనికి కారణము స్పష్టము. తనకు సహజ మగు విష్ణుభక్తితో స్వామియందలి శైవచిహ్నములను మనసున పట్టించుకొనక, ఏక దేశిగా వైష్ణవ చిహ్నములనే దృష్టియందుంచుకొని యిట్లుచేసినట్లు బోధపడగలదు. తక్కిన తొమ్మిదిమంది యాళ్వారులూ ఈ సూత్రమునే ఊతగాగొని చనిరి. ఇట్లు 7వ శతాబ్దమున పేయాళ్వారు త్రొక్కిన మార్గము కాలక్రమమున ఉత్తరోత్తర బలీయమై 10వ శతాబ్దమున నమ్మాళ్వారు నాటికి వేంకటేశ్వరుడు విష్ణువేయను ప్రచారము ప్రబలమైనది. శ్రీ వేటూరివారన్నట్లు రామానుజుల వారికిది చక్కగా నుపకరించి నది. రామానుజుల వారిఘట్టము మఱికొంత పోయిన పిమ్మట వివరింపబడును.

### శ్రీ శంకర భగవత్పాదుల వారి
### తిరుమల క్షేత్ర సందర్శన

జగద్గురు శ్రీ శంకరులు (క్రీ.శ. 8వ శతాబ్ది) తిరుమల క్షేత్రమును సేవించి యచట శ్రీ చక్రమును వేయించినట్లు ప్రతీతి రూఢిగా నున్నది. వారుచేసిన ద్వాదశ లింగ స్తోత్రములో శ్రీశైలమును గూర్చి చెప్పిన శ్లోకమున కీ క్రింది పాఠాంతరము లభించుచున్నది:-

"శ్రీశైలశృఙ్గే వివిధ ప్రసఙ్గే శేషాద్రిశృఙ్గేఽపి సదావసంతం,
తమర్జునం మల్లిక పూర్వమేనం నమామి సంసార సముద్రసేతుమ్"

దీనిని పండిత వంగోలు వేంకటరంగయ్యగారు 1925 మార్చినెల భారతిలో వ్రాసిన "ద్వాదశలింగములు" అను వ్యాసమున నిచ్చియున్నారు. దీనిని వాఖ్యా నించుచూ వారు శంకరులు తిరుమలకు విచ్చేసిన నాటికి హరిహర స్వరూపుడగు వేంకటేశ్వరుడు శివుడుగా మాఱియుండ వచ్చుననియు కావున వారిట్లు స్తుతించి రనియు వక్కాణించిరి. ఈ యభిప్రాయమును ఖండించుచూ క్రోధన సంవత్సరము, జ్యేష్ఠమున శ్రీమాన్ తి. న. చక్రవర్తి శ్రీనివాస రంగాచార్యుల వారు శ్రీవైష్ణవ

వేంకటేశ్వరుడే తిక్కన హరిహర నాథుడా!

పత్రిక యందొక వ్యాసమును వ్రాసిరి. అందులో వారు శ్రీకాళహస్తి గూడ శేషాద్రి శ్రేణిలోని దగుట వలన. శంకరుల "శేషాద్రి శృంగేఽపి" అనుదానికి కాళహస్తి యనియే యర్థమని వాదించిరి. దానికి ప్రతివాదము సల్పుచూ శ్రీ రంగయ్యగారు "ద్వాదశ లింగములు — విశేష విమర్శనము" అను వ్యాసమున శేషాద్రి శృంగము తిరుమలకే రూఢమై యున్నదని చెప్పి తమ పూర్వోక్త వాదమును గట్టిగా సమర్థించు కొనిరి. ఆ వాద ప్రతివాదముల సంగతి యటుంచి ప్రకృతాంశమును తేల్చవలసి యున్నది. "శేషాద్రి శృంగేఽపి" అను చోట 'అపి' శబ్దము విచిత్రముగా వాడ బడినది. దీనికి రెండర్థములను స్ఫురింప జేయగల సామర్థ్యమున్నది. "శ్రీశైల శృంగమునందునూ శేషాద్రి శృంగము నందునూ నివసించువాడు" అనిచెప్పినచో తిరుమల స్వామి కేవల శివ స్వరూపుడను నర్థమే స్ఫురించును. "శ్రీశైల శృంగము నందునూ, శేషాద్రి శృంగము నందు 'కూడ' నివసించువాడు 'నూ' అని చెప్పినచో శేషాద్రి శృంగము నందు నివసించు నది అర్థ శివస్వరూపుడే అను నర్థము స్ఫురించును. అప్పుడు తిరుమల యందు నివసించినది హరిహర స్వరూపుడే యగును. శంకరులు ఈ రెండవ యర్థమునందే 'అపి' శబ్దమును ప్రయోగించినారని నిర్ధారణగా భావింప వచ్చును. కాగా శంకరుల నాటికి వేంకటేశ్వరుడు హరిహర స్వరూపుడనుట నిష్కర్ష. పోనీ, శంకరులనాటికి విష్ణు చిహ్నరహితుడైన శివుడే యట నుండెనను కొందము, ఇదెట్లు సంభవించి యుండును? దీనికి భగవద్రామానుజుల వారు వేఱొక చోట చెప్పిన సమాధానమే శరణ్యము కాగలదు. శ్రీవేంకటేశ్వరస్వామి తన భక్తుడైన తొండమాన్ చక్రవర్తికి శత్రు సంహరణార్థము తన శంఖ చక్రాది దివ్యాయుధములను ఇచ్చివేయుట వలన వేంకటేశ్వరుడు శైవ చిహ్నములతో మాత్రమే ఉండవలసి వచ్చినదని వారు సెలవిచ్చిరి. ఇప్పుడీ విషయము నరయుదము:

భగవద్రామానుజుల వారు
వేంకటేశ్వరుని విష్ణువుగా తీర్మానించుట

"శ్రీవేంకటేశకర ధారిత శంఖ చక్రః
వక్షస్థ లార్పితరమః కలితాగమార్థః
సంస్థాపితాఖిల తదాలయ సంవిధానః
రామానుజో విజయతే యతి రాజరాజః"

"రామానుజ కృత వేదార్థ సంగ్రహః"
తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురణ 1953-

ఈ శ్లోకము క్రింద మఱియు నిట్లు వ్రాయబడియున్నది:

"గురు పరంపరల"యందు, "శ్రీ వేంకటాచల ఇతిహాసమాల" యందు, "తిరుమలై ఒలుగు" అను పేరుతో మేమిప్పుడు ప్రకటింపబోవు గ్రంథమునందు, "శ్రీ రామానుజకృత అష్టోత్తర శత-శాంతాది దివ్య ప్రబంధముల యందు ఈ విశేషములన్నియు వర్ణింప బడినవి" అని.

దేవస్థానమువారి పై ప్రచురణలు లభింపలేదు. క్రీ. శ. 1885 సం॥మున కొ. అనంతాచార్యులవారు ఆంధ్రమున పరివర్తించిన "గురు పరంపరా ప్రభావము" అనునది లభించినది. ఇది ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయములో నున్నది. ఇందీ విషయము చర్చింపబడినది. "శ్రీ వేంకటాచల ఇతిహాసమాల"లోని కొన్ని ప్రధాన విషయములు పండిత వంగోలు వేంకటరంగయ్యగారి "ద్వాదశ లింగములు - విశేష విమర్శనము" (1925 సెప్టెంబరు భారతి) అను వ్యాసములో లభించు చున్నవి. వారికి ఈ ఇతిహాస మాలా గ్రంథము క్రీ. శ. 1885 ప్రాంతమున మహంతు శ్రీ భగవాన్‌దాసు గారచ్చు వేయించిన "శ్రీ వేంకటాచల మాహాత్మ్యము" అను గ్రంథమునందు లభించినదట. ఆ వాక్యములే యిట నుట్టంకింపబడు చున్నవి.

రామానుజుల నాటికి వేంకటేశ్వరుడు శివుడా? విష్ణువా? యను తగాదా ప్రబలము కాజొచ్చెను. శైవులు శివుడనియు, వైష్ణవులు విష్ణువనియు వాదులాడు కొనుచుండిరి. దీనిని తేల్చుకొనుటకు అప్పటి తిరుపతి ప్రాంత దేశాధిపతి యగు యాదవరాజు కడకు శైవులొక జట్టుగ, రామానుజుల నాయకత్వమున వైష్ణవులొక జట్టుగ పోయి తమతమ వాదములను విన్నవించుకొనిరి. ఇప్పట్టున వేంకటాచల ఇతిహాస మాలా వాక్యము లిట్లున్నవి:-

శైవ పక్షమున ఐదవ వాదము:

"అస్య దేవస్య విష్ణు రూపత్వే తద సాధారణ శంఖ చక్రాది దివ్యాయుధ రాహిత్యం, దేవతాంతర సాధారణ జటిలత్వ నాగాభరణ ధారి త్వంచ దృశ్యమానం కథముచిత ఘృపపద్యతే." (ఇతిహాసమాలాస్తబకం ౧. వాక్య ము౫.)

వేంకటేశ్వరుడే తిక్కన హరిహర నాథుడా!

శ్రీ రామానుజుల వారి సమాధానము:

"అస్య శ్రీనివాస భగవతః శంఖ చక్రాద్యాయుధ విహీనత్వం తు తొండమాం శ్చక్రవర్తినే దుర్విషహ వైరి నిషూదన కాంక్షిణే నిజాయుధ దాన సూచకం భగవతైవ సంకల్పితమితి పురాణ వచనేష్వేవ స్పష్టమ్". (వాక్యము ౬)

యాదవరాజు సమక్షమున నిట్లు కొంతవాదము జరిగిన తరువాత రామానుజుల వారి ప్రోత్సాహమున నిరుపక్షముల వారు నొక విషమ పరీక్షకు పూనుకొనిరి.

"తతశ్చ ఉభయేఽపి వాదినః స్వస్వదేవాసాధారణ చిహ్నీభూతా న్యాయు ధాని నిర్మాప్య, కస్మింశ్చిత్ దివసే రాజ్ఞాసహ శ్రీవేంకటాచల మారుహ్య, రాత్రౌ దివ్యాలయ గర్భగృహే భగవత్సన్నిధౌ తాని నిక్షిప్య, కవాటబంధనంచ కృత్వా, రాజకీయ ముద్రాంచ కారయిత్వా, ప్రభాత పర్యంతం దివ్యాలయ పరితః సావధానం జాగరూకా ఏవసంచరంతో, విజయాయ స్వంస్వందేవం సంతత మనుచింత యన్నేవ తస్థిరే".

(స్తబకం ౩, వాక్యం ౨౬౧)

ఇప్పట్టున రామానుజు లొక ఉపాయ మాలోచించి కధ నడిపినట్లు ఈ క్రింది వాక్యము వలన నవగతము కాగలదు.

రామానుజ వచనము:-

"తదిదానీ మిదం కర్తవ్యం. బ్రహ్మాండ పురాణైకాదశాధ్యాయే కలౌ విమానాదీనామివ శంఖ చక్రాది దివ్యాయుధానామపి భక్త కల్పితానాం స్వీకరణస్య ప్రాగేవ ప్రతిజ్ఞా తత్వాత్ అస్మత్పరి కల్పిత సమర్పిత దివ్యాయుధానామస్వీకార నిర్బంధాభావాచ్చ, ప్రసహ్యావా సంప్రార్థ్య సంప్రతి ప్రసక్త దేవతాంతరతాపత్తి లక్షణ మహానర్థ ప్రసంగ పరిహారాయ శంఖచక్రే భగవంతం ధారయిష్యామి. ఆశ్రితవాత్సల్య జలధిః భక్త పరాధీనో భగవాన్ అస్మత్ ప్రార్థనయా అవశ్యమస్మత్సమర్పితే శంఖ చక్రే స్వయమేవ స్వీకు ర్యాదేవ. తదిహ శంఖచక్రే నిర్మాప్య సమర్పయామి" (స్తబకం ౩, వాక్యం ౨౬౮)

ఇట్లు పలికిన రామానుజులు స్వామిచేత ఆయుధములను ధరింప జేసిన విధమిది:-

"భగవాన్ రామానుజ మునిరపి స్వయోగ మహిమ్నా భగవంతం శ్రీనివాస

ముపసృత్య, సమ్యక్ సాక్షాత్కృత్య భగవన్! భవత్కృత ప్రాక్తన ప్రతిజ్ఞాను రోధేన భవ దసాధారణ శంఖ చక్రాది దివ్యాయుధాని ధృత్వా అస్మాన్ సంరక్షేఽతి సంప్రార్థయన్ శంఖ చక్రాది దివ్యాయుధ ధారణ మంగీకారయా మాస”

ఇట్లుచేసిన పిమ్మట వేంకటేశ్వరుని సన్నిధిని శ్రీవైష్ణవుల స్థానాచార్యత్వ మును స్థాపించి, రామానుజులవారు తనకు రామాయణోపదేశము చేసిన గురువులు తిరుమలనంబి గారిని, తమ శిష్యులు అనందాళ్వార్లను, ఇద్దఱు జియ్యంగార్లను, ఇరువది నల్వుగు ఏకాంగులను కాపలాపెట్టి, యీ పనిని యితరులు మార్చుటకు వీలు లేకుండ కట్టుదిట్టములను చేసెను. ఇంతటితో శ్రీ వేంకటేశ్వరుడు విష్ణురూపము దాల్చెను! యాదవరాజు విష్ణుభక్తుడగుట వలన నతనికడ తనకుగల ప్రాబల్యము నుపయోగించి రామానుజు లిదంతయు సాధించినట్లు చరిత్ర సాక్ష్యమిచ్చుచున్నది. కాని స్వామికి యిప్పటికినీ శైవచిహ్నమగు జటలున్నవనియు, వాటిని ఉపాయముతో కానరాకుండ కప్పివేయుచున్నారనియు కొందఱందురు. ఇక నాగాభరణముల విష యము వెనుక ముచ్చటించుకొని యుంటిమి. ఇట్లు ఆ తిరుమల మందిర సుందరుడు నాటికీ నేటికీ నిత్యసత్య హరిహర స్వరూపుడనుట నిష్కర్ష!

## తిక్కనగారి తిరుపతి యాత్ర

తిక్కన తిరుమల స్వామిని సేవించినట్లు చెప్పుటకు ప్రత్యక్ష ప్రమాణము లేకపోయినను అనుమానప్రమాణముచేత నిర్ధారణకు రావచ్చును. తిరుపతి నెల్లూరున కందుబాటులో నుండుట మొదటి కారణము. అసలిది నెల్లూరు తెలుగు చోడ రాజ్య ములో నొకప్పు డంతర్భాగముగా నుండెనా యను శంకయు బొడముచున్నది. క్రీ.శ. 1175 నుండి 1275 వఱకు వంద సంవత్సరముల చరిత్ర ఈ రాజ్యమునకు స్పష్టముగా నున్నది. ఈ కాలములో దీనిని పరిపాలించిన వారు వరుసగా నల్లసిద్ధి, మొదటి మనుమసిద్ధి, అతని కొడుకు మొదటి తిక్కరాజు, అతని కొడుకు రెండవ మనుమసిద్ధి (తిక్కనగారి మనుమసిద్ధి) యనువారలు. నేటి నెల్లూరు, చిత్తూరు, కడప, ఉత్తరార్కాటు, చెంగల్పట్టు జిల్లాలు అనాడీ రాజ్యములో నుండినవి. కొన్ని సందర్భములందీ రాజ్యపు టెల్లలు మారిపోవుచూ కొన్ని జిల్లాలను కోల్పోవలసి వచ్చినప్పుడు కూడ స్థిరముగా నిలిచియున్న జిల్లా చిత్తూరు జిల్లా. ఇట్లు చారిత్రక దృష్టితో పరిశీలించినచో ఏదో ఒకదశలో తిరుపతి యీ రాజ్యములో భాగముగా

వేంకటేశ్వరుడే తిక్కన హరిహర నాథుడా!

నుండెనని తోచుచున్నది. కనీసము ఈ రాజ్యపు పొలిమేరల నానుకొని యుండి, నెల్లూరులో నిలబడి తేఱిపాఱ చూచినవారికి శేషాద్రి శృంగము కనబడుచునే యుండెడిదన్నచో నతిశయోక్తి కాదుగదా! ఇంత సన్నిహిత సంబంధములు గల తిరుపతికి తిక్కన వెళ్ళియుండ డనుకొనుట యెట్లు? నెల్లూరునుండి రాచకార్యముపై ఓరుగల్లునకు వెళ్ళి గణపతి దేవచక్రవర్తికి సంస్కృత మహాభారతమును వినిపించిన తిక్కన ప్రక్కనే యున్న తిరుమలకు వెళ్ళి స్వామి సన్నిధిని జరుగు దివ్యప్రబంధ పఠనమును వినియుండడా! వేంకటేశ్వరునిపై యాళ్వారుల వర్ణనలు, శంకరుల శ్రీ చక్రస్థాపన, రామానుజులు హరిహర స్వరూపుడగు స్వామిని విష్ణువుగా తీర్మానించుట మొదలగు చరిత్రాంశములను ఇప్పుడు మనమే వినుచుండ అప్పుడు తిక్కన వినియుండడా? దాని ప్రభావమాతనిపై పడియుండదా?

## నృసింహ పురాణమునుబట్టి తిరుమల సుప్రసిద్ధ క్షేత్రమే

పై యంశములతో బాటు తిక్కననాటికి తిరుమల సుప్రసిద్ధ పుణ్యక్షేత్రమే యను విషయము ఎఱ్ఱయ నృసింహ పురాణమును బట్టి రూఢిగా తెలియుచున్నది. తెలుగు వాఙ్మయమున తిరుమలను ప్రశంసించిన తొలిగ్రంథము నృసింహ పురాణమే. ఇందలి ప్రథమాశ్వాస ప్రారంభమున గాలవ మహర్షి సేవించిన పుణ్యక్షేత్రముల పట్టికలో తిరుపతిగూడ నున్నది. "శ్రీవేంకటాచల స్థాయిఁగొలిచె" (పద్యం11). దీని క్రింద వెంటనే "ఇట్లు పరిపాటిం బ్రసిద్ధంబులగు తీర్థంబులాడుచు మఱియు (వచనం 12) అని వ్రాయబడినది. దీనినిబట్టి ఎఱ్ఱయనాటికి తిరుపతికి గల ప్రసిద్ధి తేటతెల్లమగుచున్నది. తిక్కన ఎఱ్ఱయకు ఏబది సంవత్సరములు మాత్రమే పూర్వుడు. ఈ కొద్దిపాటికాల భేదమును బట్టి ప్రసిద్ధిలో కొంత తారతమ్యముండుట కవకాశమున్నను తిక్కన నాటికి తిరుమల సుప్రసిద్ధ క్షేత్రమనుట స్పష్టము. ఇదిట్లుండ నృసింహ పురాణములోనిదే అయిన:

గిరిశపద భక్తిరసత, త్పరభావము కలిమి శంభుదాసుండనగా
బరగియు గోవిందగుణా, దరసంభృత సౌమనస్యధన్యుడ వెందున్.

(ప్రథమాశ్వాసం 18వ పద్యం)

అను పద్యము ఎఱ్ఱయనాటి శివకేశవాద్వైత భావమును చక్కగా చాటు

చున్నదని చెప్పి కొందరు విమర్శకులు తిక్కనగారి హరిహరనాథాద్వైతములో ఎఱ్ఱయకు పొలుపంచు చున్నారు. ఈపద్యమున నొక నిగూఢ చమత్కారము భాసించు చున్నది. 'గిరిశ' అనగా ఎగువ తిరుపతి యందు నివసించు వేంకటేశ్వరు డనియు, 'గోవింద' అనగా దిగువ తిరుపతి యందలి గోవిందరాజస్వామి యనియు చెప్పనొప్పును. అప్పుడు ఎఱ్ఱయ దృష్టిలో వేంకటేశ్వరుడు శివుడే యగును! స్వామి పూర్వచరిత్రను బట్టి కొంతవరకు ఇదియు సత్యమే గదా? ఏదృష్టితో చూచి నను తిరుపతి హరిహర క్షేత్రమనియే తేలుచున్నది!

"కిమస్థిమాలాం" శ్లోకము
వేంకటేశ్వరుని సంబోధించినదే!

శ్లో॥ కిమస్థిమాలాం కిముకౌస్తుభం వా పరిష్క్రియాయాం బహు మన్యసేత్వం
కిం కాలకూటః కిమువా యశోదాస్తన్యం తవ స్వాదువద ప్రభోమే.

ఇది తిక్కన భారతరచనకు పూర్వమెప్పుడో వ్రాసిన శ్లోకమని, తండ్రి కొమ్మన తిక్కనకు కలలో కాన్పించి "కిమస్థిమాలాం" అనితొల్లి నీవు రచియించిన పద్యంబు" అని చెప్పుటను బట్టి స్పష్టపడు చున్నది. తొల్లి యనగా తిక్కన తిరుపతి స్వామిని సేవించి నప్పుడనియే భావింపవలసియున్నది. ఇది నెల్లూరి హరిహర నాథుని చూచినప్పుడు తిక్కన భక్తిపరవశుడై వ్రాసిన శ్లోకమనియు పిమ్మట ప్రతి రోజూ నాతనియెదుట కూర్చుని పాడుకొనుచుండెడి వాడనియు కొందఱు వ్రాసిరి. ఇది సరికాదు. ఇట్టి లోకోత్తర శ్లోకము అసలు లేనేలేని, ఒకవేళ ఉన్ననూ ఊరూ పేరూలేని నెల్లూరి హరిహరనాథుని చూచినప్పుడు వెలువడినదను కొనవలయునా? లేక ఏడుకొండల హరిహరనాథుని చూచినప్పుడు భక్తిపారవశ్యమున ఎదకరిగి ప్రవహించిన సెలయేరనుకొనవలయునా! పేయాళ్వారులు వేంకటేశ్వరుని జూచి యాశ్చర్యముతో చెప్పిన హరిహరనాథపాశురమువలె తిక్కన భక్తిపారవశ్యముతో చెప్పిన హరిహరనాథ శ్లోకమిది. పేయాళ్వారు తొలుత శైవచిహ్నములను చెప్పి మలుత వైష్ణవచిహ్నములను చెప్పెను. తిక్కన కూడ నట్లేచేసెను! ఈ రెండింటి కిని కావలయుననియో కాక తాళీయముగనో ఏర్పడిన బింబ ప్రతిబింబ భావము ఉన్నది. ఆళసి పాశురము, ఈతని శ్లోకము స్వామి చరిత్ర నిరయములో మిక్కిలి కీలక స్థానము వహించుచున్నవి!

వేంకటేశ్వరుడే తిక్కన హరిహర నాథుడా!

అర్జున స్వప్నవృత్తాంతమే

తిక్కన స్వప్నవృత్తాంతము!

ద్రోణపర్వములోని అర్జునస్వప్నవృత్తాంతమే విరాట పర్వప్రారంభమున గల తిక్కన స్వప్నవృత్తాంతమునకు మూలము. తిక్కనకల కల్పితమా! యను విచికిత్స పుట్టించు పోలిక ఈరెండింటికిని ఉన్నది.

అర్జునుడు సైంధవ వధకు ప్రతిజ్ఞ చేసిన నాటిరాత్రి కృష్ణుని పూజించెను. పూజనందు కొన్న కృష్ణుడర్జునునితో విశ్రాంతికై నిద్రపొమ్మని సెలవిచ్చెను. నిద్రలో అర్జునుని స్వప్న వ్యాజమున కైలాసమునకు తీసుకొనిపోయి శివుని దర్శింప జేసెను. అప్పుడర్జునుడు 'తానుమున్ను ముకుందు నందు సమర్పించిన నిశాసమయ పూజా ద్రవ్యంబులగు మాల్యానులేపనంబులు అద్దేవుని దివ్యదేహంబు నందు గాంచి యచ్చెరువంది అమ్మురహర పురహరుల యేకత్వంబు మనంబునంగొనియాడి, దేవా! భవదీయ దివ్యాస్త్రంబు దయసేయుమని విన్నవించెను. భక్తవత్సలుండగు శక్తి నాథుండు పాశుపతాస్త్రమును ప్రసాదించెను."

తిక్కన తన ప్రబంధమండలి కధినాథునిగా నేపురుషుని పేర్కొనువాడనో యని తలంచుచూ ఇంచుక నిద్రించు సమయమున కలలో తండ్రి కొమ్మన హరిహర నాధుని వెంట బెట్టుకొనివచ్చి తిక్కనకు చూపెను. హరిహరనాథుడు తిక్కనతో "కృతిపతిత్వమర్థించి వచ్చితి తిక్కశర్మ" అనెను. తిక్కం కొమ్మన యనుమతితో హరిహరనాథునికి ఆత్మనివేదనము చేసికొని తదుపరి పరమేశ్వరునిం గృతి నాథునిగా వరించెను.

అర్జున స్వప్న వృత్తాంతమున మొత్తమైదు పాత్రలున్నవి:- కైలాసమ్ము; హరి పూజాద్రవ్య చిహ్నితుడైనహరుడు, కృష్ణుడు, అర్జునుడు, పాశుపతాస్త్రము: తిక్కన స్వప్న వృత్తాంత నాటకము నందుగూడ నైదు పాత్రలేయున్నవి:- తిరుమల, హరిహరస్వరూపుడైన వేంకటనాథుడు, కొమ్మన, తిక్కన, మహాభారతము. ఇక్కడ కృష్ణపాత్రధారి కొమ్మన. అక్కడ ఇక్కడ రెండు మార్పులున్నవి. ఒకటి:- అక్కడ దాత శివుడు (హరిహరుడు); పరిగ్రహీత అర్జునుడు, ఇక్కడ దాత తిక్కన, ప్రతి గ్రహీత వేంకటనాథుడు (హరిహరనాథుడు). రెండు:- అక్కడ అర్జునుడే కృష్ణు నితో కైలాసమునకు వెళ్ళగా, ఇక్కడ వేంకటనాథుడే కొమ్మనతో నెల్లూరు

వచ్చినాడు. కృష్ణుని రికమండేషన్‌వలన అర్జునునకు పాశుపతాస్త్రము లభింపగా, కొమ్మన రికమండేషన్‌వలన వేంకటనాథునకు మహాభారతము లభించినది. ఇట్టి పోలికలతో నీ రెండు వృత్తాంతములకు నేకత్వము కుదురుచున్నది.

తిక్కన వ్యాసభారతము చదువుచున్నప్పుడు ఈ యర్జున స్వప్నవృత్తాంత మాతనిహృదయము నాకర్షించియుండును. అది మొదలుకొని హరిహరనాథ తత్త్వవిషయక భావన క్రమముగా పరిపక్వము కాజొచ్చెను. దీనికితోడు వేంకటనాథ విషయక హరిహర స్వరూపము ఆతనికి తొలినుండియు ప్రత్యక్షానుభవములో నుండెను. ఈ రెండింటికి తోడు శైవవైష్ణవ మత విద్వేషముల మంటలను చల్లార్చి ప్రశాంతపరిణామము కలిగింపవలయునను సంకల్పము తీవరించెను. ఇకనేమి? కాకతాళీయముగ ముప్పేటగా కుదిరిన సమన్వయవిధానముతో పరతత్త్వ బోధనుడై హరిహర నాథార్పితముగ వాఙ్మయమహాధ్వరము నిర్వహించి పుట్టువును కృతార్థము చేసికొనెను.

ఆళ్వారుల దివ్య ప్రబంధములు

తిక్కనగారి పుణ్య ప్రబంధములు.

"ఈ దృశంబులగు పుణ్య ప్రబంధంబులు దేవ సన్నిధిం బ్రశంసించుట నొక యారాధనా విశేషంబు" ఈ ప్రబంధ మండలి కథినాథునిగా నేపురుషుని పేర్కొను వాడనో" అను విధముగా తిక్కన వాడిన "పుణ్య ప్రబంధములు" "ప్రబంధ మండలి" యను ప్రయోగములు ఆళ్వారుల దివ్య ప్రబంధములను స్ఫురింపజేయు చున్నవి. ఈ రెండింటికి నామ సామ్యముతో బాటు విషయ సామ్యము కూడ నున్నది. దివ్య ప్రబంధములు వేదమంత్రముల వంటివి. మరియు వేదసారభూతములు. ఇక పుణ్యప్రబంధమగు భారతము పంచమ వేదము. ఆ ప్రబంధ ములు భక్తి రూపమున జ్ఞానమును ప్రబోధించినవి. భారతము కర్మజ్ఞాన రూప మున వేదార్థమంతయు బోధించినది. దివ్యశబ్దము తిరుశబ్దము వంటిది. వైష్ణ వాలయములందు నిత్య దైవారాధనమున దివ్యప్రబంధపఠనమొక యారాధనా విశేష ముగచెప్పబడినది. రామానుజుల వారు తిరుపతి క్షేత్రమున దివ్యప్రబంధపఠనమును ప్రవేశ పెట్టిరి. అది నేటికినీ జరుగుచునే యున్నది. పుణ్య ప్రబంధ మనున దీ దివ్య ప్రబంధమునకు దగ్గఱగా నున్నదనుట స్పష్టము, (ఈ అభిప్రాయము

వేంకటేశ్వరుడే తిక్కన హరిహర నాథుడా!

డా॥ కేతవరపు రామకోటిశాస్త్రిగారి "తిక్కన కావ్యశిల్పము" అను గ్రంథమునుండి గ్రహింపబడినది వారికి కృతజ్ఞతలు.)

తిక్కన వేంకటనాథుని సేవించినాడనియు, ఆ సందర్భముననే "కిమస్థి మాలాం" శ్లోకమును రచించినాడనియు వెనుకనూహించితిమి. అప్పుడే స్వామి సన్నిధిని జరుగు దివ్యప్రబంధ పఠనమునుకూడ శ్రవణ సుఖముగా వినియుండవచ్చు నని భావింపవచ్చును. అది దృష్టిలో ఉంచుకొనియే స్వప్నమున హరిహరనాథ సాక్షాత్కారము జరిగిన వెంటనే "ఈ దృశంబులగు పుణ్య ప్రబంధంబులు దేవ సన్నిధిం బ్రశంసించుట నొక యారాధనా విశేషంబు" అని చెప్పినాడని చెప్ప నొప్పును. కొందఱు పై వాక్యమును బట్టి తిక్కన హరిహరనాథ దేవాలయమున కూర్చొని భారతమును వ్రాసి యుండవచ్చునని చెప్పిరి. అదియే నిజమైనచో తిరుమల వేంకటనాథుని సన్నిధిని కూర్చొనియే రచన కుపక్రమించినాడని నిస్సందేహముగా భావింప వలసి యున్నది!

ఆళ్వారుల వేంకటేశ్వర పాశురములు

తిక్కనగారి హరిహరనాథ పద్యములు

ఆళ్వారులు పదిమందియు కలిపిచెప్పిన వేంకటేశ్వర పాశురములు సుమారు రెండు వందల పదిహేను. తిక్కన ఆశ్వాసాద్యంతము లందుచెప్పిన హరిహరనాథ పద్యములు కూడ సుమారు రెండువందలు. అక్కడ పాశురము లన్నియు మూడు నాల్గు ఛందస్సులలో నున్నవి. ఇక్కడ హరిహరనాథ పద్యములుకూడ మూడు నాల్గు ఛందస్సులలోనే ఉన్నవి. దాదాపు ప్రతి పాశురము నందు "వేఙ్గడమే", "తిరువేఙ్గడమే", "వేఙ్గడత్తాన్", "తిరువేఙ్గడత్తాన్" అనువానిలో నేదో యొకటి మకుట నియమము పాటింప బడుచున్నదా యన్నట్లు తప్పక వచ్చుచునే యుండును. తిక్కన పద్యములలో "హరిహరనాథా" యను మకుట నియమమో, అట్టిసంబోధనమో ఉండుట తెలిసిన విషయమే. తిక్కన హరిహరనాథ పద్యములు వేంకటేశ్వరుని గూర్చి చెప్పినవే యని భావించినచో ఇరువురి కవితల యందు వేంకటేశ్వర భక్తి విషయక వస్త్వైక్యత ఉన్నట్లే. ఇట్టు కవితాపులగముగా నున్న యీ పోలికలు మన యీ వ్యాసముయొక్క ప్రధానాంశమునకు దోహదకరముగ నున్నవని చెప్పవచ్చును.

పేయాళ్వారు శంఖము చెప్పలేదు
తిక్కన కూడ శంఖముచెప్పలేదు.

పేయాళ్వారు తమ హరిహరనాథ పాశురమున వేంకటేశ్వరుల యందలి విష్ణు చిహ్నములలో చక్రమును చెప్పెనేగాని శంఖమును చెప్పలేదు. తిక్కన తన రెండువందల హరిహరనాథ పద్యములలో ఎంతసేపటికీ చక్రమును, తదితర చిహ్నములను చెప్పెనేగాని ఎక్కడను శంఖమును పేర్కొనలేదు! ఇదిట్లుండ పేయాళ్వారు చెప్పిన శైవ చిహ్నమగు గొడ్డలిని తిక్కన పలుమాఱులు చెప్పెను. దీనినిబట్టి పేయాళ్వారుల పాశురానుసారముగ కావలయుననియే తిక్కన శంఖమును చెప్పలేదనియు, గొడ్డలిని చెప్పినాడనియు నిశ్చయముగా భావింపవచ్చును. ఇప్పట్టున తిక్కనగారి యాంతర్యమును విడమఱచి చెప్పవలసిన పనిలేదు!

వేంకటనాథా! హరిహరనాథా!
నాథశబ్ద విచారణ

ఆళ్వారుల కాలమునుండియు "వేంకటనాథా" అను వ్యవహారము రూఢిగా నున్నది. అందలి నాథశబ్దమునే తిక్కన గ్రహించి "హరిహరనాథా" అని ప్రయోగించినట్లు నిర్ణయింపవచ్చును. నెల్లూరి రాజ్యములో ఐదు జిల్లాలుండినట్లు చెప్పి యుంటిమి. ఆయా జిల్లాలలో వెలసిన అనేక దేవాలయములకు నాథశబ్దమసు ప్రయుక్తమైయుండుట గమనింపవచ్చును, ఈ దేవాలయములన్నియు క్రీ.శ. 6 నుండి 12వ శతాబ్దాలలో వెలసినవే. కడపజిల్లా ప్రొద్దుటూరు తాలూకా దాసరి పల్లి గ్రామమున తిరువేంగళనాథ దేవాలయము, రాజంపేట తాలూకా నందలూరు గ్రామమున సౌమ్యనాథస్వామి, సిద్ధవటం తాలూకా 'జ్యోతి' గ్రామమున జోతిర్నాథ దేవుడు, కర్నూలుజిల్లా సిద్వేలి తాలూకా చింతకొమ్మదిన్నె గ్రామములో తిరు వేంగళనాథుడు. నెల్లూరు జిల్లా ఉదయగిరి తాలూకా అయ్యవారి పాలెములోనూ, నందిపాడు గ్రామములోనూ సిద్ధనాథ దేవాలయములు, నెల్లూరులో రంగనాథా లయము, హరిహర నాథాలయము, (ఉండిన మాట నిజమైన) మొదలగునవి.

ఈ దేవాలయములు చాలవఱకు వేంకటనాథునకు ప్రతిబింబముగా వెలసి నవే. అట్లుకాని వాటికి అనుప్రయుక్తమై యున్న నాథ శబ్దము వేంకటనాథలోనిదే యనుట నిస్సందేహము. కురునాథా, శక్తినాథా వంటి ప్రయోగములు తిక్కన

వేంకటేశ్వరుడే తిక్కన హరిహర నాథుడా!

భారతములో కోకొల్లలు. తిక్కన స్వీకరించిన ఈ నాథశబ్దము "వేంకటనాథా" లోనిదే యగుటచేత వేంకటశబ్దమునకు పర్యాయముగా హరిహర శబ్దమును స్వీకరించినట్లు నిష్కర్షగా చెప్పవచ్చును.

వేంకటనాథుని హరిహరుడు నెల్లూరివాడు కాదు!

డా॥ చిలుకూరి నారాయణరావు

డా॥ చిలుకూరి నారాయణరావు గారు 1941 జూన్ భారతిలో వ్రాసిన "పంచతంత్రము— వేంకటనాథ నారాయణ కవుల అనువాదాలు" అను వ్యాసమున ప్రసంగ వశమున నిట్లువ్రాసిరి:-

"బైచరాజు వేంకటనాథుడు తన కావ్యమును హరిహర నాథాంకితము చేసెను గాన నీ హరిహరనాథుడు నెల్లూరిలో నెలకొన్న దేవతా మూర్తియై యుండవలెను. "ఏచనవు గలదు" అను పద్యమును బట్టి తిక్కనగారి నెల్లూరి హరిహరనాథుడే యీతని హరిహరనాథుడని చెబుతారుగాని నాచన, వేంకటనాథులు కృతులను సమర్పించిన హరిహరనాథుడు కూడా నెల్లూరి మూర్తియేనా? అను విషయములో నభిప్రాయ భేదమున్నది."

"వేంకటనాథుడు నెల్లూరివాడు కాదు. ఆతడు కృతి యిచ్చిన హరిహర నాథుడు నాచన సోమన కృతి యిచ్చిన హరిహరనాథుని వలెనే తిక్కన కృతి యిచ్చిన నెల్లూరిలోని హరిహరనాథస్వామి కాదు" అని.

ఇంత చెప్పిన రావుగారు మఱి వేంకటనాథుని హరిహర నాథుడెవరో తేల్చి చెప్పక మధ్యలో తెచ్చిన ప్రసక్తిని మధ్యలోనే విడిచిపెట్టిరి. కాని యీతడు వేంకటేశ్వరస్వామి భక్తుడని మాత్రము పరోక్షముగ సూచించిరి. ఈతడు వేంకటేశ్వరుని భక్తుడని విమర్శకులందరూ కంఠోక్తిగా ప్రకటించిన విషయమే. ఈతని తండ్రివంశమువారు, తల్లివంశమువారు వంశ పారంపర్యముగ వేంకటేశ్వరుని భక్తులనియు, పితామహ మాతామహులు వేంకటేశ్వరునికి ధర్మములొసగిరనియు ననేక శిలా శాసనములను బట్టి తెలియుచున్నది. ఈతని గురువగు తిరుమలాచార్యులు కూడ వేంకటేశ్వరుని భక్తుడే. ఇట్లు పితామహ మాతామహ గురువంశములనుండి పారంపర్యముగ సంక్రమించిన వేంకటేశ్వరుని భక్తి తత్త్వమున జీర్ణించిన వేంకటనాథుడు వేంకటేశ్వరులను పంగనామములు పెట్టి తన

పంచతంత్రమును హరిహర నాథాంకితముచేసి:-

"ఏచనవు గలదు హరిహర
సాచివ్యమునంద నన్యజనులకుమదినా
లోచింప తిక్కయజ్వకు
నాచన సోమునకును మఱియు నాకున్ దక్కన్"

అని అనుచున్నాడేమి! పరిశీలింపవలెను. ఈ పద్యమున "చనవు" "మదినా లోచింప" అను ప్రయోగములు మిక్కిలి కీలకములైనవి. చనవు అనగా మిక్కిలిసన్నిహిత పరిచయము అని యర్థము. మదినాలోచింప ననగా అంతర్యము విచారింపగా నని యర్థము. అసలాంతర్యము విచారింపగా మా ముగ్గురికి హరిహరునితో గలసన్నిహిత పరిచయము ఇతరులకు లేదు అని తాత్పర్యము. ఈవేంకటనాథునకు తిరుపతి వేంకటేశ్వరునితో గల చనవును గూర్చి తెలుసుకొంటిమి. వేంకటేశ్వరుడు హరిహర స్వరూపుడు గాన ఆతనికి గల చనవు వేంకటేశ్వర గతమగుట నిష్కర్ష. మఱి తిక్కనకు హరిహరునితో గల చనవు వంశపారంపర్యముగ వచ్చినదా! యన్నచో అవుననియే సమాధానము. తిక్కన స్వప్న వృత్తాంతమును స్మరింపవలెను. హరిహరనాథుడు ముందుగా నాకలోక నివాసియైన కొమ్మన కడకు వచ్చెను. తండ్రి యనుమతితోనే తిక్కన భారతమును హరిహర నాథాంకితము చేసెను. దీనినిబట్టి తిక్కనతండ్రి కొమ్మన గొప్ప హరిహరనాథ భక్తుడని తెలుచున్నది. నాచనసోముడు ఉత్తర హరివంశమున వ్రాసిన పద్యములను బట్టి యాతడు హరిహర సాచివ్యముగల వాడని తెలియుచున్నది. ఆతని ఉత్తర హరివంశమున అవతారిక లేకపోవుట వలన వివరములు తెలియవు. ఇట్లు తిరుపతి వేంకటేశ్వరుడే తిక్కన గారి హరిహర నాథుడని కనిపెట్టి తానుగూడ నా మార్గమున నడిచినవాడు వేంకటనాథుడు. ఈ రహస్యమును మనమిప్పటికి పసిగట్ట గలిగితిమి!

హరిహర నాథాంకితము చేయుటతగ్గి
వేంకట నాథాంకితము చేయుట ప్రబలినది.

తిక్కన తన కృతిని హరిహర నాథాంకితము చేసిన తరువాత పలువురు కవులు తమ తమ కృతులను ఆ వరుసలో హరిహర నాథాకింతము చేసిరి. వీరిలో సోమన, బైచరాజు, నారాయణ కవి, గోపరాజు, కంభముపాటి నారపామాత్యుడు

వేంకటేశ్వరుడే తిక్కన హరిహర నాథుడా!

(16వ శతాబ్దివాడు. గ్రంథము అముద్రితాంధ్రభగవద్గీతలు) మొదలగువారు ముఖ్యులు. దాదాపు వీరందరికీ హరిహరనాథుడు కలలో కాన్పించిన మీదటనే తమతమ కృతులను హరిహర నాథాంకితము చేసినట్లు చెప్పుకొనిరి. ఇంకనూ మఱి కొందరజ్ఞాతులు, అనుక్తులు నుండవచ్చును. పై కవులందరూ దాదాపు నెల్లూరి ప్రాంతమువారే. ఇట్లుండ తరువాత వచ్చిన కవులనేకులు మూక ఉమ్మడిగా తమతమ కృతులను వేంకటేశ్వర స్వామికి అంకిత మిచ్చుట మొదలు పెట్టిరి. వీరిలో ఎలకూచి బాలసరస్వతి, కట్టా వరదరాజు, గూళికల్లు వేంకటరమణకవి, రాయసం వేంకటపతి, లింగముకుంట రామకవి మొదలగువారు ముఖ్యులు. వీరందరూ కూడ నెల్లూరి ప్రాంతమువారే! 16వ శతాబ్ది పరిసరము వారే. వీరందరికీ వేంకటేశ్వర స్వామి కలలో కాన్పించి యడిగిన మీదటనే తమ కృతులను తదంకితము చేసిరి.

ఈ మూక ఉమ్మడిమార్పునకు మూడు కారణము లూహింపవచ్చును. ఒకటి: కృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదను వేంకటేశ్వరాంకితము చేయుటవలన, తక్కిన వారా మార్గమున కాకర్షింపబడుట. వేంకటేశ్వరాంకితమైన తొలి తెలుగు ప్రబంధ మిదియే. రెండు: వేంకటేశ్వర భక్తుడగు వేంకటనాథుడు తన పంచతంత్రమును హరిహర నాథాంకితము చేయుటలోని మర్మ మెఱిగిన వారగుట. మూడు: లింగముకుంట రామకవి కాశీక్షేత్ర మహిమను గూర్చి వర్ణించిన "ఆనంద కాననము" అను కావ్యమును వేంకటేశ్వర స్వామికి అంకితమిచ్చి తిరుపతి హరిహర క్షేత్రమను విషయమును స్థాపించుట. ఈ మూడింటి యాంతర్యమును గ్రహించిన ఈ కవులందరూ ఒక సమన్వయ విధానముతో వేంకటేశ్వరాంకితులై పోయిరని భావింపవచ్చును. ఇదంతయు మన ఈవ్యాస విషయమునకు ప్రోద్బలము చేయుచున్నది!

"వ్యాసాదివచోవిభవ" ఇందలి ఆదిపదము
ఆదిశంకరులకు గ్రాహకము!

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారు ఉస్మానియా విశ్వవిద్యాలయము వారి సంశోధిత మహాభారతము, మూడవ సంపుటము నందు వ్రాసిన పీఠికలో నిట్లు సెలవిచ్చిరి : "Tikkana Somayaj did not mention Acharya Shankara though he is the latest exponent of the Philosophy of monism" మంచి, యాలోచనను రేకెత్తించు విచికిత్స యిది. మేధా మథనము చేయగా

చేయగా కారణమిట్లు స్ఫురించినది. తిక్కన తన హరిహరనాథ పద్యములలో "వ్యాసాది వచోవిభవ" "వ్యాసాది ముని ప్రోక్త" ఇత్యాదిగా 'ఆది' శబ్దమును ప్రయోగించెను. దీనికి వ్యాసుడు ఆదిగాగల వారు అని యర్థము చెప్పవలెను. కాని ఏలనో ఇది చప్పున ఆది శంకరులను స్ఫురింప జేయుచున్నది. కావున ఇది ఆది శంకరులకు గ్రాహకము అని. వ్యాస వచస్సనగా బ్రహ్మ సూత్రములు. వీటికి భాష్యము వ్రాసినవారు శంకరులు. బ్రహ్మసూత్రములందే పరతత్త్వము నిర్దేశింపబడినదో ఆ పదార్థమే తిక్కనగారికి లక్ష్యమైన హరిహరనాథ తత్త్వము. తెలుగు దేశమునకు సంబంధించినంతవఱకు వ్యాస శంకర విద్యారణ్యులకు వారసుడు తిక్కన. అట్లయ్యును సూత్రకారుడైన వ్యాసుని స్మరించెనే గాని భాష్యకారుడైన శంకరులను కంఠోక్తిగా స్మరింపక 'ఆది' పదముచే భంగ్యంతరముగ సూచించినాడు. తిక్కన వ్యాస భారతమును అనువదించుచున్నాడు గాన నాతనిని స్మరింపక తప్పదు. ఈ దృష్టితో శంకరులిక్కడ అప్రస్తుతము గదా? రామానుజులు సైతము వ్యాస సూత్రములకు భాష్యము వ్రాసిరి. కావున ఆది పదముచే వారినిగూడ గ్రహింపవచ్చును.

ఇట్లు తిక్కన ప్రయోగించిన 'ఆది' పదములో స్థానము సంపాదించు కొన్న శంకర రామానుజు లిరువురకూ తిక్కన ఆరాధ్యదైవమైన తిరుపతి వేంకటేశ్వరునితో అనుబంధముండుట ప్రధానముగ గమనింప వలసిన విషయము. రామానుజులు వేంకటేశ్వరులను విష్ణువుగా మార్పించినను స్వామి హరిహరనాథ స్వరూపమును, తత్త్వమును పూర్తిగా తుడిచిపెట్టలేదని వెనుక నిర్ధారించు కొంటిమి. స్వామికి యిప్పటికినీ జట లున్నవట! నాగాభరణము లుండనే యున్నవి. బిల్వపత్రార్చన మిప్పటికినీ జరుగుచున్నది. సహస్రనామార్చనలో "విరూపాక్షాయ" "కపర్దినే" యనునవి కూడ నిలిచియున్నవి. "వేంకటేశ్వర"లో ఈశ్వరశబ్దముండనే యున్నది. శైవసంప్రదాయమున కను కూలముగ శరన్నవరాత్రములలోనే బ్రహ్మోత్సవములు జరుగుచున్నవి. ఇక భక్తకోటులు శైవ వైష్ణవ భేదమును పాటింపక భక్తికొలది, శక్తికొలది మాటి మాటికిని వెళ్ళి స్వామిని సేవించి కృతార్థులగుచున్నారు. పేయాళ్వారుల వేద ఋక్కు వంటి హరిహరనాథ పాశుర మహిమయు, శంకరుల శ్రీ చక్రప్రభావమును, రామానుజుల సత్యదృష్టియు నీ క్షేత్రమునకు శ్రీరామ రక్షగా నిలిచియున్నవి!

వేంకటేశ్వరుడే తిక్కన హరిహర నాథుడా!

ఇట్లు వ్యాసప్రోక్తములైన బ్రహ్మసూత్రములందు ప్రతిపాదితమైన నిర్గుణ నిరాకార పరతత్త్వము, ఆరాధనార్థము సగుణము సాకారమునైన హరిహర రూపమున వేంకటేశ్వరునియందు ప్రతిబింబించుచూ "కలౌ వేంకటనాయకః" అన బరగు నాంధ్రుల యిలవేల్పుకే 'ఆంధ్రావళి మోదముం బొరయ" నాంధ్ర మహా భారతమును రచించి తిక్కన కృతి నిచ్చినది! ఏమీ! తిరుపతి వేంకటేశ్వరుడే తిక్కనగారి హరిహరనాథుడా! ఔను! తిరుపతి వేంకటేశ్వరుడే తిక్కనగారి హరిహర నాథుడు!

---

"స్రవంతి" తెలుగు సాహిత్య మాసపత్రిక
దక్షిణభారత హిందీప్రచార సభ–ఆంధ్ర
ఖైరతాబాదు, హైదరాబాదు ప్రచురణ,
సంపుటము : 25 సంచిక : 2 మే 1978
సంపుటము : 25 సంచిక : 3 జూన్ 1978

తిరుమల వేంకటనాథుడే

# తిక్కనగారి హరిహర నాథుడు!

తిక్కన తన భారతమును అంకితమిచ్చిన హరిహరనాథుడు తిరుమల వేంకట నాథుడే. అప్పటికి నెల్లూరులో హరిహరనాథాలయములేదు. ఆ తరువాత ఒక చిన్న దేవళము వెలసియుండును. ఇప్పుడదియును కానరాదు.

క్రీ.శ. 7వ శతాబ్ది ఉత్తరార్థమున ఆళ్వారులలో మొదటివారగు పొయ్‌గై ఆళ్వారు, మూడవవారగు పేయాళ్వారు, తిరుమల స్వామిని సేవించి కొన్ని పాశురములను గానము చేసిరి. మొదల్‌తిరువన్దాదిలో పొయ్‌గై చెప్పిన 5, 74, 98 పాశురములు స్వామిని హరిహర స్వరూపుడుగ సూచించినవి. వీని వివరములు చివరికి పేర్కొనబడును. పేయాళ్వారు మూడవ తిరువన్దాదిలో చెప్పిన 63వ పాశురము హరిహర రూపుడేయని నిర్ద్వంద్వముగ ప్రకటించినది:

"తాయ్‌శడైయుమ్ నీళ్‌ముడియుమ్ ఒణ్మయవుమ్ శక్కరముమ్
శూయరవుమ్ పొన్నాణుమ్ తోన్టుమాల్ — శూయమ్
తిరణ్డరువిపాయుమ్ తిరుమలై మేలెన్దైక్కు
ఇరణ్డురువు మొన్డాయిశైందు".

చుట్టునూపారుచున్న సమృద్ధములైన కొండకాలువలు ప్రవహించుచున్న తిరుమల యందుండెడు స్వామికి వ్రేలుచున్నజటలును, పొడుగైన కిరీటమును- సుందరమైన గొడ్డలియు (శూలము అనికూడ,) చక్రంబును- నడుముకు చుట్టుకొనియున్న సర్పంబును, బంగరు మొలత్రాడును- ఈరెండు హరిహర రూపములుచేరి ఒకటియై కాన్పించుచున్నాడు! ఆశ్చర్యము!

ఇందుతొలుత శైవచిహ్నములను; మలుత వైష్ణవ చిహ్నములను చెప్పుట గమనింపవలెను. పొయ్‌గై చెప్పిన మూడు పాశురములలోకూడ నిట్లేయున్నవి. "తిరుమలై" అన్న నామ నిర్దేశముచేసిన వారీ పేయాళ్వారే. ఇంతకుముందు వేంగడమన్న దే ప్రసిద్ధి. ఈ యిర్వురు ఇట్లు చెప్పుటకుముందు స్వామిస్వరూప మెట్లుండెనో

తెలియరాదు. తొల్కాప్పియమున వేంగడముయొక్క ప్రసక్తి యున్నదిగాని స్వామి ప్రసక్తి లేదు. క్రీ.శ. 750 నాటిదగు "శిలప్పదిగారము"న విష్ణువుగా చెప్పబడిననూ ఇది యీ యాళ్వారులకు పిమ్మటిదగుట వలన విషయ నిర్ణయమునకుపకరించదు. ఈ నాల్గు పాశురములను మినహాయించి, తక్కిన వానిలో ఈ యిద్దరుగాని, తరువాతి యాళ్వారులుగాని యీదేవుని విష్ణువుగనే భావించిరి. తమకు సహజమగు విష్ణు భక్తితో ఈ మూర్తి యందలి శైవ చిహ్నములను పట్టించుకొనక, ఏకదేశిగా విష్ణు చిహ్నములనే గ్రహించి యిట్లు చేసిరని భావింపవలసి యున్నది.

క్రీ.శ. 8వ శతాబ్దిలో శ్రీ శంకరులు ద్వాదశలింగస్తోత్రమున శ్రీశైలమును గూర్చి స్తుతించిన సందర్భమున లభించుచున్న ఈ క్రింది పాఠాంతరము సుప్రసిద్ధము:

"శ్రీశైల శృంగే వివిధ ప్రసంగే శేషాద్రి శృంగేఽపి సదావసంతం
తమర్జునం మల్లిక పూర్వమేనం నమామి సంసార సముద్రసేతుమ్"

దీనినిబట్టి శంకరులనాటికి తిరుమల శైవ ప్రధాన క్షేత్రమై యుండుననికొందరు అందురు. ఈ శ్లోకమును ఎవరో వ్రాసి శంకరుల కంటగట్టినదనుకొన్ననూ అనాదొక వర్గమువారి యభిప్రాయమున కిది యద్దముపట్టుచున్నదనుకొనుట చెల్లును. కాని యిందు మిక్కిలి మెలకువతో ప్రయోగింపబడిన 'అపి' శబ్దమును బట్టి వీరు సైతము ఈ మూర్తియందలి శైవ చిహ్నములనే యేకదేశిగాగ్రహించి యిట్లు చెప్పియుందురనుట లెస్స. శంకరులు కర్ణాటకమునందలి హరిహర క్షేత్రమును మెట్టి యాదేవుని శివ విష్ణు పరములుగనర్థము వచ్చునట్లు స్తుతించిన పదిశ్లోకములు శంకరచరిత్రలో నున్నవి. తిరుమలస్వామికూడ హరిహరరూపుడై యుండుట కచ్చెటువంది వారు యిట్లు చెప్పియుందురని తోచుచున్నది. శంకరుల యీ హరిహరాద్వైత తత్త్వముకూడ తిక్కనకు మార్గదర్శకమైయుండుననుట నిష్కర్ష.

ఇదిట్లుండ, అసలీమూర్తి ఆదినుండియు 'బాలా' అను స్త్రీ బింబమని కొందఱు, వీరభద్రుడు, కుమారస్వామి యని మఱి కొందఱు భావించినట్లు ఎన్నో గ్రంథములు వాకొనుచున్నవి.

క్రీ.శ. 11వ శతాబ్దమున భగవద్రామానుజులనాటికి ఈదేవుడు శివుడా,

విష్ణువా, అన్న తగాదామిన్నుముట్టెను. శ్రీరామానుజులు వైష్ణవులకు నాయకత్వము వహించి ఆళ్వారుల వర్ణనలను ఊతగాగొని, తమకుగల రాజ ప్రాబల్యమునుపయోగించి తిరుమలేశుని విష్ణువుగా తీర్మానించినట్లు కొండంత సాక్ష్యము గ్రంథస్థమై యున్నది. ఈ సాక్ష్యమంతటినీ గర్భీకరించుకొన్న ఈ శ్లోకమునరయుడు:-

శ్రీవేంకటేశకరధారితశంఖచక్రః వక్షస్థలార్పితరమః కలితాగమార్థః
సంస్థాపితాఖిలతదాలయసంవిధానః రామానుజోవిజయతేయతిరాజరాజః

రామానుజకృత వేదార్థ సంగ్రహః
తిరుమలతిరుపతిదేవస్థానం ప్రచురణ 1953.

ఇట్లుచేసిననూ, మూలరూపమగు హరిహరాత్మకతకు రామానుజులు భంగమురానీయలేదు. పేయాళ్వారుల పాశురానుసారము నడుముకు చుట్టుకొనియున్న సర్పమును హస్తము నలంకరింపజేసి యా తత్త్వమును కాపాడిరి. వారు తలచుకొన్నచో దివ్యప్రబంధము నుండి ఈ పాశురమునుగాని, స్వామి యందలి నాగాభరణమునుగాని తొలగించుట లెక్కగాదు. వేదబుక్కులవంటి యాళ్వారుల వాక్కులు వారికి శిరోధార్యములైనవి. ఇదంతయు శ్రీరామానుజుల సత్యబుద్ధికి నిదర్శనము.

తిక్కన ఏడుకొండల హరిహరనాథుని ఈ పూర్వచరిత్రనంతయు నొకక్రమ పద్ధతిలో నైదంశములుగ విభజించుకొని ఈ పద్యమున నిట్లు పుక్కిట బట్టినాడు:

ఉ. శ్రీయన గౌరినాబరగు చెల్వకు జిత్తము పల్లవింప భ
ద్రాయిత మూర్తియై హరిహరంబగురూపము దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయితకిచ్చమెచ్చు పర తత్త్వము గొల్చెద నిష్టసిద్ధికిన్ (విరాట1-1)

1. శ్రీ – ఇది లక్ష్మియను సామాన్యార్థముననేగాక శ్రీవిద్యయందు ప్రతిపాదింపబడిన బాలాత్రిపురసుందరీదేవికి సంకేతమై 'బాలాజీ' చరిత్రను సూచించుచున్నది.

2. శ్రీయనగౌరి నాబరగు .......... భద్రాయితమూర్తియై – ఇచ్చట 'భద్ర' శబ్దము వీరభద్రుని సూచించుచూ కుమారస్వామికి కూడ ఉపలక్షకముగ నున్నది. "భద్రఇవ ఆచరితామూర్తిః యస్యసః" అని దీనికి విగ్రహము చెప్పవలెను. వీరభద్రుడుగాని, కుమారస్వామి గాని తల్లి యగు గౌరీ చిత్తమును పల్లవింపచేయుట సహజమే. మఱి'శ్రీ' కెట్లు? అందురా? భారతమునందలి వనపర్వములోని కుమారస్వామియవతార

తిరుమల వేంకటనాథుడే తిక్కన హరిహరనాథుడు!

ఘట్టమున ఆతని పరాక్రమమునకు మెచ్చి చిత్తము పల్లవింపగా శ్రీదేవి సాక్షాత్తరించి దీవించిన సందర్భమును స్మరింపవలెను. 3. 'శ్రీయన గౌరినాబరగు .... హరి హరం బగు రూపము దాల్చి'- వేంకట నాథుడు విష్ణువేయైనచో శ్రీచిత్తమును, శివుడైనచో గౌరీ చిత్తమును, హరిహర మూర్తియైనచో నిరువురి చిత్తములను పల్లవింపజేయును. 4. 'విష్ణురూపాయ నమశ్శివాయ' - విష్ణురూపునకూ, శివునకూ నమస్కార మనియు, ఇప్పుడు విష్ణురూపుడైన వెనుకటి శివునకు నమస్కారమనియు, ఇప్పుడు విష్ణురూపములో నున్నను శివుడుగా కూడ కాన్పించువానికి నమస్కారమనియు దీనికి మూడర్థములు చెప్పవలెను. 5. "అనిపల్కెడు .............. నిష్టసిద్ధికిన్" - అనిపలుకు భక్తులగు జనులు భావించు వేద విహిత ధ్యానమునకు అంతరంగమున శ్లాఘించునట్టి పరతత్త్వవాచ్యుడగు పరమేశ్వరుని సేవింపవలెనన్నది యిందలి పరమార్థము. అనగా సర్వదేవతాస్వరూపుడైన వేంకటనాథగత పరతత్త్వమును భావింపవలెననుట. హరిహరనాథుడనగా హరిహరుల కతీతుడగు పరతత్త్వవాచ్యు డని పండితులు అర్థముచెప్పుటలోని యాంతర్యమిదియే. సూక్ష్మరూపముననున్న ఈపద్యభావము యొక్క విరాట్స్వరూపమును ఈ కవియొక్క రెండు వందల హరి హరనాథ పద్యములలో కాననగును.

తెలుగుసాహిత్యమున వేంకటనాథుని కంఠోక్తిగా ప్రశంసించిన తొలిగ్రంథము ఎఱ్ఱన నృసింహపురాణము. ఇందుప్రథమాశ్వాసప్రారంభమున గాలవమహర్షిచేసిన తీర్థ యాత్రల పట్టికలో తిరుమలకూడ నున్నది. "వేంకటాచలస్థాయిగొలిచె"(పద్యం 11). "ఇట్లు పరిపాటిం బ్రసిద్ధంబులగు తీర్థంబులాడుచు" (వచనం 12) కాగా, ఎఱ్ఱన కేబదేండ్లు మాత్రమే పూర్వుడైన తిక్కననాటికిది సుప్రసిద్ధమనుట స్పష్టము. మఱి తిక్కన దృష్టికెట్లు రాకుండును? అసలు తిక్కన హరిహరు డెవరో ఎఱ్ఱనకు తెలుసు.

నెల్లూరు తెలుగు చోడరాజ్యములో తిరుపతి కూడ నంతర్భాగమైయుండునా? అన్న విచికిత్సపుట్టకమానదు. కాని యీ రాజులకుగాని, వీరికి తలలోని నాల్కయగు తిక్కనకు గాని తిరుమలతోగల సంబంధమెట్టిదో స్పష్టపడుటలేదు. నిర్వచనోత్తర పీఠికలోని కొన్ని ఘట్టములను బట్టి అప్రాంతపు భౌగోళిక పరిస్థితులు, చారిత్ర కాంశములు తిక్కనకు కరతలామలకములే. ఈ రాజ్యపు హారసత్వమునకై కీచు లాడినవారు తిక్కనగారి మనుమసిద్ధియు, బయ్యన అనువారలు. ఈ బయ్యన ఏ విధ

ముగా వారసుడో తెలియరాదు. కాని మనుమసిద్ధికి వీరగండగోపాలుడనియు బయ్యనకు విజయ గండగోపాలుడనియు ఒకే రకపు బిరుదు లుండుట చిత్రము. ఈ విజయగండగోపాలుడు తఱచు తిరుమలస్వామిని సేవించుచుండెనని చరిత్ర. ఈతడు 1253లో తిరుపతి గోవిందరాజస్వామి యాలయమున తిరుమోలి, తిరుప్పావై దివ్య ప్రబంధముల పఠనమును తొలిసారిగ ప్రవేశపెట్టి, ఒక ధర్మనిధినికూడ ఏర్పాటు చేసెను. దీనికి "గండ గోపాలన్ మాడై అని పేరు (శాసనం I-741). కాలహేతు సరణులనుబట్టి ఈ ప్రబంధపఠన ప్రారంభోత్సవము సరిగ్గా తిక్కనగారి కళ్లయెదు టనేజరిగియుండును. ఇది దృష్టియందుంచుకొనియే తిక్కన "ఈ దృశంబులగు పుణ్య ప్రబంధములు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్క యారాధనా విశేషంబు" అని చెప్పినట్లు భావింపవచ్చును.

తిక్కనగారి ఈ "పుణ్యప్రబంధములు," "ప్రబంధమండలి" అన్న ప్రయోగములు ఆళ్వారుల దివ్యప్రబంధములను స్ఫురింపించుచున్నవి. ఈ రెండింటికీ నామసామ్య ముతోబాటు విషయ సామ్యముగూడ నున్నది. ఆ ప్రబంధములు వేదమంత్రముల వంటివి. పుణ్యప్రబంధమగు భారతము పంచమవేదమే. ఆప్రబంధములు భక్తి రూప మున జ్ఞానమును ప్రబోధించినవి. భారతము కర్మజ్ఞాన రూపమున వేదార్థమంతయు బోధించినది. దివ్యశబ్దము తిరుశబ్దమువంటిది. వైష్ణవాలయములందు నిత్యదైవా రాధనమున దివ్యప్రబంధ పఠనమొక యారాధనా విశేషముగ చెప్పబడినది. అసలు రామానుజులవారే తిరుపతిక్షేత్రమున దివ్యప్రబంధపఠనమును ప్రవేశపెట్టి యుందు రని భావించుటకు ఆధారములున్నవి. అది నేటికినీ జరుగుచునేయున్నది. కాగా పుణ్యప్రబంధ మనునది దివ్యప్రబంధమునకు దగ్గరగానున్నదనుట స్పష్టము. (ఇది డా. కేతవరపు రామకోటిశాస్త్రిగారి యభిప్రాయము. వీరికి కృతజ్ఞతలు)

ద్రోణపర్వమునందలి యర్జున స్వప్నమే అచ్చు విరాటమునందలి తిక్కన స్వప్నము. "ఈ ప్రబంధమండలిక ధినాథునిగా నే పురుషుని పేర్కొను వాడనో యను తలంపు గూరిన మదితోనించుక నిద్రించు సమయమున" తిక్కన కీకల వచ్చి నది. ఇందుకొన్ని ముఖ్యాంశము లున్నవి:

కొమ్మన తిక్కనతో "కిమస్మిమాలాం" అని నీవు 'తొల్లి' రచియించిన పద్యంబునవధరించి వీడె హరిహర నాథుడని....చూపించును. దీనినిబట్టి యీ శ్లోకము

తిరుమల వేంకటనాథుడే తిక్కన హరిహర నాథుడు।
భారత రచనకు పూర్వమెప్పుడో వ్రాసినదనుట స్పష్టము. ఇక్కడ 'తొల్లి' యనగా తిక్కన తిరుమలనాథుని సేవించి నపుడేయని భావింపవలెను. పేయాళ్వారు వేంక టేశ్వరుని చూసి ఆశ్చర్యముతో చెప్పిన హరిహరనాథపాశురమువలె తిక్కన ఏడు కొండల వానిని చూచినపుడు భక్తిపారవశ్యముతో ఎదకరిగి ప్రవహించిన సెలయేరీ శ్లోకము. ఆ పాశురమునందువలె నిందుకూడ తొలుత శైవచిహ్నములే యుండుట గమ నార్హము. దానికి ప్రతిబింబమే యిది. స్వామి చరిత్ర నిర్ణయములో నీరెండింటికి మిక్కిలి కీలకమైన స్థానమున్నది.

హరిహరనాథుడు సరాసరి తిక్కనదగ్గఱకురాలేదు. ముందు నాకలోకనివాసి యయిన తండ్రి కొమ్మనను ఆకర్షించి కొలిపించుకొని వెంట బెట్టుకొని మరీవచ్చెను. తిక్కన "అంజలి ఘటించి నయనంబులు, నవయవంబులు ప్రమద బాష్పసలిల విలులితంబులును పులక పటలపరికలితంబులునుంగా నంతనద్దేవునికని" నిలిచెను. తరువాత చెప్పిన "ఉపలాలితుండగు డింభకుండు" అన్న వాక్యమును ఇక్కడ నను సంధించుకొనవలెను. ఇదీ దృశ్యము. అసలీహరిహరనాథునకు, కొమ్మనకూగల పూర్వసంబంధమెట్టిది? ఇది మామూలుగా మనమనుకొన్నట్లు తిక్కనతోనేకాక తండ్రి తరమునుండియు ప్రారంభమైన సంబంధమన్నమాట. అప్పుడీ హరిహరనాథు డెవ్వరై యుండును? వేంకటనాథుడే యనుట నిష్కర్ష. తిక్కన తొట్టతొలుత, బాలుడుగా నున్నపుడు తండ్రివెంటవెళ్లి తిరుమల స్వామిని సేవించియుండును. అయానందాను భూతులే యిక్కడ వ్యక్తమైనవి. నిత్యజీవితమున జరిగిన సంఘటనలే స్వప్నములుగ పరిణమించునన్న సిద్ధాంతము శాస్త్రీయమైనచో సరిగా నిక్కడ జరిగినదదియే.

అర్జునుడు కృష్ణుని వెంట కైలాసమునకుపోయి హరిహరలక్షణలక్షితుడగు నాదేవుని దర్శించి, స్తుతించి, కృష్ణుని 'రికమండేషన్'తో పాశుపతమునుపొందెను. దీనికి వ్యతిక్రమముగా హరిహరనాథుడే కొమ్మనతోకలిసి తిక్కన కడకువచ్చి ప్రశంసించి, ఉపలాలించి "కృతి పతిత్వమర్థించి వచ్చితి తిక్కశర్మ" అని నోరార అడిగి కొమ్మన రికమండేషన్‌తో భారతమునుపొందెను. ఇదీ కథ. విశేషమేమన భారతము నందు ప్రతిపాదింపబడిన అలౌకికమగు హరిహర తత్త్వము లౌకికముగ వేంకట నాయక నిష్ఠమై తిక్కనకు స్వానుభవములోనుండుట. ఇది కాకతాళీయముగ జరి గిన నద్భుతమగు చారిత్రకసత్యము. దేశమున చెలరేగిన శైవవైష్ణవుల విద్వేషము

లను చల్లార్చుటకు తిక్కన ఈ హరిహర తత్త్వమును ప్రతిపాదించెనందురు. అదెట్లున్ననూ, ప్రత్యేకించి చెప్పవలెనన్న వేంకటేశ్వరుల మూర్తి విషయమున రగిలిన విద్వేషముల విషాదగాథనుమనసు నందుంచుకొని, ఆతనినేకృతిపతిగ స్వీకరించి ఈ తత్త్వమును ప్రతిపాదించెనని భావించుట సమంజసము. అందువలన "ఈదృశంబులగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుట" అన్నమాటలను బట్టి యీతడు భారత రచనను తిరుమల యందే ప్రారంభించియుండును. ఒకనాటి పనికాదుగదా, పిమ్మట నాదేవుని అంతస్సన్నిధింగల్పించుకొని నెల్లూరి రాజసౌధమున కొనసాగించి యుండును. ముగింపు వేళకు తిరుమలకువచ్చి "హరిహరనాథ సర్వభువనార్చితనన్ దయజూడు మెప్పుడున్" అనిపలికి చేతులు కడిగికొనియుండును. ఆళ్వారుల వేంకటనాథపాశురములు 215. తిక్కన హరిహరనాథ పద్యములు 200. వారివలె నీతడు కూడ ఈ పద్యములను స్వామి సాన్నిధ్యమున గానముచేసియుండెనా, అన్న కుతూహలము రేకెత్తును.

పేయాళ్వారుల పాశురమున వేంకటేశ్వరులకు చెప్పిన విష్ణుచిహ్నములలో చక్రమును చెప్పెనేగాని శంఖమును చెప్పలేదు. పొయ్‌గైయాళ్వారుల 5 వ పాశురములోగూడ నిట్లేయున్నది. ఆమాట కొచ్చిన, తిక్కన యాళ్వారులుగూడ చక్రమునకిచ్చిన ప్రాధాన్యమును శంఖమునకివ్వలేదు. తిక్కన పేయాళ్వారులను ప్రమాణముగ స్వీకరించి తన 200 పద్యములలో ఎన్నోమాఱులు చక్రమును చెప్పెనేగాని శంఖమును బొత్తిగా చెప్పలేదు. ఒక్కచోట నైననూచెప్పవచ్చునే. తిక్కన నాటికి వేంకటేశ్వరుని యందు రామానుజులు తొడిగించిన శంఖమున్నదే! ఇప్పట్టున తిక్కనగారి యాంతర్యమును మఱింత విడమఱచి చెప్పబనిలేదు. ఇంతకంటెను ప్రబలమైన సాక్ష్యమేమున్నది, విషయమును నిరూపించుటకు!

తిక్కనగారి 200 పద్యములలో దాదాపు 150 పద్యములు కేవలము పరతత్త్వ బోధకములే. 50 పద్యములలో కాబోలు హరిహరుల కన్వయింపగల లక్షణములనో అంశములనో ప్రతిపాదించినాడు. ఈ ఏబదిలో కొన్ని లక్షణములు, భావములు పునరావృత్తమౌచుండుట తప్పనిసరి. ఈ లక్షణమును, భావములను తిక్కన మూడవవారగు పేయాళ్వారుల 63వ పాశురమునుండియు, మొదటివారగు పొయ్‌గైయాళ్వారుల 5, 74, 98, పాశురములనుండియు సంగ్రహించినట్లు తోచు

తిరుమల వేంకటనాథుడే తిక్కన హరిహర నాథుడు!

చున్నది. పేయాళ్వారుల పాశురవిషయము పూర్వోక్తము. ఇప్పుడు పొయ్ గై యాళ్వారుల పాశురములనుండి గ్రహించిన విధమును పరిశీలింతము:—

"అరన్ నారణన్ నామమ్ ఆళ్ విడై పుళ్ళూర్ది
ఉరైనూల్ మఱైయుఱై యుమ్ కోయిల్ — వరై నీర్
కరుమమ్ అ ....ప్పు అళిప్పు కైయ్యదు వేల్ నేమి
ఉరువ మెరికార్ మేని యెన్ను" ॥5॥

ఒకరు హరుడు మఱొకరు నారాయణుడు. ఒకరెద్దును, మఱొకరు గరుత్మంతుని యెక్కుదురు. ఒకరు ఆగమములను, మఱొకరు వేదములను ప్రసాదించెను. ఒకరు పర్వతమునందు, మఱొకరు పాలసముద్రమునందు నివసింతురు. ఒకరు లయమునకు, మఱొకరు స్థితికి కారకులు. ఒకరు శూలమును, మఱొకరు చక్రమును ధరింతురు. ఒకరు అగ్నివర్ణుడు, మఱొకరు నీలగగనవర్ణుడు.

ఏ........న్ పుళ్ ఊర్ న్దాన్ ఎయిలెరిత్తాన్ మార్విడన్దాన్
వీ........ఞ ని........ల్ మణి వణ్ణత్తాన్— కూ........రుపాల్
మజ్గైయాన్ పూమగళాన్ వాన్ శడై యాన్ నీళ్ ముడియాన్
గజ్గైయాన్ నీళ్ క........లాన్ కాప్పు (74)

ఒకరెద్దును, రెండవవారు గరుడుని ఎక్కుదురు. ఒకరు త్రిపురాసురుని, రెండవవారు హిరణ్యకశిపుని సంహరించిరి. ఒకరు భస్మమును ధరింతురు, రెండవవారు నీలాకాశవర్ణుడు. ఒకరు భార్యనుదేహార్థభాగమునను, రెండవవారు వక్షస్థలపద్మమునందును ధరింతురు. ఒకరు పొడుగైన జటలను, రెండవవారు ఎత్తైన కిరీటమును తాల్తురు. ఒకరు గంగను శిరస్సునను! రెండవవారు పాదములందును ధరింతురు.

పోన్ తిగ.... మేనిప్పురిశడైయమ్ పుణ్ణియనుమ్
నిన్రులగమ్ తాయనెడుమాలుమ్ — ఎన్రుమ్
ఇరువరఙ్గ త్తాల్ తిరివ రేనుమ్ ఒరువన్
ఒరువనఙ్గ త్తుఎన్రు ముళన్ (98)

స్వర్ణమయదేహకాంతి గలిగి జటలు దాల్చిన శివుడును, విష్ణువును ఈభూమిపై అవతరించిన వేఱువేఱు దేవతలనుకొందుముగాని యిర్వురు నొకరే. ఒకరియందొకరు వసింతురు.

విషయము స్పష్టము. ఇక తిక్కన ఆ భావములను అనుసరించిన విధమునరయుడు. మచ్చునకు కొన్ని మాత్రమే ఉదాహరింప బడుచున్నవి:-

1. వాహనీకృతోజ్జ్వల గరుడ వృషభ — ద్రోణ 3 — 109.
2. నగశరధినివాసానంద సంస్తుత్యమాసా — విరాట 5 — 407.
3. శ్రీకర భక్తాంభోధిసుధాకర చక్రత్రిశూల ధారణ — ద్రోణ 2 — 1.
4. శ్రీసంశ్రయ మంగళగౌరీసంగమవిభవపుణ్యరేఖా సంప
ద్భాసిత వక్షోవామాంగా సూ.లిత చిత్రమహిమ హరిహరనాథా!-ద్రోణ-1-1.
5. హరిహరనాథునకు మరుత్సరిదాకల్పితమనోజ్ఞచరణ శిరస్సుం
దరమూర్తికి భావన తత్పర చేతోయుక్త భక్త పరతంత్రునకున్- విరాట-36
ఈ కట్టుబడుల వరుసలో
6. వనమాలికాభుజంగాభరణా — విరాట 1-86
7. భుజగ సమాచరిత శయన భూషణకృత్యా — విరాట 1 — 39

మొదలైనవి మఱికొన్ని యున్నవి. ఇవికూడ ఆ యా ఆళ్వారుల పాశుర ములను చదువుటవలన కలిగిన స్ఫూర్తితో కల్పించుకొన్నవే గాని తిక్కన స్వోపజ్ఞము లనుటకు వీలులేదు.

బైచరాజు వేంకటనాథుడు గొప్ప వేంకటేశ్వర భక్తుడు. ఈతని తండ్రి వంశమువారు, తల్లి వంశమువారు వంశపారంపర్యముగ వేంకటేశ్వరుని భక్తులు. మాతామహ పితామహులు వేంకటేశ్వరునికి ధర్మము లొసగిరని యనేక శిలాశాసనములు తెలుపుచున్నవి. ఈతని గురువగు తిరుమలాచార్యులుకూడ గొప్ప వేంకటేశ్వర భక్తుడే. ఇట్లు మాతామహ, పితామహ, గురువంశములనుండి పారంపర్యముగ సంక్రమించిన వేంకటేశ్వర భక్తి రక్తమున జీర్ణించిన యీతడు తన పంచతంత్రము హరిహర నాథాంకితము చేసెననగా వేంకటేశ్వరాంకితము చేసెననియే యర్థము. "ఏచనవు గలదు హరిహర సాచివ్యమునంద నన్యజనులకు మదినాలోచింప తిక్కయజ్వకు నాచన సోమునకును మఱియు నాకున్ దక్కన్" అని యీతని యహంకారము! ఈతనికిగల చనువు వేంకటేశ్వరునితోనే గాని మరొకరితో నుండుట కవకాశము మృగ్యము. తిక్కనకుకూడ వేంకటేశ్వరునితోగల చనువెట్టిదో కొమ్మననాటి నుండి తిక్కనవరకుగల యంశములను పరామర్శించి తెలిసికొంటిమి.

తిరుమల వేంకటనాథుడే తిక్కన హరిహరనాథుడు।

ఈ పద్యమున "చనవు" అను దళముతోబాటు "మదినాలోచింప" అన్న దళముగూడ మిక్కిలి కీలకమైనది. అంతర్యమేమనగా వేంకటనాథుడే మా ముప్వురి హరిహర నాథుడని యాతని సూచన. ఎఱ్ఱనకు, సోమునకు, బైచరాజునకూ, తిక్కనగారి హరిహరనాథు డెవరో తెలుసు. ఈ రహస్య మిప్పటికి బహిర్గతమైనది. ఇట్టి యింకెన్నియో ఉపపత్తులను బట్టి తిరుమల వేంకటనాథుడే తిక్కనగారి హరిహర నాథుడనుట నిష్కర్ష.

శ్రీనివాసాయ మంగళమ్

---

1981 జూన్ 13, 14 15 తేదీలలో తిరుపతిలో జరిగిన ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్సు మూడవ సెషన్‌లో నిర్వహింపబడిన "శ్రీనివాసా స్టడీస్" అను సదస్సులో చదివిన వ్యాసమిది.

Andhra Pradesh Oriental Conference
Third Session, June 13,14, 15, 1981
"SOUVENIR"
Tirumala Tirupati Devasthanams
Kendriya Sanskrit Vidyapeetham
TIRUPATI.
సంచికలో సంగ్రహముగ ప్రచురింపబడినది.

వేంకటేశ్వరతత్త్వమే

# తిక్కన హరిహరనాథ తత్త్వము

శ్రీయన గౌరినాబరగుచెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపముదాల్చి "విష్ణురూ
పాయ నమశ్శివాయ" యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయితకిచ్చమెచ్చు పరతత్త్వము గొల్చెద నిష్టసిద్ధికిన్ (విరాట 1-1)

ఈ పద్యమున తిక్కన యిమిడ్చిన వేంకటేశ్వరునియొక్క అయిదారు విధముల పూర్వచరిత్రనుగూర్చి వెనుకటి వ్యాసమున విశ్లేషణాత్మకముగ వివరింపబడినది. "విష్ణురూపాయ నమశ్శివాయ" అనుమంత్రమునకు మూడర్థములు చెప్పబడినవి. అయితే, "శివరూపాయ విష్ణవే నమః" అని శివోపసర్జనకముగా గాక "విష్ణురూపాయ నమశ్శివాయ" అని విష్ణూపసర్జనకమగు మంత్రమును గ్రహించుటలోఁగల తిక్కనగారి అంతర్యమేమి? అన్నదొక విచికిత్స. దీనికి సమాధానము ఈ మంత్రమునకు వెనుక మనము చెప్పుకొన్న మూడర్థములలోనే గతార్థ మగును. అయినను స్పష్ట ప్రతిపత్తికొఱకు పునశ్చర్వణము చేయబడుచున్నది: విష్ణురూపాయ=ఇప్పుడు విష్ణురూపుడైయున్న, శివాయ=ఒకప్పుడు శివుడైన వేంకటేశ్వరునకు, నమః=నమస్కారము; అని దీని నిశ్చితార్థము. ఇప్పుడుసైతము విష్ణురూపుడుగను, శివస్వరూపుడుగనుకూడ భాసించుచున్న వేంకటేశ్వరునకు నమస్కారము అనికూడ చెప్పనొప్పును.

తిక్కన వస్తుతః శివభక్తుడు. "మహేశ్వరాంఘ్రి కమలధ్యానైక శీలుండ" (నిర్వచన, 1-13). "చిత్తనిత్యస్థిత శివుడట" కేతనగారి వక్కణ. అట్లయ్యును స్మార్తుడు. శివ విష్ణు భేదములేని భక్తిగలవాడు. దీనికితోడు తండ్రి కొమ్మనామాత్యుని తరము నుండియు సాగివచ్చిన వేంకటేశ్వర విషయక హరిహరనాథ తత్త్వము ఈతనికి ఆరాధ్యమైనది. పేయాళ్వారు తన 63వ పాశురములో వేంక

వేంకటేశ్వరతత్త్వమే తిక్కన హరిహరనాథ తత్త్వము

టేశ్వరుల మూర్తియందలి "ప్రతీకా" లక్షణములలో తొలుత శైవచిహ్నములను మలుత వైష్ణవ చిహ్నములను పేర్కొనెను. దీనిననుసరించి తిక్కన "తొల్లి" చెప్పిన "కిమస్థిమాలాం" శ్లోకమునకూడ నల్లేచేసెను. దీనినిబట్టి ఆనాటి స్వామి యందలి "ప్రతీకా" లక్షణములలో ఉత్కట ఏకకోటితరముగ శైవచిహ్నములే ప్రాధాన్యము వహించియున్నవనుట నిష్కర్ష. ఇదీ, వస్తుస్థితి. ఈ వస్తుస్థితికి అనుగుణముగ తిక్కన తొలుత శివభక్తుడు. పరిణామక్రమమున హరిహరనాథభక్తుడు. ఇదంతయు దృష్టియందుంచుకొని ఆలోచించినచో "విష్ణురూపాయ నమశ్శివాయ" అని విష్ణ్వపసర్జనకమగు మంత్రమును వ్రాయుటలోగల ఆంతర్యము ఇట్టే అవగతము కాగలదు.

హరిహరనాథపద్యములలో

కొన్నిహరహరినాథపద్యములు

ఈ క్రమములో పేర్కొనవలసిన మఱొక ముఖ్యవిషయముకూడ నున్నది. తిక్కన వ్రాసిన దాదాపు రెండువందల హరిహరనాథ పద్యములలో అధికసంఖ్యాక పద్యములు హరిరూప వర్ణనతోనే ప్రారంభమగుట సాధారణనియమము. ఇదిట్లుండ, దీనికి భిన్నముగ నెడనెడ కొన్నిపద్యములు హరరూప వర్ణనతో ప్రారంభమగుట విశేషము. ఇందులో మఱొక చిత్రముకూడ నున్నది. ఇట్లు హరరూపవర్ణనతో ప్రారంభమైన పద్యములు క్రమాలంకారముననుసరించి అట్లే ముగియక వ్యుత్క్రమముల్తై ముగియుచుండును. ఈ మూడువిధములకు వరుసగా కొన్నియుదాహరణములుచూతము. అన్నియు విరాటపర్వమునుండియే ఉట్టంకింపబడుచున్నవి. దీనినిబట్టి యితర పర్వములలో తటస్థపడు పద్యములను పరిశీలించుట సులభము.

1\. ఉ. శ్రీయనగౌరినాబరగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయిత మూర్తియై హరిహరంబగు రూపముదాల్చి........

కం. హరిహరనాథునకు మరు
త్పరిదాకల్పిత మనోజ్ఞచరణ శిరస్సుం
దర తరమూర్తికి భావన త
త్పర చేతోయుక్త భక్త పరతంత్రునకున్.

ఇందలి మొదటిపద్యము 'శ్రీ'తో ప్రారంభమైనది. శ్రీకి హరి, గౌరికి

హరుడు అను క్రమాలంకారమున్నది. ఇట్లు ఇది హరిరూప వర్ణనతో ప్రారంభమైన పద్యము. ఇక రెండవ పద్యము సూటిగా హరిరూప వర్ణనతోనే ప్రారంభమైనది ఇట్టి పద్యములే అధికసంఖ్యాకములు.

2. కిమస్థిమాలాం కిముకౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసేత్వం
కిం కాలకూటః కిమువాయశోదాస్తన్యం
తవ స్వాదు వదప్రభోమే.

సీ॥ కరుణారసము పొంగి తొరగెడుచాడ్పున
శశిరేఖ నమృతంబు జాలువాఱ
హరినీల పాత్రిక సురభి చందనమున్న
గతి నాభి ధవళ పంకజము మెఱయ
గుఱియైన చెలువున నెఱసిన లోక ర
క్షణ మనంగ గళంబుఛాయ దోపఁ
బ్రథమాద్రిఁ దోతెంచు భానుబింబమునాను
రమ్మునఁ గౌస్తుభ రత్నమొప్ప
సురనదియుఁ గాళిందియు బెరసినట్టి
కాంతిపూరము శోభిల్లు శాంతమూర్తి
నామనంబు నానంద మగ్నముగఁ జేయ
నెలమిసన్నిధిసేసె సర్వేశ్వరుండు.

ఈ రెండుపద్యములు హరరూప వర్ణనతో ప్రారంభమైనవి.

3. కం॥ అజగవ శార్ఙ్గాలంకృత
భుజగర్వ నిరస్తదైత్య, భూమస్తుత్యా
త్రిజగద్ధారణ నిత్యా,
భుజగ సమాచరితశయన భూషణకృత్యా!

ఈ పద్యము మొదటిపాదమున హరచిహ్న వర్ణనముతో ప్రారంభమైనది. ఆ క్రమము ననుసరించి చివరి పాదమునకూడ హరచిహ్నవర్ణనముతో ప్రారంభము

వేంకటేశ్వరతత్త్వమే తిక్కన హరిహరనాథ తత్త్వము కావలసియుండెను; అట్లుకాలేదు. "అజగవాలంకృత-భుజగసమాచరితభూషణకృత్యా" అనియు, "శార్ఙ్గాలంకృత-భుజగసమాచరిత శయనకృత్యా" అనియు నొకక్రమములో నుండవలయును. అట్లుకాక, అజగవాలంకృత - భుజగసమాచరిత శయనకృత్యా అనియు, శార్ఙ్గాలంకృత - భుజగసమాచరిత భూషణకృత్యా, అనియు వ్రాయబడినది.

ఇట్లు ఈ మూడు విధములుగానేగాక మఱికొన్ని పద్ధతులలోకూడ క్రమమును తప్పించిన పద్యములుకూడ కొన్నిలేకపోలేదు. ఇట్లుచేయుటలోగల తిక్కనగారి అంతర్యమేమి? అన్న కుతూహలము పుట్టకమానదు, వరుసగా వీనికి సమాధాన మిది:

మొదటివిధమునకు- తిరుపతి వేంకటేశ్వరుడు హరిహరస్వరూపుడేయను నిశ్చయజ్ఞానము తిక్కనకున్నది. ఆ జ్ఞానముతోనే యీ పద్యములు వ్రాయదలచి నాడు. కాని తిక్కననాటికి వేంకటేశ్వరుడు విష్ణువుగా స్థిరపడినాడు. దానిని సవాలుచేయుట అపచారము. అసలు తిక్కన మనస్తత్వముకూడ అదికాదు. కావున వస్తుస్థితినిబట్టి అధికసంఖ్యాక పద్యములు హరిరూప వర్ణనతో ప్రారంభించినాడు.

రెండవవిధమునకు- వేంకటేశ్వరుడు ఒకప్పుడు వివిధరూపములతో విలసిల్లి నాడు. వానిలో శివస్వరూపమొకటి. ఆ విషయమును సూచించుటకు కొన్ని పద్యములను హరరూప వర్ణనతో ప్రారంభించినాడు.

మూడవవిధమునకు- ఒకప్పుడు వేంకటేశ్వరుడు హరిహరస్వరూపుడు. ఆయాచిహ్నములలో తరతమభేదములుండవచ్చును. ముందువెనుక లుండవచ్చును. ఆతత్త్వముయొక్క సామరస్యము ప్రధానము. అందువలన కొన్నిపద్యములనిట్లు వ్రాసినాడు.

## పద్యత్రయప్రాధాన్యము

తిక్కనగారి హరిహరనాథ పద్యములలో క్రమముగా "కిమస్థిమాలాం" "కరుణారసముపొంగి" "శ్రీయన గౌరి నాబరగు చెల్వకు" అను మూడు పద్యము లకు మిక్కిలి ప్రాధాన్యమున్నది. "కిమస్థిమాలాం" శ్లోకము భారత రచనకు పూర్వము "తొల్లి" తన తండ్రి కొమ్మనతో కలిసి గాని, ఒంటరిగా గాని తిరుమల స్వామిని సేవించి ఆ "మూర్తిని" దర్శించినప్పుడు కలిగిన అనుభూతితో వ్రాసినది. "కరుణారసము పొంగి" అను పద్యము వేంకటేశ్వరుడు తొలిసారి స్వప్నములో సాక్షాత్కరించినప్పుడు కలిగిన దివ్యమైన హృదయార్ద్రతతో వ్రాసినది. ఇక "శ్రీయన

గౌరినాబరగు చెల్వకు" అన్న పద్యము స్వామియొక్క అయిదారు విధములైన పూర్వ చరిత్రను, తన్మూలకముగ ప్రతిష్ఠింపబడిన సర్వదేవతాకత్వమును నిరూపించుచు భక్తి సోపానము నతిక్రమించిన జ్ఞాన విలసనముతో వ్రాసినది. అనగా విగ్రహ దర్శనముతో ప్రారంభమై, సాక్షాద్దర్శనముతో పరిణతమైన, భక్తియొక్క రెండు క్రమ దశలను దాటుకొని జ్ఞానమునందు పర్యవసించిన అద్భుతమైన మానసికస్థితి యన్నమాట.

ఆదిత్యం, అంబికాం, విష్ణుం, గణనాథం, మహేశ్వరం, షణ్ముఖంచైవ, అన్నట్లు, ఒక్క ఆదిత్యుడు లేకపోవచ్చునేమోగాని, శివ పంచాయతన మనుడు, షణ్మతారాధనా విధాన మనుడు- వీటన్నిటియొక్క సంకేత స్వరూపమే తిరుమల క్షేత్రము. ఈ సర్వదేవతామూర్తియే వేంకటేశ్వరుడు. ఈ తత్త్వసారమును వడగట్టిన పద్యమే "శ్రీయనగౌరినాబరగు చెల్వకు" అను పద్యము. ఇట్లు ఈ మూడు పద్యములు మహాపద్యములన వలయును. ఇక తక్కిన హరిహరనాథ పద్యము లన్నియు ఈ మూడింటియొక్క బిందుస్వరూపములే.

శ్రీ భాష్యమున రామానుజుల ప్రార్థనా శ్లోకములు

భారతమున తిక్కన ప్రార్థనా శ్లోకములు

భగవద్రామానుజులవారు వెలయించిన మహా గ్రంథమే శ్రీ భాష్యము. "విష్ణు పురాణమునందును", నమ్మాళ్వారుల "తిరువాయిమొళి" ప్రబంధము నందును, ప్రతిపాదింపబడిన విష్ణుతత్త్వమును వటవడిగా పెట్టుకొని వ్యాసుని బ్రహ్మసూత్రములకు వారు వ్రాసిన వ్యాఖ్యానము శ్రీ భాష్యము. ఇందు వారు వ్రాసిన ప్రార్థనా శ్లోకములలో తొలుత పరబ్రహ్మ యగు శ్రీనివాసుని స్తుతించిరి. మలుత వ్యాసుని స్తుతించిరి. ఆ శ్లోకములివి:

1. అఖిల భువన జన్మస్థేమభంగాది లీలే
వినత వివిధ భూత వ్రాత రక్షైక దీక్షే
శృతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా. (శ్లో 1)

ఉపనిషత్తుల యందును, బ్రహ్మసూత్రముల యందును ప్రతిపాదితుడైన పరబ్రహ్మయగు శ్రీనివాసుడు నాకు భక్తి రూపమైన జ్ఞానమును అనుగ్రహించుగాక-

వేంకటేశ్వరతత్త్వమే తిక్కన హరిహరనాథ తత్త్వము అని యిందలి సారాంశము. ఇక్కడ శ్రీనివాసు డనగా వేంకటేశ్వరుడని అర్థము. రామానుజులు తిరుమల స్వామిని శ్రీనివాసు డనియే పేర్కొనుచుండుట కద్దు. ఈ శ్రీనివాసుడే పరబ్రహ్మ యని వీరి నిష్కర్ష. తిరుమల శ్రీనివాసుని చరిత్రతో రామానుజుల జీవిత చరిత్రకు అవినాభావ సంబంధము గలదు. దిగువ తిరుపతిపట్టణ మును నిర్మించిన ఘనత రామానుజుల వారిదే. వేంకటేశ్వరుడు శివుడా,విష్ణువా, అన్న తగాదాను పరిష్కరించి, ఆరాధనా విధానమును వ్యవస్థీకరించినది వీరేయని పలుమాఋలు పూర్వోక్తము. క్రీ. శ. 1150 ప్రాంతము నాటికే, దిగువ తిరుపతి యందును, ఎగువ తిరుమల యందును రామానుజుల విగ్రహములుకూడ ప్రతిష్ఠింప బడినవి. వారు మొట్టమొదట తిరుమల పైకి వెళ్ళినప్పుడు. కాళ్ళతో నడచినచో పర్వతము అపవిత్రమై పోవునని భావించి మోకాళ్ళతో దేకుచు పైకిపోయిరట! ఆ త్రోవనే మోకాళ్ళ పర్వత మందురు. అనంతర కాలమున వారు తిరుమలను వీడి శ్రీరంగమునకు వెళ్ళవలసి వచ్చినప్పుడు కన్నుల నీరు తిరిగినట్లు చరిత్ర. కావుననే శ్రీనివాసుని(వేంకటేశ్వరుని)వారు ఉపనిషత్ప్రతిపాద్యమైన పరతత్త్వముగా పేర్కొనిరి.

శ్రీ రామానుజులు భక్తి ప్రధానమైన విశిష్టాద్వైతమును ప్రతిపాదించిరి. వీరు "సకల బ్రహ్మను" (సగుణుడు, సాకారుడు నైన) దైవమునే ఉపాసింతురు గాని "నిష్కల బ్రహ్మను" (నిర్గుణుడు, నిరాకారుడును నైన బ్రహ్మ పదార్థము) కాదు. ఈ శ్లోకమునందలి పరస్మిన్ బ్రహ్మణి శ్రీనివాసే అను వాక్యమునందు వారు ఇదం తయు వ్యక్తీకరించిరి.

2. పిమ్మట, తాను వ్యాసుని బ్రహ్మసూత్రములకు భాష్యము వ్రాయుచున్నం దున వ్యాసుని స్తుతించిరి.

తిక్కనకూడ సరిగ్గా రామానుజులు పాటించిన క్రమములోపరబ్రహ్మ తత్త్వమగు శ్రీనివాస తత్త్వమును(వేంకటేశ్వరతత్త్వమును)పరిగ్రహించి తొలుత నొక పద్యమును వ్రాసెను. అది సకల బ్రహ్మోపాసనగా పేర్కొనెను. పిమ్మట వ్యాసుని స్తుతించెను. ఆ వరుస క్రమ మిది:

1) శ్రీయనగౌరి నాబరగు చెల్వకు చిత్తము పల్లవింప.
2) అని "సకల బ్రహ్మ ప్రార్థనంబు సేసి.
3) విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశందు

అయితే, యీ యిర్వురు తమ తమ తత్త్వములను ప్రతిపాదించుటలోగల తార తమ్యమును సులభముగ గ్రహింప వచ్చును. రామానుజులకు శ్రీనివాసుని (వేంక టేశ్వరుని) పూర్వ చరిత్రతో పనిలేదు. అందువలన తన తత్త్వమును సులభశైలి శ్లోకములతో సూటిగా ప్రకటించిరి. తిక్కన విషయ మట్లుకుదురదు. వేంకటేశ్వరుని (శ్రీనివాసుని) పూర్వచరిత్రతో తనకు ప్రమేయము కావలయును. ఆ చరిత్రనంతయు గర్భీకరించుకొన్న పద్యములను వ్రాయవలయును. ఆ తత్త్వమును ప్రతిపాదింప వలయును. పైపెచ్చు, రామానుజులది భక్తి రూపమైన జ్ఞానము. తిక్కనది జ్ఞాన రూపమైన భక్తి. మొదటి దానిని ప్రతిపాదించుట సులభము. రెండవ దానిని ప్రతి పాదించుట కష్టము. అట్లయ్యును "శ్రీయనగౌరి నాబరగు" అన్న గొప్ప పద్యమును వ్రాయగలిగినాడు తిక్కన. సారాంశ మేమన రామానుజుల శ్రీభాష్యమునందలి ప్రార్థనా శ్లోకముల వరుస వరవడిలో తిక్కన ప్రార్థనా శ్లోకములున్నవి. కావున వేంకటేశ్వర తత్త్వమే తిక్కన ప్రతిపాదించిన హరిహర నాథ తత్త్వ మన వలయును.

శేష శేషీభావరూప సంబంధము

జగద్గురు శ్రీ శంకరులు శేష శేషీభావ రూపసంబంధమును గూర్చి సౌందర్య లహరిలో ఇట్లు సెలవిచ్చిరి:—

శరీరం త్వం శంభో శ్శశిమిహిర వక్షోరుహ యుగం
తవాత్మానం మన్యే భగవతి నవాత్మాన మనఘం
అత శ్శేష శ్శేషీ త్యయముభయ సాధారణతయా
స్థిత స్సంబన్ధో వాం సమరసపరానన్ద పరయోః. (శ్లో. 34)

తా. తల్లీ! సూర్య చంద్రులు స్తనములు గాగల నీవు (ఆనందభైరవీరూప చిచ్ఛక్తికళ) ఆనంద భైరవునకు నొడలుగా గనుపట్టుదువు. ఆ యానందభైరవుని రూపము నీ రూపముగా దోచును. ఇందువలన విచారింపగా శేషశేషీభావ రూప సంబంధము మీ యిద్దఱకు సమానమని తోచెడిని.

శేష మనగా అప్రధానమనియు, శేషీ అనగా ప్రధానమనియు నర్థము. శివ శక్తు లిరువురు సామరస్యముతో గూడిన సమానాకారములు గలవారు. వీరిలో శక్తిని ప్రధానముగా భావించిన సమయమున శివుడు అప్రధానమగును. శివుని ప్రధానముగా

వేంకటేశ్వర తత్త్వమే తిక్కన హరిహరనాథ తత్త్వము

భావించిన సమయమున శక్తి అప్రధాన మగును. ఇవి శివశక్తు లుభయులకు సాధారణమైన మహాలక్షణములు. దీనిని శేష శేషీభావ రూప సంబంధమందురు.

ఈ తత్త్వమును ప్రాతిపదికగా పెట్టుకొని తిక్కన హరిహర నాథాద్వైతమును ప్రతిపాదించినాడు. హరితోపాటు శ్రీదేవియు హరునితోపాటు గౌరీదేవియు స్ఫురించు విధమున ఈ పద్యము లన్నియు వ్రాసినాడు. వీరందరికి సామరస్యముతో కూడిన సమానాకారములను చిత్రీకరించి సాక్షాత్కరింప జేసినాడు.

ఇంతటి మహావిషయమును సంకల్పించి ప్రతిపాదించుటకు వేంకటేశ్వర తత్త్వమే యాతనికి స్ఫూర్తిని ప్రసాదించినది. ప్రేరేపించినది. వేంకటేశ్వరుడు సర్వదేవతా స్వరూపుడు; హరిహర స్వరూపుడు. కేవల హరుడు, కేవల హరి, బాలా, వీరభద్రుడు, కుమారస్వామి. ఈ అన్ని రూపములు ఆతని యందున్నవి. ఎవరికెట్లు కాన్పించెనో వారా పేరుతో పిలిచిరి. ఆ పేరుగల దేవు డప్పుడు ప్రధానము. తక్కినవా రప్రధానులు. ఇట్లు శేష శేషీభావరూప సంబంధముగల తత్త్వమే వేంకటేశ్వర నిష్ఠమైనది. అదియే తిక్కనగారి హరిహరనాథ తత్త్వము!

వేంకటనాథుడే తన హరిహరనాథుడని

తిక్కన చెప్పక పోవుటకు కారణము

ఇప్పుడొక సందేహము రావచ్చును. మఱి తిక్కన వేంకటేశ్వరుడే తన హరిహరేశ్వరుడని ఒక్కమాట చెప్పవచ్చునుగదా? ఎందుకు చెప్పలేదు? అని. దీనికి సమాధానము అతి సులభముగా చెప్పవచ్చును. ఇప్పటివఱకు గత 600 వందల సంవత్సరములనుండి తిక్కన హరిహరనాథు డెవరు? అన్న చర్చ జరుగుచునేయున్నది కావచ్చును. ఈ శతాబ్దమందలి పరిశోధకులు, విమర్శకులు ఈ చర్చలను మఱింత ఎక్కువ చేసిరి.

తిక్కన నాటికి నెల్లూరులో నొక హరిహరనాథ దేవుడుండెననియు, తిక్కన ప్రతిరోజు ఆతని యెదుట కూర్చుని, "కిమస్థి మాలాం" శ్లోకమును పాడుకొనుచుండెడి వాడనియు, ఆ పిమ్మట అక్కడే పద్యములను వ్రాయుచుండెడి వాడనియు! ఆతనికే చివరికి తన భారతము నంకిత మిచ్చె ననియు గతానుగతికముగ కొందఱు వ్రాయుచూ వచ్చిరి. నెల్లూరులో అసలట్టి దేవాలయము లేకుండె ననియు, ఉన్నట్లు చారిత్ర కాధారములు కాన్పింప వనియు, అట్టి దేవుని "అంతస్సన్నిధిం గల్పించు

కొని" ఇంటివద్దనే వ్రాసియుండె ననియు, మఱికొందఱు సెలవిచ్చిరి. ఈ రెండవ అభిప్రాయమునకంటె మొదటి యభిప్రాయమునకే అధికప్రాధాన్యము లభించిడాదాపు స్థిర పడినది.

ఇక్కడ ప్రశ్న ముఖమున చెప్పవలసిన సమాధాన మేమన, మఱి తిక్కన నెల్లూరులో వేంచేసియున్న హరిహరనాథుడే తన హరిహర నాథుడని యెందుకు చెప్పలేదు? అని. తిక్కన అట్లు చెప్పకున్నను నెల్లూరి హరిహర నాథునకే ఆతడు తన కృతిని అంకితమిచ్చినట్లు వాకొనుచున్నాము గదా? పైపెచ్చు అసలది లేని దేవాలయము! ఒకవేళ ఉండియుండినచో తిక్కనవంటి మహనీయుడు, మహాభారతము వంటి పుణ్య ప్రబంధము సంకిత మిచ్చిన ఆ దేవుని యాలయమును నెల్లూరి ప్రజలు మట్టికొట్టుకొని పోనిచ్చి యుందురా? మఱింత పెద్ద దేవాలయమును కట్టించి యుందురే? పోనీ, భారతము హరిహర నాథాంకితమైన పిమ్మటనైనను అట్టి దేవాలయ మొకటి నెల్లూరులో లేచియున్నట్లు అనుకొనుటకుకూడ వీలులేదే! ఇప్పుడు రంగనాథాలయ ప్రాంగణమున పెన్నానది ఒడ్డున, విసరివేసి నట్లున్న, పసిపిల్లలు ఆడుకొనుటకు కట్టుకొన్న బొమ్మరిల్లువంటి, పాడుబడిన ఒకచిన్న మందిరమును చూపించి ఇది హరిహరనాథ దేవాలయమని చెప్పెడు వారున్నారు. అది చూడ బుద్ధికాదుగదా, చూసినచో నవ్వు వచ్చును. అదియే తిక్కననాటి దేవాలయమని ఏ పరిశోధకుడైనను చెప్పుటకు సాహసించునా?

తిక్కన ఏడుకొండల వేంకటనాథుడే తన హరిహర నాథుడని చెప్పకపోవుటకు కారణమిది: అప్పటికే వేంకటేశ్వరుడు విష్ణువుగా తీర్మానింపబడి తదనురూపమైన పూజా పరిష్క్రియలను అందుకొను చున్నాడు. శతాబ్దుల తఱబడి వాదులాటలకు గుఱియై ఒక విధముగ పరిష్కరింప బడి సద్దుమణిగిన పాత చరిత్రల పాతరలను త్రవ్వుట వ్యర్థము. పైపెచ్చు శివ విష్ణు భేదములేని భక్తిగల యాతని వంటి మహనీయునకు తగినపనికాదు. అందువలన ఆ విషయమును కంఠోక్తిగా ప్రకటింపక, స్వామి ప్రాచీన చరిత్రయొక్క వస్తు స్థితిని దృష్టియందుంచుకొని మౌనముగా ఇంతపని చేసినాడు. పైగా తిక్కనవంటి మహనీయుడు ఒక విశాలమైన తత్త్వమును ప్రతిపాదించుటయందు మాత్రమే దృష్టిని నిల్పును గాని, ఇది ఫలానా దేవునికి సంబంధించినదని చెప్పి ఆ తత్త్వమును సంకుచిత పఱచు అల్పత్వమునకు దిగడు.

వేంకటేశ్వరతత్త్వమే తిక్కన హరిహరనాథ తత్త్వము పైపెచ్చు వివాదాస్పదమైన విషయము పట్టున మఱింత జాగరూకుడై యుండును.

అసలు తిక్కనగారి హరిహరనాథుడు వేంకటనాథుడే అన్న విషయము ఎఱ్ఱనకు, నాచనసోమునకు, బైచరాజు వేంకటనాథునకు కచ్చితముగా తెలియును. కాని తిక్కన కంఠోక్తిగాచెప్పలేదుగాన వారుకూడ చెప్పరైరి. ఆమాటకొచ్చిన చెప్పవలసిన అవసరములేదని తిక్కనతోసహా వీరందరు భావించియుందురు. ఏలయన, ఇవి కంఠోక్తిగా దండోరావేయించి చెప్పవలసినంత పెద్దవిషయముగాదు. అందఱికీ తెలిసినవిషయమే యని ఆ మహనీయులు భావించియుందురు. ఆనాడు మొదలుకొని 19వ శతాబ్ది చివరివఱకు వెనుకటితరములవారు అట్లేభావించి ఉపేక్షించియుందురు. మనపూర్వికులు ఇట్లు ఎన్నోవిషయములనుగూర్చి వాకొనకుండుట మామూలుమాట. ఈశతాబ్ది ప్రారంభమున పరిశోధనలు ప్రారంభమైన పిమ్మట తమకు సమకూరిన సౌకర్యాసౌకర్యములనుబట్టియు, లభించిన యాధారములనుబట్టియు, వట్టి ఊహలను బట్టియు ఆయా మహనీయులు కొందరు తమకు తోచిన విషయములను సెలవిచ్చిరి. ఆ ధోరణిలో తిక్కనగారు నెల్లూరువాడుగాన అతని హరిహరనాథుడుగూడ నెల్లూరివాడై నాడు. అయితే తిక్కనది నెల్లూరేగాని అతని హరిహరనాథుడు మాత్రము నెల్లూరి వాడుకాదు. తిరుపతివేంకటేశ్వరుడే అతని హరిహరనాథుడు. వేంకటేశ్వర తత్త్వమే హరిహరనాథ తత్త్వము!

### తిరుపతి వేంకటేశ్వరుని కన్వయించు
### తిక్కనగారి మఱికొన్ని హరిహరనాథ పద్యములు

తిక్కనగారి హరిహరనాథ పద్యములన్నియు తిరుమల వేంకటేశ్వరునిగూర్చి చెప్పినవేయని పలుమాఱులు పూర్వోక్తము. ఆ వరుసలో మఱికొన్ని పద్యము లిట నుదాహరింప బడుచున్నవి:-

1. కం॥ శ్రీ సంపాదనచాతు, ర్యాసేవ్యపదారవింద యౌగిక విద్యో,
ద్భాసితమూర్తిమయాత్మ, వ్యాససమానైకరూప హరిహరనాథా
(విరాట. 5-1)

ఇందు "వ్యాస, సమాన, ఏక, రూప-" అన్నది ముఖ్యము. వ్యాసరూపము నను అనగా వ్యష్టిరూపముసను అనగా చరిత్రలో కొంతకాలము కేవల హరిరూపము తోడను మఱికొంత కాలము కేవల హర రూపముతోడను దర్శన మిచ్చిన వాడని

యర్థము. సమాస రూపముననుఅనగా సమష్టి రూపముననుఅనగా చరిత్రలో కొంతకాలము హరిహర నాథాత్మక జమిలి రూపముతో దర్శన మిచ్చినవాడని యర్థము. ఇట్లు ఈ మూడు రూపములు స్వామియొక్క ఉపాధికి సంబంధించినవి. మన కిక్కడ ప్రకృతాంశములు. ఇక ఏకరూప- అనగా అఖండైక రసరూపముతో ప్రకాశించువాడు అన్నది స్వామియొక్క నిరుపాధిక లక్షణమునకు సంబంధించినది. ఇది తిరుమల స్వామియొక్క పూర్వ చరిత్రను సూచించు పద్యమనుట నిర్వివాదము.

2. కం॥ అజగవశార్ఙ్గాలంకృత, భుజగర్వ నిరస్త దైత్య భూమస్తుత్యా,
త్రిజగద్ధారణ నిత్యా, భుజగసమాచరితశయన భూషణకృత్యా.
(విరాట. 1-39)

ఇందు "భుజగ సమాచరితశయన భూషణకృత్యా" అన్నది ముఖ్యము. భుజగ సమాచరిత శయనకృత్యా=శేష సర్పమును శయ్యగా చేసికొనినవాడా! (హరిపక్షమున), భుజగ సమాచరిత భూషణకృత్యా=వాసుకి సర్పమును అభరణముగా చేసికొనినవాడా! (హర పక్షమున), అని యర్థము. ఈ యర్థములను ఇట్లు సమన్వయింప వలెను: తిరుమల స్వామికి, క్రీ. శ. 7వ శతాబ్దియందలి పేయాళ్వారుల 63వ పాశురములో నడుముకు చుట్టుకొని నాగాభరణ మున్నట్లు వర్ణింప బడినది. దరిమిలా రామానుజుల కాలమునుండియు నది హస్తముల నలంకరించిన విషయము వెనుక చెప్పబడినది. అది యిప్పటికినీ అట్లేయున్నది. కావున హర పక్షమున నీ యర్థము సూటిగా సరిపడుచున్నది. మఱి హరి పక్షమున భుజగ సమాచరిత శయన కృత్యా- అన్నది యెట్లు సరిపడును? అన్నది విచికిత్స! శేషాహి రూపమున నున్న అద్రిని శయ్యగా చేసికొనినవాడా అని చెప్పి కొన్నచో సరిపడునని సమాధానము. ఈ యర్థ మిట్లువచ్చునా? యన్నచో తిక్కన గుండెలోతులను త్రవ్విచూడగా వచ్చుననియే చెప్పవలెను. ఇట్టి సందర్భములయందు ఒక యర్థమును సూటిగను, మఱొక యర్థమును వ్యంగ్యముగను సమన్వయించుట తిక్కనకు అభిప్రేతము. అంతకు మించిన గత్యంతరముకూడ లేదు పాపమామహాకవికి!

3. మాలిని- నిగమకుసుమ గంధోన్మేష భూతాభిధానా,
సగుణ విగుణ లీలాసౌమ్య సాక్షిత్వనానా

వేంకటేశ్వరతత్త్వమే తిక్కన హరిహరనాథ తత్త్వము

జగదవనపిధాన స్థైర్య దత్తావధానా

నగశరధి నివాసానంద సంస్తుత్యమానా. (విరాట. 5-407)

ఇందు "నగ శరధి నివాసానంద" అన్నది ముఖ్యము. నగనివాసానంద = పర్వతమునందు నివసించుటచే పొందిన ఆనందము గలవాడు! (హర పక్షమున), శరధి నివాసానంద = సముద్రమునందు నివసించుటచే పొందిన ఆనందముగలవాడు! (హరిపక్షమున) అని యర్థము. వేంకటేశ్వరుడు శేషాద్రియందు నివసించుచున్నాడు గావున హర పక్షమున చెప్పబడిన యర్థము సూటిగా సరిపడును. మఱి హరి పక్షమున చెప్పబడిన "శరధి నివాసత్వ"మెట్లు సరిపడును? అన్నది విచికిత్స! ఇక్కడ 'శరధి' శబ్దమునకు సముద్ర మను రూఢ్యర్థమునుగాక, నీటి సమూహము లేక నెలయేళ్ళ నీళ్ళ సమూహము అను యౌగికార్థమును గ్రహింప వలెను. ఆళ్వారులందరు నెలవిచ్చిన వేంకటేశ్వర పాశురములలో తిరుమల కొండలపై ప్రవహించు నెలయేళ్ళు, ఎన్నో జల తీర్థములు చర్విత చర్వణముగా ఓతప్రోతముగా వర్ణింపబడినవి. చుట్టును పాఱుచున్న సమృద్ధములైన కొండకాలువలు ప్రవహించుచున్న తిరుమల యందుండెడి స్వామిగా వేంకటేశ్వరుడు వర్ణింపబడినాడు. తిరుమలయే వైకుంఠ మనియు, పాలసముద్ర మనియుకూడ ఆళ్వారులు వర్ణించినారు. అది దృష్టి యందుంచుకొనియే తిక్కన యిట్లు వర్ణించినాడని గ్రహింపవలెను.

4. కం॥ దూరాంతిక, దుర్గమ, వి! స్తార, సుగమ, సన్నివేశ తావదచల, స

ర్వారంభక, నిష్క్రియ, సం, స్కారోజ్జ్వల, విశ్వసంప్రకాశనమూర్తీ.

(భీష్మ. 1-305)

ఇది వేంకటేశ్వరునకు ప్రతి యక్షరమున ప్రతి పదమున అన్వయించుచున్న పద్యము. దూరాంతిక = శక్తి లేని వారికి దూరముగాను, శక్తిగలవారికి దగ్గఱగాను ఉండువాడా! దుర్గమ = దరిచేరుటకువీలుగాని, విస్తార = విశాలములైన అడవులతోను, కొండరాతి ప్రదేశములతోను కూడియున్నవాడా! అట్లయ్యును, సుగమ = సులభముగా పొందుటకు శక్యమైనవాడా!, సన్నివేశతావదచల = నివాస యోగ్యమైన ప్రదేశము పర్వతము గాగలవాడా!, సర్వారంభక = అన్ని ప్రారంభములు గలవాడా!, నిష్క్రియ = ఎట్టి క్రియలును లేనివాడా!, సంస్కారోజ్జ్వల = వైఖాన సాగమము మొదలైన వైదికారాధనా సంస్కార విశేషముచే వెలు

గొందు చున్నవాడా!, విశ్వ సం ప్రకాశన మూర్తి = జగత్తు నంతను చక్కగా ప్రకాశింప జేయుచున్న ఆకృతి విశేషము గలవాడా!, అని యర్థము.

వేదాంతిపరమైన అర్థమును చెప్పవలసినప్పుడు ఇందలి ప్రతిపదమునకు అర్థాంతర ముండుట సహజము. కాని మనము స్వీకరించిన యీ ప్రకృతాంశ నిరూపణమునందు మాత్రమువస్తుస్థితికి అనుగుణముగ ఈ యర్థ మిట్లేయున్నదనుట నిస్సందేహము.

ఆళ్వారాచార్యులు గానము చేసిన వేంకటేశ్వర మంగళాశాసన "పాశురములను"గాని, అంతకు ముందటి "తొల్కాప్పియము"నుగాని, ఆ పిమ్మటి "శిలప్పదికారమును"గాని చూసినచో ఆ రోజులలో తిరుమల కొండలు ఎంతటి భీకరముగ నుండెడివో తెలియవచ్చును. రామానుజుల నాటికిగాని, తిక్కన నాటికిగాని కొంరకు కొంత మెఱుగుపడి యుండవచ్చునను కొన్నను, దాదాపు ఇట్టి దూర దుర్గమ విస్తారత్వమే యుండెనని భావించుట యుక్తము. మూలాధార చక్రమునుండి బయలుదేరిన కుండలిని షట్చక్రములను భేదించి సహస్రారమును చేరుకొనుట ఎంతటి కష్టమో, మోకాళ్ళ పర్వతమునుండి బయలుదేరిన భక్తుడు ఈ మధ్యగల ఆరు పర్వతములను, అరణ్యములను దాటుకొని సప్తగిరి నాథుని చేరుకొనుట ఆ రోజులలో అంత కష్టముగా నుండెడిది. ఈ రోజులలో సైతము అట్టిశ్రమ లేదనగలమా! కొండపై గల పరిస్థితులు భయంకరముగా లేకపోవచ్చును గాక, ప్రయాణమును సాగించుట గానీ, స్వామి దర్శనమునకై పడు త్రొక్కిసలాట గాని ఎంత కష్ట భూయిష్టమో భక్త కోటులకు అనుభవములో నున్న విషయమే. తిరుమల తిరుపతి దేవస్థానముల చరిత్రను, ఇతర క్షేత్రముల చరిత్రతో పోల్చి చూచినచో అప్పుడు గాని యిప్పుడు గాని భక్త జనములను అధికముగా నాకర్షించుచున్న క్షేత్రము తిరుమలయే. మఱి "కలౌ వేంకటనాయకః" అని గదా ప్రసిద్ధి. దేహ దార్ఢ్యము లేని వారికి, పేదవారికి బౌతికముగా జూచినచో తిరుమల స్వామి "దూర దుర్గమ విస్తార సన్నివేశుడు." అట్లయ్యును తీవరించిన భక్తితో, పట్టుదలతో సేవింప దలచిన వారికి "అంతిక సుగమసన్నివేశుడు." అన్ని సౌకర్యము లుండియు భక్తిలేని అజ్ఞానులకు "దూర దుర్గమ విస్తార సన్నివేశుడు." అన్ని సౌకర్యములతో బాటు భక్తిగూడ కలిగియున్న వారికి అత్యంత సులభుడు!

వేంకటేశ్వరతత్త్వమే తిక్కన హరిహరనాథ తత్త్వము

ఈ పద్యము నందలి "అచల" "సంస్కారోజ్జ్వల" శబ్దములు మిక్కిలి కీలకములైనవి. ఈ "అచల" శేషాచలమని కంఠోక్తిగా చెప్పుటకు ప్రయోగింపబడినది. "సంస్కారోజ్జ్వల" అన్న ప్రయోగము పూజా పునస్కారాది విషయములలో స్వామి యొక్క పూర్వ పూర్వ స్థితిని తెలియ జేయుచున్నది. భగవద్రామానుజులు వేంకటేశ్వరుని విష్ణువుగా తీర్మానించి వైదిక పద్ధతిలో తదారాధనా విధానమును పరిష్కరించి పెట్టుటకు పూర్వము ఏ అలనా పాలనా లేక, సరియగు పూజా పునస్కారములు లేక, హరియనియు, హరుడనియు, హరిహరుడనియు, బాలా(జీ) యనియు, వీరభద్రుడనియు, కుమారస్వామియనియు, పలుతెఱగుల పేళ్ళతో నొప్పుచూ, కొండ జాతివారి యొక్కయు, ఆటవికుల యొక్కయు తాంత్రిక పూజలకు గుఱియై స్వామి "నిష్క్రియుడై" పడియుండి యున్నట్లు చరిత్ర చెప్పుచున్నది. రామానుజులరాకతో స్వామి సంస్కారోజ్జ్వలుడై నాడని సూచించు మాట యిది. "విశ్వ సంప్రకాశన మూర్తి" అను ప్రయోగము కూడ అర్థవంతముగనే వేయబడినది. జగత్తునంతను చక్కగా ప్రకాశింప జేయుచున్న ఆకృతి విశేషము గలవాడని గదా తాత్పర్యము. ప్రసిద్ధిని బట్టి చూచినచో "తిరుమల మందిర సుందరు" డొక్కడేగదా అప్పుడుగాని యిప్పుడుగాని అంతటివాడు! కావుననే ఎఱ్ఱన తన నృసింహ పురాణమునందలి ప్రథమాశ్వాస ప్రారంభమున గాలవమహర్షి చేసిన తీర్థయాత్రలలో "వేంకటాచల స్థాయిని" గూడ చేర్చి, "ఇట్లు పరిపాటిం బ్రసిద్ధంబులగు తీర్థంబు "లాడుచు" అను వచనముద్వారా ఆనాడే తిరుమల స్వామికిగల ప్రసిద్ధిని పేర్కొనుట జరిగినది!

౫. కం॥ అనపేక్షిత ఫలతాశోభన మహనీయ క్రియావిపాకాత్మక రూ
ప, నితాంతధూత సంశ్రితజనపాపా పరమమిత్రసత్యాలాపా.

(అశ్వ. 3-227)

ఇందు "నితాంత ధూత సంశ్రిత జనపాపా" అనునది ముఖ్యము. ఆశ్రయించిన భక్తుల పాపములను పూర్తిగా పోగొట్టువాడని దీని యర్థము. ఈ యర్థమునే యిచ్చు మఱి రెండు మూడు పద్యము లున్నవి. కాని, ఈ పద్యముయొక్క కట్టుబడిగాని, భావ వ్యక్తీకరణ పద్ధతిగాని, "వేంకట" నామ నిర్వచనమునకు దగ్గరగా నుండి కొద్దిపాటి ప్రత్యేకతను కలిగియున్నది. "వేంకట" నామమున కిట్లు నిర్వచనము లభించు చున్నది:

6. సర్వ పాపాని "వేం" ప్రాహుః కటస్తద్దాహ ఉచ్యతే
సర్వ పాపాపహారిత్వాత్ వేంకటాద్రి రితి స్మృతః.

వరాహ పురాణము

"వేం" అనగా సర్వ పాపములు, 'కట' అనగా దహించి వేయునది. కాగా, సకల పాపములను దహించునది వేంకట మైనది.

'వేంకట' శబ్దమును కంఠోక్తిగా ప్రకటించుట తిక్కన కభిప్రేతముగాదు. ఆ భావమును మాత్రము చెప్పదలచినాడు. పై నిర్వచన శ్లోకమునుండి "పాప" శబ్దమును గ్రహించినాడు. "దాహ" శబ్దమునకు పర్యాయపదముగ"నితాంతధూత" అని ప్రయోగించినాడు. ఇట్లు ఈ పద్యము ఉన్నంతలో మన ప్రస్తుతాంశమునకు మంచి ఊతమునిచ్చునదిగానున్నది.

7. కం॥ ఆదిత్యమరుద్వసురుద్రాది సకలదేవతామయాత్మక, శ్రీసం
పాదనవిధావిచక్షణ, పాదసరోజా మహర్ధి భక్తసమాజా!

(శాంతి.4-556)

తిక్కనగారి హరిహరనాథుడు (వేంకటేశ్వరుడు) సకలదేవతా స్వరూపుడు. ద్వాదశార్కులు, సప్తమరుత్తులు, అష్టవసువులు, ఏకాదశరుద్రులు ప్రభృతిదేవత లందరు వేంకటేశ్వరునియందే అంతర్భవింతురు. ఇక్కడ శాస్త్రసమ్మతమైన దృష్టితో ఈదేవతలపేళ్లను పేర్కొన్నప్పటికినీ, చారిత్రక దృష్టితో చూచినప్పుడు తిక్కనగాని, మనముగాని ఈదేవతలకు బదులుగా భావింపవలసినది: హరి, హరుడు, వీరభద్రుడు, కుమారస్వామి, బాలా(జీ) మొదలైనవారినే. అట్లు స్పష్ట ముగా పేర్కొనుటకు ఇష్టపడని తిక్కన యిట్లు ఇతరదేవతలను పేర్కొని భగ్యం తరముగ వస్తుస్థితిని సూచించినాడు. హరిహరనాథుడు తన భక్తులకు ఎట్టి సిరి సంపదలను అనుగ్రహింపవలెనో తెలిసినవాడట! అందువల్లనే ఆతని భక్తులెల్లరు గొప్ప యభివృద్ధితో తులతూగుచుందురట! భక్తులసమూహములు తండోపతండము లుగ నిరంతరము అభివృద్ధి చెందుచుండునట!

ఇట్టిదేవుడెవ్వరై యుండును? అన్నదివిచికిత్స! "హరిహరనాథదేవాలయము" అన్న పేరిట ఇంతటి మహాలక్షణములుగల క్షేత్రమేదైనను దేశమునందెచ్చటనైనను ఉండియుండెననుటకు చారిత్రక పరిశోధకులెవ్వరైనను ఆధారము చూపించగలరా?

వేంకటేశ్వర తత్త్వమే తిక్కన హరిహరనాథ తత్త్వము అన్న ప్రశ్నకు సమాధానము కడుదుర్లభము. (కర్ణాటకలోని హరిహర క్షేత్రమున్న దనుట ఇచ్చట అసందర్భము.) ఆపరిశోధకులందరు తిరిగి తిరిగి చివరికి వేంకటేశ్వరస్వామికడకు రాక తప్పనిసరి. కాగా వేంకటేశ్వరుడే తిక్కన హరిహరేశుడనుట నిష్కర్ష!

8. కం॥ శ్రీమత్కీర్తిమదత్యభి, రామాకృతి మద్గుణాభిరతిమత్పుణ్య
గ్రామాకృతి మత్సంప, త్ప్యామోదిత భక్తలోక హరిహరనాథా!

ఇది తిక్కన మిక్కిలి ఆర్ద్రహృదయముతో వేంకటేశ్వరునితో తాదాత్మ్యమును భజించి వ్రాసినపద్యము. ఆస్వామి లోకాతిశాయియైన సిరితోను, కీర్తితోను, సౌందర్యముతోను వెలుగొందుచుండునట! సకల సద్గుణములయందు మిక్కిలి స్పృహగలవాడట! తిక్కనగారి సుకృతసముదాయ స్వరూపుడట! స్వామియనుగ్రహమున తనకు లభించిన సంపదచేత భక్తకోటిని సంతృప్తి పఱచుటకు తగిన యవకాశములభించినదట! ఇదీ వరుస!

ఇందు "మత్పుణ్యగ్రామాకృతి" "మత్సంపత్ప్యామోదిత భక్తలోక" అన్న ప్రయోగముల యందిమిడియున్న స్వస్వామిసంబంధము, ఆత్మీయత, ఆర్తి, ఎద పొంగు ఎంతచెప్పినను తనివితీరునా? తిక్కనగారికి ఇంత గుండెదగ్గఱివాడైన ఆ హరిహరనాథదేవుడెవ్వరు? అదుగో, ఆసప్తగిరిశిఖర సహస్రారపద్మమున శ్రీదేవీసహితుడై విహరించుచున్న "సుమధుర కరుణాసాగరుడు" వేంకటేశ్వరుడుగాక మఱెవ్వరు!

---

దిం 28-5-1979 నా డిచ్చిన ఉపన్యాసమది.
హైదరాబాదులోని య స్. వి. వి. వి. యస్. కళాశాలలో
టి. టి. డి. వారి హిందూధర్మ ప్రతిష్ఠానం నిర్వహించిన శిబిరంలో
శిబిరం డైరక్టరు శ్రీ జి. శ్రీరామమూర్తిగారు, అధ్యక్షులుగా
ప్రతిష్ఠానం కార్యదర్శి డా॥ అర్క సోమయాజి, ప్రధానాతిథిగా
పాల్గొన్న గోష్ఠిలో ఇచ్చిన ఉపన్యాస మిది.

తమిళ తెలుగు వాఙ్మయములు

# సప్తగిరి హరిహరనాథుడు

భారతదేశమున ఎన్నో పుణ్యక్షేత్రములున్నవి. కాని ఏ క్షేత్రమునుగూర్చి గాని, అందలిదేవునిగూర్చిగాని ఎట్టి వివాదములుగాని, చర్చలుగాని జరిగినట్లు దాఖలా కానరాదు. తిరుమలస్వామి విషయము మాత్రమట్లుగాదు! ప్రాచీనకాలము నుండియు ఎంతయో రభసజరిగినట్లు చరిత్ర సాక్ష్యమిచ్చుచున్నది. దీనికి కారణ మేమిటన్నది ప్రశ్న! వస్తుస్థితి అట్లున్నదిగాన, అట్టివివాదములు జరుగుచూవచ్చిన వని సమాధానము! శివుడనియు, విష్ణువనియు, వీరభద్రుడనియు, కుమారస్వామి యనియు, హరిహరుడనియు, బాలా అనియు ఇదీవరుస! ఈ విషయములన్నియు పలు మాఱులు పూర్వోక్తములు. వెనుకచెప్పబడని మఱికొన్ని యంశములు విషయ సమ గ్రత కొఱకు, జిజ్ఞాసువుల సమ్యగవగాహనకోసము ఇట వివరముగ ప్రస్తావింపబడు చున్నవి:-

### తమిళవాఙ్మయము-వేంకటేశ్వరుడు

తమిళవాఙ్మయమున మొట్టమొదటి గ్రంథముగ పరిగణింపబడుచున్న "తొల్కాప్పియము" అను లక్షణ గ్రంథమునకు "శిఱప్పాయిరమ్" అను పేరుతో "పనమ్ పరనార్" అను మహానుభావుడు వ్రాసిన వ్యాఖ్యాసగ్రంథమున "వడవేఙ్గడం తెన్కుమరి అయిడైతమిళ్ కూరునల్లులహం" ఉత్తరమున వేంగడమునకు, దక్షిణ మున కన్యాకుమారికి మధ్యగలదేశము తమిళదేశము అనిమాత్రము చెప్పబడినది అచ్చటి దేవునిగూర్చిన ప్రశంసమాత్రము చేయబడలేదు. ఈ గ్రంథము క్రీ.శ. ఒక టవ శతాబ్ది నాటిదని భావించుటలెస్స.

సంగమ సాహిత్య యుగపు నడిమికాలమున వెలువడిన "అగనానూరు" అను గ్రంథమునవిట్లు పేర్కొనబడినది:

"క....ల్ పునై తిరున్నడిక్కళ్వర్ కోమాన్
మ....పులమ్ వణక్కియమావణ్ పుల్లి

తమిళ తెలుగు వాఙ్మయములు సప్తగిరి హరిహరనాథుడు

ఏ....వుడై వి....చ్చీర్ వేంగడం పెరిదుమ్
ప....గువ రాదలో అరిదు"
"వెన్ వేల్ తిరైయన్ వేంగడనెడువరై"
"విసైనవిల్ యానై పీఅజ్ పోర్ త్తొణ్డియర్
ఇన్నమ....తవ....మ్ ఎ....రునెడుజ్కోట్టు
ఓఙ్గువెళ్ళరువి వేంగడత్తుమ్బర్"

అని వర్ణింపబడినది. వేంకటాచలమున "తిరువిళా"అను ఉత్సవములు జరుగు చుండుననియు, ఇది మిక్కిలి శ్రేష్ఠమైనపర్వతమనియు ఈ వాక్యముల సారాంశము. ఇచటగల దేవునిగూర్చి యీగ్రంథముకూడ పేర్కొనలేదు. ఇది క్రీ.శ. రెండవ శతాబ్దమున వెలువడిన గ్రంథమని తమిళసాహిత్య చరిత్రకారుల అంచనా.

ఇట్లు తమిళవాఙ్మయమున తొలిదశలో వెలువడిన గ్రంథములన్నియు తిరు వేంగడమునుగూర్చి దిఙ్మాత్రముగ సూచించినవేగాని అచ్చటి క్షేత్రస్వామిని గూర్చి పేర్కొన్నవైనము బొత్తిగా కానరాదు. శతాబ్దములు గడిచిన కొలది కాలక్రమమున వెలసిన అనేకగ్రంథములలో అచ్చటగల దేవునిగూర్చిన ప్రశంసలు ప్రారంభమైనవి. పాపమాదేవుడు "ఉల్లేఖాలంకారమునకు" లక్ష్యభూతుడైనాడు!

శైవుడైన తిరుమూలనాయనారు తన "తిరుమంత్ర పాశురమున" వేంకటేశ్వరుని యిట్లు స్తుతించినాడు:

"వేఙ్గడనాదనై వేదాన్తకూత్తనై
వేఙ్గడత్తుళ్ళే విళైయాడుమ్ నన్దియై
వేఙ్గడమ్ ఎన్ఱే విరగటి యాదవర్"

వేదాంత పురుషుడైన వేంకటనాథుని యందు పావనమూర్తి యైన నందీశ్వరుడు నాట్యము చేయుచుండును. అని దీని భావము. ఈతడు క్రీ. శ. రెండు లేక మూడవ శతాబ్ది వాడని అంచనా వేయబడు చున్నది

ఇదేవిధముగ, కపిలదేవనాయనారు కూడ తన "శివపెరుమాన్ తిరువన్దాది"లో ఇట్లు ప్రశంసించినాడు:

"అరియారుమ్ పూమ్పొ....ల్ శూ....అమాత్తూరమ్మాన్
అరియారుమ్ పాగత్తమదన్- అరియారుమ్

వేఙ్గడత్తు మేయానై మేవా ఉయరెల్లామ్
వేఙ్గడత్తు నోయాల్ విశిన్దు"

పరమ శివుడవైన ఓ వేంకటనాథ! ఈ మానవకోటిని సంరక్షింపుము. వీరి బాధలను పోగొట్టి ఉద్ధరింపుమని నిన్ను వేడుకొను చున్నాను. అని దీనితాత్పర్యము. ఈతడు కూడ క్రీ. శ. మూడు నాలుగు శతాబ్దుల నాటి వాడని ఊహింపబడు చున్నది.

ఇక అరుణగిరి నాథుడు తన "తిరుప్పుగళ్" గ్రంథమున ఇట్లు పేర్కొనినాడు: "తిరు వేంగడత్తిలు క్రైతరుపెరుమానే" "తిరుమల కొండపై నుండు దేవుడు శ్రీ సుబ్రహ్మణ్య స్వామియే." ఈతని కాలము సరిగ్గా తెలిసి వచ్చుటలేదు.

శివజ్ఞాన మునివరుడు తన "తొల్కాప్యప్పాయిరవృత్తి" అను గ్రంథములో నిట్లు వక్కాణించినాడు:

"తొల్కాప్పియము"నకు పనమ్ పరనార్ వ్రాసిన "శిఅప్పాయిరమ్" అను ప్రశంసా గ్రంథమున తమిళదేశమునకు ఎల్లలు పేర్కొనుచు- "వడ వేఙ్గడమ్- తెన్గుమరి అయిడై తమిళ్కూరు నల్లులహమ్" అని ఉత్తరమున వేంగడమును సరిహద్దుగా చెప్పుటకు కారణము" అక్కడ శెన్తమిళ్ భాషకు పరమాచార్యులైన షణ్ముఖుడు నివసించుటచేత" అని. ఈతని కాలముకూడ తెలియరాదు.

ఇక కాల నిర్ణయము సరిగా జరుగని, బహుశ, క్రీ. శ. ఏడవ శతాబ్దము నాటిది కావచ్చునని ఊహింపబడు చున్న "శిలప్పది కారము" అను ప్రముఖ గ్రంథమున దీని కర్తయగు యువరాజస్వామి యిట్లు వర్ణించెను:

"వీఙ్గు నీరరువి వేంగడమెన్నుమ్
ఓఙ్గుయర్ మలయత్తుచ్చిమిమిశై
విరికదిర్ ఞాయిఱుంతిఙ్గళుం విళఙ్గి
ఇరుమరుఙ్గోఙ్గియవిడై నిలై తానత్తు
మిన్నుక్కోడి యుడుత్తు విళఙ్గు విఱ్పూణ్డు
నన్నిఱ మేగమ్ నిన్రదుపోల
పగై యణజ్కా....యుమ్ పాల్వెణ్ శఙ్గముమ్
తకైపెఱు తామరై కైయినేన్ది

తమిళ తెలుగు వాఙ్మయములు- సప్తగిరి హరిహరనాథుడు

నళజ్గళరరామరర్ విఙ్బ్బాణు
పోలమ్బ్వాడైయిఱ్ పొలిన్దు తోన్ఱియ
శెజ్గణ్ నెడియోన్ నిన్ఱవణ్ణముమ్"

తిరువేంగడమున వెలసియున్న స్వామి- శంఖ చక్రములను, కౌస్తుభమును ధరించి మేఘవర్ణుడై నిలిచియున్న వాడే- అని దీని తాత్పర్యము.

ఆళ్వారాచార్యు లందరూ తిరుమలస్వామి విష్ణువే యని వర్ణించిన వివరములు వెనుక పేర్కొన బడినవి. ఒక రిద్దరు ఆళ్వారులు హరిహర స్వరూపుడని స్తుతించిన వైనముకూడ వెనుక పేర్కొన బడినది.

కాల నిర్ణయము వివాదాస్పద మైనను క్రీ. శ. 5వ శతాబ్దికి చెందిన వారని చెప్పుటకు సవకాశముగల కారైక్కాలమ్మయారును, శేరమాన్ పెరుమాళ్ నాయ నారును హరిహరు లిద్దరు ఒకే మూర్తిలో నొదిగియుందురను సమన్వయ భావమును ప్రకటించిన వైనముకూడ కానవచ్చు చున్నది. ఇది వేంకటనాథ విషయమును గూర్చియే సూచించినట్లు భావింప వచ్చును.

కారైక్కాలమ్మ యారులు ఇట్లు సెలవిచ్చిరి:

"మిన్పోలుమ్ శెజ్జడైయాన్ మాలోడుమ్ ఈణ్డిశైన్దాల్
ఎన్పోలుమ్ కాణ్బార్కట్ కొన్ఱిరేల్- తన్పోలుమ్
పొఙ్గున్ఱుమ్ నీలమణిక్కున్ఱుమ్ తాముదనే
నిఱ్కిన్ఱ పోలుమ్ నెడిదు"

శేరమాన్ పెరుమాళ్ నాయనార్లు ఇట్లు సెలవిచ్చిరి:

"ఇడమాల్ పలన్దా నిడప్పాల్
తు....య్ వలప్పాలోణ్ కొన్ఱ
వడమాలిడన్దుగిల్ తోల్ వలమ్
ఆ....యిడం వలమాన్
ఇడమాయ్ కరిదాల్ వలఙ్జో లివనుక్కె....ల్ నలఙ్గార్
కుడమాలిడయ్ వలమ్
కొక్కరై యామెన్గళ్ కూత్తనుక్కే",

సారాంశము పైన సూచింపబడినది. విస్తరభీతిచే వివరణము జోలి విర

మించటమైనది.

ఇక వేంకటేశ్వరుని హరిహర స్వరూపమును గూర్చిన "ప్రతీకా" లక్షణము లను కొట్టవచ్చినట్లుగా చెప్పిన పేయాళ్వారుల 63వ పాశురము వెనుకప్రస్తావింప బడినది. దీనికి ఉప బలకముగ పొయ్‌గై యాళ్వారు చెప్పిన పాశురముల నుట్టంకించి వాటినికూడ తిక్కన అనుసరించిన విధము వివరింప బడినది.

తెలుగు వాఙ్మయము వేంకటేశ్వరుడు

తొట్టతొలుత తెలుగు భాషలో, తెలుగు లిపిలో వెలువడిన శాసనము విజయ నగర ప్రభువగు మహామండలేశ్వరుడైన మీసరగండ మంగిదేవ మహారాజుగారిది. ఇది తిరుపతి దేవస్థాన శాసన సంపుటిలో 179 సంఖ్యగలది. ఆ శాసన పాఠమిది:

"శ్రీ విజయాభ్యుదయ శకవరుసంబులు 1281 అగునేంటి, వికారి సంవత్సర ఆషాఢ శుద్ధ దశమి మందవారాన, స్వస్తి శ్రీ మహామండలేశ్వర మీసరగండ మంగిదేవ మహారాజులు తిరుమల దేవరకు పటాదిపగగు సువర్ణాది సిఖరమును ఎతిం చెను. మంగళం మహా శ్రీః శ్రీః శ్రీః అని.

దాదాపు ఇదే సమయమున ఎఱ్ఱాప్రెగడ రచించిన నృసింహ పురాణములో ప్రథమాశ్వాస ప్రారంభమున గాలవమహర్షి చేసిన తీర్థయాత్రల పట్టికలో "శ్రీవేంక టాచల స్థాయి గొలిచె" అని పేర్కొనబడినది.

ఈ రెండింటిలో మొదటిదగు శాసనము తిక్కనకు కొంచెము పూర్వము గాని, తిక్కన నాటిదిగాని కావలయును. రెండవదగు నృసింహ పురాణము తిక్క నకు కొంచెము అర్వాచీనము. ఈ రెండింటిలోను స్వామినిగూర్చిన ప్రసక్తియున్నది గాని వర్ణనలేదు. తమిళ వాఙ్మయమున గల స్వామిని గూర్చిన వర్ణనలన్నియు భగవద్రామానుజుల వారు వేంకటేశ్వరుని విష్ణువుగా తీర్మానించుటకు పూర్వము వ్రాయబడినట్టివి. తెలుగు వాఙ్మయమునగల యీ కొద్దిపాటి ప్రసక్తి స్వామి విష్ణు రూపము దాల్చిన పిమ్మటిది. మన కిక్కడ విషయనిర్ధారణ కుపకరించునది తమిళ వాఙ్మయము మాత్రమే. ఇప్పటికి చెప్పినదంతయు సమీక్షించిన మీదట తెలుచున్న విషయము లివి:-

ఆ రోజులలో- ఆమాటకొచ్చిన బహుశా ఇప్పుడుకూడ కొందరు కొందరు- అటు వైష్ణవులుగాని, యిటు శైవులుగాని, పెద్దపులి తరుముకొని వచ్చినను దాని

తమిళ తెలుగు వాఙ్మయములు- సప్తగిరి హరిహరనాథుడు

కాహార మగుటకైనను సిద్ధపడు చుండిరేగాని ఆత్మరక్షణ కొఱకు, దాగుకొనుటకై వైష్ణవులు శివాలయములలో దూఱుటకుగాని, శైవులు విష్ణ్వాలయములలో దూఱుటకు గాని ప్రవేశించు చుండెడివారు కాదు! ఇక మామూలుగా దైవ దర్శనార్థము వెళ్లుట అసంభవము! అట్టియెడ వేంకటేశ్వరుడు శివుడే అయ్యుండినచో వైష్ణ వాళ్వారులు గాని, విష్ణువే అయ్యుండినచో శైవ నాయనారులు గాని దర్శనార్థము వెళ్లుట ఎట్లు సంభవించినది అన్నది విచికిత్స! పొరపాటున వెళ్ళిరిబో, ఆ దేవుడు తమ దేవుడు కానిచో ఆ విషయమునే చెప్పియుందురే! అట్లుగాక, అతడు తమ దేవుడే యని శైవులు, తమ దేవుడే యని వైష్ణవులు వాదులాడు కొనుచు తమ వానినిగా చేసి కొనుటకు ఇంత తహతహ లాడుట యెందులకు? ఇంత సాహిత్యమును సృష్టించుట యెందులకు? అన్నది మఱియొక విచికిత్స! కాగా, తేలుచున్న విషయమిది: క్రీ.శ. ఒకటవ శతాబ్దిలో "తొల్కాప్పియము" నాటి కాలమునుండి పదకొండవ శతాబ్దిలో రామానుజుల నాటి వఱకు ఆ యా శతాబ్దులలో ఏ కారణము చేత నైనగాని వేంకటేశ్వరుడు వివిధ రూపములు దాల్చి యుండును. ఏ యే మహనీయున కెట్లెట్లు కాన్పించెనో వారట్లట్లు వ్రాసియుండిరి. లేదా, వేంకటేశ్వరుడు హరిహర స్వరూపు డగుట వలన శైవులు ఏకదేశిగా శివ స్వరూపమును మాత్రమే పరిగ్రహించియు, వైష్ణవులు ఏకదేశిగా విష్ణు స్వరూపమును మాత్రమే పరిగ్రహించియు అట్లు వర్ణించి యుందురు. లేదా, యథార్థమగు హరిహర స్వరూపమునే దర్శించి సమ దృష్టితో హరిహరనాథాత్మక సమన్వయ సాహిత్యమును సృష్టించి యుండిరి కావచ్చును. తిక్కన, స్వామియొక్క యీ సర్వమగు పూర్వచరిత్రను స్వీకరించి స్థూలదృష్టికి హరిహరనాథ తత్త్వమును ప్రతిపాదించినట్లు కాన్పించు చున్నను సూక్ష్మదృష్టితో పరిశీలించినచో దాని కతీతమగు, స్వామియొక్క సర్వదేవతాకత్వమును మాత్రమే ప్రతిపాదించిన మహనీయుడు!

నన్నయ ప్రయోగించిన "హరిహరద్వంద్వమే"
తిక్కన హరిహరనాథరూపకల్పనకు మూలకారణము.

మనకు ఆదికవియు ఆదర్శకవియునైన నన్నయభట్టారకులు తన భారతావ తారికలో "అని సకలభువనరక్షణప్రభువులై యాద్యులైన హరిహరహిరణ్యగర్భ పద్మోమావాణీసతుల స్తుతియించి" అనియు, "హరిహరాజ గజాననార్క షడాస్యమాతృ

సరస్వతీగిరిసుతాదిక దేవతాతతికిన్ నమస్కృతిసేసి" అనియు శ్రవణసుఖముగను, స్ఫూర్తిదాయకముగను ఉండునట్లు హరిహరద్వంద్వముతో ప్రయోగించినాడు. తిక్కన దీనికి నాకర్షితుడైనాడు. కావుననే తన నిర్వచనోత్తర రామాయణ పీఠికలో "హరిహర పద్మగర్భులను నాది కవీంద్రుల నూత్న సత్కవీశ్వరులను భక్తి గొల్చి" అని తానుకూడ "హరిహర ద్వంద్వమును" ప్రయోగించినాడు.

నన్నయ "హరిహర హిరణ్యగర్భులను" అని ముగ్గురినీ పేర్కొన్నను హిరణ్యగర్భునకు పూజా పునస్కారములు లేవుగాన నిలుచునది హరిహర ద్వంద్వమే. "శివకేశవ" అను మఱొక ద్వంద్వమున్నప్పటికినీ "హరిహర ద్వంద్వమున" నున్న నాదము, శ్రుతి సుభగత్వము, ఆకర్షణ, ఉచ్చారణ సామ్యము, అందువలన ఏర్పడు ఈ జమిలి వేల్పుల మధ్యగల ఏకత్వ స్ఫురణ "శివకేశవ ద్వంద్వము"లో లేదు. కావున తిక్కన నన్నయగారి "హరిహర ద్వంద్వమునే" స్వీకరించి తన హరిహర నాథ రూపకల్పనకు ప్రాతిపదికను నిర్మించుకొని నాడని కొందరు విమర్శకులు సెల విచ్చినమాట యథార్థము. (వ్యాసము: రెండు అవతారికలు, కాకరపర్తి ముఖలింగ శర్మ, భారతి). తిక్కన తొలుత శాబ్దికముగ ఈ "హరిహర ద్వంద్వము" చేత నాకర్షితుడైనాడు. పిమ్మట నన్నయ ప్రతిపాదించిన సకల దేవతా సమాహార సమన్వయ స్వరూపమును అవాహన చేసికొనుటద్వారా హరిహరనాథ తత్త్వదర్శనమును రూపొందించు కొనినాడు. దానిని సప్తగిరి వేంకటనాథ నిష్ఠముచేసి పద్యములు వ్రాసినాడు. పద్యములను వ్రాయుటలోకూడ నన్నయ్యనే అనుకరించినాడు. నన్నయ తన భారతములోని ఆశ్వాసాద్యంత పద్యములను రాజరాజనరేంద్రుని సంబోధించుచూ ఎట్లు వ్రాసినాడో అదేవరుసవఱవడిలో తిక్కన హరిహరనాథుని సంబోధించుచూ పద్యములను వ్రాసినాడు. ఇదీ సిద్ధాంతము. రాయి రాయి కొట్టుకున్నప్పుడు తక్షణ నిప్పురవ్వలు లేచినట్లు ఒక్క శబ్దమేచాలు ఒకానొక మహాతత్త్వ కల్పనకు స్ఫూర్తి ప్రసాదించుటకు! మథించి చూడగా హరిహరనాథ తత్త్వ ప్రతిపాదనలో తిక్కనకు ఎన్నో విషయములు కలిసి వచ్చినవనుట నిక్కము!

నన్నయగారి ప్రసక్తి వచ్చినదిగాన ఒక్కవిషయ మాలోచింపవలసియున్నది. తిరుమల వేంకటేశ్వరుని గూర్చి అసలాయన దృష్టికి వచ్చియుండునా! ఆయన తిరుమలస్వామిని సేవించి యుండునా? అన్నదొక విచికిత్స! సేవించియుండుననియే

తమిళ తెలుగు వాఙ్మయములు- సప్తగిరి హరిహరనాథుడు

సమాధానము! నన్నయ భట్టారకులు భగవద్రామానుజుల వారికి సరిగ్గా సమకాలి కులు. రామానుజులు కాంచీపురమునకు చెందినవారు. నన్నయ నారాయణభట్టు లిర్వురు సహాధ్యాయులై బాల్యమున కాంచీపురములోనే విద్యాభ్యాసము చేసినట్లు కొందఱు చారిత్రకుల వక్కాణ. పూర్వాపరములను పరిశీలించిచూడగా మఱి రామా నుజులకు తెలిసిన వేంకటేశ్వరుడు నన్నయ నారాయణభట్టులకు తెలియకపోవుట ఎట్లు సంభవించును? తెలిసియే యుండును. ఆతడు సేవించియే యుండును. అయితే, ఆత డెక్కడగాని తన వాఙ్మయములో వేంకటేశ్వరునిగూర్చి ప్రస్తావించినట్లు కాన రాదు. అందుకు కావలసిన సందర్భము, అవసరముకూడ నుండవలయును గదా? అట్లుగాక, ఆతడు హరిహర ద్వంద్వమును ప్రయోగించుటతోబాటు సకల దేవతా సంతతికి నమస్కరించుచు, ఏకరస రంజితముగ నావాహనచేసిన తీరునుబట్టి అది సకల దేవతా స్వరూపుడైన వేంకటేశ్వరుని మనసు నందుంచుకొని చేసిన ఆవాహన కావచ్చునని ఎవ్వరైన భావించినచో నది పరిశీలింప వలసిన విషయమని అంగీక రింపక తప్పదు!

ఈ విధముగ నన్నయ ప్రయోగించిన "హరిహర ద్వంద్వము" నుండియు, ప్రతిపాదించిన సకల దేవతా సమాహార సమన్వయ స్వరూపము నుండియు స్ఫూర్తిని పొందిన తిక్కన హరిహరనాథ తత్త్వమును రూపొందించి దానిని ఏడుకొండల హరి హరనాథ నిష్ఠము చేసినాడు! ఈ రహస్యమును పసిగట్టిన ఎఱ్ఱన తన నృసింహ పురాణములో ప్రథమాశ్వాస ప్రారంభమున గాలవ మహర్షి చేసిన తీర్థయాత్రల పట్టి కలో "వేంకటాచల స్థాయి గొలిచె" అని తిరుమలనుగూడ చేర్చినాడు. తాను స్వయ ముగ గిరిశపద భక్తి తత్పరు డయ్యును గోవింద గుణాదర సౌమనస్యధన్యుడై నాడు. తన హరి వంశములో ఆ తత్త్వమును ప్రతిపాదించినాడు. సప్తగిరి హరి హరనాథుని సేవించినాడు. ఆ వరుసలో నాచన సోముడు, బైచరాజు వేంకట నాథుడు మొదలగు నితరకవులుకూడ పయనించినారు. ఇట్లు సమన్వయించి చూడగా ఆంధ్రభాషకు ఆది భిక్ష పెట్టిన నన్నయ భట్టారకులే ఆంధ్రదేశమున హరిహరనాథ తత్త్వ దర్శనమునకు కూడ మార్గదర్శకులైనారనుట నిక్కము!

రచన: ఆగస్టు 1981

ఆళ్వారులు- తిక్కన వర్ణించిన

# సప్తగిరి హరిహరనాథ సౌందర్యలహరి

పన్నిద్దరాళ్వారులలో మధురకవి, తొండరడిప్పడి (విప్రనారాయణుడు) తప్ప తక్కిన పదిమందియు కలిసి వేంకటేశ్వరునిగూర్చి గానముచేసిన పాశురములు మొత్తము రెండు వందల పైచిలుకుగలవని పూర్వోక్తము.

ఈపాశురములలో వీరు తిరువేంగడమునందలి ప్రకృతిసౌందర్యమును గూర్చియు, స్వామియొక్క మహిమాతిశాయిత్వమునుగూర్చియు అద్భుతరమణీయముగ వర్ణించిరి. కొండకోనలు, సెలయేళ్ళు, తీర్థములు, తిర్యగ్జంతువులు, భక్తిపరవశములై సర్వేశ్వరునిగూర్చి గానముచేయుచున్నవి! తీర్థములలో నివసించుచేపలు యాత్రికుల సౌకర్యార్థము నీటినినిర్మలముగనుంచుచు వారికి తమవంతుసేవలను చెల్లించుచూ ధన్యత్వముచెందుచున్నవి. స్వామిపుష్కరిణిలో విహరించుపక్షులు పరిసరములను పరిశుభ్రముగనుంచుచు భక్తులనుసేవించుచున్నవి. కోతులుకూడ తామరపువ్వులను కోసికొనిపోయి సర్వేశ్వరుని పూజించుచున్నవి. ఇత్యాదిగా ఎంతో రమ్యముగ వర్ణించిరి. ప్రకృతియొక్కయు, ప్రభువుయొక్కయు మిళితమై ప్రవహించుసౌందర్యపువెల్లువలో, ఆయనుభూతిలో ఆళ్వారులు అడుగడుగునపరవశించిపోవుచుండిరి. వరుసక్రమములో నాల్గవవారైన తిరుమలశైయాళ్వారు గానముచేసిన యీ పాశురమునందలి భావసౌందర్యగరిమను అనుభవింపుడు:-

"వైప్పన్ మణివిళక్కామ్ మామదియై, మాలుక్కెన్ఱు
ఎప్పొళుదుమ్ కైనీట్టుమ్ యానైయై,—ఎప్పొదుమ్
వేదువశైక్క క్కుఱవర్ విల్లెడుక్కుమ్ వేఙ్గడమే,
నాదువశైత్తాదు మేల్ నన్ఱు"

నాన్ముగన్ తిరువన్దాది — 46

ఒక ఏనుగు వేంగడమునందు నివసించుటచే దివ్యజ్ఞానముపొందినది. అది సకలకలాపహారుడైన చంద్రునిచూచి ఇది వేంకటనాథునకు మంగళదీపముగనున్న

ఆళ్వారులు— తిక్కన వర్ణించిన సప్తగిరి హరిహరనాథ సౌందర్యలహరి బాగుండునని భావించినది. తొండమునుచాచి అందుకొనుటకై ప్రయత్నించుచు పరవశించుచుండెను. దానిని ఎటూకదలనీయక వేటకాండ్రు నాల్గువైపులచుట్టు ముట్టిరి. అదిచూచి సహింపనేరక అచ్చటిబోయవాండ్రు వారిపై బాణములువేసి ఆ యేనుగును సంరక్షించుచుండిరి. అట్టి వేంగడమును ఆశ్రయించుట లోకములన్నింటికీ ప్రదక్షిణముచేయుటకంటె మేలైనది!

వేంకటేశ్వరునియొక్క "ప్రతీకాలక్షణములతో" కూడియున్న మూర్తిని ఉన్నదున్నట్లు పేర్కొనవలయునన్న ఆళ్వారులలో మూడవవారగు పేయాళ్వారు గానముచేసిన ౮౨వ పాశురమునే మఱల నుట్టంకింప వలసియున్నది. అదివెనుక ననేకపర్యాయములు ఉల్లేఖింపబడినది. కావున మఱొక పాశురమును ఉదాహరించుట సమంజసము. ఆళ్వారులు తమతమ అభిరుచులనుబట్టియు, అనుభూతులనుబట్టియు దశావతారములలో ఏదేని ఒక అవతారమునందలి కథాంశమునో, పరాక్రమ లీలనో, లీలావిలాసమునో స్వీకరించి స్వామిని ఆవాహనచేసిరి. ఆ పాశురము లన్నియు పరమమనోహరముగనుండును. ఎట్టికథాంశ స్పర్శయులేక, సూటిగను, సూక్ష్మముగను, తత్త్వమును తేటపరచు అందమైన చిన్నచిన్నపాశురములను కొందఱు వెలయించిరి. నమ్మాళ్వారు ప్రసాదించిన తిరువాయ్‌మొళిలోని ౩-వ పది, ౩-వ తిరువాయ్‌మొళిలోని ఈ ౩-వ పాశురమును చిత్తగింపుడు:

> అణ్ణల్మాయన్ అణికొళ్ శెన్దామరై
> క్కణ్ణన్, శెజ్ఞనివాయ్ క్కరుమాణిక్కమ్,
> తెణ్ణిఱై చ్చునైనీర్ త్తిరువేంగడత్తు,
> ఎణ్ణిల్ తొల్ పుకళ్ వానవరీశనే.

ఆభరణముల అపేక్షలేకయే స్వతస్సిద్ధమగు సౌందర్యము, సౌకుమార్యము, లావణ్యము మొదలగు తనదివ్యమంగళ విగ్రహముయొక్క కల్యాణగుణములచే ఆశ్చర్యభూతుడై, కెందామరలవంటి దివ్యనేత్రములను, దొండపండువంటి ఎఱ్ఱని అధరోష్టమును, ఇంద్రనీలములవంటి దివ్యదేహమును గలవాడై, అసంఖ్యేయములగు, అనాదిసిద్ధములగు, దివ్యకల్యాణ గుణములచే గలిగినకీర్తితోగూడుకొన్నవాడై విలసిల్లు సర్వేశ్వరుడు నిత్యసూరులు తనను అనుభవించునట్లు సర్వస్వదానము చేయుచున్నాడు. మనమును అతనిని అనుభవించుటకు వీలగునట్లు పరి

శుద్ధమై, సంపూర్ణములైన నెలయేళ్ళను కలిగియున్న తిరువేంగడమునకు విచ్చేసియున్నాడు!

ఆళ్వారుల పాశురములలో ఎన్నో విధములైన వర్ణనలున్నవి. కాని అలమేలు మంగా వేంకటేశ్వరుల సౌందర్యవర్ణనగాని, శృంగారవర్ణనగాని ప్రత్యేకించి చేసిన వైనముకానరాదు. ప్రతి పాశురములో గాకపోయినను, అధికసంఖ్యాక పాశురములలో ఒక విశేషణముచేతనో, ఒకభావముచేతనో వేంకటేశ్వరుని సౌందర్యము వర్ణింపబడినను అలమేలుమంగా సౌందర్యవర్ణనమాత్రము అరుదుగా కాన్పించును. నమ్మాళ్వారు, ఆండాళ్ళు (గోదాదేవి) మాత్రము అక్కడక్కడ వారి సౌందర్య వర్ణనయనుడు, శృంగారవర్ణనయనుడు, కొన్ని కొనమెఱుపులు చూపించిరి. శ్రీనమ్మాళ్వారు ప్రసాదించిన తిరువాయ్‌మొళి లోని "ఉలగమణ్ణ పెరువాయా" అను 6_వ పది, 10_వ తిరువాయ్‌మొళి లోని ఈ 10వ పాశుర వాక్యము నరయుడు:

"అగలగిల్లేన్ ఇఱైయుమెన్ఱు అలర్‌మేల్ మఙ్గైయుఱైమార్‌బా!"

తృటికాలమైనను ఎడబాసి యుండజాలను అని మనవిచేసికొనుచు తామర పుష్పముపై నివసించుచున్న నిత్యయౌవనవతియగు శ్రీలక్ష్మీదేవి నిత్యనివాసము చేయుచున్న దివ్యవక్షస్థలముతో విరాజిల్లుచున్నస్వామీ! అనియర్థము.

శ్రీ ఆండాళ్ ప్రసాదించిన నాచ్చియార్ తిరుమొళిలోని 8_వ తిరుమొళి-విణ్ణీల మేలాప్పు లోని ఈ 4-వ పాశురమును ఆలకింపుడు:

మిన్నాగత్తై .... గిన్ఱ మేగఙ్గాళ్, వేంగడత్తు,
తన్నాగత్తిరుమంగై తఙ్గియశీర్ మార్వఱ్కు,
ఎన్నాగత్తిళమ్ కొఙ్గై విరుమ్బిత్తామ్ నాళ్‌తోఱుమ్,
పొన్నాగమ్ పుల్‌గుదఱ్కు ఎన్‌పురివుడైమైశెప్పుమినే.

ఎల్లవేళలయందు మెఱుపు తీగెలతోకలిసి సుఖములననుభవించు మేఘములారా! నా ఉరమునందు క్రొత్తగా పొటమరించిన కుచములపై తహతహపడి నా నాథుడు తన అందమైన, విశాలమైన, వక్షః స్థలముతో గాఢాలింగనమొనరించుగాక, అని యెల్లప్పుడు ఉవ్విళ్ళూరుచున్న నాకౌతుకమునుగూర్చి — తన దివ్యవక్షస్థలమునందున్న శ్రీ అలమేలుమంగతో తిరువేఙ్గడమున విహారముసలుపుచుండు నా ప్రాణేశ్వరునకు దయచేసి విన్నవింపుడు. అని భావము.

ఆళ్వారులు– తిక్కన వర్ణించిన సప్తగిరి హరిహరనాథ సౌందర్యలహరి

తన్ ఆగమ్ తిరుమంగై తంగియ శీర్‌మార్వత్‌క్కు — అలమేలుమంగని నిరంతరము తన దివ్యవక్షస్థలముతో గాటపు కౌగిలింతల హత్తుకొనుటలతో రమింప జేయుచున్న స్వామికి, అట్లే విరహవేదనతో తాళజాలని తనను ఉపేక్షించుట న్యాయము కాదనిధ్వని. అందమైన శృంగారవర్ణనయిది.

తిరుమఙ్గైయాళ్వారు చిత్రీకరించిన

వేంకటేశ్వరుని హరిహరస్వరూపసౌందర్యము.

పన్నిద్దఱాళ్వారుల వరుస క్రమములో చివరివారు శ్రీ తిరుమఙ్గైయాళ్వారు. వీరు వేంకటనాథుని గూర్చి ౬౫ పాశురములను గానము చేసిరి. ఇవి "పెరియతిరుమొళి" అను భాగములోనివి. ఈ పాశురములన్నియు వేంకటనాథుని విష్ణువుగనే వర్ణించినవని చెప్పవలసిన పనిలేదు. ఒక్కటి మాత్రము స్వామియందు హరిహర రూపురేఖలను చిత్రించినది. ఇవిగాక "తిరునెడున్దాణ్డకము" అను పేరుతో మఱి నాల్గుపాశురములనుకూడ సెలవిచ్చిరి. వీటిలో ప్రతిపాశురమునందు వేంకటనాథునితోపాటు వైష్ణవసంప్రదాయమున దివ్యతిరుపతులుగా ప్రసిద్ధికెక్కిన క్షేత్రములలోని మఱి కొందఱు దేవతలను గూడ స్తుతించిరి. ఇందులో కూడ ఒక్క పాశురము వేంకటనాథుని యందు హరిహరరూపురేఖలను గీసి చూపించినది. ఈ రెండు పాశురములలోని రూపురేఖలు పేయాళ్వారు తన 63–వ పాశురములో స్వామియందలి "ప్రతీకా" లక్షణములను చెప్పినట్లుగాక, దాని కనుగుణముగ నుండునట్లు గీయబడిన ఒకానొక రమణీయ భావ చిత్రణకు ప్రతీకలు. ఇప్పుడు మనకు కావలసిన ఆ రెండు పాశురములు ఇట ప్రస్తావింపబడుచున్నవి:–

"ఎఙ్గళుక్కు అరుళ్ శెయ్‌గిన్ఱ ఈశనై,
వాళవార్ కుంతలాళ్ మలైమఙ్గైదన్,
పఙ్గనైప్పఙ్గిల్ వైత్తుగన్దాన్ తన్నై,
ప్పాన్మై యైప్పని మామదియమ్ తవ....,
మఙ్గులైచ్చుడరై వడమామలై,
యుచ్చియైనచ్చినామ్ వణఙ్గప్పడుమ్,
కఙ్గులై పృగలై చ్చెన్నునాడి,

క్కణ్ణమజ్గైయుళ్ కణ్డుకొణ్డేనే"

(పెరియతిరుమొళి-7-10-3)

మనపై కృపారసమును చల్లుచున్నవాడును, దివ్యపరిమళములు వీచుచున్న మనోజ్ఞములగు కుంతలములతో నలరారుచున్న పార్వతీదేవి తనకు అర్ధాంగిగా గలిగిన పరమశివుని తనసరసనే నిలుపుకొని ఆనందించుచున్నవాడును, ఇటువంటి సౌశీల్యము రూపుగట్టినవాడును, చల్లనిచంద్రుడు విహరించు నాకాశస్వరూపుడును, సూర్యమండలాంతర్వర్తియును, ఉత్తరదిక్కున నెలకొనియున్న వేంకటాచల శిఖరమునకు భూషణమై విరాజిల్లుచున్నవాడును, మనకు ఆశ్రయమైనవాడును, దివారాత్రములకు ప్రవర్తకుడును, అగు స్వామిని యన్వేషించుచూపోయి చివరికి తిరుక్కణ్ణమంగై దేశమున కనుగొని సేవింపగలిగితిని.

ఇందు "వాశవార్కుంతలాళ్ మలైమజ్గైదన్, పజ్గనైప్పజ్గిల్ వైత్తుగన్దాన్ తన్నై"=దివ్యపరిమళములు ప్రసరింపజేయుచున్న మనోజ్ఞములైన కుంతలములతో నొప్పారుచున్న పార్వతీదేవిని అర్ధాంగిగాకలిగియున్న పరమేశ్వరుని తనప్రక్కనే నిలుపుకొని ఆనందించుచున్న "వడమామలైయుచ్చియై" ఉత్తరదిశలోనున్న తిరుమలశిఖరమునకు భూషణమైనవాడు. అన్నమాటలు మనకిక్కడ ప్రకృతాంశములు

వజ్గత్తాల్ మామణివన్దున్దుమున్నీర్,
మల్లైయాయ్! మదిళ్కచ్చియూరాయ్! పేరాయ్!
కొజ్గత్తార్ వళజ్గొన్తై యలజ్గల్ మార్వన్,
కులవరైయన్ మడప్పావై ఇడప్పాల్ కొణ్డాన్,
పజ్గత్తాయ్! పాఱ్కడలాయ్! పారిన్మేలాయ్,
పనివరైయినుచ్చియాయ్! పవళవణ్ణా!
ఎజ్గు....య్! ఎమ్బెరుమాన్! ఉన్నైనాడి,
ఏ....యేన్ ఇజ్గనమే ఉ....దరుగేనే.

(తిరునెడున్దాణ్డకము-9)

మల్లై, కంచి (తిరువెహ్కా), తిరుప్పేర్ అనుదివ్యదేశము లందు వేంచేసి యున్నవాడా! తేనెతో నిండిన ఎత్తైన కొన్దపుష్పముల దండతో ఒప్పారుచున్న దివ్యమైన వక్షస్థలము గలవాడును, హిమగిరికి ముద్దులపట్టియగు పార్వతిని వామ

ఆళ్వారులు– తిక్కన వర్ణించిన సప్తగిరి హరిహరనాథ సౌందర్యలహరి భాగమున అర్ధాంగిగా కలిగియున్న పరమేశ్వరుని కుడివైపున కలిగియున్నవాడా! పాలసముద్రమున పవ్వళించి యున్నవాడా! అవతారములనెత్తి భూమిపై విహరించినవాడా! చల్లనైన అందమైన వేంకటాచలము యొక్క శిఖరమున నివసించుచున్నవాడా! పగడమువలె రమ్యమైన వర్ణముగలవాడా! నా ప్రభువా! ఎక్కడున్నావు? నిన్ను వెదకివెదకి విసిగివేసారితినోయీ!

ఇందు"కొజ్గత్తార్ వళజ్గొన్తైయలంగల్ మార్వన్, కులవరైయన్ మడప్పావై ఇడప్పాల్ కొణ్డాన్, పజ్గత్తాయ్!"—మకరందభరితమై అరుణరమ్యములైన కొన్ద పూలమాలతో కూడియున్న అందమైన వక్షస్థలముగల వాడును, హిమగిరికి ముద్దుల కుమారైయైన పార్వతీదేవిని ఎడమవైపున కలిగియున్నవాడును, అయిన పరమేశ్వరుని కుడి ప్రక్కన గలిగిన వాడా!, "పనివరైయినుచ్చియాయ్''—వేంకటాచల శిఖరనివాసా! అన్నవాక్యములు మనకిక్కడ ప్రస్తుతాంశములు. పవళవణ్ణా!—పగడపుకాంతివంటి దేహకాంతి గలవాడా! అన్నదికూడ ముఖ్యమైనదే.

ఇప్పుడు ఈ రెండు పాశురముల భావములను సమన్వయించి చూతము: ఇదొక అద్భుతరమణీయమైన దృశ్యము! అదిగో, వేంకటాచలశిఖరము! అల్లదుగో, వేంకటేశ్వరుడు! పగడపుకాంతితో వెలుగొందుచున్నాడు! అతనివక్షస్థలముపై అల్లదిగో, శ్రీదేవి! అదుగో, ఆ ప్రక్కనే పరమశివుడు! అరుణరమణీయములైన కొన్ద పుష్పములమాలతో విరాజిల్లుచున్నాడు! అల్లదిగో, అతని అర్ధాంగియైన గౌరీదేవి! సహజ గంధములను వీచుచున్న మనోజ్ఞములైన కుంతలములతో నలరారుచున్నది! "ఇదే! ఇయ్యదే! శ్రీయన గౌరి నాబరగు చెల్వకు చిత్తము పల్లవింప భద్రాయిత మూర్తియై హరిహరంబగు రూపముదాల్చి" వెలుగొందుచున్న వేంకటేశ్వరుని "వ్యాససమాసైకరూపత్వము"! సర్వదేవతా సమవాయ స్వరూపము!

తిరుమజైయాళ్వారు ఈ రెండు పాశురములను వెలయించుటలో గొప్ప ఔచిత్యమును, సంప్రదాయమును పాటించెను. ఔచిత్యమెట్లన, వస్తుస్థితికను రూపముగ వేంకటేశ్వరుడు హరిహరస్వరూపుడని సూచించుట. సంప్రదాయమెట్లన, పార్వతీదేవి కుంతలములు సహజ సుగంధ భరితమైనవి, మనోజ్ఞమైనవి అని వర్ణించుట. ఈ సంప్రదాయ గౌరవమును గూర్చి కొంత చెప్పవలసియున్నది:

అగస్త్యమహర్షి ద్రావిడభాషను సృష్టింపదలచి అష్టాదశాక్షరమైన మాతృకను రచించి అమలమైన శంఖఫలకమును తీసికొని వచ్చి పాండ్యరాజున కిచ్చెను. ఈ ఫలకము ద్రవిడ సాహిత్యమార్గమున సరస్వతీదేవికి సరివచ్చు ఎందరు కవులకైనను చోటిచ్చు ప్రభావము గలది. దీనిని పూజించి తరతరములు వర్ధిల్లుము. అనియు మంగళాశాసనము చేసెను. దరిమిలా పెక్కు సంవత్సరములకు ఆ వంశమున ద్రావిడ భాషా పోషకుడగు మహారాజొకడుదయించెను. అతని యాస్థానమున శంఖ ఫలకముపై నివసించు యోగ్యతగల పన్నిద్దరు కవులుండిరి. వారిలో నత్కీరుడు అగ్రగణ్యుడు. పరమశివుడు ద్రావిడ భాషయందొక పద్యమును వ్రాసి తన భక్తుడగు మూలస్థాన హరద్విజున కిచ్చెను. అతడాపద్యమును పాండ్యునిసభలో చదివెను. అందులో "సింధురరాజ గమనాథమ్మిల్ల బంధము సహజ గంధంబు" అని యుండెను. అది తప్పని నత్కీరుడనెను. సభలో చిన్నబోయిన హరద్విజుడు తిరిగి వచ్చి ఆ సంగతి శివునకు విన్నవించెను. నత్కీరునితో వాదించుటకు శివుడు స్వయముగా తానేవెళ్ళెను. గిరితనయా ఘనకచభారంబు సహజగంధంబని సమర్థించెను. ప్రత్యక్ష ప్రమాణమునననుసరించి మానవకాంతల కేశపాశము సహజగంధమనుట చెల్లదు. పార్వతీదేవి కేశపాశము సహజగంధము కావచ్చును. అది పరోక్ష ప్రమాణము. మాకు తెలియదు. కావున నమ్ముటకు వీలులేదు. అని నత్కీరుడు త్రోసి పుచ్చెను. శివునకు కోపము వచ్చి కుష్ఠురోగివికమ్మని నత్కీరుని శపించెను. కైలాస దర్శనముచే శాపవిమోచనము కలుగునని అనుగ్రహించెను. జగజ్జననీ జనకులకు సంబంధించిన ఏ విషయమునైనను విశ్వసింప వలెను. శంకించుటయన చార్వాకము చేయుటయే. పరమశివునితో నే నిట్టి చార్వాకమున కేల దిగితిని. అని నత్కీరుడు విచారించెను. ధూర్జటి "కాళహస్తీశ్వర మాహాత్మ్యము" తృతీయాశ్వాసములో ఈ కథను కడు రమ్యముగ రచించెను.

జగద్గురు శ్రీ శంకర భగవత్పాదులు కూడ "సౌందర్య లహరి" 43వ శ్లోకములో జగజ్జననీ కేశపాశము సహజ గంధమను విషయ మిట్లు వర్ణించిరి:

ధునోతు ధ్వాన్తం నస్తులిత దళితేన్దీవరవనం
ఘన స్నిగ్ధ శ్లక్ష్ణం చికురనికురంబం తవశివే,
యదీయం సౌరభ్యం సహజ ముపలబ్ధుం సుమనసో

ఆళ్వారులు- తిక్కన వర్ణించిన సప్తగిరి హరిహరనాథ సౌందర్యలహరి

వసన్త్యస్మిన్మన్యే బలమథన వాటీ విటపినామ్.

తా॥ తల్లీ! నల్ల కలువలవలె చిక్కనై మెఱుగెక్కి నునుపుతేరిన నీ కురుల కొప్పు మా యజ్ఞానమును నశింప జేయుగాక. ఇంద్రుని నందనవనము నందలి కల్పవృక్ష కుసుమములు నీ కుంతలముల సహజగంధమును పొందుటకై నిరంతరము నీ కేశ కలాపమును ఆశ్రయించు చున్నవో! (తల్లి కేశకలాపము కల్పవృక్ష కుసుమములచే అలంకరింపబడినదని భావము).

తమిళ సాహిత్యమున ఈ శంఖఫలకమునకు, నక్కీరుని కథకు చాల ప్రాముఖ్యమున్నది. అసలిక్కడి నుండియే ఆ సాహిత్య చరిత్ర ప్రారంభమగు చున్నదనియు తెలిసినవారు చెప్పుదురు. శంకరులు, తిరుమంగై యాళ్వారు 8వ శతాబ్ది నడిమి భాగమువారు. దాదాపు సమకాలికులు. శంకరుల సాహిత్యమును గూర్చి తిరుమంగైకి తెలియునో లేదో చెప్పలేము. తమిళ సాహిత్యమునుండియే ఆత డీ సంప్రదాయమును స్వీకరించి ఒక్కమాటలో జగజ్జనని సౌందర్యమును రమ్యముగ వర్ణించినాడు.

రెండవ పాశురమున హరుని "వళమ్ కొన్ఱై అలజ్గల్ మార్వన్ = "ఎఱ్ఱని కొన్ఱ" పుష్పముల దండతో ఒప్పారుచున్న వక్షస్థలము గలవాడనియు, హరిని "పవళవణ్ణా" = పగడము వంటి దేహచ్ఛాయ గలవాడనియు వర్ణించుట ఈయిరువురి యేకత్వమును సూచించుటకే యని భావింపవచ్చును. ఈ రెండు రంగులలో కొంత తరతమ భేదమున్నను స్థూలముగా ఒకే రంగుకు చెందినవని చెప్పుటకు వీలైనవి. కొన్ఱ పుష్పములు ఆనాడు తిరుమలపై లభించు పుష్పము లనియు భావించుట లెస్స.

ఆళ్వారులు వేంకటేశ్వరుని వర్ణించిన పద్ధతులు మూడున్నవి: ఒకటి- కేవలము విష్ణువుగా వర్ణించుట. ఈ పాశురములే యెక్కువ. రెండు- వేంకటేశ్వరుని సేవించుటకు బ్రహ్మ మహేశ్వరులు కూడ తిరుమలకు విచ్చేసియున్నారని వర్ణించుట. ఇవి ఏడెనిమిది పాశురములు మాత్రమున్నవి. మూడు- వేంకటేశ్వరుని హరిహర స్వరూపునిగా వర్ణించుట. ఇవి మూడు నాల్గు పాశురములు మాత్రమే ఉన్నవి. ఏపాశురములెన్నియున్నను ఇబ్బందిలేదు. మూర్తి యొక్క "ప్రతీకా" లక్షణములను బట్టిమాత్రమే విషయనిర్ధారణ చేయవలసియున్నది. ఆ దృష్టిలో ఈ మూడవవిధమునకుచెందిన మూడునాల్గు పాశురములే మిక్కిలి కీలకమైనవి. వస్తుస్థితికి ప్రతిబింబము

లనదగినవి. తిరుమంగై యాళ్వారు వర్ణించిన ఈ రెండుపాశురములు 'ప్రతీకా' లక్ష ణమునకు దగ్గఱగానుండి స్వామిసౌందర్యమును అద్భుతముగ వర్ణించినవనుట ఏపాటిమాట!

తిక్కన వర్ణించిన
సప్తగిరి హరిహరనాథ సౌందర్యము

తిక్కన హరిహర స్వరూపుడగు వేంకటనాథుని వర్ణించు పట్టున సాధారణ ముగా సౌందర్య పదమునకు పర్యాయముగ రమ్య, రమణీయ, అభిరామ, శోభ, వికాస, అద్భుత, సముజ్జ్వల - ఇత్యాది శబ్దములను ప్రయోగించుట ద్వారా ఆ భావ మున కొక దీప్తిని కలిగించి స్వామియొక్క మూర్తిని కన్నులకు గట్టించుచుండును. కొన్ని పద్యములలో సౌందర్య శబ్దమును ప్రయోగించి హృదయమున కాహ్లాదము కలిగించును. ఆ కొన్నింటిలో రెండు మూడు పద్యము లిట నుదాహరింపబడు చున్నవి:

క. హరిహరనాథునకుమరు, త్సరిదాకల్పిత మనోజ్ఞ చరణశిరస్సుం
దరమూర్తికి భావనత, త్పర చేతోయుక్త భక్త పరతంత్రునకున్.
(విరాట 1-36)

తా. గంగానది హరిపాదమునకును, హరుని జటాజూటమునకును అందమగు నలంకారముగ నొప్పారు చుండును. ఆ గంగానదియే హరిహరనాథ స్వరూపుని యొక్క చరణమును, శిరస్సును ఒకే సమయమున నలంకరించుట వలన నాతడు మిక్కిలి సుందరమూర్తి యగు చున్నాడు. మఱియు నాతడు తన నిజ స్వరూపము నెఱిగి నిరంతరము భావించు భక్తులకు స్వాధీనుడై యుండును.

ఇది ఆళ్వారులలో మొదటివారగు శ్రీ పొయ్‌గై యాళ్వారు సెలవిచ్చినభావమే. దానిని పుణికి పుచ్చుకొని తిక్కన యీ పద్యమున నిట్లు అచ్చుగ్రుద్దినాడు! ఆ పాశు రము, ఈ పద్యము "తిరుమల వేంకటనాథుడే తిక్కనగారి హరిహరనాథుడు"అను వ్యాసమున పోల్చి చూపబడినవి. (చూ. పుటలు 88, 89).

క. జలనిధి హిమవద్భూధర కలితజనన కేశికౌతుక వ్యక్తావ్య
క్త లలిత సౌందర్య స్ఫుర దలఘు తను శ్రీసనాథ, హరిహరనాథా.
(విరాట 1-40)

ఆళ్వారులు- తిక్కన వర్ణించిన సప్తగిరి హరిహరనాథ సౌందర్యలహరి

తా. హరిహరనాథుడు శ్రీసనాథుడు. ఆమె సముద్రమునుండి లక్ష్మీదేవిగను, హిమవత్పర్వతము నుండి పార్వతీదేవిగను జన్మించినట్టిది. విశ్వవ్యాప్తమగు దేహము గలది. ఆ దేహము లలిత సౌందర్య స్ఫురణ గలది. ఆమె సృష్టికి పూర్వము పర మేశ్వర లీనమై అవ్యక్తముగ నుండును. పిమ్మట వ్యక్త అగు చున్నది.

ఇందు "లలిత సౌందర్య స్ఫురత్" అను ప్రయోగము "లలితాత్రిపుర సుందరిని" సూచించు చున్నదనుట నిక్కము. లలితాత్రిపుర సుందరి, బాలాత్రిపుర సుందరి అను నామములు ఒకదాని కొకటి పర్యాయములు. ఈ నామముల నిట్లు సూచించుటద్వారా తిక్కన వేంకటేశ్వరుని పూర్వ రూపములలో నొకటిగా భావింప బడు బాలా(జీ) రూపమును ఆవాహన చేయుచున్నాడని భావించుట లెస్స.

స్వర్గారోహణపర్వ ప్రారంభ పద్యమునకూడ "మహా విద్యోన్మేషగాత్ర హరి హరనాథా" అని ప్రయోగించుట గమనార్హము. "మహావిద్య" అనగా వనదుర్గా మహాదేవీ ప్రధానమైన సకల దేవతా ప్రతిపాదకమగు మంత్రశాస్త్రము. ఇందు పర మేశ్వరుని సంపూర్ణ నిజస్వరూపము ఉన్మిషితమగునని శాస్త్రము. "వనదుర్గా మహా దేవి" అను నామము, వనములలోను, కొండకోనలలోను, నివసించెడి "బాలా(జీ)ని" సూచించుచు సార్థకమగుచున్నదో! అనియు భావించుట సమంజసమే.

"బాలా"(జీ) స్వరూపమును గూర్చి ఇక్కడొక విషయమును మనవి చేయ వలసియున్నది. ఇప్పుడు మనకులభించు చిత్రపటములలో వేంకటేశ్వరుని పాదములు పురుషమూర్తి పాదములవలెగాక స్త్రీమూర్తి పాదములవలె నుండుట గమనింపవచ్చును. తాబేటిచిప్పలయాకృతిని పోలియున్నవో అన్నట్లుండి, రమ్యమైన కుదింపుగలవిపోలె కాన్పించుటవలన ఇట్టి ఊహాపోహలకు తావిచ్చుచున్నది! తిరుపతితిరుమలదేవస్థానము వారు "బాలాజీభవనము"లని పేరుపెట్టుటలోగాని, ఔత్తరాహులు ఇప్పుడుకూడ స్వామిని "బాలాజీ" అనిపిలుచుటలోగాని యిట్టి యాంతర్యమునే భావింపవచ్చును.

క. కమలవన సదృశదృగ్రుచి సముదయ శమితార్తి భక్తసంఘా, లక్ష్మీ
రమణత్వశివాప్రియతా సమవాయాలంబమాన సౌందర్యనిధీ.

(కర్ణ. 1-321)

తా॥ నీకన్నులకాంతులు వికసించిన పద్మముల కాంతులను పోలియున్నవి. అట్టికటాక్షకాంతుల ప్రసారముచే నీవుభక్తులబాధలను పోగొట్టుదువు. లక్ష్మీరమణ

త్వము, శివాప్రియత్వములు సమవాయసంబంధము నిమిత్తముగాగల సౌందర్యమునకు నిధివినీవు।

ఈపద్యమునందలి భావసౌందర్యమునకు ఆయువుపట్టువు "సమవాయాలంబమాన" అనుప్రయోగము. హరిహరనాథునకుగల లక్ష్మీరమణత్వముగాని, శివాప్రియత్వముగాని విడదీయుటకువీలులేని సంబంధముగలవి. కావుననే వారిరువురు తమనాథుని సౌందర్యమునకులోబడి యెడబాయకున్నారని భావము. తిక్కన మఱి రెండుమూడుతావులందుకూడ ఈ సమవాయ శబ్దప్రయోగముచేత చక్కని భావసౌందర్యమును సంతరించుట గమనింపవచ్చును.

సౌందర్యశబ్దము ముద్రింపబడిన పద్యములందుమాత్రమే సౌందర్యముట్టిపడుననిగాని అట్లుకానిచో కాదనిగాని భావింపరాదు. కొన్నియెడల అట్టిశబ్దప్రయోగము లేవియు లేకపోయినను అంతకుమించిన భావసౌందర్యము లహరులై ప్రవహించి హృదయములనుచేపుట అనుభవింపవచ్చును. ఈక్రిందిపద్యములనరయుదము:

క. శ్రీమత్తులసీపల్లవ దామచ్ఛవిలబ్ధమరకతప్రతిమత్వో
ద్దామప్రభాఽస్థిమాలా శ్యామాయితవిపులవక్ష హరిహరనాథా।
(ఉద్యోగ. 4-1)

హరిహరనాథుని వక్షస్థలమున నల్లని తులసీమాలికయు, తెల్లని అస్థిమాలికయు నుండును. తులసీమాలయొక్క నల్లనికాంతి తెల్లని అస్థిమాలపై ప్రసరించుటవలన నది గరుడపచ్చల రంగును సంతరించుకొని స్వామియొక్క విశాలమగు వక్షస్థలమును నల్లగాజేయుచున్నది। మొత్తముమీద దేహమంతయు శ్యామలవర్ణమును పొంది రమణీయముగనున్నది.

ఇక్కడ తిక్కనగారి పనితనమెక్కడున్నదనిన సౌందర్యమునకు సంబంధములేని అస్థిమాలనుస్వీకరించి దానికి తులసీపల్లవదామచ్ఛవిని సంక్రమింపజేసి, తులసీమాలనుమించిన "ఉద్దామప్రభను" అస్థిమాలకు సంతరించిపెట్టి, దానిద్వారా సహజశ్యామమగు స్వామివక్షస్థలమును అధికతర శ్యామాయితము చేయుటలోనున్నది। ఆ గరుడపచ్చల సౌందర్యపూరమును మనఊహలచిఱుగాలుల స్పర్శచేత తరంగితమొనర్చుటలోనున్నది।

ఆళ్వారులు- తిక్కన వర్ణించిన సప్తగిరి హరిహరనాథ సౌందర్యలహరి

క. భసితపరభాగహేలా లసితశ్రీవత్సలలితలాంఛన, పింఛ
ప్రసృమరరుచిశబలోరగ విసృమరదీధితికలా వివేష్టితమౌళీ.

(భీష్మ. 3-454)

హరిహరనాథుని దేహమొకవైపు బూడిదతోను, మఱొకవైపు శ్రీవత్సలాంఛనముతోను అలంకృతమైయున్నది. మౌళిపరిసర్పిత పింఛకాంతులు ఆభరణమగు సర్పముపై ప్రసరించుచున్నవి. అట్లు శబలితమైన సర్పకాంతి నెత్తియందలి నెలవంకపై వ్యాపించి రమ్యమైన రంగులీనుచున్నది. అద్భుతమైన రూపచిత్రణమిది.

ఇక్కడ తిక్కనగారి శిల్పపారగత్వమెట్లున్నదన్న- హరిహరస్వరూపములను, స్వభావములను భిన్నముగ చిత్రించుచునే ఏకత్వప్రవణముగ నొకదానితోనొకటి పెనవేసుకొన్నట్లు పరస్పర సాంకర్యమును వర్ణించుటలోనున్నది! ఏరూపమేదో ఆలోకించుటకు మన కన్నులు చేపునట్లు చేయుటలోనున్నది!

శిఖరిణి. తపస్స్వాధ్యాయాది క్షపితమలచిత్త ప్రకలితా
విపజ్జాల జ్వాలా విరమణ సుధావృష్టిలలితా
జపాపుష్పక్షీరచ్ఛవికిరణ సంసర్జనధు రా
సపర్యా నిర్వాహ ప్రచురకలనస్థైర్య మధురా.

(స్త్రీ, 1-187)

హరిహరనాథుడు తపస్సు, స్వాధ్యాయము మొదలగు పుణ్యకర్మలచేత పరిశుద్ధమనస్కులగువారి హృదయములందు భావింపబడుచుండును. విపన్నుల ఆపదల మంటలను కరుణామృతవృష్టిచే చల్లార్చి శాంత్యానందములను సమకూర్చుచుండును. భక్తులు సేవానిర్వహణమను భక్తివిశేషముచేత స్వామిని తమ హృదయములందు పదిలపఱచుకొని భావమాధుర్యమునకులోగి ఆనందించుచుందురు.

పద్యమంతయు ఆధ్యాత్మికతత్త్వ సౌందర్యభరితము. ఇచ్చట మనకు కావలసినది: "జపాపుష్పక్షీరచ్ఛవికిరణ సంసర్జనధురా" అన్న సంబోధనావాక్యము. జపాపుష్పముయొక్కయు క్షీరముయొక్కయు కాంతిగల కిరణపుంజముల కలయికచేత అందమైనవాడని దీని భావము. "జపాపుష్పకాంతి రక్తమనియు, క్షీరవర్ణము ధవళమనియు ప్రసిద్ధమే. ప్రాణిసృష్టికి నిదానమగు పారమేశ్వర మహస్సు, అనగా తేజము రక్తశుక్లకాంతులతో నొప్పియుండునని తంత్రగ్రంథప్రసిద్ధము. అట్టిమహా

రూపుడు పరమేశ్వరుడు" అని కీ.శే. బ్రహ్మశ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రిగారు సెలవిచ్చిన ఈ ఆధ్యాత్మికార్థము మనకు శిరోధార్యము. (శ్రీతిక్కయజ్వ హరిహర నాథతత్త్వము. పుటలు: 259, 260) ఈ ఆధ్యాత్మికతత్త్వ సౌందర్యలహరినుండి చిందిన ఒక బిందువుగ మనముకూడ మరొకచిన్న కొనమెఱుపును పుట్టింతము:

జపాపుష్పమనగా కల్పవృక్షకుసుమము. అదిక్షీరసాగరమునుండి పుట్టినది. తెల్లని క్షీరసాగరమునుండి విరియబూచిన ఎఱ్ఱని పూలతోనిండి పైకివచ్చుచున్న కల్ప వృక్షము! ఆ రెండింటి కాంతులయొక్క సాంకర్యము, ఇదీ దృశ్యము! ఇచ్చట హరుడు ధవళక్షీరచ్ఛవి గలవాడు, హరి జపాపుష్పచ్ఛవి గలవాడు. ఈ రెండు కాంతిపుంజములయొక్క సాంకర్యమిట వర్ణింపబడినది. ఇదొక అద్భుతరమణీయ దృశ్యము!

శ్రీతిరుమంగై యాళ్వారు ప్రసాదించిన "తిరునెడున్దాండకము"లోని 9వపాశు రము పూర్వోదాహృతము. అందు వేంకటేశ్వరస్వామి యొక్క హరిహరస్వరూప మును వర్ణించుచు హరిని "పవళవణ్ణా" = పగడమువంటి దేహచ్ఛవిగలవాడని వర్ణించినట్లు గమనించితిమి. ఇంచుమించు అదే ఇక్కడ వర్ణింపబడినదని భావింప వచ్చును!

క. శ్రీనగసుతాత్వమహితవి ధానుత శశ్వల్లసల్లతావేష్టనహే
లానిత్య శాద్వలతరు త్వానుగుణ ఫలప్రదత్వ హరిహరనాథా.

[అశ్వమేధ. 3-1]

అందమైనలతలు దృఢముగా వేరూనిపాదుకొన్న పచ్చని చెట్టును గాఢముగా నల్లుకొని, దానినంతటిని తమ పల్లవపుష్పఫలములతో మఱింతపచ్చగా చేసినట్లు, శ్రీ గౌరీదేవులు నిన్ను గాఢముగను శాశ్వతముగను ఆశ్రయించుకొని నిత్య కల్యాణ మూర్తిగ నొనర్చుచున్నారు. నిన్ను ఆరాధించు భక్తులకుతగిన ఫలములనిచ్చు వానినిగా చేయుచున్నారు.

అందమైన అలంకారిక రచన. మనోజ్ఞమైన రూపకాలంకారము. గుండెలు పులకరించు మనోహరమైన రూపకల్పన. బాటసారుల సేదను తీర్చు మహావృక్షము వలె భక్తుల పాలిట నిత్య శాద్వల కల్పతరువు హరిహరనాథుడు! "వల్లరులచే దట్ట ముగా నల్లుకొనబడినప్పుడు వృక్షస్వరూపము తెలియబడనట్లే శ్రీ గౌరీత్వ రూప

ఆళ్వారులు- తిక్కన వర్ణించిన సప్తగిరి హరిహనాథ సౌందర్యలహరి మాయాచ్ఛన్నుడగునపుడు పరమేశ్వరుని వాస్తవ రూపము గోచరింపదనియు ఇందు సూచితమని పెద్దల వక్కాణ.

ఇట్టి పద్యములను చదివినప్పుడు సంబంధ ముండియుగాని, లేకగాని, చప్పున జగద్గురు శ్రీ శంకరులు సెలవిచ్చిన ఈ క్రింది శ్లోకము మనస్సున స్ఫురించుట సహజ మని తోచుచున్నది:

గతాస్తేమఞ్చత్వం ద్రుహిణ హరి రుద్రేశ్వరభృతః
శివస్స్వచ్ఛ ఛాయాకపటఘటిత ప్రచ్ఛదపటః
త్వదీయానాం భాసాం ప్రతిఫలనరాగారుణతయా
శరీరీశృఙ్గారోరస ఇవదృశాం దోగ్ధి కుతుకమ్.

(సౌందర్యలహరి—92)

భగవతీ! బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వరులు నలువురు నీ మంచమునకు నాలుగు కోళ్ళై నిన్ను సేవించు చున్నారు. శివుడు తెల్లని కాంతియను మిషతో నిన్నావరించి నీకు కప్పుడు బట్టయై నీ యెఱ్ఱని మేనికాంతులచే తాను ఎఱ్ఱనై మూర్తీభవించిన శృంగార రసమువలె నుండి కన్నులలో కుతూహలమును చేయు చున్నాడు. (దృశాం దోగ్ధి కుతుకమ్).

ఇదీ తిక్కన వర్ణించిన సప్తగిరి హరిహరనాథ సౌందర్యలహరి.

రచన: జనవరి 1982

నిర్వచనోత్తర పీఠిక

# తిక్కన తిరుపతుల సమకాలీన చరిత్ర

## పూర్వ రంగము

నన్నయచేత భారతమును వ్రాయించిన రాజరాజనరేంద్రుని కొడుకు కులోత్తుంగుడను నామాంతరముగల రాజేంద్రుడు అనువాడు. ఈతడు తనతండ్రి తదనంతరము వేంగీరాజ్యమును పినతండ్రియైన ఏడవ విజయాదిత్యునకు విడిచిపెట్టి తాను తమిళదేశమునకు తరలిపోయి తన మాతామహునిదైన చోళరాజ్యమునకు రాజైనాడు. గంగైకొండ చోళపురము రాజధానిగా ఒకటవ కులోత్తుంగుడను పేరుతో క్రీ.శ. 1070 నుండి 1120 వఱకు అర్ధశతాబ్దికాలము రాజ్యమును ప్రజారంజకముగ పరిపాలించినాడు. మఱికొన్ని యితర తమిళ ప్రాంతములతోబాటు చెంగల్పట్టు, ఉత్తరార్కాటు, చిత్తూరు, కడప, నెల్లూరు, ప్రాంతములు ఈతని యేలుబడిలో నుండినవి. అప్పటికింకను నెల్లూరు తెలుగు చోడసామంతరాజ్యము ఏర్పడి యుండలేదు. చోళరాజులు శివభక్తులు.

ఈ ఒకటవ కులోత్తుంగుడు క్రీ.శ. 1073 సం॥ ప్రాంతమున వేంకటేశ్వరుని సేవించినట్లు చరిత్ర. తిరుమల తిరుపతిదేవస్థానముల శాసన సంపుటములలో క్రీ.శ. 1073 సం॥ నాటి 1-21 సంఖ్యగల శాసనములో ఈతని బిరుదములు పేర్కొనబడినవి. వాటిలో "వేంకటనాథపురందర" అను బిరుదముకూడ వ్రాయబడియున్నది. ఇంచుమించు ఇదేకాలమున నీతడు నెల్లూరు రంగనాథస్వామినికూడ సేవించినట్లు చరిత్ర. ఈ వరుసలో నీతడు నెల్లూరు తిరుపతుల మధ్యలోనున్న కాళహస్తీశ్వరస్వామినికూడ సేవించినట్లు చెప్పవలసిన పనిలేదు. శ్రీకాళహస్తీశ్వరుడు వీరి యిలవేల్పులలో నొకడు. ఇప్పటి కాళహస్తీశ్వర దేవాలయము చోళరాజులు కట్టించినదేయని తెలియగలము.

దీనినిబట్టి రెండువిషయములు స్పష్టపడుచున్నవి. ఒకటి-నన్నయ కులోత్తుంగులిరువురు ఒకానొకదశలో సమకాలికులు. ఒకరు రాజరాజనరేంద్రుని ఆస్థానకవి.

నిర్వచనోత్తర పీఠిక— తిక్కన తిరుపతుల సమకాలీన చరిత్ర

మఱొకరు కొడుకు. కావున కులోత్తుంగుడు సేవించిన వేంకటేశ్వరుని యీతని కంటె కొంచెము ముందుగ నన్నయకూడ సేవించియుండవచ్చును. వెనుకటి వ్యాసములలో నొకచోట నన్నయ విషయమున మనముజేసిన ఇట్టి ఊహకు ఇది మఱికొంత ఊతమునిచ్చుచున్నది. రెండు— ఆ నాడు నెల్లూరు తిరుపతులకు నడుమ కాళహస్తి మీదుగా ధారాళముగ రాకపోకలు జరుగుచుండెడివి కావచ్చును. ఇటు నెల్లూరు రంగనాథుడు అటు తిరుమలవేంకటనాథుడు రాజులనేగాక సాధారణ భక్తులను గూడ నాకర్షించుచుండిరి కావచ్చును. తిక్కనకూడ పలుమారులు నెల్లూరు తిరుపతులకు రాకపోకలు సాగించియుండవచ్చును. ఆనాడు కాళహస్తి సుప్రసిద్ధ క్షేత్రమే. తిక్కన. తన తండ్రి కొమ్మనతోపాటు సపరివారముగ శ్రీకాళహస్తీశ్వరుని సేవించినట్లు కొందఱి వ్రాతలవలన తెలియుచున్నది. తిరుమలస్వామిని సేవించిన విషయమును వెనుక నిర్ధారించితిమి. ఎఱ్ఱనకూడ "వేంకటాచలస్థాయిని గొలిచినట్లు" భావించితిమి. ఇట్లు కవిత్రయమువారికి తిరుమలస్వామితో సంబంధముండియున్నట్లు స్పష్టము.

మొదటి కులోత్తుంగునికి పిమ్మట అతనికొడుకు విక్రమచోళుడు రాజై క్రీ.శ. 1120నుండి 1137వఱకు రాజ్యమును పాలించెను. ఈతడు 1134లో తిరుచానూరులో వేంచేసియున్న అప్పటికి సుప్రసిద్ధ శివాలయమగు పరాశరస్వామి దేవాలయమును దర్శించి అచ్చట ప్రతిసంవత్సరము వైకాశి మహోత్సవములను ఏర్పాటు చేసినట్లు చరిత్ర. ఈతడు ఎంతటి శివభక్తుడైనను, వేంకటేశ్వరుడు శివుడా, విష్ణువా, అన్న తగాదా ఎట్లున్నను, అంతదూరము పోయినవాడు తన తండ్రి యడుగుజాడలలో వేంకటేశ్వరుని సేవించి యుండడో! అను ఊహబొడముట అసహజము గానేరదు!

విక్రమచోళుని తరువాత అతని కుమారుడు రెండవ కులోత్తుంగుడు రాజ్యభారమునుచేపట్టి క్రీ.శ. 1138 నుండి 1150 వఱకు పరిపాలించెను. ఈతడు చిదంబరనటరాజస్వామి భక్తుడు. పదవికి వచ్చినదే తడవు నటరాజస్వామి ఆలయములోని గోవిందరాజస్వామి విగ్రహమును తొలగించెను. వైష్ణవులు ఆ విగ్రహమును తిరుపతికి చేర్చిరి. అక్కడొక దేవాలయము నిర్మింపబడినది. అదియే ఇప్పటి గోవిందరాజస్వామి దేవాలయము. ఇప్పటికి చెప్పిన యీ చోళరాజుల చరిత్రయంతయు తిక్కనకు తెలిసియుండదనుట చెల్లుబడియగునా!

రెండవ కులోత్తుంగుని దరిమిలా వచ్చిన చోళరాజుల వరుసక్రమమిది: రెండవ రాజరాజు- క్రీ.శ. 1151-1173. రెండవరాజాధిరాజు- 1174-1178. మూడవ కులోత్తుంగుడు- 1179-1216. మూడవ రాజరాజు- 1217-1256. మూడవ రాజేంద్రుడు- 1257-1279. ఈ చోళరాజులందరికీ తిరుపతి తమ రాజ్యములోనిదే యగుటవలన సంబంధముండియుండెను. అయితే అది పరోక్షసంబంధము. ప్రత్యక్ష సంబంధమును గూర్చి ఇంకనూ కనుగొనవలసియున్నది.

రెండవ కులోత్తుంగుని తరువాత, అనగా క్రీ.శ. 1150కి పిమ్మట చోళ రాజ్యము బలహీనపడ జొచ్చినది. చోళులకు, పాండ్యులకు సంఘర్షణలు జరుగు చుండెడివి. తఱచుగ రాజ్యముల పొలిమేఱలు మారిపోవు చుండెడివి. కంచి, నెల్లూరు, తిరుపతి ప్రాంతములు కొన్నాళ్లు పాండ్యుల వశమైపోయిన సందర్భము లున్నవి. కొన్ని సందర్భములలో పల్లవుల క్రిందగూడ నుండినవి. ఈ పరిస్థితులలో కొన్ని సామంత రాజ్యములేర్పడినవి. నెల్లూరు తెలుగు చోడరాజ్యము, తిరుపతి(నారాయణవనం) యాదవరాయవంశ రాజ్యము అట్లేర్పడిన సామంతరాజ్యములే. కాలక్రమమున నెల్లూరు తెలుగు చోడరాజ్యమునుండి చీలిపోయినకంచిప్రాంతమొకచిన్నప్రత్యేక రాజ్యముగ నేర్పడిన సందర్భముకూడ నున్నది. అప్పుడప్పుడు ఈ రెండు లేక మూడు రాజ్యముల పొలిమేఱలు మాఱిపోవుచుండిన సమయములుకూడ కద్దు. మొత్తము మీద ఈ మూడు రాజ్యమండలములకు తిరుమల క్షేత్రముతో సంబంధ ముండి యున్నదనుట స్పష్టము. అయితే, కంచిమండల రాజులకు, తిరుపతిమండల రాజులకు తిరుమల స్వామితోగల సంబంధము శాసన ప్రమాణములచేత నిర్ధారితమగు చుండగా, నెల్లూరు మనుమసిద్ధి రాజులకు తిరుమలతోగల నంబంధమును గూర్చిన శాసన ప్రమాణము మృగ్యముగ నున్నది. ఇది ఇంకను పరిశోధించి తేల్చవలసిన విషయమే యని అంగీకరింపక తప్పనిసరి.

## నెల్లూరు తెలుగు చోడ రాజ్యము

ఈ రాజ్యమునకు క్రీ. శ. 1150 సం॥ దరిమిలా స్పష్టమైన చరిత్ర కాన్పించు చున్నది. చెంగల్పట్టు, ఉత్తరార్కాటు, చిత్తూరు, కడప, నెల్లూరు మండలములు అందంతర్భాగములుగ నుండినవి. అనగా కంచి, తిరుపతి, కాళహస్తి, నెల్లూరు ప్రాంతములు ఇందు చేరియున్నవనుట స్పష్టము. కాలక్రమమున తిరుపతి ప్రాంతము

నిర్వచనోత్తర పీఠిక – తిక్కన తిరుపతుల సమకాలీన చరిత్ర మాత్రము నారాయణవనం యాదవరాయ వంశరాజ్యములో చేరినది. నెల్లూరు తెలుగు చోడరాజ్యమును తీర్చిదిద్దినవారిలో నల్లసిద్ధి అగ్రగణ్యుడు. ఈ రాజులవరుసక్రమ మిది: నల్లసిద్ధి, మొదటి బేతరాజు, ఎఱ్ఱసిద్ధి, ఈతని పెద్దకొడుకు మొదటి మనుమ సిద్ధి, రెండవకొడుకు రెండవ బేతరాజు, మూడవ కొడుకు తమ్ముసిద్ధి, మొదటి మనుమ సిద్ధికొడుకు తిక్కనృపతి, తిక్కనృపతి కొడుకు రెండవ మనుమసిద్ధి (మనతిక్కనగారి మనుమసిద్ధి) మొదలైనవారు. ఈ రాజ్యమునకు నల్లసిద్ధినుండి మొదటి మనుమ సిద్ధి వఱకు నెల్లూరు కంచి పట్టణములు రెండును రాజధానులుగ నుండినవి. మొదటి మనుమసిద్ధి కాలమునను, తిక్కనృపతి కాలమునను కంచిప్రాంతము కొన్నాళ్ళు నెల్లూరితో కలిసియు, కొన్నాళ్ళు విడిపోయి ప్రత్యేకముగను ఉండిపోయిన సందర్భము లున్నవి. రెండవ మనుమసిద్ధి కాలమున నెల్లూరు కంచి పట్టణములు పూర్తిగా విడిపోయినవి. ఈ రాజులు తమిళుడైన కరికాలచోళ చక్రవర్తినే తమవంశ కర్తగా పేర్కొనిరి. అయితే, తెలుగు చోడులుగా పిలువబడుచుండుట వలన కాబోలు కడప జిల్లాలోని పొత్తపి గ్రామమునకు చెందిన మధురాంతక పొత్తపిచో డుని, మఱియు బిజ్జన అను వానిని వరుసగా తమ మూలపురుషులుగా పేర్కొనిరి.

మొదటి మనుమసిద్ధి క్రీ.శ. 1180–1186 నాటికి కంచి నెల్లూరులు రాజ ధానులుగా రాజ్యము నేలుచుండెను. ఇంతలో ఏ కారణము వల్లనోగాని మూడవ్య కులోత్తుంగుడు ఈ సంవత్సరములలోనే నెల్లూరిపై దండెత్తి వచ్చి యాతనిని రాజట భ్రష్టుని చేసి యతని తమ్ముని, రెండవ బేతరాజును గద్దెనెక్కించెను. పిమ్మ కొన్నాళ్ళకు ఈ బేతరాజు తమ్ముడు తమ్ముసిద్ధి, అన్నయొక్క రాజ్య మపహరించి కంచి, నెల్లూరుసీమలకు రాజైనాడు. ఇవన్నియు 1185–1207సం॥ మధ్య కాలమున జరిగిన సంఘటనలు.

వాస్తవమునకు పరిస్థితులు చక్కగా సాగివచ్చినచో మొదటి మనుమసిద్ధి తరువాత అతని కొడుకు తిక్కనృపతి రాజుకావలసి యుండెను. అట్లు జరుగలేదు. ఈ పరిస్థితులలో తిక్కనృపతి గణపతిదేవుని సహాయమర్థించి యెట్లో 1208 సం॥ రాజ్యమును సంపాదించు కోగలిగినాడు. ఇట్లుండ క్రీ.శ. 1215–1228 మధ్య కాలమున చోళులకు, హొయసాలులకు జరిగిన సంఘర్షణలలో తిక్కనృపతి మఱల రాజ్యభ్రష్టుడైనాడు. తిరిగి రెండవసారి గణపతిదేవుని సాహాయ్య మర్థించి 1230

ప్రాంతమున కంచి నెల్లూరు రాజధానులుగ మఱల రాజ్యమును సంపాదించుకొని 1248 వఱకు పాలించినాడు.

రెండవ మనుమసిద్ధి (తిక్కనగారి మనుమసిద్ధి) తన తండ్రి తిక్కనృపతి తదనంతరము రాజైనాడు. అయితే యీతనితో విజయగండ గోపాలు డనువాడు ఈ రాజ్య వారసత్వమునకై పోటీపడి కాంచీ మండలమును జయించి తాను అక్కడ రాజై కూర్చొనినాడు. ఈ విజయగండ గోపాలుడు మనుమసిద్ధికి బంధువు. కవి తిక్కనకు కూడ సన్నిహితుడు. పోయినదిపోగా మిగిలిన నెల్లూరు ప్రాంతమున కైనను మనుమసిద్ధి రాజుగా కొనసాగవలసి యుండెను. అట్లు జరుగలేదు. అక్కన బయ్యనలు అను మనుమసిద్ధి యొక్క దాయాదులు కుట్రపన్ని యాతనిని రాజ్య భ్రష్టుని చేసినారు. ఇది 1249—50 ప్రాంతమున జరిగిన సంఘటన. అప్పుడు కవి తిక్కన ఓరుగంటికి తరలివచ్చి గణపతి దేవుని సహాయమర్థించుట, గణపతిదేవుడు సైన్యమును పంపి ఆ తిరుగుబాటు నణచి మనుమసిద్ధిని రాజ్యారూఢుని చేయుట సుప్రసిద్ధ చరిత్రయే.

ఇదిట్లుండ చోళులకు పాండ్యులకు జరిగిన పోరాటములలో చోళులు వెనుక బడి పాండ్యులది పైచేయి అయినది. జటావర్మ సుందరపాండ్యుడు ఆ ప్రాంతముల కెల్లను నుద్దండుడై అటు కంచిని పాలించుచున్న విజయగండ గోపాలుని, ఇటు తిరుపతిని పాలించుచున్న వీరనరసింగదేవ యాదవరాయలను వశపరచుకొని పెత్తనము చలాయించుచుండెను. ఇది 1250 సం॥ ప్రాంతము. నెల్లూరి మనుమసిద్ధిపై కూడ నాతని కన్నుబడినది. 1250—1258 మధ్యకాలమున రెండు మూడుసార్లు నెల్లూరిపై దండెత్తి వచ్చి విఫలుడై పారిపోయినాడు. కాకతి గణపతిదేవుని అండదండలు మనుమసిద్ధికి పుష్కలముగానుండుటయే యిందుకు కారణము. ఇంతలో కవి తిక్కన 1258లో మరణించినాడు. గణపతిదేవుడు 1260లో మరణించినాడు. మనుమసిద్ధి ఒంటరివాడైనాడు. ఈ ముదనుచూసుకొని జటావర్మసుందరపాండ్యుడు నెల్లూరిపై దండెత్తివచ్చి 1263లో ముత్తుకూరి యుద్ధమున మనుమసిద్ధిని హతమార్చి తొలుత నెల్లూరులోను, మలుత కంచిలోను రాజ్యాభిషేకము చేసికొనినాడు. ఈ సందర్భముననే కంచిని పాలించుచున్న విజయగండ గోపాలునిగూడ జయించినాడు. తిరుపతి వీరనరసింగదేవ యాదవరాయల జోలికి పోయినట్లు కాన్పింపదు.

నిర్వచనోత్తర పీఠిక— తిక్కన తిరుపతుల సమకాలీన చరిత్ర

నిర్వచనోత్తరరామాయణ పీఠిక

ఈ కావ్యమును తిక్కన 1234–50 మధ్యకాలమున రచించినట్లు సాహిత్య చరిత్రకారుల నిర్ణయము. ఎవరుగాని కావ్యమంతయు రచించిన పిమ్మటనే చిట్ట చివరికి పీఠికలు, అవతారికలు సంతరింతురని తెలిసినవిషయమే. దీనితరువాత భారతమును వ్రాసినాడు తిక్కన. ఈ రామాయణము వ్రాయునాటికి తిక్కన వయస్సు సుమారు 5౦ సంవత్సరములుండును. ఈ పీఠికలో రమారమి 15 పద్యము లలో నెల్లూరు తెలుగు చోడరాజుల చరిత్రను పుక్కిటబట్టినాడు. తమిళుడైన కరి కాల చోళచక్రవర్తినే యీ వంశమునకు కర్తగా పేర్కొనినాడు. వీరి మూలపురుషు లలో బిజ్జననుగూర్చి మాత్రము చెప్పినాడు. పిమ్మట మొదటి మనుమసిద్ధిని వర్ణించి నాడు. తరువాత తిక్కనృపతిని, రెండవ మనుమసిద్ధినిగూర్చి వివరించినాడు. తిక్కన మొదటి మనుమసిద్ధిని చూచినాడో లేదో చెప్పలేము. అప్పటికి చాల పసి వాడై యుండవచ్చును. ఆబాల్యము తానుచూసినది తిక్కనృపతిని, తన మనుమసిద్ధిని మాత్రమే. ఈ పద్యములలో మనకు కావలసిన చరిత్రాంశ సూచకములైన పద్యము లను పలుకరింతము. తిక్కనృపతిని వర్ణించిన పద్యమిది:

సీ. లకుమయ గురుములూరికి నెత్తివచ్చినఁ
గొనడె యాహవమున ఘోటకముల
దర్పదుర్జయులగు దాయాదనృపతుల
ననిలోన బఱపడే యాగ్రహమున
శంభురాజాది ప్రశస్తారిమండ లి
కముఁ జేర్చి యేలడేకంచిపురముఁ
జేదిమండలముఁగానిగఁ జేసి కాళవ
పతి నియ్యకొలుపడే పలచమునకు (పద్యం. 33)

ఈ పద్యమునందలి చరిత్రాంశములలోకొన్ని పూర్వోక్తములు. ఇక్కడ మనకు కావలసిన చరిత్రాంశము నాల్గవ పాదమునందలి "కాళవపతి నియ్యకొలుపడే పల చమునకు" అన్నది మాత్రమే. ఈ కాళవపతి యెవ్వరనగా కొప్పెరుంజింగుడు అను పేరుగల కాదవరాయలు. ఈతడు మూడవరాజరాజచోళునకు (క్రీ.శ.1217–1257) సామంతుడయ్యును పాండ్యుల పక్షమునజేరి యాతనిని యెదిరించెను.

అప్పుడు తిక్కనృపతి చోళరాజుపక్షమున పోరాడి కాదవరాయలను జయించుటకు తోడ్పడెను. ఇది క్రీ.శ. 1223-1224 మధ్య జరిగిన సంఘటన. ఈ యుద్ధములో తిక్కనృపతితో కలిసి పోరాడిన మఱొక చోళసామంతుడు తిరుపతి ప్రాంతమును ఏలుచున్న సుప్రసిద్ధుడైన వీరనరసింగదేవ యాదవరాయలు. ఈతడు తిరుపతిని రమారమి అరవై సంవత్సరములు పాలించి తిరుమల క్షేత్రముయొక్క సర్వతో ముఖాభివృద్ధికి పాటుపడిన ధన్యాత్ముడు. ఈ విధముగ తిక్కనృపతి, కవితిక్కన, రెండవ మనుమసిద్ధులకు వీరనరసింగదేవ యాదవరాయలతో గల సంబంధమును బట్టి తిరుమల క్షేత్రముతోకూడ వీరికి సన్నిహిత సంబంధముండి యుండవచ్చునని సులభముగ నూహింప వచ్చును.

ఈసందర్భముననే తిక్కనృపతికి "చోళస్థాపనాచార్యనామము" దక్కినది. ఈవిషయమును తిక్కన 34 వ పద్యములో పేర్కొనినాడు. ఇప్పుడు రెండవ మనుమసిద్ధిని గూర్చి (తిక్కనగారి మనుమసిద్ధి) వ్రాసిన యీ పద్యమునరయుదు:

మ॥ ద్రవిడోర్వీపతి గర్వముందునిమి శౌర్యంబొప్పఁగర్ణాటద
ర్పవిఘాతంబు నొనర్చి వైరిమనుజేంద్రశ్రేణికిన్ గొంగనా
నవనిం బేర్కొనియున్నయట్టి విజయక్ష్మాధీశ్వరుంగాసిగా
నెవిచెం జోళన మన్మసిద్ధి యనిప్రాయేటంబ్రగాఢోద్ధతిన్.

(పద్యం. 39)

ఇందలి చివరిపాదమున "అనిప్రాయేటంబ్రగాఢోద్ధతిన్" అనిచెప్పబడినది. ఈ ప్రాయేరు "పలైయారు" అనునది. ఇది కంచికిదాపున తంజావూరు మండలము లోనిది. అచ్చట జరిగిన యుద్ధములో మనుమసిద్ధి కాకతి గణపతిసైన్య సహాయ ముతో ద్రవిడోర్వీపతిని, కర్ణాటరాజును, విజయక్ష్మాధీశ్వరుని జయించెను. ఈ విజయక్ష్మాధీశ్వరుడెవ్వరోగాదు; విజయగండ గోపాలుడే. ఈతడు మనుమసిద్ధి బంధువు. 1248లో తిక్కనృపతి మరణించిన తరువాత మనుమసిద్ధితోబాటు వార సత్వపు పెనుగులాటలో నీతడు చెంగల్పట్టు ఉత్తరార్కాటు లతో గూడిన కాంచీ మండలమును మనుమసిద్ధికి దక్కకుండ కాజేసినవాడు. అప్పుడు ఈతనికి కర్ణాట రాజు వీరసోమేశ్వరుడు 1234-1260), ద్రవిడోర్వీపతి మూడవ రాజేంద్రుడు మద్దతుగా నిలిచిరి. మనుమసిద్ధి యీ ముగ్గురిని జయించినాడు. అయితే కాకతి

నిర్వచనోత్తర పీఠిక— తిక్కన తిరుపతుల సమకాలీన చరిత్ర

గణపతి సైన్యములు మఱలిపోయిన తరువాత ఈ విజయగండ గోపాలుడు తిరిగి కంచి మండలమును ఆక్రమించి మనుమసిద్ధికి చివరివఱకు దక్కనీయలేదు. తిక్కన 1258లో మరణించెను. జటావర్మ సుందరపాండ్యుడు 1263లో మఱల నెల్లూరిపై దండెత్తివచ్చి ముత్తుకూరి యుద్ధములో మనుమసిద్ధిని హతమార్చి మొదట నెల్లూరులోను పిమ్మట కంచిలోను పట్టాభిషిక్తుడై ఆ ప్రాంతములన్నింటికి ఎదురు లేని పరిపాలకుడైనాడు. ఇదంతయు పూర్వోక్త కథనమే.

ఉక్తకథన సారాంశము

ఇప్పటికి పరామర్శించిన చరిత్రను బట్టి తేలుచున్న సారాంశమిది: తిక్కనకు కరికాలచోళ చక్రవర్తి మొదలుకొని తన ప్రభువు మనుమసిద్ధి వఱకు సాగివచ్చిన చారిత్రక భౌగోళిక విషయములు కరతలామలకములే. అందులో క్రీ.శ. 1200 నుండి అనగా తనకు ఊహవచ్చి ప్రపంచము తెలిసినది మొదలు క్రీ.శ. 1258లో తాను మరణించువఱకు జరిగిన వృత్తములన్నియు ప్రత్యక్ష ప్రమాణములే. పైగా తాను కవి మాత్రమేగాదు; మనుమసిద్ధికి మంత్రిగా కూడ పనిచేసిన విషయమును జ్ఞప్తియందుంచుకొన వలెను. ఈ పరోక్ష ప్రత్యక్ష ప్రమాణ చరిత్రకు తిరుమల తిరుపతి క్షేత్రములతోగల సంబంధము కూడ నాతనికి కొట్టిన పిండియే. వీరనర సింగదేవ యాదవరాయలు క్రి. శ. 1204 నుండి 1264 వఱకు తిరుమల తిరుపతి క్షేత్రప్రాంతములకు తిరుగులేని పరిపాలకుడు. తొలుత చోళరాజులకు సామంతుడు. కాదవరాయలను ఓడించుటలో తిక్కనృపతికి కలిసివచ్చినవాడు. ఈత డెవరో తిక్కనకు తెలియుననుట చర్వితచర్వణము చేయుటయే! విజయగండ గోపాలుడు మనుమసిద్ధితో వారసత్వమునకు పోటీపడి కాంచీ మండలమును స్వాహా చేసుకొని 1251 నుండి 1264 వఱకు పరిపాలించెను. ఈతడు తొలుత మనుమసిద్ధికి బంధు వనియు తిక్కనకు కూడ సన్నిహితుడనియు చెప్పుట పునరుక్తి దోషమునకు గుఱి యగుటయే! జటావర్మ సుందరపాండ్యుడు చోళుల పరిపాలనమును వెనుకకునెట్టి తాను రాజై అటు విజయగండ గోపాలుని, యిటు వీరనరసింగదేవ యాదవరాయ లను తనకు సామంతులుగ జేసికొనెను. మనుమసిద్ధిని గూడ పడద్రోసి నెల్లూరును ఆక్రమించుటకు క్రి. శ. 1258 లోపల రెండు మూడుసార్లు దండెత్తివచ్చెను. ఈత డెవ్వరో తిక్కనకు తెలియును.

## తిరుమల తిరుపతి క్షేత్రముల యభివృద్ధికి వీరనరసింగదేవ యాదవరాయలు చేసిన కృషి

తిరుమల తిరుపతి క్షేత్రముల యభివృద్ధికి నారాయణవనం యాదవరాయ వంశీకులు చేసిన కృషి సుప్రసిద్ధమైనది. వీరిలోకెల్ల ప్రాతఃస్మరణీయుడు వీర నరసింగదేవ యాదవరాయలు. ఈతడు క్రీ.శ. 1204 నుండి 1264 వఱకు, 60సం॥ సుదీర్ఘకాలము ఈ క్షేత్రములకు పాలకుడుగ నుండి చేసినసేవ అమోఘమైనది. అందులో రెండుమూడు ప్రధాన విషయములు మాత్రమిట పేర్కొనబడుచున్నవి:

ఈతడు క్రీ.శ. 1244-1250 మధ్యకాలమున Paiyindi Palli అనుగ్రామ మును తిరుమల యందలి వేంకటేశ్వరునియొక్క, తిరుపతి యందలి గోవిందరాజ స్వామియొక్క కైంకర్యము కొఱకు సమర్పించెను. తిరుమలస్వామియొక్క గర్భ గృహమును గొప్పగా పునర్నిర్మించెను. బంగారుపూత విమానమును వేయించెను. బంగారు కలశము నెత్తించెను. హేమగిరిగా వర్ణింపబడుచున్న మేరుపర్వతమును తలదన్నినట్లు ఈ దేవాలయముండవలయునని యాతని ఆకాంక్ష అయినట్లు చరిత్ర వర్ణించుచున్నది. తాను రాజుగా ఉచ్చస్థితిలోనున్న రోజులవి. స్వయముగా తాను బంగారు తులాభారమును తూగి ఆబంగారముతో ఇంతపని చేయించినాడని చరిత్ర. అట్లే తిరుపతిలోని గోవిందరాజస్వామి యాలయమును గూడ గొప్పగా రూపొం దించినాడు. ఎగువ దిగువ తిరుపతుల రెండింటియందును స్వామివారల ఉత్సవములకు కావలసిన నాల్గుముఖముల రథములను (Four Faced Car) నిర్మింపజేసెను. ఇట్లు ఇంకెన్నియో ఘనకార్యములను చేసిన మహనీయుడీతడు!

## విజయగండ గోపాలుడు ప్రవేశపెట్టిన దివ్యప్రబంధ పఠన కార్యక్రమము

విజయగండ గోపాలుడు క్రీ. శ. 1250 నుండి 1285 వఱకు కంచి మండ లము నేలినట్లు చరిత్ర. ఈతని పేర లభించుచున్న తిరుమల తిరుపతి దేవస్థానముల శాసనములు కొన్నింటిలో వర్ణింపబడిన దానినిబట్టి ఈతడు ఈ దేవస్థానముల యభి వృద్ధికి చేసిన కృషి గణనీయమైనది. తిరుమలపై జరుగు నుత్సవ సమయములలో వచ్చు భక్తులకు భోజన వసతి సదుపాయములను ఏర్పాటు చేయించు చుండెడివాడు. ఆ సౌకర్యముల ననుభవించు చుండిన ప్రజలు ఆతనిని బహుధా ప్రశంసించి కృతజ్ఞ

నిర్వచనోత్తర పీఠిక– తిక్కన తిరుపతుల సమకాలీన చరిత్ర
తలు తెలుపుచుండెడివారట: విజయగండ గోపాలునిభార్య దేవరాశియారుకూడ వేంక టేశ్వరుల గుడిలో దీపారాధనకు కావలసిన నేతికొఱకు మంచి గోవులను కానుకగా నిచ్చి తనవంతు సేవను చెల్లించిన పుణ్యాత్మురాలు.

ఈ విజయగండ గోపాలుడు తఱచు తిరుమలకువచ్చి స్వామిని సేవించు చుండెనని చరిత్ర. ఈతడు క్రీ.శ. 1283లో తిరుపతి గోవిందరాజస్వామి యాల యమున తిరుమొళి, తిరుప్పావై దివ్య ప్రబంధ పఠనములను తొలిసారిగ ప్రవేశ పెట్టి, ఒక ధర్మనిధిని కూడ ఏర్పాటుచేసెను. దీనికి "గండగోపాలన్ మాడై" అని పేరు (శాసనము 1-741). తిరుమలపైగాని, తిరుపతిలోగాని కచ్చితముగా ఈ దివ్యప్రబంధ పఠనము ఎప్పుడు ప్రారంభమైనదో చారిత్రకముగ చెప్పుట కొంత కష్టమే. రామానుజుల వారే ఈ కార్యక్రమమును ప్రారంభించి యుందురని సాధా రణ దృష్టితో భావింపవచ్చును. అట్లు గ్రంథములలో వ్రాయబడి యున్నదిగూడ. అయితే, తిరుపతి గోవిందరాజస్వామి దేవాలయమునకు సంబంధించి మాత్రము శాసన ప్రమాణముగ విజయగండ గోపాలుని చేతనే ప్రారంభింపబడినట్లు నిర్ధారిం చుట లెస్స.

### జటావర్మ సుందర పాండ్యుడు
### స్వామి వైభవమునకు చేసిన కైంకర్యములు

జటావర్మ సుందర పాండ్యుడు క్రీ. శ. 1250 నుండి ఆ ప్రాంతమున కెల్ల నుద్దండుడైన పరిపాలకుడు. ఈతడు తిరుమలతిరుపతి స్వాములకు, కాంచీ పట్టణము నందలి దేవుళ్లకు చేసిన కైంకర్యము లనేకములున్నవి. 1262లో నీతడు తిరుమల వేంకటేశ్వరులగుడికి బంగారు పూతవిమానమును, కలశమును వేయించినట్లు చరిత్ర. వీరనరసింగదేవ యాదవరాయలు కూడ లోగడ నిట్టికైంకర్యములను చేసియున్నట్లు పూర్వకథితము. బహుశః ఈతడు మఱల రెండవసారి చేయించియుండునని భావిం చుట లెస్స. తిరుమలక్షేత్ర చరిత్రను పరిశీలించినచో నిట్టి పునరుద్ధరణ కార్యక్రమ ములు విడతలు విడతలుగ పలుపురిచే పునఃపునః జరిపింపబడినట్లు భావింపవచ్చును. వాస్తవమునకు 1262 నాటికి తిక్కన లేడు. అయితే, సుందరపాండ్యుడు ఈ ఘన కార్యములను ఇప్పుడే చేయించెననియు, ఇంతకుముందు అనగా తిక్కన జీవించి యున్నప్పుడు చేయించియుండడనియు అనుకొనుటకు వలనుపడదు. 1250-1258

మధ్యకాలముననకూడ చేయించి యుండవచ్చు ననుకొనుటలో విప్రతిపత్తి లేదు.

ఈతనిని గూర్చి శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డి గారు, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు వారు 1972లో ప్రచురించిన తిక్కన భారతము: కర్ణ పర్వమునకు వ్రాసిన అవతారికలో 57వ పుటలో "మనుమసిద్ధిరణమరణము" అను ఉపప్రకరణమున ఇట్లు పేర్కొనిరి: "జటావర్మ సుందరపాండ్యుడు రాజరాజ చోళుడంతటివాడు. కృష్ణ దేవరాయలదాక, ఆమధ్య అంతటి విజేతలేడు. "సమస్త జగదాధార — హేమాచ్ఛాదన రాజ (దేవాలయ విమానములకు బంగారునీరు తొడుపులు వేయించినవాడు) మహా రాజాధిరాజ శ్రీ పరమేశ్వర — మరకత పృథ్వీభృత్కాంచీపురం కొండాన్ (జయించినవాడు) రాజ తపన — కర్ణాణక లక్ష్మీ బంధన కాటకకుల తిలక — సర్వజ్ఞ మల్ల — కవీశ్వరభౌమ — సాహిత్య రత్నాకర — మొదలగునవి ఈ పాండ్యుని బిరుదావళిలో కొన్ని" అని.

## తిరుపతిలో తిరుమంగై యాళ్వారు విగ్రహమే తొలుత స్థాపింపబడుటకు కారణములు

పన్నిద్దఱాళ్వారులలో తొండరడిప్పడి, మధురకవి తప్ప తక్కిన పదిమంది యాళ్వారులు వేంకటేశ్వరునిపై పాశురములను రచించి గానముచేసిన విషయము పలుమాఱులు పూర్వకథితము. ఈ యాళ్వారుల వరుసలో అందరికంటె చివరివాడు తిరుమంగై యాళ్వారు. ఈతడు ఎనిమిదవ శతాబ్దపు నడిమి భాగములో వర్ధిల్లిన మహనీయుడు. ఆళ్వారులందరికంటె ముందుగా తిరుపతిలో ఈతని విగ్రహములే వెలయుట ఆశ్చర్యకరవిషయము: క్రీ.శ. 1228 — 34 మధ్యకాలమున మొత్తము మూడు విగ్రహము లీతనివి వెలసినవి. తిరుపతి గోవిందరాజస్వామి యాలయ ప్రాంగణమున, ఈ దేవాలయము నిర్మింపబడుటకు పూర్వమే 1234 లో అక్కడొక విగ్రహము వెలసినది. దీని నిత్యపూజలకొఱకు ఆ చుట్టుపట్ల గ్రామవాసులైన భక్తులు ఈనాము భూముల నిచ్చి ధర్మనిధులను ఏర్పాటు చేసినట్లు చరిత్ర.

ఇట్లు ధర్మనిధులను ఏర్పాటుచేసిన వారిలో వీరనరసింగదేవ యాదవరాయలు కూడ నొకడు. విజయగండ గోపాలుడు "తిరుమొళి" "తిరుప్పావై" దివ్యప్రబంధ పఠనముల నేర్పాటుచేసి "గండ గోపాలన్ మాడై" అను నిధినికూడ సమకూర్చెనని పూర్వము చెప్పబడినది. "తిరుమొళి" పేరుతో దివ్యప్రబంధములను వెలయించిన

నిర్వచనోత్తర పీఠిక- తిక్కన తిరుపతుల సమకాలీన చరిత్ర మహనీయులు నమ్మాళ్వారు, అండాళ్, తిరుమంగై యాళ్వారులు. ఈ ముగ్వురి "తిరుమొళి" ప్రబంధములలో ఎవ్వరి ప్రబంధ పఠనమును విజయగండ గోపాలుడు ప్రవేశపెట్టెను? అన్నదొక చర్చ. తిరుమంగై విగ్రహమునకే తొలిపూజ జరుగుట వలన, అతని "తిరుమొళి"యే పఠన ప్రాధాన్యమును సంతరించుకొన్నదను నిర్ణయమునకువచ్చుట సులభము! శ్రీ రామానుజ వైష్ణవ సంప్రదాయమున నమ్మాళ్వారుల "తిరువాయి మొళి" మొదలగు దివ్యప్రబంధములకే అధికతమ ప్రాధాన్యమున్నది. ఆ తరువాతనే తక్కిన ఆళ్వారులకుగాని, వారి ప్రబంధములకుగాని ప్రాధాన్య మీయబడినట్లు గమనింప గలము. అట్టియెడ అందఱి యాళ్వారుల కంటె ముందుగా తిరుపతిలో తిరుమంగై యాళ్వారుల విగ్రహము వెలయుటకుగాని, అతని "తిరుమొళి" దివ్య ప్రబంధ పఠనము ప్రారంభింప బడుటకుగాని కారణ మేమైయుండునన్నదొక కుతూహలభరితమైన విచికిత్స! దానికి సమాధాన మిది:

శ్రీ తిరుమంగై యాళ్వారు 8 వ శతాబ్దమున చోళదేశములో కావేరీ సాగర సంగమ ప్రదేశమున "తిరుక్కురై యలూర్" అను గ్రామములో జన్మించెను. ఈతని తండ్రియు, నీతడును చోళరాజులకడ సేనానులుగా పనిచేసిరి. క్రీ.శ. 4-9 శతాబ్దుల మధ్యకాలమున తమిళ దేశములో జైన బౌద్ధ మతముల ప్రభావ మధికముగా నుండెను. అప్పుడు చోళరాజుల ప్రభావము సన్నగిల్లియుండెను. కావేరీ తీరము నందలి రేనాండు మండలమున వీరు అజ్ఞాతముగ కాలము గడపవలసి వచ్చినది. ఈ పరిస్థితులలో తిరుమంగై తండ్రి నీలన్ వారికడ సేనాపతిగా పనిచేసెను. తండ్రికి పిమ్మట ఆ స్థానములో తిరుమంగై సేనాపతిగా నియమింపబడెను.

తమిళ దేశమునందలి సంఘవాఙ్మయములో కరికాళ చోళచక్రవర్తి యొక్క ప్రశంస ఎక్కువగా కాన్పించును. అతనివలె బహుధా ప్రశంసింపబడిన మఱొక పురాణ పురుషుడు కోచ్చెంగనాన్ అనునాయన. కొన్ని తామ్రశాసనములలో ఈతనినిగూర్చి చోళవంశవృక్ష మూలపురుషులలో నొకడుగా వర్ణింపబడి యున్నది. ఆళ్వారులలో మొట్టమొదటివాడైన శ్రీ పొయిగైయాళ్వారు తన "కాళవళి" అను కావ్యములో ఈ కోచ్చెంగనాన్‌ను గూర్చి 40 పద్యములలో ప్రశంసించినాడు. ఈ పరువల్లో చిట్టచివరివాడైన తిరుమంగై కూడ నాతనినిగూర్చి కొన్ని పద్యములలో ప్రశంసించుట జరిగినది.

తిరుమంగై దర్శించినన్ని పుణ్యక్షేత్రములను తక్కిన యాళ్వారులు దర్శించలేదు. ఈతడు 108 వైష్ణవ క్షేత్రములలో 93 క్షేత్రములను దర్శించెను. వేంకటేశ్వరుని గూర్చి యీతడు గానముచేసినన్ని పాశురములను తక్కిన యాళ్వారులు గానము చేయలేదు. ఈతడు 63 పాశురములను గానముచేసెను. అందులో రెండు పాశురములలో నీతడు వేంకటేశ్వరుని హరిహర స్వరూపుడుగా చిత్రించినట్లు పూర్వోక్తము. ఆళ్వారులలో అహోబల క్షేత్రమును దర్శించి స్వామిపై ఒకటి రెండు పాశురముల నానతిచ్చినదికూడ తిరుమంగై ఒక్కడే. తక్కిన వారా జోలికి పోలేదు. కారణమేదైన నౌగాక, రోజుకి వెయ్యిమంది చొప్పున పేదప్రజలకు అన్నదానము చేసిన మహనీయుడు ఈతడొక్కడే! ఈతని కవితలో భక్తిమాత్రమే గాక ఉత్తమ కవితాలక్షణములుగూడ గోచరించును; చక్కని వైవిధ్యముకూడ కాన్పించును. బహుశః ఈతడు తిరుపతి తిరుమల ప్రాంతమున మరణించి యుండవచ్చునని తోచుచున్నది. ఇది ఇంకను కనుగొన వలసిన విషయము!

అటు చోళరాజులతోగాని, ఇటు తిరుమల క్షేత్రముతోగాని తిరుమంగైకిగల ఆత్మీయతాను బంధములను పురస్కరించుకొని, తొలినాళ్లలో చోళులకు సామంతుడుగా వ్యవహరించిన వీరనరసింగదేవ యాదవరాయలు ఒకానొక అభిమానముతో ఈతని విగ్రహములను తిరుపతిలో ముందుగా వెలయింపజేసి యుండునని భావించుట సమంజసము!

తిక్కనకు తెలిసిన ఉపర్యుక్త విషయములు
సమ్యక్ సమన్వయము

ఈపైన పేర్కొనబడిన విషయములన్నియు నూటికి నూఱుపాళ్ళు తిక్కనకు తెలిసియుండు ననుటలో అవంతయు సందేహముండరాదు. అది క్రీ. శ, 1250 ప్రాంతము. తిక్కన నిర్వచనోత్తర రామాయణ రచనను పూర్తిజేసి భారతరచనను ప్రారంభించి తలమున్కలుగానున్న సమయము. సరిగ్గా అదేసమయమున తిరుమల తిరుపతులలో జరుగుచున్న కోలాహలము!

వీరనరసింగదేవ యాదవరాయలు తిరుమలస్వామి గర్భగుడిని పునర్నిర్మించు చుండెను. బంగారుపూతరేకుల విమానమును వేయించు చుండెను. బంగారు కలశము నెత్తించు చుండెను! అదుగో, అక్కడ తిక్కన!

నిర్వచనోత్తర పీఠిక- తిక్కన తిరుపతుల సమకాలీన చరిత్ర

అది క్రీ. శ. 1253 ప్రాంతము. తిక్కన భారత రచనను ఉరవడి పరవడిగా సాగించుచున్న కాలము. విజయగండ గోపాలుడు తిరుపతి గోవిందరాజ స్వామి యాలయమున "తిరుమొళి" "తిరుప్పావై" దివ్య ప్రబంధ పఠనమును నిత్య కార్యక్రమముగా నేర్పాటుచేయుటకు పండితసభను సమావేశపఱచిన దృశ్యమది! అదుగో, అక్కడ తిక్కనకూడ నున్నారు! ఓహో, శ్రవణ సుఖముగా ఆ దివ్య ప్రబంధ పఠనమును వినుచున్నారు! తన కళ్ళయెదుట జరుగుచున్న ఆ కార్యక్రమమునుచూసి, తన చెవులతోవిన్న ఆ ప్రబంధపఠనమునకు పరవశుడై భారతములో "ఈ దృశంబులగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక యారాధనావిశేషంబు" అని వ్రాయుచున్నారు!

అదిగో, అక్కడ తిరుమంగై యాళ్వారుల విగ్రహము! ఆ యెదుట నిలబడిన కుండలీంద్రుడెవ్వరు? ఓహో, తిక్కనయా! ఆ యాళ్వారుల పాశురములను, ముఖ్యముగ తిరుమలస్వామిని హరిహర స్వరూపుడుగ చిత్రీకరించిన ఆ రెండుపాశురములను- అవాహన చేయుచు తన్మయుడగు చున్నాడు!

అది క్రీ. శ. 1251-58 మధ్యకాలము. ఒకవైపు భారతరచన ముగింపునకు రాబోవుచున్నది. ఇంతలో నెల్లూరి మనుమసిద్ధి రాజ్యమును స్వాహాచేయుటకు అదుగో, జటావర్మ సుందరపాండ్యుడు కంచినుండి రాబందుల రెక్కల చప్పుడును వినిపించుచు వచ్చిపడుచున్నాడు! ఇదుగో, నెల్లూరి రాజసౌధమున మంత్రితిక్కన మనుమసిద్ధితో మంతనములు చేయుచున్నాడు! ఆ రాబందుల రెక్కలను ఖండించుటకు కావలసిన యుద్ధనీతి మంత్రోపదేశమును చేయుచున్నాడు! తాను బ్రతికియుండగా జటావర్మ సుందరుడు నెల్లూరును ఆక్రమించుటకల్ల! అతని జటలను కత్తిరించి బోడితలలతో కంచికి తిరగగొట్టి పంపుచున్నాడు! మధ్య మధ్య యేర్పడిన యుద్ధవిరమణసమయములలో జటావర్మసుందరపాండ్యుడు అటు కంచి దేవాలయములపైనను, ఇటు తిరుమల తిరుపతి దేవాలయముల పైనను బంగారుపూత విమానములను వేయించుట, బంగారు కలశముల నెత్తించుట, విజయగండ గోపాలుడు, వీరనరసింగదేవ యాదవ రాయలు అతనికి సహకరించుట మొదలగు కథలను కర్ణాకర్ణికగా ఎప్పటికప్పుడు వినుచున్నాడు!

అది క్రీ.శ. 1257 ప్రాంతము. భారత రచన పూర్తియైనది. ఆ తాళపత్రము

లతో సపరివారముగ తిక్కన తిరుమలచేరి స్వామియెదుట నిలబడి, భారత మును సప్తగిరి హరిహరనాథార్పణముచేసి " హరిహరనాథ సర్వ భువనార్చిత నన్ దయచూడు మెప్పుడున్" అని పలికి హృదయమును దూసిపోసి, చేతులను స్వామి పుష్కరిణిలో కడిగికొని తిరిగి నెల్లూరుకు వచ్చుచున్నాడు। ఇదీ, కాలసరణి, హేతు సరణులనుబట్టి కుదురుచున్న చారిత్రక సమన్వయము। ఇది కాదనరాని సత్యము।

తిరుమల "సమవాయి" చరిత్రను ధ్వనింపజేయు

తిక్కన "సమవాయి" శబ్ద ముద్రిత పద్యద్వయము.

తిరుమల వేంకటేశ్వరస్వామి కైంకర్యము కొరకు మొట్టమొదటి ధర్మ నిధిని యేర్పాటుచేసిన మహనీయురాలు సమవాయి లేక సామవాయి అను పేరుగల ఒకానొక మహిళ. ఈమె ఈ ధర్మ నిధిని క్రీ శ. 966లో ఏర్పాటుచేసినట్లు చరిత్ర. ఇంతకు పూర్వముకూడ ఎవరైనను ఇట్టి నిధులను ఏర్పఱచి యుందును గాక; కాని యీమె సమకూర్చిన ధర్మనిధి మొదలుకొని వేంకటేశ్వరుడు క్రమముగా ప్రఖ్యాతి వహించుటవలన దీనికి తిరుమలస్వామి చరిత్రలో ప్రత్యేకస్థాన మేర్పడినది.

ఈ సమవాయి చరిత్రను కొంత తెలిసికొనుట సమంజనము: చెంగల్పట్టు, ఉత్తరార్కాటు, చిత్తూరు మండలములతో కూడిన తొండై మండలమును క్రీ. శ. 953-970 మధ్యకాలమున సుందరచోళుడు లేక రెండవ పరాంతకుడు అనునాయన పరిపాలించెను, అతని కొడుకు కొప్పాత్ర మహేంద్ర పన్మార్ అను పేరుతో ప్రసిద్ధి చెందిన కొప్పార్థివేంద్ర వర్మ అనువాడు. ఈతడు తన తండ్రి పరిపాలనా కాలములో యువరాజుగా పట్టాభిషిక్తుడై తండ్రికి సైదోడుగా రాజ్యపాలనా వ్యవ హారములను చూచు చుండెడివాడు. తండ్రి తదనంతరము క్రీ. శ. 970 లో తాను రాజై "రెండవ ఆదిత్యకరికాల" అను పేరుతో రాజ్యమును పాలింపదొడగెను.

తండ్రియగు సుందరచోళ ఉరఫ్ రెండవ పరాంతకుని కాలమునను, కొడు కగు కొప్పాత్ర మహేంద్ర పన్మార్ ఉరఫ్ కొప్పార్థివేంద్ర వర్మ ఉరఫ్ రెండవ ఆదిత్య కరికాలుని కాలమునను వారికడ సామంతుడుగా నున్నవాడు సత్తి విటంకన్ లేక శక్తి విటంకన్ అనునాయన. ఈతడు కాదవ వంశీయుడు. అనగా పల్లవవంశీయుడు. పల్లవులను కాదవు లనియు వ్యవహరించుట గలదు.

ఈ శక్తివిటంకన్ ఏలియాన్ కాదవప్పట్టిగళ్ యొక్క ధర్మపత్నియే సమ

నిర్వచనోత్తర పీఠిక- తిక్కన తిరుపతుల సమకాలీన చరిత్ర

వాయి లేక సామవాయి ఏలియాస్ కాదవన్ పెరుందేవి(రాణి). ఈమె పల్లవప్పెరు కడైయార్ అను పేరుగల పల్లవవంశ ప్రముఖుని సుపుత్రిక.

అది క్రీ. శ. 966 వ సంవత్సరము. తొండై మండలమునకు ప్రభువులైన ఆ తండ్రీ కొడుకు లిరువురు పరిపాలించుచున్న సమయమున, మన మహిళామతల్లి సమవాయి ఈ ధర్మనిధిని యేర్పాటు చేసెను. తిరుమల తిరుపతి దేవస్థానముల శాసన సంపుటములలోని మొదటి సంపుటియందలి 8, 9 సంఖ్యలుగల శాసనములలో ఈ ధర్మనిధికి సంబంధించిన వివరము లన్నియు విస్తారముగ పేర్కొన బడినవి. అవి చదువునప్పుడు పరిమాణమున చిన్నవైన రసవత్కావ్యములను పఠించుచున్నట్టి యానందము కలుగును! అందలి ప్రధానాంశము లివి:

తిరుమల వేంకటేశ్వరస్వామి మూల విగ్రహమును కదలించుటకు వీలుగాదు కాన దానికి ప్రతిగా నిత్య సంసేవనము కొఱకు వీలుగానుండునట్లు వెండితో వేంకటేశ్వరమూర్తిని చేయించెను. దీనికి "మనవాళప్పెరుమాళ్" (భోగశ్రీనివాస) అని పేరు. తిరువిలన్కోయిల్ అను పేరుగల స్నపన లేక స్థాపన మంటపమున సమవాయి ఈ మూర్తిని ప్రతిష్ఠాపన చేయించెను. ఈ మూర్తికి నవరత్నములతోను. వజ్రవైడూర్యములతోను, మంచి ముత్యములతోను ఖచితములైన ఎన్నో బంగారు భూషణములను చేయించెను. ఈ యలంకార సమూహమును "తిరువాభరణము" అందురు. పురత్తాసి (Purattasi) తిరునాళ్ మొదలైన ఉత్సవములను నిర్వహించుటకు ఏర్పాట్లు చేసెను. ఈనాటి లెక్కల ప్రకారము 24 ఎకరముల పంటభూమిని మూల ధనముగా నిరూపించెను. ఇట్లింకెన్నియో విషయములు ఈ దానశాసనములు రెండింటినిగూర్చియు! ఈ మహనీయురాలిని గూర్చియు చెప్పవలసినవి యున్నవి ఈమెను గూర్చి ఒక పెద్ద కథయో, ఒకచిన్న నవలికయో రావలసిన యవసరమున్నదని భావించుట తెప్పు. ఆ నేర్పుగలవారు దీనికి పూనుకొందురు గాక యని మనవి చేయటమైనది.

ఇంతచేసిన పిమ్మట ఈ రెండు శాసనముల చివర ఈ మహనీయురాలు ఏమనుచున్నదో వినుడు: "ఈ ధర్మనిధివలన జరుగవలసిన కైంకర్యము ఆచంద్రతారార్కముగ నిర్వహింపబడ వలయునని తాను కోరుచున్నదట!" (శాసనం1-9). "ఈధర్మనిధిని శాశ్వతముగ సంరక్షించు మహనీయుల పాదములను నిరంతరము నా తలపె

దాల్తును:" (శాసనం 1-8). దీని సంరక్షకత్వ బాధ్యతను ఆమె శ్రీ వేంకటేశ్వర స్వామి దేవస్థాన ధర్మకర్తలకు అప్పగించి పోయినది:

సమవాయియొక్క ఈ చివరి వాక్యములు అనంతరకాలమున ధర్మనిధులను ఏర్పాటుచేసిన మహనీయులందరికీ ఒకానొక స్ఫూర్తినీ, భావోద్రేకమును కలిగించిన వనియు, కావుననే వారు వేసిన దాన శాసనములందు తఱచుగ "ఈ ధర్మనిధిని భంగముచేసిన వారిని కాశీలో నూఱు గోవులను హత్యచేసినంత మహాపాపము చుట్టు కొనునని" హెచ్చరికలు వ్రాయించిరనియు శ్రీ టి. కె.టి. వీరరాఘవాచార్యగారు తమ "తిరుపతి చరిత్ర" గ్రంథపీఠికలో సెలవిచ్చిరి.

తిరుమల తిరుపతి దేవస్థానములకు సంబంధించిన చారిత్రకాంశములుగాని, ఈ సమవాయి చరిత్రకు సంబంధించిన విషయములుగాని శ్రీ టి. కె.టి. వీరరాఘవా చార్యగారు వ్రాసిన "History of Tirupati" (The Tiruvengadam Temple) Vol 1 నుండి గ్రహింపబడినవి. వారికి కృతజ్ఞతలు.

సారాంశమేమన, సమవాయి సమకూర్చి పెట్టిన "ధర్మనిధి" సంపదకు శ్రీ వేంకటేశ్వరుడు ఆలంబనమైనాడు. అది మొదలుకొనియే యాతడు క్రమక్రమముగ ప్రఖ్యాతి వహించుచూ వచ్చినాడు. "సమవాయాలంబమాన" సౌందర్యనిధియైనాడు. ఈ చారిత్రకాంశములను తిక్కన తన రెండు పద్యములలో అద్దముపట్టిన విధమును సమన్వయించి చూతము.

### తిక్కనగారి సమవాయశబ్ద ముద్రిత
### పద్య ద్వయము

తిక్కన తన హరిహరనాథ పద్యములలో రెండుచోట్ల "సమవాయ" శబ్ద ముద్రిత కంద పద్యములను వ్రాసెను. అవి వ్రాసిన తీరునుబట్టియు, అందలి ప్రతి పదమునందును గోచరించు అర్థస్ఫూర్తిని బట్టియు ఆ సమవాయ శబ్దములు పూర్వోక్త మగు తిరుమల సమవాయి చరిత్రను ధ్వనింపజేయుచున్నవనుట నిక్కము. ఆ పద్య ములను పరిశీలింతము:

. కమలవన సదృశదృగ్రుచి సముదయ శమితార్తిభక్తసంఘా, లక్ష్మీ
రమణత్వ శివాప్రియతా సమవాయాలంబమాన సౌందర్యనిధీ.

(కర్ణ. 7-321)

నిర్వచనోత్తర పీఠిక– తిక్కన తిరుపతుల సమకాలీన చరిత్ర

తా. పద్మవనముతో సమానమైన కన్నుల కాంతుల సముదాయముచేత శమింప జేయబడిన బాధలుగల భక్తుల బృందము గలవాడా; శ్రీదేవీ రమణత్వము, పార్వతీ ప్రియత్వము అనువానియొక్క సమూహమున ఆధారపడియున్న సౌందర్యనిధి గల వాడా, అని భావము

లక్ష్మీరమణత్వ=శ్రీదేవీ ప్రియత్వము, శివాప్రియతా=పార్వతీకాంతత్వము అనువానియొక్క, సమవాయ=సముదాయమున, ఆలంబమాన=వ్రేలాడుచున్న, అనగా ఆధారపడియున్న, సౌందర్యనిధీ=సౌందర్యమునకు నిధానమైనవాడా! అని ప్రతి పదార్థము.

ఈ ప్రతిపదార్థ తాత్పర్యములు చారిత్రక దృష్టికిభిన్నముగ, వేదాంతపర ముగ నప్పునట్టివి. అట్లే చెప్పవలసినవికూడ. కాని చారిత్రక దృష్టితో సమన్వ యింప వలసినప్పుడు ఈ క్రింది విధముగా చెప్పుట సమంజసము:

లక్ష్మీరమణత్వ=శ్రీదేవీ ప్రియత్వము, శివాప్రియతా=పార్వతీకాంతత్వము సమవాయి=సమవాయి అను పేరుగల స్త్రీయొక్క భక్తితత్త్వము అను వానియందు, ఆలంబమాన=వ్రేలాడుచున్న, అనగా ఆధారపడియున్న సౌందర్యనిధీ=సౌంద ర్యమునకు నిధియైనవాడా! అని చెప్పవలసియున్నది.

2. క. శ్రీ గిరిజా సమవాయ మ, హాగురుతర శుభగ సంపదాలంబ, సదా
యోగిజన క్షేమ సమీ, హాగర్భిత దివ్యచిత్త, హరిహరనాథా.

(శల్య. 1-1)

తా. లక్ష్మీదేవితోను, పార్వతీదేవితోను విడదీయుటకు వీలుగాని చాల గొప్పది యైనట్టియు, మంగళమును సమకూర్చునట్టిదియు అయిన సంపదకు ఆధారమైనవాడా, నిరంతరము యోగిజనులయొక్క క్షేమమునకు సంబంధించిన కోరికలను గర్భీక రించుకొన్న పవిత్రమైన మనస్సు గలవాడా, అని తాత్పర్యము.

శ్రీ=లక్ష్మీదేవితోను, గిరిజా=పార్వతీదేవితోను, సమవాయ=విడదీయు టకు వీలుగాని సంబంధముచే, మహాగురుతర=మిక్కిలి గొప్పదియగు, శుభగ= మంగళకరమగు, సంపత్=ఐశ్వర్యమునకు, ఆలంబ=ఆలంబనమై యున్నవాడా, అని ప్రతిపదార్థము.

ఇక్కడకూడ ఈ ప్రతిపదార్థ తాత్పర్యములు చారిత్రక స్పర్శలేని వేదాంత

పరముగ నప్పునట్టివి. చెప్పవలసినవిగూడ. అయితే చారిత్రక దృష్టిని సమన్వయింప వలసి వచ్చినప్పుడు ఈ క్రింది విధముగ చెప్పుట లెస్స:

శ్రీ = లక్ష్మీదేవివలనను, గిరిజా = పార్వతీదేవి వలనను, సమవాయ = సమవాయి వలనను (లభించిన) మహాగురుతర = చాలగొప్పదైన, శుభగ = మంగళకరమైన, సంపత్ = ఐశ్వర్యమునకు, ఆలంబ = ఆధారమైనవాడా, అని చెప్పవలసియున్నది.

మొదటి పద్యమున లక్ష్మీ పార్వతీ సమవాయీల ముగ్గురి వలన లభించిన సౌందర్యమును గూర్చియు, రెండవ పద్యమున ఆ ముగ్గురి వలననుండి లభించిన ఐశ్వర్యమును గూర్చియు వర్ణించుట గమనార్హము. లక్ష్మీ పార్వతుల వలన లభించిన సౌందర్య, సంపదల విషయ మటుండనిత్తము. సమవాయి అను మహిళ సమకూర్చిన "ధర్మనిధి వలన" సప్తగిరి హరిహరనాథుడు గొప్ప ఐశ్వర్యవంతుడైనాడనియు, అందువలన ఏర్పడిన గొప్ప సౌందర్యము గలవాడనియు పూర్వోక్తము. ఆ చరిత్ర యీ పద్యములయందు చక్కగా సమన్వయింపబడి ధ్వని కక్ష్యలో స్పష్టముగ స్ఫురించుచున్నదనుట నిక్కము॥

తమిళము నందున్న "సమవాయి" నామవాచకమునకు ఆంగ్లానువాదము SAMAVAI, SĀMAVAI అని రెండు విధములుగా నున్నది. ఇవి తెలుగులో సమవాయి, సామవాయి అగుట సహజము. తిక్కన ఛందస్సులో ఇిగించుటకువీలుగ సమవాయి నామమును స్వీకరించినట్లు తోచుచున్నది. మొదటి పద్యములో "సమవాయాలంబమాన"అని ప్రయోగించెను. ఇది సంధిలో, సమవాయ్ + ఆలంబమాన, సమవాయి + ఆలంబమాన, సమవాయ + ఆలంబమాన, ఇట్లు అన్ని విధములుగా కూడ కుదురును. కావున వేదాంతపరముగ "సమవాయ సంబంధమును" కుదుర్చుటకు గాని, చారిత్రకముగ "సమవాయి"నిగూర్చి సూచించుటకు గాని ఎట్టి యిబ్బందియు లేదు. రెండవ పద్యములో మాత్రము కొంత యిబ్బంది కలుగుచున్నది. "శ్రీగిరిజా సమవాయ మహాగురుతర" అని ప్రయోగము. సమవాయ + మహాగురుతర-ఇక్కడ సమాస విషయక విగ్రహ పరముగా గాని, సంధి విషయక వ్యాకరణ కార్యపరము గాగాని మనకు అనుకూలముగ నన్వయించుకొనుటకు అంతగా వీలులేకుండనున్నది. "సమవాయ సంబంధ" పరముగ చక్కగా కుదురుచున్నది. "సమవాయి" పరముగ

నిర్వచనోత్తర పీఠిక – తిక్కన తిరుపతుల సమకాలీన చరిత్ర నంతగా కుదురుట లేదు. మఱి ఎట్లు? అన్నదొక ప్రశ్న. అట్లే "సమవాయీ" అనునది స్త్రీనామవాచకముగదా మఱి సంస్కృత సమాసములో నెట్లు కుదురును? అను ప్రశ్నకుకూడ తావున్నది. ఇవన్నియు పట్టిపట్టి లాగినట్లుగాక కొంత విస్తృత ప్రాతిపదికపై స్థూలముగా నాలోచింప వలసిన విషయములని చెప్పుటయే సమాధానము. మఱియు సాధ్యమైనంతవఱకు వాచ్యకక్ష్యలో నరాసరి తెలియవచ్చు సామాన్యార్థము తోబాటు ధ్వనికక్ష్యలో గోచరించు విశేషార్థమును గూడ స్వీకరించి యథార్థ విషయ నిర్ణయమునకు ప్రయత్నింప వలయునని చెప్పుటయే సమాధానము. తిక్కన కవిత్వము ధ్వని ప్రధానమని చెప్పుటకద్దు. అప్పుడు ఈ సందేహములన్నియు ఇట్టే పరిష్కరింప బడును.

సారాంశమేమన, హరిహరనాథుడు "సమవాయాలంబమాన సౌందర్యనిధి" "సమవాయ మహాగురుతర సుభగసంపదాలంబుడు". కాగా, శమితార్తి భక్తసంఘుడు, సదా యోగిజనక్షేమ సమీహాగర్భిత దివ్యచిత్తుడైన యాతని దయకు ముందుగా పాత్రురాలైన మహనీయురాలెవ్వరు కావలయును? "సమవాయి" అను మహిళామతల్లియేకావలయును. ఈ విధముగ తిరుమల వేంకటనాథుడే తిక్కనగారి హరిహరనాథు డనుట మఱింత ధ్రువపడు చున్నది.

మనుమసిద్ధిరాజులకు, తిక్కనకు సంబంధించిన
శాసనములు శిలమై పోయినవి కావచ్చునా?

ఇన్ని విధముల ప్రత్యక్ష పరోక్ష ప్రమాణములచేత వేంకటేశ్వరతత్త్వమే తిక్కన హరిహర తత్త్వమను విషయము కచ్చితముగా ధ్రువపడు చున్నను, అటు మనుమసిద్ధిరాజులకు గాని, ఇటు తిక్కన వంశీకులకుగాని తిరుమల స్వామితోగల సంబంధములను గూర్చిన శాసన ప్రమాణములు మృగ్యమగుట ఆశ్చర్యకరమైన విషయము. కాలగర్భమున నిద్రించుచున్నవి కావచ్చును. లేదా శిలమై పోయినవి కావచ్చును. అసలే లేకపోయినచో ఎట్టి యిబ్బందియు లేదు. ఉండియుండవచ్చునేమో అను ఊహ లేశమాత్రమున్నను ఆచూకీ తీయుటమేలు. మనుమసిద్ధిరాజులు అర్థతమిళులనుట తెలిసిన విషయమే. తిక్కన వంశీకులకు తమిళముకూడ వచ్చునని భావించుటయు సమంజసమే. తెలుగు శాసనముల కంటె తమిళ శాసనములు అధిక సంఖ్యలో నున్నవనుట నిర్వివాదాంశము. తమిళ శాసనములలో ఇట్టి

ఆచూకీ లభించునేమో ప్రస్తుత, భావి పరిశోధకులు పరిశ్రమించి కనుగొన వలసి యున్నది. ఏది ఏమైనను తిరుమల వేంకటేశ్వరుడే తిక్కనగారి హరిహరనాథు డనుట త్రికాలా బాధితమైన తిరుగులేని సత్యము॥

---


ఉపయుక్త గ్రంథములు

1. నిర్వచనోత్తర రామాయణము- తిక్కన

2. ప్రాచీన దక్షిణ భారత చరిత్ర
డా॥ నందూరి రామకృష్ణమాచార్య, M.A. Ph. D.

3. తిక్కన భారతము: కర్ణ పర్వము
సంపాదయిత: శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదువారి ప్రచురణ
ప్రథమ ముద్రణ 1972

4. History of Tirupati
( The Tiruvengadam Temple ) Vol. 1.
Sri T, K. T, Vira Raghavacharya
Published by Tirumala - Tirupati Devastanams
Tirupati. 1977.

## తిక్కన ఉభయకవి మిత్రత్వము

# హరిహరనాథ పద్యములు

కేతన తన "దశకుమార చరిత్ర"లో తిక్కన్నను ఉభయకవి మిత్రుడని పేర్కొనెను. ఆ పద్యము లివి:

క. అభినుతుఁడు మనుమభూవిభు, సభఁదెనుఁగున సంస్కృతమునఁజతురుండై తా
నుభయకవిమిత్ర నామము, త్రిభువనములనెగడ మంత్రి తిక్కఁడు దాల్చెన్.

ఆ. కవితచెప్పి యుభయకవిమిత్రు మెప్పింప, నరిది బ్రహ్మకైన నతడు మెచ్చ
పరగి దశకుమార చరితంబుచెప్పిన, ప్రోడనన్ను వేరె పొగడనేల?

సీ. "సరసకవీంద్రుల సత్ప్రబంధములొప్ప, గొనునను టధిక కీర్తనకుఁ దెరువు
లలిత నానాకావ్యములు చెప్ప నుభయభా,షలయందు ననుట ప్రశంసత్రోవ"

.... .... ....

కేతన యీ గ్రంథమును తిక్కనకే అంకితమిచ్చెను. ఈ వరుసలో తిక్కన్నను గూర్చి యింకెన్నియో విషయములను గుప్పించి వర్ణించెను. మరి యింత చెప్పినవాడు పిమ్మట వ్రాసిన భారతము సంగతి యట్లుంచి ముందువ్రాసిన నిర్వచనోత్తర రామాయణమునుగూర్చియైనను పేర్కొనక పోవుటవలన అప్పటి కింకను తిక్కన ఆ గ్రంథమునుకూడ వ్రాయలేదనుట స్పష్టము. ఇదిట్లుండ, కేతన నాటికి గాని, ఆ తరువాతగాని తిక్కన వ్రాసిన సంస్కృత గ్రంథములెవ్వియో నామ మాత్రపు టాచూకీయైనను లభింపకపోవుట దురదృష్టము. అట్లయ్యును, నిర్వచనోత్తరమును, భారతమును చదివిన పిమ్మట తిక్కన "ఉభయ కవిమిత్రుడు" అను విషయమును విశ్వసింపక తీరదు. అయితే, కేతననాటి తిక్కన, మంత్రిగాను, ఉభయభాషల యందు పండితుడుగాను, ఒకపాటి కవిగాను మాత్రమే గోచరించుట సహజము. అట్టి సామాన్యస్థితిలోనే కేతన తిక్కనకు ''ఉభయకవిమిత్ర" నామమును తగిలించుట కొంత అతిశయోక్తియుక్తమైన ఆశ్చర్యముగనే కాన్పించును. ఈ మూడు పద్యములను చదివి ఆ బిఱుద నామమునుగూర్చి సమన్వయాత్మకముగ నాలోచించిన

మీదట అందులో అంత సార్థకమైన బిరుదుగాని, తీవిగాని కాన్పింపదు. మఱియెప్పుడు సార్థకమైనదనగా నిర్వచనోత్తర భారతములను వ్రాసినపిమ్మట సార్థకమైనది। తిక్కన స్వయముగా తన రెండు గ్రంథములలోను ఆశ్వాసాంత గద్యలలో ఆబిరుద నామమును చేర్చుకొనినాడు।

మధురా విజయమనెడు తన సంస్కృత కావ్యములో గంగాదేవి యను కవ యిత్రి తెలుగు కవులలో ఒక్క తిక్కన్ననే స్మరించినది. ఎట్టి ప్రత్యేక విషయ మునుచూచి అట్లు చేసినదో తెలియరాదు। ఈమె వెల్లూరి ప్రాంతమునందలి ఉదయ గిరి దుర్గమును పరిపాలించిన కంపరాయల దేవేరి.

సంస్కృతశ్లోక ద్వయము

ఈ చేసిన పరామరికను బట్టి మొత్తముమీద తిక్కనగారి అలబ్ధసంస్కృత సాహిత్యము కొంత ఉండియుండవచ్చునని భావించుటమేలు. గుడ్డిలోమెల్లగ కొంత ఊరటకలిగించు విషయమేమన రెండు సంస్కృతశ్లోకము లాతనివి లభించుచుండుట। ఆ శ్లోకము లివి:

శ్లో॥ శ్రీరాస్తాం మనుమక్షితీశ్వర భుజాస్తంభే జగన్మండల
ప్రాసాదస్థిర భారభాజి దధతీ సా సాలభంజీ శ్రియం
శుండాలోత్తమ గణ్డభిత్తిషు మదవ్యాసంగ వశ్యాత్మనాం
యాముత్తేజయతే తరాం మధులిహామానన్ద సాంద్ర స్థితిః
(నిర్వచనోత్తర. ఆ-1. శ్లో-1)

తా. భూమండలమను భవనముయొక్క దృఢమైన భారమును మోయుచున్న మనుమసిద్ధి మహారాజుయొక్క భుజమనెడి స్తంభమునందు, సాలభంజికా శోభను సంతరించుకొన్నదై సిరి విరాజిల్లుగాక। దిగ్గజములయొక్క గండస్థలముల యందలి మదధారల నానుచు ఆ మత్తులో పరవశించు తుమ్మెదలయొక్క ఆనంద సాంద్రస్థితి ఆ సిరిని మఱింత విరాజిల్లునట్లు చేయుగాక।

శ్లో॥ కిమస్థిమాలాం కిముకౌస్తుభం వా, పరిష్క్రియాయాం బహుమన్యసేత్వం
కిం కాలకూటః కిమువా యశోదా, స్తన్యం తవస్వాదువద ప్రభోమే.
(భారత, విరాట, ఆ-1. పద్యం 4)

తా. ప్రభూ। అలంకరణలో నీకు మిక్కిలియిష్టమైనది అస్థిమాలయా। కౌస్తుభ

మణియా? ఆహారము స్వీకరింపదలచినపుడు నీకు చాల ఇష్టమైన పానీయము కాల కూటమా? యశోదాదేవి స్తన్యమా? నాకు సెలవిమ్ము!

ఈ రెండింటిలో సందర్భమునుబట్టి, వర్ణ్యవస్తువునుబట్టి దేనికదిగొప్ప శ్లోకమని చెప్పవచ్చును. అయితే, మొదటిదాని కంటె రెండవది రమ్యతరమైనదని పేర్కొనుట విశేషముగాదు. ఈ రెండవ శ్లోకము ఏడుకొండల వేంకటనాథుని గూర్చి గానముచేసినదని పలుమారులు పూర్వోక్తము!

## హరిహరనాథ పద్యములు

### తెలుగు పద్యములా? సంస్కృత శ్లోకములా?

తిక్కనగారి హరిహరనాథ పద్యములు సుమారు రెండు వందలు. వీనిలో ఏ పది పన్నెండు పద్యములో మినహాయించి తక్కినవన్నియు తెలుగు పద్యములా? లేక సంస్కృత శ్లోకములా? అను భ్రమను గొల్పుచుండును! వాస్తవమునకు ఇవి తిక్కనగారి స్వతంత్ర పద్యములు. భారత రచనకు సంబంధము లేనివి. వ్యాస రచనతో సంబంధము లేనివి. కేవలము తిక్కన వ్యక్తిత్వ ముద్రాంకితములు. ఆతని ఆత్మకు ప్రతిబింబములు. భారతరచనలో తెలుగుభాషకు ప్రాధాన్య మిచ్చిన తిక్కన ఈ పద్యములలో సంస్కృతభాషకు ప్రాధాన్యమొసగినాడు. అంతకంటె సంస్కృతములోనే వ్రాసినాడనుట లెస్స. ఈ విషయమును కొంత విశ్లేషించి చూడవలసి యున్నది. దీనికి ముందు సదరు పద్యములను వ్రాయుటలోగల ఛందోవిషయక మగు కట్టుబాటునుగూర్చి కూడ కొంత తెలిసికొందము:

హరిహరనాథ పద్యములను వ్రాయుటలో తిక్కన ఒకానొక క్రమమును పాటించెను. ప్రతి ఆశ్వాసముయొక్క ప్రారంభమున ఒక కందపద్య ముండును. చివర ఏదేని ఒక వృత్తము, ఒక కందము, ఒక మాలిని ఉండును. ఈ క్రమము తప్పక పాటింప బడినది. అట్లే, ఆశ్వాసాది పద్యములన్నియు "హరిహరనాథా" అను మకుట నియమముతో నొప్పారుచుండును. అట్టి నియమము అంత్యపద్యములకు లేదు. ఇవిగాక షష్ఠ్యంతములు, విరాటపర్వ ప్రారంభమునను, స్వర్గారోహణపర్వ అంత్యమునను కొన్ని పద్యము లధికముగా నున్నవి. వ్యాసుని స్తుతించిన పద్యములు కొన్ని యున్నవి. అన్నియుగలిపి సుమారు రెండు వందలనుకొంటిమి. ఇవన్నియు అయిదు విధములుగా భావించి ఒక్కొక్క విధమునకు ఒక కొన్ని యుదాహరణములద్వారా

సంస్కృతాంధ్ర భాషావిషయకమగు కట్టుబడినిగూర్చి పరామర్శింతము:

1. షష్ట్యంతపద్యములనుండి రెండు కంద పద్యములు—

క. పరమ శమనిరత సంయమి, వరమానసకుముదహాస వర్ధన చంచ
చ్చరణ నఖచంద్రికావి, స్ఫురణాచిత్రప్రకారశోభాఢ్యునకున్॥
(విరాట. 1—35)

ఇందలి చివరనున్న "శోభాఢ్యునకున్" అనుమాటను "శోభాఢ్యాయ" అని అనువదించినచో పద్యమంతయు నూటికి నూరుపాళ్ళు సంస్కృత శ్లోకమైపోవును:

క. ఓంకారవాచ్యునకు నన, హంకార నిరూఢ భావనారాధ్యునకున్
హ్రీంకారమయ మనోజ్ఞా, లంకారోల్లాస నిత్యలాలిత్యునకున్॥
(విరాట. 1-32)

ఈ పద్యమును సులభముగా ఇట్లు సంస్కృత శ్లోకమును చేయవచ్చును:
ఓంకారవాచ్యాయ అనహంకార నిరూఢ భావనారాధ్యాయ
హ్రీంకారమయ మనోజ్ఞాలంకారోల్లాస నిత్య లాలిత్యాయ (నమః)

2. ఆశ్వాసాది పద్యములనుండి రెండు కంద పద్యములు—

క. జలనిధి హిమవద్భూధర, కలిత జనని కేశికౌతుక వ్యక్తావ్యక్త
లలితసౌందర్య స్ఫుర, దలఘుతనుశ్రీసనాథ, హరిహరనాథా!
(విరాట. 1-40)

ఈ పద్యమంతయు యథాతథముగ సంస్కృత శ్లోకమనవలయును. "హరి హరనాథా" అను సంబోధనా దీర్ఘమును "హరిహరనాథ" అని హ్రస్వముగా చేయ వచ్చును. లేక దీర్ఘమనియో, ప్లుతమనియో, సమర్థించి యట్లే ఉంచవచ్చును.

క. శ్రీ గౌరీపల్లవపుట, యోగాశ్రయ మంజరీ సముజ్జ్వలమూర్తీ,
యోగీంద్ర సంతతాంత, ర్యాగపరీపాకరూప హరిహరనాథా!
(ఉద్యోగ. 1-1)

ఇందులో "సముజ్జ్వలమూర్తీ" అనుదానిని "సముజ్జ్వలమూర్తే" అని మార్చ వలయును. "హరిహరనాథా" విషయము పూర్వోక్తము.

3. ఆశ్వాసాంత పద్యములనుండి రెండు వృత్తములు—

తిక్కన ఉభయకవి మిత్రత్వము- హరిహరనాథ పద్యములు

చ. నిగమశిఖావిహార, మహనీయ మునీశ్వర భావనీయ, స
ర్వగురు మహానుభావ, మధురప్రకటాప్రతిమస్వభావ, దే
వగణ నిషేవ్య, వారిగిరివాస వినోద విభావ్య, విశ్వలో
కగత వపుర్వికస్వర, వికారవిదూర విలాస భాసురా.

(భీష్మ. 1-304)

ఉ. భూరి తపోవిశేష పరిపూర మృదుస్థిర హృత్కరండ వి
స్తారనివాస, తంత్రఘనసార విధాపరమాభిరామ రే
ఖారమణీయ లోకహితకారి మహాకరణీయ, ఘోర సం
సార దురామయాపదవసాయక నిత్యఫల ప్రదాయకా.

(భీష్మ. ఆ. 2-408)

4. ఆశ్వాసాంత పద్యములనుండి రెండు కందములు—

క. జనవినుత బాదరాయణ, మునీంద్ర వాగమృతనిధి సముద్భూతాహ్లా
దనకీర్తి సుధాకిరణా, వినతాఖిల భద్రకరణ విశ్రుతచరణా.

(ద్రోణ. ఆ. 5-432)

క. వినత దురిత నిరసన శుభ, జనన కలాకల్యచరణ సంభావన పా
వన తటినీమాల్యసమ, స్తనిగమ సంవేద్య పరమసంయమిహృద్యా.

(కర్ణ. ఆ. 3-400)

5. ఆశ్వాసాంత పద్యములనుండి రెండు మాలినీ వృత్తములు—

మా. వరబహునుత వేదవ్యాస విశ్వాత్మభాసా
నిరుపమతనులీలా నిత్యసత్యాధికత్వా
నిరతిశయ సమత్వోన్నిద్ర కారుణ్యభద్రా
భరిత భువన వర్గా భాస్వదానంద మార్గా. (శాంతి. ఆ. 6-624)

మా. త్వరిత విహితగాథధ్యాయి సంమోదవాదా,
స్ఫురదరి దృఢశూల స్ఫూర్తి సంశస్తహస్తా
తరణి శశిమయత్వోదారతా చిత్రనేత్రా
పరమ నియతనిష్ఠా భవ్యహృత్పద్మసద్మా. (అను. ఆ. 4-451)

ఇప్పటికి ఉట్టంకింపబడిన ఆ యా పద్యములను సంస్కృతీకరింప వలసిన

పట్టులందు చేయవలసిన చిన్న చిన్న మార్పులనుగూర్చి— అకారాంత సంబోధనా శబ్దముల యందలి దీర్ఘములను హ్రస్వములు చేయుటగాని, ఇకారాంత సంబోధనా శబ్దములను 'ఎ' కారాంతములుగా మార్పుచేయుటగాని వంటి వాటినిగూర్చి—లొలుత వివరింప బడినది. ఇంతటి చిన్నచిన్న చిత్రికలతో ఈ పద్యములన్నియు సంస్కృత శ్లోకములై పోవుననుట విశేషముగాదు. స్థాలీపులాకన్యాయముగ అక్కడక్కడ కొన్ని పద్యములను మాత్ర ముదాహరించుట జరిగినది. అన్ని పద్యములు ఇట్లే యుండునని చెప్పుట చర్విత చర్వణము చేయుటయే యగును.

తిక్కనగారి హరిహరనాథ ద్విశతి

హరిహరనాథ పంచాశత్తు

తెలుగు వాఙ్మయమున శతక సాహిత్యమొక విస్తృతమైన ప్రత్యేకశాఖగా వర్ధిల్లినదను విషయము లోక విదితమే. మనకు ఆదికవియు, ఆదర్శ కవియునైన నన్నయగారి ఉదంక చరిత్రలో ఉదంకుడు నాల్గు పద్యములలో చేసిన సర్పరాజస్తవములో శతక లక్షణము లున్నవని పెద్దలతీర్పు. నన్నయ భారతములోని "రాజరాజ నరేంద్రా" సంబోధనతో కూడిన ఆశ్వాసాంత పద్యములుకూడ అందుకు పరమోదాహరణములే. దీని ననుసరించి నన్నెచోడుడు తన కుమారసంభవములో "దారిద్ర్యవిద్రావణా" అను సంబోధనతో వ్రాసిన కొన్ని పద్యములుకూడ శతకలక్షణములను సంతరించు కొన్నవని కొందరందురు. పాల్కురికి సోమనాథుని వృషాధిప శతక ముండనే యున్నది. ఈ పరిణామక్రమములో.... ....

తిక్కనగారి పద్యములను "హరిహరనాథద్విశతి" అనుపేరుతో శతకసాహిత్య ప్రక్రియలో చేర్చుట సమంజసమని తోచును. అయితే, ఆశ్వాసాది పద్యములలో మాత్రమే "హరిహరనాథా"అను మకుట నియమ మున్నదేగాని అంత పద్యములలో లేదు. శతక లక్షణములలో మకుట నియమము ముఖ్యమైనది. కావున "హరిహర నాథా" అను మకుట నియమముగల రమారమి ఏబది పద్యములను "హరిహరనాథ పంచాశత్తు" అన్న పేరుతో వ్యవహరించి శతక సాహిత్యములో నొకభాగముగస్వీకరింపవచ్చును.

నన్నయ తిక్కనల ననుసరించి ఎఱ్ఱన తన అరణ్యపర్వ శేషములో "రాజ రాజనరేంద్రా" అన్న మకుటముతోను, హరివంశమున వేమారెడ్డిని సంబోధించుచును

పద్యములను వ్రాయుట శతక సాహిత్య పరిణామక్రమములో నొకభాగమని భావింప వచ్చును. అయితే నన్నయ ఎఱ్ఱయ పద్యములు నరాంకితములై పోయినవి. తిక్కన పద్యములు భగవదంకితములై పోయినవి. శతక సాహిత్యములో భగవదంకిత శతకములకే విశేషప్రాచుర్యమున్నది. ఆ మేఱకు తిక్కనగారి "హరిహరనాథ ద్విశతికి" లేదా "హరిహరనాథ పంచాశత్తుకు" ప్రత్యేకమైన గుర్తింపు నిచ్చుట సమంజసము.

దేవనాగరి లిపిలో సంస్కృత భాషలో
హరిహరనాథ పద్యముల యనువాదము

తిక్కనగారి యీ పద్యములన్నియు దేవనాగరి లిపిలో సంస్కృతములోనికి అనువదింప వలసిన యవసరమున్నది. అనువదించుట ఎంత సులభమో సూచింప బడినది. పద్యములను శ్లోకములుగా మార్చుటతోబాటు తాత్పర్యములను కూడ సులభశైలి సంస్కృతములో వ్రాయవలెను. తెలుగులోని కందములను, వృత్తములను అవే ఛందోరీతులలో యథాతథముగ సంస్కృతీకరించుట సులభము, మంచిది కూడ. తెలుగువారి "యతిప్రాసలు" సంస్కృతములో లేవు. ఈ నియమములను గూర్చియు, ఇందలి రామణీయకతను గూర్చియు అక్కఱపడు మేఱకు వివరించుట కూడ అవశ్యకము. కందపద్యము ఆర్యాభేదమని చెప్పవచ్చును. అప్పుడు ఛందోరీతులన్నియు సంస్కృతములే యగుటవలన ఆంధ్రేతరులైన సంస్కృతభాషాభిజ్ఞులకు సులభగ్రాహ్యములగును. తిక్కన కొన్ని పద్యములలో సంస్కృత సమాసములను కట్టునప్పుడు సామాన్యదృష్టికి శాస్త్రమర్యాదలను ఉల్లంఘించినట్లు తోచును. అవి ఉల్లంఘనలు కావనియు విశేష వ్యాకరణ కార్యములకు లోబడినవేయనియు కీ.శే. బ్రహ్మశ్రీ ఓరుగంటి నీలకంఠ శాస్త్రి వంటి మహనీయ పండితులు సమర్థించి నిరూపించియున్నారు. అవసరమక్కఱపడు మేఱకు ఈ విశేషాంశములను కూడ చిన్నచిన్నటిప్పణులద్వారా వ్యక్తీకరించుట ఆవశ్యకము.

భారతమంతయు నూటికి 75 శాతము తెలుగులో వ్రాసిన తిక్కన ఈ పద్యములను నూటికి 91 శాతము సంస్కృతములో వ్రాయుట ఆశ్చర్యకర విషయము. బహుశా ఈ పద్యములన్నియు ఆంధ్రేతరులకుకూడ నందవలయునని అతడు భావించి యుండవచ్చును. ఆనాడు నెల్లూరు, తిరుపతి, కంచిమండలములలో తమిళభాషా వాతావరణము అధికముగానుండుటవల్ల వారికికూడ వర్గముకావలెననియు

ఆశించియుండవచ్చును. సప్తగిరి హరిహరనాథుని స్తుతించుటకు సంస్కృతభాషా ఆధిక్యమే మేల్తరమని భావించియుండవచ్చును. మఱి యివి యిప్పటివఱకూ నిద్రావస్థలోనుండుట విచారకరము. ఇప్పటికైనను సంస్కృతీకరింపబడవలయును. కవిత్రయమువారిలో ఒక్కరినిగూర్చి చెప్పవలసి వచ్చినప్పుడుగూడ తక్కిన యిద్దరిని గూర్చికూడ పేర్కొనుటకద్దు. ఆ విధముగ మన కవిత్రయమువారు సంస్కృతముద్వారా ఆంధ్రేతరులకు పరిచయమగుదురు. ఇది చాల ముఖ్యము.

ఈ గ్రంథరచయిత (డాక్టర్. ఓగేటి అచ్యుతరామ శాస్త్రి) ఇప్పటికే యీ పద్యములన్నింటిని పైన పేర్కొనబడిన విధముగ సంస్కృతములో ననువదించుట జరిగినది. సాధ్యమైనంత త్వరలో గ్రంథము ముద్రింపబడి వెలువడబోవుచున్నదని ప్రకటించటమైనది.

ఈ చేసిన చర్చనుబట్టి తిక్కన ఉభయకవి మిత్రుడనుట స్పష్టమగుచున్నది. అది హరిహరనాథ పద్యముల రచనద్వారా మఱింత సార్థకమగు చున్నదనుట నిష్కర్ష!

రచన: మే. 1985.

విదేశ దేశ ఆంధ్రప్రదేశములలో

# హరిహరనాథాలయములు

అతిప్రాచీన కాలమునుండి యు భారతదేశము నందలి వివిధ ప్రాంతములలో ఈ హరిహరనాథ తత్త్వము తీగెలు సాగినట్లు చక్కగా వ్యాపించి ప్రచారములో నుండినట్లు అక్కడక్కడ నెలకొనియున్న కొన్ని హరిహరనాథ దేవాలయముల చరిత్రనుబట్టి తెలియుచున్నది. ఇది కొంతకుకొంత విదేశములలోనికి కూడ ప్రాకిన వైనము కాన్పించుచున్నది. అయితే, దేశమునందలి యితర దేవాలయము లన్నియు "హరిహర" "హరిహరేశ్వర" అను పేర్లతో నొప్పుచుండగా తిక్కన మాత్రము దీనికి 'నాథ' శబ్ద మనుప్రయుక్తముచేసి "హరిహరనాథా" అని పేర్కొనుట గమనార్హము. ఇది "వేంకటనాథ" లోని 'నాథ' శబ్దమే అనియు, తిక్కన "వేంకటనాథ" నామమునకు పర్యాయముగ "హరిహరనాథ" నామమును స్వీకరించినా దనియు పూర్వోక్తము. (చూ. "తిరుపతి వేంకటేశ్వరుడే తిక్కనగారి హరిహర నాథుడా!" వ్యాసము, పుటలు 75, 76). ఇక్కడ విదేశ దేశ ఆంధ్ర ప్రదేశముల లోని హరిహర దేవాలయముల చరిత్రను లభించినమేఱకు సంగ్రహముగ క్రోడీకరించుటయే ప్రస్తుతాంశము.

### విదేశములలో హరిహర విగ్రహములు

ఆగ్నేయ ఆసియా— జావాలో ఈ హరిహరమూర్తులు దొరికినవని శ్రీ మరుపూరు కోదండరామ రెడ్డి గారొకచోట వ్రాసిరి (తిక్కన భారతము: కర్ణపర్వము, అవతారిక పుట. 70, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు, ప్రచురణ 1972). ప్యారిస్ నగరములో మ్యూజీగిమే అను పురాతన వస్తు ప్రదర్శనశాల యందలి దూరప్రాచ్య విభాగములో హరిహర విగ్రహమొకటున్నది. అది కాంబోడియానుండి తెప్పించిన విగ్రహమని తెలియుచున్నది. [శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారు 1963లో "నరుడు — నక్షత్రాలు" అను పేరుతో స్వీయ వ్యాసరచనల సంపుటి యొకటి ప్రచురించిరి. అందులో "హరిహరనాథుడు తిక్కన ఊహకాదు"

అన్నదొక వ్యాసము. ఆ వ్యాసములో వ్రాయబడని యీ విషయమును దరిమిలా వారు 1970లో ప్యారిస్ నగరమునకు వెళ్ళినప్పుడు చూసి తెలిసికొనిరి. పిమ్మట సదరు వ్యాస సంపుటియొక్క స్వంతప్రతిలో ఆ వ్యాసమునందలి ఒక పుటలో దీనికి సంబంధించిన నోట్సు వ్రాసికొనిరి. అది చదివియు, వారిలో మాట్లాడియు ఆప్తవాక్య మును ప్రమాణముగ భావించి యీ విషయమిట చేర్చటమైనది.]

### భారత దేశములో హరిహర దేవాలయములు

#### కాశ్మీర్

కాశ్మీర ప్రాంతములో నొక హరిహర దేవాలయమున్నట్లు కొందఱి వ్రాతల వలన తెలియుచున్నది. వివరములు లభింపవు.

#### ఉత్తర ప్రదేశ్

ఈ ప్రాంతములో గంగా గండకీ నదుల సంగమ స్థానమున సోనేపూర్ అను పట్టణము గలదు. దీనికి హరిహర క్షేత్రమను నామాంతరము కూడ నున్నది. ఇది వరాహ పురాణములో పేర్కొనబడిన సుప్రసిద్ధ క్షేత్రమగుట విశేషము.

#### రాజస్థాన్

ఇందలి జోధ్‌పూర్ పట్టణమునకు సమీపమునగల "ఓస్" అనుచోట నొక హరిహర దేవాలయము గలదు.

#### మధ్య ప్రదేశ్

ఈ రాష్ట్రమునందలి బిలాస్‌పూర్ పట్టణమునకు 32 కిలోమీటర్ల దూరములో 'మల్లాన్' అనునొక చిన్నగ్రామము గలదు. ఇందొక హరిహర మందిరమున్నది. కుడివైపు శైవచిహ్నములతోను, ఎడమవైపు వైష్ణవ చిహ్నములతోను ఒప్పుచున్న మూర్తి యిది. దీని దిగువ భాగములో మౌర్య బ్రాహ్మీ లిపిలో వేయబడిన శాసన మును బట్టి యీ మూర్తి క్రీ.పూ. 2 వ శతాబ్దినాటిదని తెలియుచున్నది. దేశమందు ఇప్పటికి లభించిన హరిహర విగ్రహములలోకెల్ల నిది మిక్కిలి ప్రాచీనతమమైనదని పురాతత్త్వ శాస్త్రజ్ఞుల వక్కాణ.

ఇదొక విశిష్టమైన గ్రామముగ కాన్పించుచున్నది. దీనిచుట్టును మూడువైపుల ఆర్పా, లీలాగరా, శివనాథా అను ఏరులు పాఱుచుండును. ఇచ్చట శివ, గణేశ, సూర్య, స్కందమాత, అర్ధనారీశ్వర దేవాలయములున్నవి. హనుమంతుని యొక్క

విదేశ దేశ ఆంధ్రప్రదేశములలో హరిహరనాథ దేవాలయములు

తిలో చేతులు జోడించి నిలువబడిన నందీశ్వర విగ్రహమొకటుండుట ప్రత్యేకించి పేర్కొనవలసిన విషయము. ఎన్నో బౌద్ధ జైన దేవాలయములుకూడ నిటనున్నవి.

మహారాష్ట్ర

ఇందలి నాసికాత్ర్యంబక క్షేత్రములకు దాపున నొక హరిహర దేవళ మున్నట్లు కొందఱు వ్రాసిరి. వివరములు సేకరింపవలసి యున్నది.

కర్ణాటక

ఈ ప్రాంతమునందలి "హరిహర క్షేత్రము" యావద్భారతదేశ ప్రశస్తి కెక్కినది. అతి ప్రాచీనమైనది. జగద్గురు శ్రీ శంకరులు [క్రీ.శ. 750 ప్రాంతము] ఈ క్షేత్రమును దర్శించి అటు హరిపరముగ, ఇటు హర పరముగ నర్థములు వచ్చునట్లు పది ద్వ్యర్థి శ్లోకములను ఆశువుగాగానము చేసినట్లు శ్రీ విద్యారణ్యకృత శంకర విజయములో నున్నది. శ్రీ చైతన్య ప్రభువు శిష్యుడైన నిత్యానందుడుకూడ దర్శించినట్లు చరిత్ర. పద్మపురాణ ప్రసిద్ధమైన క్షేత్రమిది. చిత్రదుర్గ జిల్లాలో తుంగ, భద్ర అను నదులు రెండుకలియు సంగమస్థలమున వెలసిన తీర్థమిది. ఇందలి స్వామికి నాల్గుచేతులున్నవి. కుడివైపు రెండుచేతులలో శైవచిహ్నములు, ఎడమవైపు రెండుచేతులలో వైష్ణవ చిహ్నములు గలవు. కాళ్ళు మోకాళ్ళ పైభాగము వఱకే యుండి నిలుచున్న విగ్రహమిది. [మఱికొన్ని వివరములు "హైదరాబాదులో హరిహర దేవాలయము" అను శీర్షికక్రింద పేర్కొనబడును].

ఇదే రాష్ట్రమున బీజపూర్ జిల్లాలోని బాదామి అనుపట్టణము చరిత్ర ప్రసిద్ధమైనది. దీనికి వాతాపి, వాతాపి పురము అను నామాంతరములుకూడ నున్నవి. ఇది పశ్చిమ చాళుక్యుల రాజధాని. గదగ్–హుబ్లి రైలుస్టేషనుల మధ్యనున్న పట్టణము. ఇందలి గుహాలయములలో రెండు హరిహర మూర్తుల శిల్పములున్నవి. ఒకటి– ఇరుపార్శ్వముల దేవులుగల హరిహరస్వామి. దీనికి హర్యర్ధమూర్తి, లేక హరార్ధమూర్తి, లేక శంకరనారాయణమూర్తి అనిపేరు. రెండు– ఒంటరి హరిహరస్వామి ఈ విగ్రహముయొక్క ముఖ్యదేహభాగమంతయు మామూలుగా ఒకటిగానే ఉండును. చేతులయందు మాత్రము ఒకవైపు శైవచిహ్నములు, మఱొకవైపు వైష్ణవ చిహ్నములు నుండును. ఈ గుహాలయములను క్రీ. శ. 578 ప్రాంతమున పృథ్వీవల్లభ బిరుదాంచితుడైన మంగలేశ్వరుడను పశ్చిమచాళుక్య చక్రవర్తి మలిపించినట్లు చరిత్ర.

వాస్తుశిల్పరీతుల ప్రకారము చెక్కింపబడినవి. ఈ గుహల గుడులకు ఎదురుగా నున్న సెలయేటి ఒడ్డున ఒక పెద్ద రాతిబండపై ఒక హరిహరనాథమూర్తి మలచ బడి యున్నది. ఈ జమిలివేల్పుకు ఎనిమిది చేతులున్నవి. ఒకవైపు హర చిహ్నములతోను, మఱొకవైపు హరి చిహ్నములతోను, ఆయుధములతోను వేంచేసి యున్నస్వామి యీతడు. ఈ మూర్తికి ప్రక్కనే నటరాజస్వామి విగ్రహముకూడ కలదు. ఈ కోన గుహలలోని గుడులను, విగ్రహములను క్రీ.శ. 8వ శతాబ్దములో పల్లవ చక్రవర్తి నరసింహుడు మలపించినట్లు చరిత్రకారుల వక్కాణ.

అనంతపురంజిల్లా కల్యాణదుర్గం తాలూకాలోని ఒక చిన్న గ్రామము తూము కుంట. ఇక్కడొక హరిహరేశ్వర (హరిహరనాథ అనికాదు) దేవళమున్నది. ఈ విగ్రహము ఎత్తు సుమారు 5 అడుగులుండును. దక్షిణ పార్శ్వమున త్రిశూలము జపమాలయు ధరించి, ముఖమున విభూతిరేఖలు, మీసములుగల హర స్వరూప మున్నది. ఈవైపు దిగువభాగమున పార్వతీదేవి విగ్రహమున్నది. వామ పార్శ్వ మున శంఖ చక్రములను ధరించి ముఖమున తిరునామములు, తలకట్టున కిరీటముగల విష్ణుస్వరూపమున్నది. ఈవైపు దిగువభాగమున లక్ష్మీదేవి విగ్రహమున్నది. పాన వట్టమునకు అధోభాగమున నందీశ్వరునిమూర్తి వేయబడియున్నది. ప్రతి సంవత్స రము ఈదేవునికి ఉత్సవములు జరుగుచుండునని తెలియుచున్నది. దీని ప్రాచీనత తెలిసివచ్చుటలేదు. తిక్కనసనాటికే యీదేవళముండి యున్నట్లు భావించుట సమంజ సము.

తూర్పుగోదావరిజిల్లా దక్షారామములోని సప్త గోదావరీ తీరమున నొక హరి హరనాథమూర్తి యున్నట్లు కీ.శే. బ్రహ్మశ్రీ చాగంటి శేషయ్యగారు తమ ఆంధ్ర కవి తరంగిణిలో సెలవిచ్చిరి. ఇది 1950కి పూర్వము వ్రాయబడిన గ్రంథము. అప్పటికి ఆ మూర్తి స్పష్టముగా ఉండియుండవచ్చుననుటలో సందేహముండరాదు. కాని, ఇటీవల అక్కడికివెళ్ళి దానిని దర్శించినప్పుడు, ఆ మూర్తి యొక్క ఉనికిని బట్టిగాని, రూపురేఖలను బట్టిగాని చూచినచో సదరు చిహ్నములు రూపరియుండుట వలన కాబోలు అది హరిహర విగ్రహమని భావించుటకు అవకాశము అంతగా కాన్పింపలేదు. అట్లయ్యును ఒకప్పుడక్కడ అట్టి విగ్రహమొకటి ఉండి యుండెనని భావించుట లెస్స.

వాస్తుశిల్పరీతుల ప్రకారము చెక్కింపబడినవి. ఈ గుహల గుడులకు ఎదురుగా నున్న సెలయేటి ఒడ్డున ఒక పెద్ద రాతిబండపై ఒక హరిహరనాథమూర్తి మలచ బడి యున్నది. ఈ జమిలివేల్పుకు ఎనిమిది చేతులున్నవి. ఒకవైపు హర చిహ్న ములతోను, మఱొకవైపు హరి చిహ్నములతోను, ఆయుధములతోను వేంచేసి యున్నస్వామి యీతడు. ఈ మూర్తికి ప్రక్కనే నటరాజస్వామి విగ్రహముకూడ కలదు. ఈ కోన గుహలలోని గుడులను, విగ్రహములను క్రీ.శ. 8వ శతాబ్దములో పల్లవ చక్రవర్తి నరసింహుడు మలపించినట్లు చరిత్రకారుల వక్కాణ.

అనంతపురంజిల్లా కల్యాణదుర్గం తాలూకాలోని ఒక చిన్న గ్రామము తూము కుంట. ఇక్కడొక హరిహరేశ్వర (హరిహరనాథ అనికాదు) దేవళమున్నది. ఈ విగ్రహము ఎత్తు సుమారు 5 అడుగులుండును. దక్షిణ పార్శ్వమున త్రిశూలము జపమాలయు ధరించి, ముఖమున విభూతిరేఖలు, మీసముఁగల హర స్వరూప మున్నది. ఈవైపు దిగువభాగమున పార్వతీదేవి విగ్రహమున్నది. వామ పార్శ్వ మున శంఖ చక్రములను ధరించి ముఖమున తిరునామములు, తలకట్టున కిరీటముగల విష్ణుస్వరూపమున్నది. ఈవైపు దిగువభాగమున లక్ష్మీదేవి విగ్రహమున్నది. పాన వట్టమునకు అధోభాగమున నందీశ్వరునిమూర్తి వేయబడియున్నది. ప్రతి సంవత్స రము ఈదేవునికి ఉత్సవములు జరుగుచుండునని తెలియుచున్నది. దీని ప్రాచీనత తెలిసివచ్చుటలేదు. తిక్కనసనాటికే యీదేవళముండి యున్నట్లు భావించుట సమంజ సము.

తూర్పుగోదావరిజిల్లా దక్షారామములోని సప్త గోదావరీ తీరమున నొక హరి హరనాథమూర్తి యున్నట్లు కీ.శే. బ్రహ్మశ్రీ చాగంటి శేషయ్యగారు తమ ఆంధ్ర కవి తరంగిణిలో సెలవిచ్చిరి. ఇది 1950కి పూర్వము వ్రాయబడిన గ్రంథము. అప్పటికి ఆ మూర్తి స్పష్టముగా ఉండియుండవచ్చుననుటలో సందేహముండరాదు. కాని, ఇటీవల అక్కడికివెళ్ళి దానిని దర్శించినప్పుడు, ఆ మూర్తి యొక్క ఉనికిని బట్టిగాని, రూపురేఖలను బట్టిగాని చూచినచో సదరు చిహ్నములు రూపరియుండుట వలన కాబోలు అది హరిహర విగ్రహమని భావించుటకు అవకాశము అంతగా కన్పింపలేదు. అట్లయ్యును ఒకప్పుడక్కడ అట్టి విగ్రహమొకటి ఉండి యుండెనని భావించుట లెస్స.

విదేశ దేశ ఆంధ్రప్రదేశములలో హరిహరనాథ దేవాలయములు తపన్ ఉత్సవములు, ఆర్పిసి మాసములో తిరుకల్యాణోత్సవములు, మార్గశిర మాసమునందు ఆరుద్రోత్సవములు జరుగుచుండును.

మహాబలిపురములో నొక హరిహర విగ్రహము గలదు. తంజనగరములో ఒక వైపు పరశువు, మఱొకవైపు శంఖము ధరించిన హరిహరమూర్తి యొకటున్నది. గంగై కొండచోళ పురములో నొక విగ్రహమున్నది.

ఇతర ప్రాంతములు

ఒరిస్సా, అస్సాం, బెంగాల్, బీహార్, హిమాచల ప్రదేశ్, హర్యానా, గుజరాత్ మొదలైన ప్రాంతములలో హరిహర తత్త్వమునకు, దేవాలయములకు సంబంధించిన ఆచూకీ లిఖితపూర్వకముగాగాని, వినికిడిద్వారాగాని బొత్తిగా లభించుట లేదు. అందువలన ఆయా ప్రాంతములలో దీనికి సంబంధించిన చిహ్నములు అసలే లేవని నిర్ధారించుటకంటె ఉన్నవనిభావించి పరిశోధనకు పూనుకొన్నచో అక్కడక్కడ కలికమునకైనను కొన్ని లభింపకపోవు. అప్పుడు ఈ తత్త్వప్రచారము యొక్క ప్రాచీనత, విస్తృతి మఱింత సాక్షాత్కరింపగలదు. భావి పరిశోధకులు అందుకు పూనుకొందురుగాక యని మనవి చేయటమైనది.

ఆంధ్ర ప్రదేశ్

ఒకప్పుడు నెల్లూరు జిల్లాలో అంతర్భాగముగనుండి ఇప్పుడు ప్రకాశం జిల్లాలో చేరియున్న పట్టణము కందుకూరు. ఇక్కడ అతిప్రాచీనకాలమున "విష్ణుహర" అను పేరుతో నొక హరిహరనాథాలయముండెను. పల్లవరాజు సింహవర్మ క్రీ.శ. 486లో అనగా తాను పట్టాభిషిక్తుడైన పిమ్మట పదకొండవ పరిపాలనా సంవత్సరమున ఈ దేవాలయమునకు ఉరవపల్లి గ్రామమును ఈనాముగా (grant) దత్తము చేసినట్లు చరిత్ర. మఱి యిప్పుడు కందుకూరులో ఈ దేవాలయమున్నదో లేదో అన్నదొక విచికిత్స. ఆ చరిత్రను త్రవ్వి వెలికితీయుట మంచిది.

ఇదే ప్రాంతమున భైరవకోన చాల ప్రసిద్ధిచెందిన ప్రదేశము. మొదట నెల్లూరు జిల్లాలోనుండి పిమ్మట ప్రకాశం జిల్లాలో చేరిపోయిన ప్రాంతమిది. నెల్లూరికి ఉదయగిరి సుమారు 60 మైళ్ళ దూరములో నున్నది. ఉదయగిరికి సమీపమందున్న సీతారామపురమునకు సుమారు పది పదిహేనుమైళ్ళ దూరములో నున్నది యీ భైరవకోన. ఇచ్చటి గుహలలో ఏడు శివలింగములున్నవి. ఇవి బౌద్ధ జైన

వాస్తుశిల్పరీతుల ప్రకారము చెక్కింపబడినవి. ఈ గుహల గుడులకు ఎదురుగా నున్న సెలయేటి ఒడ్డున ఒక పెద్ద రాతిబండపై ఒక హరిహరనాథమూర్తి మలచ బడి యున్నది. ఈ జమిలివేల్పుకు ఎనిమిది చేతులున్నవి. ఒకవైపు హర చిహ్నములతోను, మఱొకవైపు హరి చిహ్నములతోను, ఆయుధములతోను వేంచేసి యున్నస్వామి యీతడు. ఈ మూర్తికి ప్రక్కనే నటరాజస్వామి విగ్రహముకూడ కలదు. ఈ కోన గుహలలోని గుడులను, విగ్రహములను క్రీ.శ. 8వ శతాబ్దములో పల్లవ చక్రవర్తి నరసింహుడు మలపించినట్లు చరిత్రకారుల వక్కాణ.

అనంతపురంజిల్లా కల్యాణదుర్గం తాలూకాలోని ఒక చిన్న గ్రామము తూము కుంట. ఇక్కడొక హరిహరేశ్వర (హరిహరనాథ అనికాదు) దేవళమున్నది. ఈ విగ్రహము ఎత్తు సుమారు 5 అడుగులుండును. దక్షిణ పార్శ్వమున త్రిశూలము జపమాలయు ధరించి, ముఖమున విభూతిరేఖలు, మీసముఁగల హర స్వరూప మున్నది. ఈవైపు దిగువభాగమున పార్వతీదేవి విగ్రహమున్నది. వామ పార్శ్వ మున శంఖ చక్రములను ధరించి ముఖమున తిరునామములు, తలకట్టున కిరీటముగల విష్ణుస్వరూపమున్నది. ఈవైపు దిగువభాగమున లక్ష్మీదేవి విగ్రహమున్నది. పాన వట్టమునకు అధోభాగమున నందీశ్వరునిమూర్తి వేయబడియున్నది. ప్రతి సంవత్స రము ఈదేవునికి ఉత్సవములు జరుగుచుండునని తెలియుచున్నది. దీని ప్రాచీనత తెలిసివచ్చుటలేదు. తిక్కననాటికే యీదేవళముండి యున్నట్లు భావించుట సమంజ సము.

తూర్పుగోదావరిజిల్లా దక్షారామములోని సప్త గోదావరీ తీరమున నొక హరి హరనాథమూర్తి యున్నట్లు కీ.శే. బ్రహ్మశ్రీ చాగంటి శేషయ్యగారు తమ ఆంధ్ర కవి తరంగిణిలో సెలవిచ్చిరి. ఇది 1930కి పూర్వము వ్రాయబడిన గ్రంథము. అప్పటికి ఆ మూర్తి స్పష్టముగా ఉండియుండవచ్చుననుటలో సందేహముండరాదు. కాని, ఇటీవల అక్కడికివెళ్ళి దానిని దర్శించినప్పుడు, ఆ మూర్తి యొక్క ఉనికిని బట్టిగాని, రూపురేఖలను బట్టిగాని చూచినచో సదరు చిహ్నములు రూపరియుండుట వలన కాబోలు అది హరిహర విగ్రహమని భావించుటకు అవకాశము అంతగా కాన్పింపలేదు. అట్లయ్యును ఒకప్పుడక్కడ అట్టి విగ్రహమొకటి ఉండి యుండెనని భావించుట తప్పు.

విదేశ దేశ ఆంధ్రప్రదేశములలో హరిహరనాథ దేవాలయములు

తపన్ ఉత్సవములు, ఆర్పిసి మాసములో తిరుకల్యాణోత్సవములు, మార్గశిర మాసమునందు ఆరుద్రోత్సవములు జరుగుచుండును.

మహాబలిపురములో నొక హరిహర విగ్రహము గలదు. తంజనగరములో ఒక వైపు పరశువు, మఱొకవైపు శంఖము ధరించిన హరిహరమూర్తి యొకటున్నది. గంగై కొండచోళ పురములో నొక విగ్రహమున్నది.

ఇతర ప్రాంతములు

ఒరిస్సా, అస్సాం, బెంగాల్, బీహార్, హిమాచల ప్రదేశ్, హర్యానా, గుజరాత్ మొదలైన ప్రాంతములలో హరిహర తత్త్వమునకు, దేవాలయములకు సంబంధించిన ఆచూకీ లిఖితపూర్వకముగాగాని, వినికిడిద్వారాగాని బొత్తిగా లభించుట లేదు. అందువలన ఆయాప్రాంతములలో దీనికి సంబంధించిన చిహ్నములు అసలే లేవని నిర్ధారించుటకంటె ఉన్నవనిభావించి పరిశోధనకు పూనుకొన్నచో అక్కడక్కడ కలికమునకైనను కొన్ని లభింపకపోవు. అప్పుడు ఈ తత్త్వప్రచారము యొక్క ప్రాచీనత, విస్తృతి మఱింత సాక్షాత్కరింపగలదు. భావి పరిశోధకులు అందుకు పూనుకొందురుగాక యని మనవి చేయటమైనది.

ఆంధ్ర ప్రదేశ్

ఒకప్పుడు నెల్లూరు జిల్లాలో అంతర్భాగముగనుండి ఇప్పుడు ప్రకాశం జిల్లాలో చేరియున్న పట్టణము కందుకూరు. ఇక్కడ అతిప్రాచీనకాలమున "విష్ణుహర'' అను పేరుతో నొక హరిహరనాథాలయముండెను. పల్లవరాజు సింహవర్మ క్రీ.శ. 486లో అనగా తాను పట్టాభిషిక్తుడైన పిమ్మట పదకొండవ పరిపాలనా సంవత్సరమున ఈ దేవాలయమునకు ఉరవపల్లి గ్రామమును ఈనాముగా (grant) దత్తము చేసినట్లు చరిత్ర. మఱి యిప్పుడు కందుకూరులో ఈ దేవాలయమున్నదో లేదో అన్నదొక విచికిత్స. ఆ చరిత్రను త్రవ్వి వెలికితీయుట మంచిది.

ఇదే ప్రాంతమున భైరవకోన చాల ప్రసిద్ధిచెందిన ప్రదేశము. మొదట నెల్లూరు జిల్లాలోనుండి పిమ్మట ప్రకాశం జిల్లాలో చేరిపోయిన ప్రాంతమిది. నెల్లూరికి ఉదయగిరి సుమారు 60 మైళ్ళ దూరములో నున్నది. ఉదయగిరికి సమీపమందున్న సీతారామపురమునకు సుమారు పది పదిహేను మైళ్ళ దూరములో నున్నది యీ భైరవకోన. ఇచ్చటి గుహలలో ఏడు శివలింగములున్నవి. ఇవి బౌద్ధ జైన

పద్యములలో పలుమాఱులు "వ్యాసాదివచో విభవ" "వ్యాసాది ముని ప్రోక్త" ఇత్యాదిగా పేర్కొనుటను బట్టి యీ తత్త్వమును ప్రతిపాదించిన మహనీయుడు వ్యాసుడే యనుట నిష్కర్ష. వట్టి తత్త్వమునేకాదు; ద్రోణపర్వమునందలి అర్జున స్వప్నవృత్తాంతములో ఈ మూర్తికి రూపకల్పనముకూడ చేసిన విషయము గమనార్హము. అది యాధారముగ ఈ తత్త్వము, దేవాలయములు క్రమక్రమముగా దేశమెల్లెడల వ్యాప్తి చెందుచూ వచ్చినవి. పౌరాణిక దృక్పథమును వదలిపెట్టి కేవల చారిత్రక దృష్టితో చూచినను ఈ ఆరాధనా విధానమునకు క్రీ.శ. ఒకటవ శతాబ్దము నుండి కచ్చితమైన ప్రారంభము, చరిత్ర లభించుచున్నవి. క్రీ.శ. 8వ శతాబ్దిమధ్య భాగములో శంకరులు అవతరించిన నాటికే ఇది చక్కగా వ్యాప్తి చెందియున్నది. వారి రాకతో మఱింత పుంజుకున్నది. అందుకే "వ్యాసాది వచోవిభవ" వంటి వాక్యములలోని "ఆది" పదము శ్రీ శంకరులకు కూడ గ్రాహకమని పలుమాఱులు పూర్వోక్తము.

వ్యాసునకు శంకరులకు మధ్యకాలములో దేశమునందలి వివిధప్రాంతములలో ఈ దేవాలయములు వెలసినట్లే, అదేవరుసలో, తిరుమలపై కూడ వేంకటేశ్వరుడు హరిహరస్వరూపముతో వెలసినాడని నిర్ధారించుటలో విప్రతిపత్తి యుండరాదు. శంకరులు అవతరించకపూర్వమే, వ్యాసప్రోక్తమై, తిరుమల వేంకటేశ్వర నిష్ఠమైన యీ తత్త్వమును దక్షిణదేశములో ముందుగా దర్శించి పట్టివేసిన మహనీయులు ఆళ్వారులలో మొదటివారైన పొయ్‌గై యాళ్వారు, మూడవవారైన పేయాళ్వారు, పదవవారైన తిరుమంగై యాళ్వారులు. తమకుగల సహజమైన విష్ణుభక్తినికూడ త్రోసి రాజని, ఇష్టముండియో లేకయో కావచ్చుగాక, వేంకటేశ్వరుని హరిహర స్వరూపమును తప్పక వర్ణింపవలసినవారైరి.

ప్రజ్ఞాచక్షువైన తిక్కన అన్నివైపులనుండి కూలంకషముగ పరిశీలించి, ఒక సమన్వయాత్మక ప్రాతిపదికను నిర్మించుకొని, వేంకటేశ్వర నిష్ఠమైన యీ హరిహర తత్త్వమును ఆళ్వారుల పాశురములద్వారా ఠక్కున అందిపుచ్చుకొని ఆ వఱవడిలో రెండువందల పద్యములను వ్రాసి యీ తత్త్వమును పడగవిప్పినట్లు విస్తారముగ ప్రతిపాదించినాడు; తాను సప్తగిరి హరిహరనాథాంకితుడై పోయినాడు; తాళ్ళపాక కవులందఱు వేంకటేశ్వరుని విష్ణువుగా భావించి సేవించి తరించిన

విదేశ దేశ ఆంధ్రప్రదేశములలో హరిహరనాథ దేవాలయములు యొక్క, ఇటు శ్రీనారాయణస్వామియొక్క సేవలో నిమగ్నులై యుందురు. కుటుంబపోషణకు నొకచిన్న వ్యాపారమును చేసికొనుచు కాలముగడుపుచున్నారు.

హరిహరేశ్వర మూర్తి
ప్రతీకా లక్షణములు

కర్ణాటకములోని సుప్రసిద్ధ హరిహర క్షేత్రమునందలి మూర్తికి ప్రతిబింబమే యీ విగ్రహమని పూర్వోక్తము. ఒకేఒక ఘనమైన నల్లరాతిలో మలచబడిన విగ్రహమిది. సుమారు 5 అడుగుల యెత్తుండును: ఈతడు ఇరుప్రక్కల దేవులుగల హరిహరేశ్వరుడు కాదు; ఒంటరిగానున్న హరిహరేశ్వరుడు. కాళ్ళు మోకాళ్ళపైభాగము వఱకేయుండును. ఆక్రిందిభాగము లేదు. పూర్తిగా దిగంబరమూర్తి. ఔచిత్యమును పాటించి వస్త్రము అచ్ఛాదింపబడుచున్నది. కుడివైపు హర స్వరూపము, ఎడమవైపు హరి స్వరూపము ఉన్నది. ఒకవైపు జటలు మఱొకవైపు కిరీటము, నుదుటియందొకవైపు త్రినేత్ర చిహ్నము మఱొకవైపు తిరునామ చిహ్నము, కుడివైపు చెవికి సర్పాభరణము ఎడమవైపు చెవికి చక్రాకృతిలో కుండలాభరణము ఉండును. నాల్గుచేతులున్నవి. కుడివైపు పైచేతిలో త్రిశూలము క్రిందిచేతిలో అభయముద్ర, ఎడమవైపు పైచేతిలో చక్రము క్రిందిచేతిలో శంఖము ఉండును. కుడివైపు దిగువభాగమున చిన్న పార్వతీవిగ్రహము, ఎడమవైపు దిగువభాగమున చిన్న లక్ష్మీ విగ్రహము ఉండును. అభిషేకమున కనుకూలముగ పానవట్టము గలదు. ఈ మూల విగ్రహమునకు సరియైన నమూనాగా ఇత్తడికంచుతో చేయబడిన ఒకమోస్తరు చిన్నపాటి పరిమాణములో ఉత్సవమూర్తి గూడ కలదు.

పూజా సమయములో శాస్త్ర సంప్రదాయ మర్యాదలననుసరించి అటు హరికి ఇటు హరునకు కావలసిన ద్రవ్యములను సమర్పింతురు. రుద్రము, విష్ణు సహస్రనామము రెండును పఠింపబడును. ప్రతిరోజు సాయంసమయమున భజనలు జరుగుచుండును.

పిండీకృత సారాంశము

ఇప్పటికిచేసిన యీ పరామర్శనుబట్టి తెలుచున్న సారాంశమిది: ఈ హరిహరతత్త్వము అతి పురాతనమైనది. దానిని అనుసరించి నిర్మింపబడిన దేవాలయముల చరిత్రకూడ మిక్కిలి ప్రాచీనమైనది. తిక్కన తన హరిహరనాథ

పద్యములలో పలుమాఱులు "వ్యాసాదివచో విభవ" "వ్యాసాది ముని ప్రోక్త" ఇత్యాదిగా పేర్కొనుటను బట్టి యీ తత్త్వమును ప్రతిపాదించిన మహనీయుడు వ్యాసుడే యనుట నిష్కర్ష. వట్టి తత్త్వమునేకాదు; ద్రోణపర్వమునందలి అర్జున స్వప్నవృత్తాంతములో ఈ మూర్తికి రూపకల్పనముకూడ చేసిన విషయము గమనార్హము. అది యాధారముగ ఈ తత్త్వము, దేవాలయములు క్రమక్రమముగా దేశమెల్లెడల వ్యాప్తి చెందుచూ వచ్చినవి. పౌరాణిక దృక్పథమును వదలిపెట్టి కేవల చారిత్రక దృష్టితో చూచినను ఈ ఆరాధనా విధానమునకు క్రీ.శ. ఒకటవ శతాబ్దము నుండి కచ్చితమైన ప్రారంభము, చరిత్ర లభించుచున్నవి. క్రీ.శ. 8వ శతాబ్దిమధ్య భాగములో శంకరులు అవతరించిన నాటికే ఇది చక్కగా వ్యాప్తి చెందియున్నది. వారి రాకతో మఱింత పుంజుకున్నది. అందుకే "వ్యాసాది వచోవిభవ" వంటి వాక్యములలోని "ఆది" పదము శ్రీ శంకరులకు కూడ గ్రాహకమని పలుమాఱులు పూర్వోక్తము.

వ్యాసునకు శంకరులకు మధ్యకాలములో దేశమునందలి వివిధప్రాంతములలో ఈ దేవాలయములు వెలసినట్లే, అదేవరుసలో, తిరుమలపై కూడ వేంకటేశ్వరుడు హరిహరస్వరూపముతో వెలసినాడని నిర్ధారించుటలో విప్రతిపత్తి యుండరాదు. శంకరులు అవతరించకపూర్వమే, వ్యాసప్రోక్తమై, తిరుమల వేంకటేశ్వర నిష్ఠమైన యీ తత్త్వమును దక్షిణదేశములో ముందుగా దర్శించి వట్టివేసిన మహనీయులు ఆళ్వారులలో మొదటివారైన పొయ్‌గై యాళ్వారు, మూడవవారైన పేయాళ్వారు, పదవవారైన తిరుమంగై యాళ్వారులు. తమకుగల సహజమైన విష్ణుభక్తినికూడ త్రోసి రాజని, ఇష్టముండియో లేకయో కావచ్చుగాక, వేంకటేశ్వరుని హరిహర స్వరూపమును తప్పక వర్ణింపవలసినవారైరి.

ప్రజ్ఞాచక్షువైన తిక్కన అన్నివైపులనుండి కూలంకషముగ పరిశీలించి, ఒక సమన్వయాత్మక ప్రాతిపదికను నిర్మించుకొని, వేంకటేశ్వర నిష్ఠమైన యీ హరిహర తత్త్వమును ఆళ్వారుల పాశురములద్వారా చక్కన అందిపుచ్చుకొని ఆ వఱవడిలో రెండువందల పద్యములను వ్రాసి యీ తత్త్వమును పడగవిప్పినట్లు విస్తారముగ ప్రతిపాదించినాడు। తాను సప్తగిరి హరిహరనాథాంకితుడై పోయినాడు। తాళ్ళపాక కవులందఱు వేంకటేశ్వరుని విష్ణువుగా భావించి సేవించి తరించిన

విదేశ దేశ ఆంధ్రప్రదేశములలో హరిహరనాథ దేవాలయములు యొక్క, ఇటు శ్రీనారాయణస్వామియొక్క సేవలో నిమగ్నులై యుందురు. కుటుంబపోష షణకు నొకచిన్న వ్యాపారమును చేసికొనుచుకాలముగడుపుచున్నారు.

## హరిహరేశ్వర మూర్తి

## ప్రతీకా లక్షణములు

కర్ణాటకములోని సుప్రసిద్ధ హరిహర క్షేత్రమునందలి మూర్తికి ప్రతిబింబమే యీ విగ్రహమని పూర్వోక్తము. ఒకేఒక ఘనమైన నల్లరాతిలో మలచబడిన విగ్రహ మిది. సుమారు 5 అడుగుల యెత్తుండును: ఈతడు ఇరుప్రక్కల దేవులుగల హరి హరేశ్వరుడు కాదు; ఒంటరిగానున్న హరిహరేశ్వరుడు. కాళ్ళు మోకాళ్ళపైభాగము వఱకేయుండును. ఆక్రిందిభాగము లేదు. పూర్తిగా దిగంబరమూర్తి. ఔచిత్యమును పాటించి వస్త్రము అచ్చాదింపబడుచున్నది. కుడివైపు హర స్వరూపము, ఎడమ వైపు హరి స్వరూపము ఉన్నది. ఒకవైపు జటలు మఱొకవైపు కిరీటము, నుదుటి యందొకవైపు త్రినేత్ర చిహ్నము మఱొకవైపు తిరునామ చిహ్నము, కుడివైపు చెవికి సర్పాభరణము ఎడమవైపు చెవికి చక్రాకృతిలో కుండలాభరణము ఉండును. నాల్గుచేతులున్నవి. కుడివైపు పైచేతిలో త్రిశూలము క్రిందిచేతిలో అభయముద్ర, ఎడమవైపు పైచేతిలో చక్రము క్రిందిచేతిలో శంఖము ఉండును. కుడివైపు దిగువ భాగమున చిన్న పార్వతీవిగ్రహము, ఎడమవైపు దిగువభాగమున చిన్న లక్ష్మీ విగ్రహము ఉండును. అభిషేకమున కనుకూలముగ పానవట్టము గలదు. ఈ మూల విగ్రహమునకు సరియైన నమూనాగా ఇత్తడికంచుతో చేయబడిన ఒకమోస్తరు చిన్నపాటి పరిమాణములో ఉత్సవమూర్తి గూడ కలదు.

పూజా సమయములో శాస్త్ర సంప్రదాయ మర్యాదలననుసరించి అటు హరికి ఇటు హరునకు కావలసిన ద్రవ్యములను సమర్పింతురు. రుద్రము, విష్ణు సహస్ర నామము రెండును పఠింపబడును. ప్రతిరోజు సాయంసమయమున భజనలు జరుగు చుండును.

## పిండీకృత సారాంశము

ఇప్పటికిచేసిన యీ పరామర్శనుబట్టి తేలుచున్న సారాంశమిది: ఈ హరి హరతత్త్వము అతి పురాతనమైనది. దానిని అనుసరించి నిర్మింపబడిన దేవాల యముల చరిత్రకూడ మిక్కిలి ప్రాచీనమైనది. తెక్కన తన హరిహరనాథ

మున పి.హెచ్.డి. చేసి డాక్టరేట్ పట్టమును పొందిన “ఎఱ్ఱన అరణ్యపర్వశేషము” అను తన సిద్ధాంత గ్రంథమున మొదటిదగు “మూడుకృతుల” సమస్యను కూలంకషముగ చర్చించి “నన్నయ అరణ్యపర్వములో సగము మాత్రమే వ్రాసెను; తక్కిన సగమును ఎఱ్ఱనయే పూర్తిగా రచించెను” అని సోపపత్తికముగ నిష్కర్షగా నిర్ధారించుట జరిగినది. అదే గ్రంథమున “ఎఱ్ఱన హరిహరతత్త్వము” అను శీర్షికన వేంకటేశ్వర తత్త్వమే తిక్కన హరిహరనాథ తత్త్వమనియు, ఎఱ్ఱన హరిహర తత్త్వముకూడ అదియే యనియు దిఙ్మాత్రముగ చర్చించి నిష్కర్షగా నిరూపించుట జరిగినది. సదరు సిద్ధాంత గ్రంథము త్వరలో ప్రచురింపబడి వెలువడబోవుచున్నదని మనవిచేయటమైనది.

ఇక రెండవ విషయమునకు సంబంధించినంతవఱకు ఈ ప్రస్తుత ములో ఎనిమిది వ్యాసములు వ్రాయబడినవి. వలవేసినట్లు వివిధ విషయము సేకరించి అనేక దృక్కోణములనుండి తలస్పర్శముగ పరిశీలించి చర్చించి “వే టేశ్వర తత్త్వమే తిక్కనగారి హరిహరనాథ తత్త్వమని” నిష్కర్ష చేయుచు నిర్ధా రించుటకు యథాశక్తి ప్రయత్నింప బడినదని మనవి చేయుచు విరమించటమైనది.

“హరిహరనాథః సర్వభువనార్చిత నన్ దయఁజూడు మెప్పుడున్”

—*—

# తెలుగులో ఛందోరీతులు

"ఛందః పాదౌతు వేదస్య" ఛందము వేదమునకు పాదములు అని పాణినీయ శిక్ష చెబుతున్నది. వేదంయొక్క షడంగాల్లో ఛందస్సొకటి. ఇది వేదపురుషునకు పాదములుగా నిరూపింపబడినదన్నమాట. ఇక్కడ వేదమంటే ఋగ్వేదం ఋగ్వేద మంత్రాలు ఛందోబద్ధాలు. "ఛందోహీనో నశబ్దోఽస్తి న చ్ఛదః శబ్దవర్జి తమ్'' అని నాట్యశాస్త్రం. అంటే ఛందస్సుకు కట్టుబడని శబ్దముండదు; శబ్దం లేనిదే ఛందస్సుండదు అనిఅర్థం. "ఛందాంసి ఛాదనాత్" అని యాస్కుడు నిర్వ చనం చెప్పారు. అంటే భావాలకు ఛందస్సు తొడుగువంటిదని భావం. ''ఛందయతి అహ్లాదయతి'' "ఛందః పద్యే అభిలాషేచ" ఇత్యాది నిర్వచనాలింకా ఎన్నోఉన్నాయి. అహ్లాదార్థకమైన 'చది' ధాతువు తొలి చకారానికి "చందేరాదేశ్చః" అన్న ఉణాది సూత్రంచేత ఛకారంవచ్చి ఛందశ్శబ్దం ఏర్పడింది.

ఋగ్వేదంలో 26 ఛందాలున్నాయి. వీటిల్లో కొన్ని ఏకపదాలు. కొన్నిద్వి పదాలు. గాయత్రీ ఛందం త్రిపద. గాయత్రి ఛందా లన్నింటిలోకి సర్వశ్రేష్ఠమై నది. గీతలో భగవానుడు "గాయత్రీ ఛందసామహమ్" అని సెలవిచ్చారు. ''ఓమ్ తత్స వితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్" అన్నది గాయత్రి. దీనికున్న మూడు పాదాల్లోను పాదానికి ఎనిమిదేసి చొప్పున మొత్తం 24 అక్షరాలుంటయి. ''సాంఖ్యదర్శన ప్రసిద్ధమైన ప్రకృతియొక్క త్రిగుణాత్మ కత్వమే గాయత్రియొక్క త్రిపదాత్వము. ప్రకృతియొక్క చతుర్వింశతి తత్వాత్మ కత్వమే గాయత్రి చతుర్వింశత్యక్షరాత్వము. ప్రకృతియొక్క సర్వ ప్రపంచ మాతృత్వమే గాయత్రి సర్వ చ్ఛందో మాతృత్వము. ఛందః ప్రకృతియే గాయత్రి" అని చెప్పారు శాస్త్రవేత్తలు. ఇట్టి ఋగ్వేద జనితమైన వైదికచ్ఛందం లౌకికరూ పాన్ని ధరించి వాల్మీకి ముఖంనుండి తొలిసారి వెలువడింది:

వాల్మీకిమహర్షి కళ్ళయెదుట ఒక నిషాదుడు క్రౌంచమిధునంలోని మగదాన్ని బాణంతోకొట్టి చంపాడు. మరణిస్తున్న భర్తను చూసి క్రౌంచి విలపిస్తుంటే మహర్షి

హృదయం కల్లోలితమైంది, అప్రియత్నంగా అతని ముఖంనుండి—

"మానిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీస్సమాః
యత్క్రౌంచ మిధునాదేక మవధీః కామమోహితమ్"

అన్న శ్లోకం వెలువడింది. ఇది అనుష్టుప్పు. అంటే శ్లోకమని అర్థం. ఇది ఛందస్సుయొక్క ప్రథమావతారం. ఈ అనుష్టుప్ ఛందము గాయత్రీ ఛందము యొక్క పునర్జన్మమట; జన్మ మాత్రమేకాదు; అవతారమే అని ఉత్తరరామ చరిత్రలో ఆత్రేయీ వనదేవతల ద్వారా భవభూతి ప్రశంసించారు. ఈ అనుష్టుప్ ఛందముయొక్క తొలి యక్షరాలు "మ,ని,ష,ద," అనేవి ''సరిగమపదని" అను సప్త స్వరాల్లోనివే అనీ, క్రౌంచీ ఋతంలో ఈ సంగీతధర్మం ఉంటుందనీ ఒక మహా విషయాన్ని ప్రతిపాదించారు శాస్త్రజ్ఞులు. ఈ అనుష్టుప్ తరువాతిదగు ''పాద బద్ధోఽక్షర సమః తంత్రీలయ సమన్వితః"అన్న శ్లోకాన్నిబట్టి వాల్మీకి రామాయణంలోని సంగీత ధర్మాన్ని కూడా దర్శించారు పెద్దలు. అంటే ఛందస్సుకూ సంగీతానికి అవినాభావ సంబంధముందని చెప్పటమే ఇందలి పరమార్థం. ఈ విధంగా వాల్మీకి సంస్కృతంలో ఆదికవైనాడు.

ఇక "ఋషివంటి నన్నయ్య రెండవ వాల్మీకి" మన తెలుగుకవిత్వాకి ఆదికవి వైదికమైన గాయత్రీ ఛందముయొక్క, ఆర్షమైన అనుష్టుప్ ఛందముయొక్క, రీతినీ ధర్మాన్నీ అదేస్థాయిలో అందిపుచ్చుకొని ఆంధ్రభారతములోని ఛందస్సుల్లో ఋతంభరత్వమును నింపిన మహనీయుడు. ఉదంకుని సర్పరాజస్తోత్రంలోని నాల్గు శ్లోకాలు ఋతంభరములై వేదఋక్కులవలె ఉండటం మన అనుభూతిలో ఉన్నవిషయం.

నన్నయకు ముందున్న తెలుగుకవుల్ని గూర్చి, కావ్యాల్నిగూర్చి బొత్తిగా తెలియకపోయినా అప్పటికే తెలుగులో కవిత్వం ఉన్నట్లు నాల్గుశాసనాలవల్ల తెలుస్తున్నది. పండరంగని అద్దంకిశాసనంలో ఒకతరువోజ, గుణగవిజయాదిత్యుని కందుకూరు శాసనంలోనూ, చాళుక్యభీమ మహారాజు ధర్మవరం శాసనంలోనూ చెరొక సీసపద్యమూ, యుద్ధమల్లుని బెజవాడ శాసనంలో కొన్ని మధ్యాక్కఱలు ఉన్నాయి. ఇవి సంస్కృత సంబంధంలేని దేశీయ ఛందస్సులు. నన్నయకు పూర్వుడైన కన్నడ కవి నాగవర్మ రచించిన ఛందోంబుధిలో "తెలుగులో సంస్కృత ఛ్ఛందోజాతా

లైన సమ — అర్ధసమ — విషమవృత్తాలనే మూడు విధాల వృత్తాలు వ్యవహారంలో ఉన్నాయి" అని చెప్పటాన్నిబట్టి ఆనాడు కొన్ని సంస్కృత వృత్తాలుకూడా వ్యవహారంలో ఉన్నట్లు బోధపడుతుంది. దీనికితోడు క్రీ.శ. 1000 శతాబ్దినాటిదగు విరియాల కామసాని గూడూరు శాసనంలో మూడు చంపకమాలలు రెండు ఉత్పలమాలలు లభించటం ఈ విషయాన్ని ధృవపరుస్తున్నాయి. కాగా నన్నయకు పూర్వం తరువోజ సీస మధ్యాక్కఱలు అనే దేశీయరీతులు, చంపక ఉత్పల మాలలనే సంస్కృత వృత్తాలు బాగా వ్యవహారంలో ఉండేవనటం స్పష్టం. వీటన్నింటినీ నన్నయ స్వీకరించి భారతంలో వ్రాశాడు.

అయితే ఈ తరువోజ సీస మధ్యాక్కఱలు నిజంగా తెలుగు దేశీయవృత్తాలనటానికి వీల్లేదు. ఎందుకంటే యివి ఆంధ్రభారతం అవతరించటానికి పూర్వమే కన్నడ కావ్యాల్లో ధారాళంగా వాడబడినవి. కన్నడ భాషకూ తెలుగు భాషకూ ఆ నాడున్న సంబంధ బాంధవ్యాల్నిబట్టి యివి తెలుఁగులో ప్రవేశించినవని భావింపవచ్చు. కాబట్టి సంస్కృతంతో సంబంధంలేని దేశీయవృత్తాలు అన్నంతవఱకే యివి దేశీయవృత్తాలన్నమాట. కాని యీ దేశీయ వృత్తాలకు, వీటితోపాటివే అయిన సీసం, ఆటవెలది, తేటగీతి, ద్విపద మొదలైన వాటికి సంస్కృత సంబంధం అసలే లేదనటానికి బొత్తిగా వీల్లేదు. ఎందువల్లనంటే సంస్కృత గణాలైన "యమాతారాజభానస" అనే ఎనిమిది అక్షరగణాలతోనే తయారైన ఇంద్ర సూర్య చంద్ర గణాలనే మాత్రాగణాలతో కూర్చబడిన వృత్తాలు కావటమే కారణం. ఇలా విశ్లేషణ చేస్తూపోతే సంస్కృతంతో సంబంధంలేని ఛందోరీతి అంటూ తెలుగులో కనబడదు. ఈ స్థితి ఒక్క తెలుగులోనే కాదు; దాదాపు అన్ని దేశీయభాషల్లోనూ ఉన్నది.

అయితే, యిక తెలుగులో అచ్చమైన దేశీయ కవితఅంటూ ఒకటిలేదా అంటే ఉన్నది. భావోద్రేకంచేతహృదయ ముప్పొంగి అప్రయత్నంగా మానవుని నోటి నుండి వెలువడిన పదములు, పాటలు, గీతాలు అనేవి నిజమైన దేశీయ కవితలు. ఏ భాషలోగాని పద్య కవిత్వానికి ముందు పదములు, పాటలే వెలువడి, తరువాత క్రమంగా పద్యరూపం దాల్చటం అతి సహజంగా కనబడుతున్నది. అప్పుడు దానికి వ్యాకరణమంటూ, ఛందస్సంటూ ఏర్పడతయి. పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రలో చెప్పిన:

"పదములు తుమ్మెద పదములు ప్రభాత పదములు పర్వత పదములు శంకర పదములు సంజవర్ణన మఱి గణవర్ణన పదములు అర్ణవఘోషణ ఘూర్ణిల్లుచుండ బాడుచు నాడుచు పరమహర్షమున సద్భక్త సంకులమేగుదేఱ (వాదప్రకరణం 513)

అన్నదాన్నిబట్టి ఏలపాటలు, గొల్లసుద్దులు, లాలిపాటలు, జోలపాటలు. పెండ్లి పాటలు మొదలైనవి ప్రాచీనకాలమునుండీ వ్యాప్తిలోనున్నట్లు తెలుస్తున్నది.

1) లాలి బంగరుబొమ్మ లాలి మాయమ్మా
లాలి ముద్దుల గుమ్మ లాలి సీతమ్మా

2) అంతట రాములవారూ - అంగన సీతనుగూడీ
సంతసమందుచు వేగా - స్వపురానికి చనుదెంచి

ఇత్యాది దేశీయ పదములే నిజమైన తొలి తెలుగు కవిత్వము. తెలుఁగు ఛందోరీతుల్లో ద్విపదకు మఱి దేనికీలేని కీలకమైన స్థానమున్నది. పైన చెప్పిన పదములు, పాటలూ ఇవన్నీ ఈ ద్విపదలో సుళువుగా ఒదిగికూర్చుంటయి. ఇది తెలుఁగులో అతిచిన్న ఛందోరీతి. ఈ ద్విపదయొక్క రెండవ ప్రత్యేకత యేమంటే జాతులు, ఉపజాతులు అని పిలువబడుచున్న తరువోజ, సీసం వంటివి. ఇందులో నుంచి పుట్టటం! ఉదాహరణకు: ద్విపదయొక్క పాదాలు రెండింటినీ ఒక్కటిగా చేస్తే తరువోజ కొక్కపాదమౌతుంది. ఇట్లు ద్విపదకొక ప్రత్యేక స్థానమున్నది. అందుకే పాల్కురికి సోమనాథుడు అంతగా దాన్ని పట్టుకొని వేళ్ళాడాడు. దేశి కవితకు ద్విపదలు, ద్విపద కావ్యాలు జీవగఱ్ఱలనక తప్పదు. తెలుఁగు సాహిత్యంలో కవిత్రయంవారి మార్గకవితా పద్ధతికీ, పాల్కురికి దేశికవితా పద్ధతికీ అనేక ఇతర విషయాలలోపాటు ప్రత్యేకించి యీ ఛందోరీతుల్లో పెద్ద ఘర్షణే కలిగిందని చెప్పాలి.

కవిత్రయంవారు వాడిన సంస్కృత వృత్తాలన్నీ కలిపి సుమారు నలభైదాకా ఉన్నయి. కాని ధారాళంగా వందల సంఖ్యలో వాడినవి చంపకోత్పల శార్దూల మత్తేభవిక్రీడితాలు మాత్రమే. వీటిల్లో ఒక్క శార్దూలం తప్ప తక్కిన మూడువృత్తాలూ సంస్కృత కావ్యాల్లో అంతగా కనబడవు. నన్నయ "శ్రీవాణీగిరిజాశ్చిరాయ" అన్నది సంస్కృతంలో శార్దూలంలో వ్రాసినా "రాజకులైక భూషణుడు" అన్న తెలుగు తొలిపద్యాన్ని ఉత్పలంలో వ్రాశాడు. ఆశ్చర్యమేమంటే నన్నయగారి చివరి పద్యం "శారద రాత్రులు జ్వల" అన్న పద్యంగూడా ఉత్పలమే. తిక్కన తన విరా

చనోత్తర రామాయణంలో "శ్రీరాస్తాం" అను తొలిశ్లోకం సంస్కృతంలో శార్దూలంలో వ్రాశాడు. తన భారతంలో తొలిపద్యం "శ్రీయనగౌరి నాబరగు" అన్నది ఉత్పలంలో వ్రాశాడు. ఎఱ్ఱయ హరివంశంలో తొలిపద్యం ఉత్పలంలో వ్రాశాడు. నృసింహ పురాణంలో తొలిపద్యం ఉత్పలంలో వ్రాశాడు. తన భారతంలో తొలి పద్యం" స్ఫురదరుణాంశురాగరుచి" అన్నదాన్ని చంపకంలో వ్రాశాడు. ఇంకా ఈ విధంగా అనేక కవులు ఉత్పలమాలలో శ్రీకారం చుట్టారు. అంటే సంస్కృతంలో అంతగా వ్యవహారంలో లేని మూడు నాల్గు వృత్తాలను మాత్రమే ఎన్నుకొని వాటిని తెలుగు జాతీయ వృత్తాలను చేసిపారేశారన్నమాట।

ఇక జాతి, ఉపజాతి నామాలతో పిలువబడుతున్న- కందం, సీసం, ఆటవెలది, తేటగీతి, ఉత్సాహం, తరువోజ, అక్కఱలు, ద్విపదలు, రగడలు, కళికలు, ఉత్కళికలు- ఈ పదే ప్రధాన ఛందస్సులు. వీటిల్లో దాదాపుఅన్నీ వ్యవహారంలో ఉన్నప్పటికీ ప్రధానంగా కందం, సీసం, ఆటవెలది, తేటగీతి, ద్విపద విరివిగా వాడబడుతున్న ఛందస్సులు. ద్విపదతోపాటు కందానికున్నంతస్థానం తెలుగు కావ్యాల్లో బహుశా మరోదానికిలేదు. కొన్నివేల పద్యాలున్నాయి. కాగా, సంస్కృత వృత్తాలు నాలుగైదూ, దేశీయవృత్తాలు నాలుగైదూ మొత్తం పది, పన్నెండు వృత్తాలుమాత్రమే తెలుగు కవిత్వానికి ఎక్కువగా ప్రాణసారం నింపినవని చెప్పాలి. తెలుగు భాషా స్వభావాని కనుగుణంగా ఉన్నందువల్ల ప్రథమశ్రేణికి చెందిన మన మహాకవులు వీటినే ఎక్కువగా స్వీకరించినట్లు పెద్దల అభిప్రాయం. ఒక్కొక్కరూ ఒక్కొక్క ఛందోరీతిని ఎక్కువగా ఆదరించి "ఫిట్సు" చేశారు। తిక్కన కందం, శ్రీనాథుని సీసం, పాల్కురికి ద్విపద, వేమన ఆటవెలది ఇలా ప్రచారమే వచ్చింది. ఇవన్నీ దాదాపు దేశీయఛందస్సులు కావటం విశేషం. ప్రబంధ ప్రక్రియ, శతక సాహిత్యం, ఉదాహరణ వాఙ్మయం, పదసాహిత్యం, యక్షగానాలు- ఇలా వివిధ శాఖలుగా వర్ధిల్లిన తెలుగు సాహిత్యం ఏవో కొన్ని ఛందోరీతులను, లేదా ఏదో ఒక ఛందోరీతిని ఆలంబనంగా చేసుకొని పాయలై ప్రవహించిందని స్థూలంగా చెప్పవచ్చు.

తెలుగు ఛందో రీతుల్లో యతిప్రాసల విషయం ప్రత్యేకమైంది. సంస్కృతములో యతి విచ్ఛేద మాత్రం. కాని తెలుగులో దానికి భిన్నంగా, ప్రత్యామ్నాయంగా పాదాద్యక్షర మైత్రి పాటింపబడు తున్నది. కవిజనాశ్రయంలో పదిగాఉన్న

యతుల సంఖ్య అప్పకవీయం నాటికి 41 కి పెరిగింది. అంటే మహాకవులు పాటించిన పలురకాల ఛందశ్శిల్పంవల్ల అవి నానాటికీ పెరిగిపోయినవన్నమాట. సంస్కృత ఛందస్సులో ప్రాసవిషయం లేదు. తెలుగులో పద్యంయొక్క రెండవ అక్షరాన్ని ప్రాసగా నియమించుకొనటంతో బాటు కొన్ని యెడల ప్రాస యతినికూడా కల్పించుకొనటం జరిగింది. ప్రాసలో హల్లుకు మాత్రమే మైత్రినియతం. యతిలో స్వర వ్యంజనాలు ప్రధానం కాగా ప్రాసలో వ్యంజన మొక్కటే ప్రధానమన్నమాట. ఈ యతిప్రాసల పద్ధతి తమిళం నుండీ, కన్నడం నుండీ తెలుగులోకి వచ్చినవని భాషా చరిత్రవేత్తల అభిప్రాయం. యతిప్రాసలు తెలుగు ఛందస్సుకు మంగళసూత్రాల వంటివి. వీటివల్ల తెలుగు పద్యాలకు అబ్బినసొగసులుచూస్తే "తెలుగున యతిప్రాసలు సహజాలం కారములేగాని ఎఱువులు తెచ్చుకొన్న బఱువులు కావు" అన్నది యెంత సత్యమో తెలుస్తుంది.

ఇక అధునిక ఛందోరీతులను పరామర్శించు నప్పుడు ప్రధానంగా పేర్కొనవలసిన ఛందస్సు ముత్యాలసరాలు. ఇది గురజాడవారి ప్రతిభావైభవజనితం. "గుత్తునా ముత్యాల సరములు కూర్చుకొని తేటైనమాటల, కొత్త పాతల మేలికలయిక క్రొమ్మెఱుంగులు జిమ్మగా" అన్నారు గురజాడ. "గుమ్మ దేడే గోపిదేవీ" వంటి ప్రాచీన పదాలనుండి దీనిని వీరు సృష్టించినట్లు చెబుతారు.

ముత్యాలసరంలో మొదటి మూడు పాదాలలో ప్రతిదానిలోనూ 14 మాత్రలు, నాల్గవ పాదంలో ఏడు మొదలు పధ్నాలుగు మాత్రలుఉంటాయి. రాయప్రోలు, విశ్వనాథ, దేవులపల్లి, శ్రీ శ్రీ మొదలగు ఈ యుగం కవులు తమ తమ యితర సొంత ఛందో రీతులతోపాటు ముత్యాల సరంలోకూడ కవితల్లారు. ఇదొక గొప్ప ఛందో రీతి. కొన్ని శతాబ్దాల తరువాత మళ్ళీ తెలుగువారు నిర్మించుకొన్న సొంత ఛందో రీతి. ఈ విధంగా నన్నయనుండి గురజాడ వఱకు తెలుగులో ఛందోరీతులు పలు పోకడలలో విలసిల్లుతున్నాయి.

---

ఆకాశవాణి, హైదరాబాదు కేంద్రంవారి సౌజన్యంతో
ప్రసారం తేది: 16—2—1978

# రెండవ అనుసంధానభాషగా తెలుగు

మొన్న రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా తమిళనాడులో డి.ఎం.కె,డి.కె. పార్టీల ఆధ్వర్యంలో కరుణానిధి నాయకత్వాన రెండురోజులపాటు హిందీ వ్యతిరేకోద్యమం జరిగింది. అధికార భాషకు సంబంధించిన అనేక తీర్మానాలు చేశారు. శ్రీ కరుణానిధి పొడుగాటి ప్రకటన ఒకటి విడుదల చేశారు. అందులో ఒకఅంశంఇది:

రాజ్యాంగంలో పేర్కొన్న ప్రాంతీయ భాషలన్నింటినీ అధికార భాషలుగా ప్రకటిస్తూ ఆమేరకు రాజ్యాంగాన్ని సవరించాలి. దానికి తొలిమెట్టుగా ద్రావిడ భాషలలో ప్రాచీనతరమైన తమిళభాషను హిందీ, ఇంగ్లీషు భాషలతో పాటు సహ అధికార భాషగా ప్రకటించాలి. అని.

హిందీతో పాటు తమిళాన్ని అధికార భాషగా కేంద్ర ప్రభుత్వం ప్రకటించే వరకు తాను విశ్రమించనని శ్రీ కరుణానిధి ప్రతిజ్ఞచేశారు. "హిందీ భాష పెత్తనం నశించాలి" "తమిళాన్ని కూడా భారత దేశ అధికార భాషగా ప్రకటించాలి" అని ప్రజలచేత నినాదాలు చేయించారు. దీనితో తమిళ సోదరుల అసలు ఉద్దేశం ఏమిటో బయటపడిందనిచెప్పవచ్చు.

## త్రిభాషా సూత్రం

కేంద్ర ప్రభుత్వం రూపొందించిన త్రిభాషా సూత్ర పథకానికి శ్రీ కరుణానిధి ఇచ్చిన కొత్త భాష్యమన్నమాట ఇది! హిందీ యేతరవారు తమ మాతృభాషతో పాటు ఆంగ్ల, హిందీ భాషలను నేర్వాలని, హిందీవారు ఇంగ్లీషుతోపాటు దక్షిణాది భాషలు నాల్గింటిలో ఏదో ఒకటి నేర్వాలని త్రిభాషా పథకం చెబుతున్నది. అయితే హిందీవారు నేర్చుకోవలసింది ఏదో ఒక దాక్షిణాత్యభాష కాక అది తమిళం కావాలని శ్రీ కరుణానిధి ఉద్దేశంగా కనబడుతున్నది. అంతేనో లేక ఒక్క హిందీ ప్రాంతాలవారే కాదు; హిందీ ప్రాంతంతో పాటు ఇతర ప్రాంతాలవారు కూడ తమిళం నేర్చుకోవాలన్న అతి తెలివికి కూడా పోతున్నారేమో తెలియదు.

ఈ రెండింటిలోని ఏ ఒక్క వాదముకూడా సహేతుకం కాదు. ఎందుకంటే

త్రిభాషాసూత్ర పథకంక్రింద హిందీ ప్రాంతాలవారు నేర్చుకోవలసిన దక్షిణాది భాష "ఫలానా" అని నిర్దేశమే జరిగినట్లయితే అది తెలుగుభాషే అయితీరాలి కాని మరొకటి కాజాలదు. అలాగే హిందీతోపాటు రెండవ అనుసంధాన భాష అవసరమైతే అది తెలుగు తప్ప మరొకటి కాజాలదు.

అధిక సంఖ్యాకుల భాష

దేశం మొత్తం మీద చూసుకుంటే హిందీ తరువాత అధిక సంఖ్యాకులు మాట్లాడే భాష తెలుగుకాగా దక్షిణాది వరకు చూసుకుంటే మొదటి భాష తెలుగే అవుతున్నది. "అధిక సంఖ్యాకుల భాష "అన్న ప్రాతిపదికపై హిందీ అధికారభాష అయినప్పుడు అదే ప్రాతిపదికపై రెండవ అధికారభాష కావలసింది తెలుగేకాని మరొకటి కాదుకదా? పోతే ప్రాచీనతను బట్టి ఏభాషనైనా అధికారభాషగా నిర్ణయించవలసివస్తే ఆ గౌరవం సంస్కృతానికే లభించాలి! అందుకు శ్రీ కరుణానిధి అంగీకరించరు. ఎవరంగీకరించినా అంగీకరించక పోయినా అధికార భాష కావటానికి ప్రాచీనత మాత్రమే కొలమానం కాదు కాబట్టి తమిళభాష ఆ ప్రాతిపదిక మీద రెండవ అధికారభాష కాజాలదు. ప్రపంచంలో అధిక సంఖ్యాకులకు అర్థమయ్యే అర్వాచీనమైన ఆంగ్లాన్ని కాదని ప్రాచీనత పేరుతో ఏ ఇటలీభాషనో, గ్రీకుభాషనో ప్రపంచ భాషగా అంగీకరించే రోజులా యివి?

లిపి సామ్యం

హిందీకి, మరాఠీకి కూడా దేవనాగరి లిపే. వంగ, గుజరాతీ భాషల లిపికీ నాగరలిపికీ సామ్యం ఉంది. ఇక దక్షిణాదిలో తెలుగు లిపీ, కన్నడ లిపీ ఇంచుమించు సమానమే. ఈ లిపి సామ్యంతోపాటు తెలుగు కన్నడభాషలవారికి సాహిత్య పరంగా, సంస్కృతి పరంగా ఆత్మీయమైన సంబంధ బాంధవ్యాలున్నాయి. తెలుగువాడైన పంపకవి కన్నడ భాషకు ఆదికవి కావటం, పంప భారతం, ఆంధ్ర మహాభారత రచనకు కొంత వరవడి కావటం నిదర్శనాలు. వాస్తవానికి తెలుగును రెండవ అధికారభాషగా చేస్తే ఆ గౌరవమూ, ప్రతిపత్తీ కన్నడ భాషకు కూడా దక్కుతుందనే విషయం గమనించాలి.

దేశ భాషల్లో ఒక్క తమిళంమీదతప్ప తక్కిన వాటన్నింటిమీదా సంస్కృత భాషా ప్రభావం విశేషంగా ఉన్నది. కాబట్టి తెలుగు వచ్చినంత సులభంగా ఉత్తరాది

రెండవ అనుసంధాన భాషగా తెలుగు వారికి తమిళం రాదు. దీనికితోడు తమిళం పరుషమైనదనీ, తెలుగు తేట అనీ ఉత్తరాది వారికి వినికిడి.

## హిందీపట్ల ఆదరణ

తెలుగువారు ఒక శతాబ్దం పైగా హిందీని ఆదరిస్తూ వస్తున్నారు. మాజీవిజయ నగర సంస్థానాధిపతి శ్రీ విజయరామ గజపతి, (ఆనందగజపతి తండ్రి) 1870 కి పూర్వమే తులసీదాస రామాయణాన్ని తెలుగులో పద్యరూపంలో అనువదింపజేశారు. దాదాపు 75 సంవత్సరాలకు పూర్వం తెలుగు వాడైన నాదెళ్ళ పురుషోత్తమ కవి (మచిలీపట్నం) హిందీలో ముప్ఫైకి పైగా నాటకాలు రచించాడు. ఈ రెండు విషయాలనూ ఇటీవల హిందీవారు తెలుసుకొని చాలా ఆశ్చర్యపోయారు. ఇక తెలుగు నాటక రంగం అభివృద్ధికి ఉత్తరాది పార్సీనాటక కంపెనీలవారూ, ధార్వాడ నాటక సమాజం వారూ ఎంతో దోహదం చేశారు. ఈనాడు కూడా తెలుగువారు హిందీని రాష్ట్ర భాషగా స్వీకరించి ఆదరిస్తున్నారు

తెలుగు, హిందీ భాషలకు గల ఇట్టి ఆత్మీయత తమిళానికీ హిందీకీ అప్పుడు గాని, ఇప్పుడుగాని ఉన్నదని చెప్పడానికి ఒక్క ఉదాహరణ కూడా చూపలేరు. వంద సంవత్సరాలకు పూర్వమే తిరువాన్కూరు ప్రభువు స్వాతి తిరునాళ్ హిందీలో వందకు పైగా కృతులు రచించాడు. కేరళ పొరుగున ఉన్న తమిళనాడు అప్పుడు గాని ఇప్పుడు గాని హిందీని ఆదరించక పోవడం విడ్డూరమే మరి. ఆదరింపక పోగా ఇప్పుడు హిందీని వ్యతిరేకిస్తున్న వారిలో అగ్రతాంబూలం తమిళులదే. హిందీని ఆది నుంచీ ఆదరిస్తూ వచ్చిన తెలుగు వారి భాషను కాదని, దానిని తృణీకరిస్తూ ముప్పైఏళ్ళ నుంచీ అడ్డు తగులుతున్న తమిళాన్ని హిందీవారే గాదు, తక్కిన ఉత్తరాదివారు సైతం ఆదరిస్తారనుకోవడం వట్టి భ్రమే.

బ్రిటిష్ వారి హయాంలో నాణాల మీద దేవనాగరి లిపితో పాటు తెలుగులిపి ఉండేదేగాని తమిళలిపి ఉండేది కాదనే విషయం గమనించాలి.

## సంగీతానికి జీవగర్ర

"ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అని తెలుగు భాషా మాధుర్యాన్ని పాశ్చాత్యులు ప్రశంసించిన విషయం కూడా గ్రహించాలి. భారతదేశానికి తెలుగు అధికారభాష కాదగినది అని ప్రశంసించి హాల్డేన్ వంటి పాశ్చాత్యపండితులు ఏనాడో పట్టంకట్టారు.

క్రీ. శ. 1550-1625 మధ్య జీవించిన తమిళుడైన, శ్రీ అప్పయ్యదీక్షితులు "ఆంధ్రుడుగా పుట్టటము, ఆంధ్రము మాతృభాషగా కలిగి ఉండటము మహా తపః ఫలితమని" సెలవిచ్చిన విషయం ప్రత్యేకించి గమనించాలి.

హిందూస్తానీ సంగీతానికి హిందీవలె కర్ణాటక సంగీతానికి తెలుగు, కన్నడ భాషలు జీవగర్రలు. కన్నడిగుడైన పురందరదాసు, తెలుగు వాడైన త్యాగరాజు లేకపోతే కర్ణాటక సంగీతమేలేదు. త్యాగరాజు తెలుగు కృతులే తమిళులు పాడుకుంటున్నారన్న విషయం జగద్విదితం.

తెలుగు భాష రాజశీవి

ఇలా ఏ విధంగా చూచినా దక్షిణాది భాషల్లో తెలుగు రాజశీవితో ఒప్పుతున్నది. అయినా తెలుగు వారు దేశసమైక్యానికి భంగం కలిగించకుండా ప్రతి విషయంలోనూ జాతీయతకు ప్రాధాన్యం ఇచ్చి ఉదాత్తంగా వ్యవహరిస్తూ వస్తున్నారు. తమిళులు దీనికి భిన్నంగా వ్యవహరిస్తున్నారు. ఈ పద్ధతికి తమిళ సోదరులు స్వస్తి చెప్పాలి.

దక్షిణ భాషల్లో తెలుగు భాషకున్న వైశిష్ట్యాన్ని గుర్తించి కేంద్ర ప్రభుత్వం ఇంగ్లీషు, హిందీ భాషలతో పాటు తెలుగును కూడా అధికార భాషగా ప్రకటించాలి అది వీలుకాకపోతే కనీసం త్రిభాషా సూత్రం పథకంలో హిందీవారు ఏదో ఒక దక్షిణాది భాషను నేర్చుకోవాలి అనికాక తెలుగే నేర్చుకోవాలనే నియమం చేయడం సముచితం. ఒకవేళ ఇట్టి ఆలోచన కూడా దేశ సమైక్యానికీ జాతీయతకూ భంగకరమైనట్లయితే తమిళ సోదరుల ఒత్తిడినీ, బెదిరింపులనూ లెక్కపెట్టక ఇప్పుడున్న త్రిభాషా సూత్ర పథకాన్ని యథాతథంగా అమలుచేయాలి.

లేదా అసలు సంస్కృతాన్ని రాజభాషగా చేసి, ప్రాంతీయ భాషలన్నింటికి సమాన ప్రతిపత్తిని కల్పించి, కొంతకాలం ఇంగ్లీషును కూడా కొనసాగించే పద్ధతిలో ఒక సహజమైన సరిక్రొత్త త్రి భాషా సూత్ర పథకాన్ని రూపొందించుకొంటే సర్వోత్తమం గదా!

---

ప్రచురణ : "ఆంధ్రప్రభ" ఆదివారం,
1979 ఫిబ్రవరి 4

# తెలుగు కావ్యాల్లో రాయబార ఘట్టాలు

తెలుగు కావ్యాల్లోని రాయబార ఘట్టాల్ని తిర్యక్కులు, స్త్రీలు, పురుషులు నిర్వహించేవి అని మూడు తెగలుగా విభజింపవచ్చు. ఆమాటకొస్తే సంస్కృతం లోని మేఘసందేశం వంటి యే ఒకటి రెండు సందర్భాలో మినహాయిస్తే యేభాషలో గాని యీ విభాగం ఇలాగే ఉంటుందని భావింపవచ్చు. సాధారణంగా తిర్యక్కులు, స్త్రీలు నిర్వహించే రాయబారాలు ప్రణయ పరిణయ ఘట్టాలకు, పురుషులు నిర్వ హించేవి రాజనీతికి, సంబంధించినవిగా కనిపిస్తాయి. కొన్నిచోట్ల ప్రేమఘట్టాల్లోనైతం పురుషులే దూతకృత్యం నెఱవేర్చిన సందర్భాలు లేకపోలేదు. నలదౌత్యము, హనుమత్సందేశము అట్లాంటివి. స్త్రీతిర్యక్కుల రాయబారాలన్నీ సఫలం కావటమూ, పురుషుల రాయబారాలన్నీ విఫలం కావటము అనేది వీటిల్లో కనిపించే మరో సామాన్య లక్షణం.

సుప్రసిద్ధ రాయబారాలన్నీ కవిత్రయ భారతంలోనూ, వారి యితర కృతు ల్లోనూ కనిపిస్తాయి. నన్నయగారి అరణ్యపర్వమందలి నలోపాఖ్యానంలో హంస నల దౌత్యములు, ఎఱ్ఱన్నగారి అరణ్యపర్వశేషంలోని రామోపాఖ్యానంలో హను మత్సందేశ, అంగద రాయబారములు, అతని హరివంశంలోని ఉషానిరుద్ధుల కథలో చిత్రరేఖ దౌత్యము, తిక్కనగారి ఉద్యోగ పర్వంలోని పురోహిత సంజయ కృష్ణరాయబారములు తరువాతి తెలుగు కవుల రాయబారాలకు ఒజ్జబంతులైనవి.

రెండవతరం కవుల్లో నాచన సోముని ఉత్తర హరివంశంలోని హంసడిభ కోపాఖ్యానంలో జనార్ధన సాత్యకి రాయబారములు, పోతన్నగారి భాగవతంలోని రుక్మిణీ కల్యాణంలో పురోహిత రాయబారము, శ్రీనాథుని శృంగారనైషధంలో హంస నల దౌత్యములు ప్రధానంగా పేర్కొనవలసిన ఘట్టాలు.

అయితే యీ గ్రంథాలన్నీ సంస్కృతంనుండి తెలుగులోకి దించుకొన్న అను వాదాలేగాని స్వతంత్ర కావ్యాలుగావు. కాని మహనీయులైన యీ పూర్వాంధ్ర కవులచేతుల్లో ఇవన్నీ అచ్చమైన తెలుగు తనాన్ని సంతరించుకొని స్వతంత్రకావ్యా

లుగా భాసించటం విశేషం. వీటిల్లోని రాయబారఘట్టాలన్నీ సంస్కృతమూలాన్ని మించి మిక్కిలి చమత్కార జనకంగాను, పరమ రమణీయంగాను చిత్రింపబడి తెలుగు వారికి గుండె దగ్గఱై పోయినవి.

ఇక మూడవతరం కవుల ప్రబంధ సాహిత్యమంతా వారి ప్రతిభా సంపద్వి లాసమే. ఇందులో పింగళి సూరన్న ప్రభావతీ ప్రద్యుమ్నంలోని శుచిముఖిదౌత్యము, చిలుక రాయబారము, రామరాజభూషణుని వసు చరిత్రలోని మంజువాణీ దౌత్యము, అసలైన నిసలైన తెలుగు రాయబార ఘట్టాలు. ఈ మూడింటికీతోడు, అనువాదమే అయినా, హేతుసరణిని బట్టి నాచన సోముని ఉత్తర హరివంశములోని జనార్దన సాత్యకి రాయబారాలనుకూడా జోడిస్తే మనకు ఐదు కమ్మని తెలుగు రాయబారా లున్నట్లు లెక్క. తెలుగు తనమే గాక ఈ మూడు ప్రబంధాల్లోనూ ఉన్న మరో సామాన్యలక్షణం నాటకీయత.

రాయబారి కుండవలసిన లక్షణాలేవో తొలుత చెప్పినవాడు తిక్కన్న. ద్రుపదుడు తన పురోహితుణ్ణి కౌరవులకడకు రాయబారిగా పంపుతూ ఇలా అంటాడు:

క॥ "హితుడవు, మతిమంతుడవు, చతురవచన కోవిదుడవు, సమయజ్ఞుడవు
ఉన్నతవంశవర్ధనుడవు, ఇంగితవేదివి, నెచ్చెలివి, సుకృతి వట్లగుటన్"

(ఉద్యోగం, ఆ 1, పద్యం 53) "నేర్పు వాటించి కార్యంబు దీర్పవలయు" (పద్యం 54) అని. సాధారణంగా రాయబారు లందరిలోనూ ఈ లక్షణాలుండటం సహజమే.

పింగళి సూరన్న శుచిముఖి పాత్రచిత్రణకు నన్నయ శ్రీనాథుల హంసలు ఒజ్జబంతులు. నన్నయ హంసలోని సత్వగుణాన్ని, శ్రీనాథుని హంసలోని రజో గుణాన్ని మేళవించి దీన్ని తీర్చిదిద్దాడు సూరన్న. ఆ హంసలు ఆడవో, మొగవో తెలియదు. ఇది మాత్రం హంసి. మరెవ్వరిలోను లేని ఒక కొత్త లక్షణం దీనికుంది. అది కవితాగుణం. అంటే యిది గొప్ప కవయిత్రికూడా నన్నమాట. వజ్రనాభుని వధకు గొప్పమంత్రమైన ప్రభావతీ స్వప్నవృత్తాంతాన్ని రమ్యమైన కవితాధోరణిలో కళ్ళకు కట్టినట్లు చెప్పినప్పుడు ఆశ్చర్యచకితుడైన యింద్రుడు శుచిముఖిని ఇలా ప్రశంసిస్తాడు:

సీ॥ శబ్ద సంస్కారమెచ్చటను జాఱగనీక పదమైత్రి యర్థసంపదల బొదల
తలపెల్ల నక్లిష్టతను బ్రదీపితముగా బునరుక్తి దోషంబు పొంతబోక

ఆకాంక్షిత స్ఫూర్తి యాచరించుచును శాఖాచంక్రమక్రియఁగడవ జనక
ప్రకృతార్థ భావంబు పాదుకోనదుకుచు నుపపత్తియెందునతూర్జితముగ
గీ॥ నొకటఁబూర్వోత్తర విరోధమొందకుండఁదత్తదవయవవాక్యతాత్పర్యభేద
ములు, మహావాక్యతాత్పర్యమునకు నొనరఁబలుక నేర్చుట బహుతపః
ఫలము గాదె!

సూరన్నయే శుచిముఖిలో ప్రవేశించి యిందలి ప్రతి సన్నివేశాన్ని తానుగా నడిపించినట్లు చెబితే అతిశయోక్తి కాదు!

ఈ కవయిత్రి ప్రద్యుమ్నుడికి ప్రభావతి మీద అనురాగాన్ని అంకురింప జేసిన సన్నివేశం మహా చమత్కారమైనది. ఈమె కృష్ణునికి సాచివ్యం నెఱపటానికి గగనమార్గంలో ద్వారకకుపోతూ, క్రింద కందుక క్రీడ నలుపుతున్న ప్రద్యుమ్నుడికి వినబడేటట్లు తోటి హంసలతో "అల్ల, యితండ కావలయు నవశ్య మీవరపురుషునితో మాటలాడి చనుట మనకు మేలు" అంటుంది. అతనికి కుతూహలం రేకెత్తి సంగతి యయోయి. అన్నట్లు ప్రశ్నిస్తాడు. అప్పుడాతనికి ప్రభావతి యొక్క స్వప్న చిత్ర ఫలక వృత్తాంతాల్ని చెప్పి "ఆ చిత్తరువులోని పురుషుడచ్చముగ నీవలెనున్నాడు ఆ మాటయే యివ్వడనుకొంటిమి నిన్ను జూచి" అని పలికి అతణ్ణి పెల్లుబికించి ప్రభావతీ సౌందర్యాన్ని ఓతప్రోతంగా వర్ణించి హఠాత్తుగా రివ్వున యెగిరిపోతుంది. ఇక చూడాలి ప్రద్యుమ్నుని యవస్థ! ప్రభావతికి ప్రేమలేఖ వ్రాసి, ఒక చిలుకద్వారా శుచిముఖికి పంపిస్తాడు. అది చిత్రంగా ప్రభావతికి చిక్కుతుంది. ఇక్కడ్నుంచి యితివృత్తం కొత్తమలుపు తిరిగి వేగం పుంజుకుంటుంది. చెలికత్తె రాగవల్లరికొంత, ప్రభావతికొంత, ఆశ్లేఖను చదివే సన్నివేశ రామణీయకత అసలు ఏయితర సాహిత్యములోనైనా ఉన్నదా అనిపిస్తుంది!

ఈ హంసి యేదో ఒకఘట్టంలో ఇలావచ్చి అలా వెళ్ళేదికాదు. ప్రబంధమంతా తానై కూర్చున్న పాత్రయిది. దీని సంగతి విమర్శకుల మాటల్లో పొడిపొడిగా చెప్పాలంటే: ఇంద్రునికి మంత్రం చెప్పింది, కృష్ణునికి సాచివ్యం నెఱవేర్చింది, ప్రద్యుమ్ననికి ప్రాణమిత్ర మనిపించుకొన్నది, ప్రభావతికి కామశాస్త్రోపదేశం చింది, వీరి పెళ్ళికి పౌరోహిత్యం వహించింది, లోకకళ్యాణం కోసం వజ్రనాభుణ్ణి వధింపజేసి ప్రభావతీ ప్రద్యుమ్నుల కొడుక్కి రాజ్యాభిషేకం చేయించింది, ఇంకేం

చేయించలేరు! ఇదొక గొప్పదూతిక! ఈ ప్రబంధమొక నాటకం!

వసు చరిత్రలోని మంజువాణి పాత్రచిత్రణకు ఎఱన్న సోమన్నల హరివంశ ములలోని ఉషానిరుద్ధుల చరిత్రలోని చిత్రరేఖల పాత్రలు వఱవడిగా కనిపిస్తాయి. ఎఱ్ఱన్న చిత్రరేఖలోని సౌజన్యమూ, సోమన్న చిత్రరేఖలోని ప్రౌఢత్వమూ మిశ్రితమై మంజువాణిగా రూపొందిందని చెప్పవచ్చు. ప్రబంధంలో దాదాపు ఒక ఘట్టానికే పరిమితమైన పాత్ర. ఆ ఒక్క మెఱుపులోనే జిగేలు మనిపించే అద్వితీయ దూతిక మంజువాణి!

గిరిక వసురాజగతమైన విరహ వేదనలో వెన్నెల వేడికూడ భరించలేక తల్లడిల్లి పోతున్నది. అప్పుడీ చెలికత్తె "ఆళీజనం బిచ్చన్ మెచ్చగ- సకలాభీష్ట క్రియా ధుర్యయై:

గీ॥ "అబ్జముఖులార! యేబోయి యచలకన్యయుత్తలముదెల్పి వసురాజచిత్తమరసి
వత్తు, నత్యంత శుభవార్త దెత్తుననుచు గొమ్మహారంబు గొనియేగి"

గగన సంచారముతో వసురాజ శయనమందిరములో వాలుతుంది. కామరూపధారణ శక్తితో రత్నపాంచాలికయై రాజుశయ్యకు ప్రక్కనే ఉంటుంది. రాజు గిరికయొక్క చిత్రపటాన్ని చూస్తూ ఆమె సౌందర్యాన్ని వర్ణిస్తూ దూఱుతూ ఉంటాడు. ఒక్కుమ్మడి ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ మంజువాణి:

"పకపక నవ్వి యో వసున్నృపాలక! బాలిక దూఱదేల సా
రెకు? బరతంత్రు లింతులు వరింతురె కాంతులఁదమ్ముదాము, క
న్యకలకు నేరమా యిది యనన్యగతిన్ సుదతిన్ మనోజు బా
ఱికి నెఱజేసి లో గనికరింపని వారివిగాక నేరముల్"

అంటుంది. రాజు నివ్వెఱపోతాడు. గిరిక తనదే నన్న ఆనందంతో పరితాపంతో పక్క మీద సోలిపోతాడు. మంజువాణి తాను తెచ్చిన గిరిక ముత్యాలహారాన్ని అతని మెడలో వేస్తుంది. ఆచల్లని స్పర్శకు రాజు తేఱుకుంటాడు. మంజువాణి రత్నపుత్రికారూపాన్ని విడిచి మానవ కాంతయై రాజుకు కన్పిస్తుంది. ఇద్దఱికీ చమత్కారజనకమైన సంభాషణ జరుగుతుంది. రాజుయొక్క ముద్రికను తీసుకొనిపోయి గిరిక కిచ్చి ఆమెకు నూతన చైతన్యాన్ని ప్రసాదిస్తుంది. రాజును మహోసరసంగా అదఱగొట్టి, నేర్పు వాటించి కార్యాన్నిసాధించిన నెఱజాణ మంజువాణి. ఆంధ్రభాషా యోషకు అపూర్వ

మణిభూషణం వసుచరిత్ర.

సోముని ఉత్తర హరివంశములోని హంస డిభకోపాఖ్యానములో ఉన్న జనార్దన సాత్యకి రాయబారములు తిక్కనగారి సంజయ, కృష్ణ రాయబారాల్ని పోలి ఉన్నవి. హంసడిభకులు రాజసూయముచేస్తూ ఉప్పును కప్పంగా తీసుకొని రావలసినదిగా జనార్దనునిద్వారా కృష్ణునకు రాయబారము పంపుతారు. ఈతడు హరిభక్తుడు. అందువల్ల యిష్టము లేకపోయినా కృష్ణ దర్శనభాగ్యమన్నా కలుగుతుందని వెళతాడు. అక్కడ తాను వెళ్ళిన పని చెప్పటానికి మోమోటపడి:

ఉ॥ "ఉండుటతప్పు వారికడ నుండమితప్పిట రాకతప్పు రా
కుండుట తప్పు తప్పులకు నొప్పులకున్ గతి నీవదేవ! యే
నొండొక రుండనే పలుక కూరక నేరక యుండఁజేయు వీ
టిండి తనంబుచేత నిసిజింతలు వాటెడిఁ జిత్తమిప్పుడున్" అంటాడు.

చ॥ "అనుడు జనార్దనుండను జనార్దనుతో విను దూతకృత్యముం
బనివడిపూని యేలికల బ్రల్లదమైననుఁ జెప్పఁ జెల్లుఁద
ప్పని పలుకైనబోలు వినబంతము, చల్లకువచ్చి ముంత దా
చినగతి నింతమాటు వడఁజేసిన, గార్యముగాన వచ్చునే"

అని దూతయొక్క కర్తవ్యాన్ని గుర్తుచేస్తాడు. జనార్దనుడు తన రాయబార సారాంశము వినిపిస్తాడు. తనను కించపఱచే ఈరాయబారాన్ని కృష్ణుడు తిరస్కరించి యుద్ధానికి సిద్ధం కావాల్సిందని తెలియజేయటానికి సాత్యకిని హంసడిభకుల కడకు రాయబారిగా పంపుతాడు. అరాక్షసులు సాత్యకి సమక్షంలో జనార్దనుణ్ణి, కృష్ణుణ్ణి నిందించి, సాత్యకిని అవమానిస్తారు. సాత్యకి కోపించి ఈక్రింది విధంగాపలికి వెళ్ళిపోతాడు:

కడగితి దౌత్యమున్నెఱవఁగాన సహింపకపోదుగాక నా
కడిదము చేతనుండగ మురారి విరోధులబట్టి పూవునుం
దొడిమియుఁజూపకున్న నది ద్రోహము వండ్రెము వేసి తుండము
లుడుబడకుండ మిమ్ముఁబెడధారన వ్రేయుదు నేమిసేయుదున్

ఈవిధంగా తెలుగుకావ్యాల్లో రమ్యమైన రాయబార ఘట్టాలు మనకు దర్శనమిస్తాయి.

ఆకాశవాణి, హైదరాబాదు కేంద్రం వారి సౌజన్యంతో
ప్రసారం తేది: 25-7-1981

కన్యాశుల్కం నాటకము

# విశేష విమర్శనము

మహాకవి కీ.శే. గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కం మహానాటకం. ఎన్నిసార్లు చదివినా పాతబడకుండ, విసుగు పుట్టించకుండ ఎప్పటికప్పుడు "క్రొమ్మెఱుంగులు జిమ్ముతూ" మొదటిసారి చదివినప్పుడు కలిగిన 'థ్రిల్లు'నే ఆనందాన్నే మళ్ళీ మళ్ళీ కలిగిస్తూ విశ్వజనీనతను సంతరించుకొన్న లోకోత్తరమైన మహానాటకమిది. ఎవరు ఏ దృష్టితో చదువుకొంటే ఆ దృష్టికల్లా సరిపడే ఆలోచనామృతాన్ని ప్రసాదించే విచిత్రవిశేషభరితమైన నాటకమిది. మానవ శరీరంలో 72 వేల నాడులున్నట్లే ఇందులో కూడ ఉన్నాయి. ఒక్కమాటలో చెప్పాలంటే ఆధునికాంధ్ర సాహిత్యంలో మణిస్తంభంలాంటి మహానాటకమిది. ఇది నాటకమా! కావ్యమా! అన్న కుతూహలభరితమైన విచికిత్స కలుగుతూ ఉంటుంది. నాటకంగా చదవటానికి ప్రారంభిస్తే కావ్య రామణీయకత రంగులు చిమ్ముతుంది. కావ్యంగా చదవటానికి పూనుకొంటే హృదయరంగంమీద ఆ పాత్రలు కదలాడుతున్న అనుభూతి కలుగుతూ ఉంటుంది. సంస్కృతంలో మృచ్ఛకటికంలాంటి మహానాటకం మళ్ళీ రాలేదు! తెలుగులో కన్యాశుల్కం వంటి మహానాటకం మళ్ళీ వస్తుందో లేదో చెప్పలేము.

గురజాడవారు (జననం 21-9-1862, మరణం 30-11-1915) ఈ నాటకాన్ని తొలుత ఎప్పుడు వ్రాశారన్న దొక చర్చ. పలువురు విమర్శకులు వెలిబుచ్చిన అభిప్రాయాల్ని పరిశీలించిన పిమ్మట క్రీ.శ. 1885 సం॥ నాటికే వ్రాశారని నిర్ధారించటం లెస్స. వీరు మొత్తం మూడు కన్యాశుల్కం నాటకాలు వ్రాసినట్లు తెలుస్తున్నది. మరీ మొట్టమొదట వ్రాసిన కన్యాశుల్కాన్ని గూర్చి మనకెవ్వరికీ తెలియదు. అది అలభ్యం. కాని వ్రాసినట్లు ఆప్తవాక్యం ప్రమాణంగా కనబడుతున్నది. కీ.శే. వేలూరి శివరామశాస్త్రిగారు 8-1-1949 నాడు భారతి పత్రిక రజతోత్సవ సందర్భంగా జరిగిన సభలో ఇ అన్నట్లు తెలుస్తున్నది:

కన్యాశుల్కం నాటకము - విశేషవిమర్శనము

"వాడుక భాషలో అందెవేసిన శ్రీ గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కం లోని సీసపద్య మొకటి 'అముద్రిత గ్రంథ చింతామణి పత్రిక'లో చూచినే నాశ్చర్యపోయి 1913 లోనో, 1914 లోనో ప్రెసిడెన్సీ కాలేజీలో జరిగిన ఒక సభలో దానినిగూర్చి అప్పారావుగారిని అడిగాను. మొదట ప్రబంధ భాషలోనే కన్యాశుల్కం వ్రాసి అది రుచించకపోవటంచేత గ్రామ్యంలో తిరగ వ్రాశానని వారప్పుడు చెప్పారు...." అని.

ఈ ప్రాబంధిక కన్యాశుల్క నాటకాన్ని గూర్చి యెప్పటికైనా యెవరైనా పరిశోధించి వెలికి తేవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. ఇదే 1885 నాటికి వ్రాయబడిన నాటకమని చెప్పాలి.

దరిమిలా 1890లో గాని, అంతకు కొంచెం ముందుగాగాని గ్రామ్యంలో తిరగవ్రాసినట్లు చెప్పబడుతున్న రెండవ కన్యాశుల్కం అవతరించిందని అంచనా వేసుకోవాలి. ఇది తొలిసారి 1892 ఆగష్టులో విజయనగరంలో "జగన్నాథ విలాసినీ సభ" అనే నాటక సమాజం వారిచేత ప్రదర్శింపబడింది, ఈ సమాజం పలువురు భావించినట్లు తెలుగు నాటక సమాజంకాదు. 1874లో స్థాపింపబడిన సంస్కృత నాటక సమాజమిది. దీని ఆధ్వర్యంలో ఆదిలో సంస్కృత నాటకాలే ప్రదర్శింపబడుతూ ఉండేవి. కాలక్రమంలో తెలుగు నాటకాల ప్రదర్శనం కూడ ప్రారంభమైనది. ఆ వరుసలో ప్రదర్శింపబడిన నాటకమే కన్యాశుల్కం. అయితే, సంస్కృత నాటక సమాజం ఆధ్వర్యంలో తెలుగు నాటకాన్ని ప్రదర్శించటమనే దోష పరిహారార్థం కాబోలు, ఈ నాటకానికి విజయనగర సంస్థాన విద్వాంసులైన శ్రీ ముడుంబై వరాహనరసింహస్వామిగారు సంస్కృతంలో నాందీ ప్రస్తావనలు వ్రాయగా, వాటిని ఆనాటి ప్రదర్శనలో శ్రీ మేడేపల్లి వేంకట రమణాచార్యులుగారు పఠించారన్నది ప్రత్యేకంగా గమనించాల్సిన విషయం. ఈ రెండవ కన్యాశుల్కంనాటకం 1897లో ప్రథమంగా ముద్రింపబడింది.

ఇంతటితో ఈ నాటక రచన ఆగిపోలేదు. కాలక్రమంలో పలుమార్లు ప్రదర్శింపబడుతూ, ఎందరెందరో సహృదయులైన సామాజికుల యొక్క సూచనలను, సలహాలను స్వీకరిస్తూ, ఎన్నో మార్పులకు, చేర్పులకు, కూర్పులకు గురియై, చక్కగా చియ్యబట్టి, బాగా రాపిడిబడి, క్రమపాకంలో నునుపుదేలి, సర్వాంగ

సుందరమైన మరో రూపాన్ని ధరించింది. ఇక దీనికి తిరుగులేదు అన్న నిర్ణయమై పోయిన తరువాత 1909లో ముద్రింపబడింది. ఇది మూడవ కన్యాశుల్క నాటక మన్న మాట. ఇవాళ ప్రచారంలో ఉన్న, ప్రఖ్యాతమైన కన్యాశుల్క నాటకమిదే. మరీ మొట్టమొదటి ప్రాబంధిక కన్యాశుల్కం అలభ్యం, అసలదొకటి ఉండెనని ఎవ రికీ తెలియదు. రెండవ కన్యాశుల్కం ఉన్నదని కొంతమందికి తెలుసు; కాని చది విన వాళ్ళు చాలా తక్కువ. మూడవ కన్యాశుల్కాన్ని గూర్చి తెలియని వాళ్ళుగాని, చదివి తనియనివాళ్ళుగాని ఉండటానికి వీల్లేదు. ఒకవేళ యెవరైనా ఉంటే వారికి "నమోవాకంప్రశాస్మహే" అనవలసిందేగాని చేయగలిగిందిలేదు. ఈ విధంగా యీ నాటకం ఒక అద్వితీయమైన, మహోత్తమ కళాఖండంగా రూపొందటానికి ధాదాపు 25 సం॥ పట్టిందన్న మాట! ఒకానొక నాటక రచన పూర్తిగావటానికి ఇంతకాలం పట్టిన దృష్టాంతం ప్రపంచ నాటక సాహిత్యంలో మరొకటుందేమో ఆ కుతూహలం గలవారు పరిశీలింపవచ్చు. ఒకవిధంగా ఇది నాటక కర్త యొక్క ప్రతిభకు లోపమని భావించే ప్రబుద్ధులు కొందరుందురుగాక. కాని ప్రపంచసాహిత్యంలోనే యిటువంటి నాటకం మరొకటి లేదన్న స్థాయికి ఇది పోయిందన్న అదృష్టమే మనకు చాలు.

## నామసార్థక్యం

కన్యాశుల్కం అన్న పేరు చాలా అందంగాను, అర్థవంతంగాను పెట్టారు అప్పారావుగారు. కన్యలకు ఖరీదుకట్టి అమ్మటం అని యర్థం. "అష్టవర్షాభవే త్కన్యా" అన్నది శ్రుతివాక్యం. ఎనిమిదేళ్ళ వయస్సు నుండి ఆపైబడిన యీ డొచ్చిన అవివాహిత బాలిక అని దీనియర్థం. ఈ 'అష్ట' అనేది పవిత్రతను సూచించే ప్రామాణికమైన సంఖ్యావాచకం. ఆపైబడిన వయస్సులు గల కన్య వివాహయోగ్య అని స్థూలంగా భావింపబడింది. ఆయా వయస్సులు గల కన్యకలకు అనురూప వయో యోగ్యతలుగల వరునికిచ్చే సందర్భమది. ఈ శాస్త్ర వాక్యానికి మన ప్రబుద్ధులు ఎనిమిదేళ్ళు ఆలోపు వయస్సుగల శిశువులను యాభై పైబడిన వృద్ధులకిచ్చే ఆచారంగా దిగజార్చిపట్టించిన దుర్గతిని వ్యంగ్యవైభవంతో వ్యక్తం చేసేటట్లు ఈ పేరు పెట్టారు గురజాడ. ఈ పేరుకు ఆకర్షితులైన కందుకూరి వీరేశలింగంగారు 1897లో తాముకూడ కన్యాశుల్కం అనే చిన్న ప్రహసనం వ్రాశారు వారి మీదున్న గౌరవంతో అప్పారావుగారు కన్యాశుల్కం, ద్వితీయాంకం 1-వ స్థలంలో

వెంకటేశానికి గిరీశం చేత "వీరేశలింగంగారు కన్యాశుల్కం విషయంపై రాసిన ఉపన్యాసం పైకితీయ్. మావగారికి లెక్చరివ్వడాని క్కత్తి కఠారీ నూరాలి" అని చెప్పిస్తారు.

నాల్గు ముఖ్యాంశాలు — నాల్గు కథలు

గురజాడవారు ఈ నాటకంలో ప్రతిపాదించిన ప్రధానాంశాలు నాలుగు. ఈ నాలుగంశాలకు నాల్గు కథలు ఇందులో ప్రాతినిధ్యం వహిస్తున్నాయి.

ఒకటి: ధనాశతో పసితనంలో ఉన్న ఆడ పిల్లల్ని వయసు చెల్లినవారి కమ్మి పెళ్ళి చేయటంవల్ల బాల వితంతువులైన వారికి పునర్వివాహాన్ని ప్రోత్సహించటం. ఇది బుచ్చమ్మకథ, నాయకుడు గిరీశం.

రెండు: అసలు ఈ శుల్క వివాహాల దారుణ దురాచారాన్ని ప్రతిఘటించటం. ఇది సుబ్బికథ, నాయకుడు లుబ్ధావధాన్లు.

మూడు: ఇటు ఈ దురాచారానికి బలియై బాలవితంతువులై, అటు పునర్వివాహానికి నోచుకోక, శరీర చాపల్యానికి తట్టుకోలేక పతితలైన బాల విధవల పాట్లు, సంఘహానిని నిరూపించుట. ఇది మీనాక్షి కథ- నాయకాభాస నాయకుడు రామప్ప పంతులు.

నాలుగు: వేశ్యావృత్తి నిర్మూలన, ఇది మధురవాణి కథ. నాయకాభాస నాయకుడు సౌజన్యారావు పంతులు.

గిరీశం బుచ్చమ్మల కథ

అగ్నిహోత్రావధాన్ల పెద్ద కూతురు బుచ్చమ్మ. పసితనంలోనే వితంతువై పుట్టింట్లో ఉంటున్నది. సంప్రదాయానికి, కుటుంబ మర్యాదకి కట్టుపడి పవిత్రంగా జీవిస్తున్న గంగిగోవు, అందాల భరిణ బుచ్చమ్మ. ఈమె తమ్ముడు వెంకటేశానికి క్రిస్మస్ సెలవుల్లో చదువు చెప్పటానికి విజయనగరం నుండి విచ్చేసి వీళ్ళింట్లో తిష్ఠ వేసిన యువకుడైన వ్యక్తి గిరీశం. బుచ్చమ్మను మొదటిసారి చూసినప్పుడు ఆమె విడో బ్యూటీకి మోహితుడై పెళ్ళి చేసుకోవాలనుకుంటాడు గిరీశం. ఆమెను కలిసి విధవా వివాహాల్ని గూర్చి ఆమెకున్న సందేహాలు తీర్చాడు. ఆమెవంటి అందమైన విధవ లెవరైనా ముందుకొస్తే తాను పెళ్ళాడతానని చెబుతాడు. బుచ్చమ్మ గనక తనతో లేచిపోయివచ్చి తన్ను పెళ్ళాడితే లుబ్ధావధాన్లతో ఆమె చెల్లెలు సుబ్బిపెళ్ళి

ఆగిపోతుందని నచ్చచెప్పి అందుకామెను ఒప్పిస్తాడు. ఆమె చెల్లెలు సుబ్బి పెళ్ళికై తరలి వెళ్ళేటప్పుడు దారిలో బండి తప్పించి ఆమెతోసహా రామవరం పారిపోతాడు. రామవరంలో తన గురువుగారును, వితంతు శరణాలయాధికారియునగు రామయ్య పంతులుగారి వద్దనుండి విశాఖపట్నం వచ్చి లుబ్ధావధాన్ల ఆస్తిని వారసుడుగా పొందటానికి ప్రయత్నిస్తాడు. సౌజన్యారావు పంతులింట్లో దొంగయని తెలిసిపోతాడు. సౌజన్యారావు బుచ్చమ్మను రక్షించటం జరుగుతుంది.

సుబ్బి లుబ్ధావధాన్ల కథ

అగ్నిహోత్రావధాన్ల చిన్న కూతురు సుబ్బి. ఈమెను లుబ్ధావధాన్ల కమ్మి పెళ్ళి చేయటానికి నిశ్చయిస్తాడు. అతని భార్య వెంకమ్మ తన అన్న కరటక శాస్త్రి సహాయంతో ఈ పెళ్ళిని లోపల్లోపల ప్రతిఘటించటానికి పూనుకుంటుంది. కరటకశాస్త్రి గుంటూరు శాస్త్రుల్లుగా పేరూ, వేషమూ మార్చుకొని తనశిష్యుడు మహేశానికి ఆడపిల్ల వేషం వేసి ఈమెను (మాయ సుబ్బి) లుబ్ధుడికి అంటగట్టి రసాభాసం నడిపించటానికి బయలుదేరుతాడు. మధురవాణిని కలిసి ఆమె వేసిన పథకం ప్రకారం రామప్పపంతుల్ని కలిసి యీ పిల్ల తన కూతురని చెప్పి తక్కువ బేరాని కమ్మటానికి ఒప్పుకుంటాడు రామప్ప పంతులు తనకు మధ్యవర్తిగా కొంత డబ్బు ముదుతుందనే స్వార్థంతో మొదట తానే కుదిర్చిన సుబ్బి సంబంధాన్ని చెడగొట్టి ఈ మాయ సుబ్బిని లుబ్ధుడికి అంటగట్టటానికి కూహకం చేస్తాడు. అగ్నిహోత్రావధాన్ల సంతకంతో లుబ్ధావధాన్ల కొక ఫోర్జరీ ఉత్తరం వ్రాస్తాడు. వెంకమ్మ బుచ్చమ్మల కోరికపై గిరీశం కూడా లుబ్ధుడికి ఒక జాబు వ్రాస్తాడు. గిరీశానికి లుబ్ధుడు పెత్తల్లి కొడుకు. ఈ రెండు ఉత్తరాలు చదువుకొని కించపడి సుబ్బి సంబంధాన్ని వదలుకుంటాడు లుబ్ధుడు.

ఈ తరుణంలో తక్కువ బేరానికి మళ్ళీ మాయ సుబ్బిని మాట్లాడి అంటగడతాడు రామప్ప. పెళ్ళి సమయంలో కాసేపు పిల్ల మెళ్ళో వేయటానికి మధురవాణి కంఠెను అరువు తీసుకుంటాడు రామప్ప. కరటకశాస్త్రి చేసిన ఒక కుట్రలో రామప్ప లేని సమయంలో ఈ పెళ్ళి జరుగుతుంది. రామప్పపంతులు ఈ మోసానికి మండిపడి గుంటూరు శాస్త్రులు వెధవముండని లుబ్ధుడికి అంటగట్టాడని పుకారు లేవతాడు. దాని మొదటి మొగుడు పిశాచమై తన్ను వేధిస్తున్నట్లు గోల పెడతాడు లుబ్ధుడు.

చివరికి లుబ్ధుణ్ణి, అతని కూతురు మీనాక్షిని తప్పించుకొని మాయసుబ్బి వేషంలో ఉన్న శిష్యుడు పారిపోయి వస్తాడు. మధురవాణిని కలిసి ఆమె కంటె ఆమె కిస్తాడు. మధురవాణి తన కంటె తనకివ్వమని రామప్పను బలవంతం చేస్తుంది. రామప్ప పంతులు లుబ్ధుణ్ణి అడుగుతాడు. లుబ్ధుడు తనకు తెలియ దంటాడు. రామప్పను తిడతాడు. రామప్ప కోపంతో లుబ్ధుడు పెళ్ళికూతుర్ని చంపేశాడని అతనిపై కేసు మోపుతాడు. ఈలోగా పెళ్ళికి తర్లి వచ్చిన అగ్నిహోత్రుడు ఈ జరిగినదానికి లుబ్ధుణ్ణితంతాడు. ఇద్దరూ ఒకళ్ళపై ఒకళ్ళు క్రిమినల్ కేసు మోపుతారు. ఈ క్రిమినల్ కేసులో లుబ్ధుడి తరపున వకీలుగా సౌజన్యారావు పని చేస్తాడు. మధురవాణి సౌజన్యారావుని కలిసి కరటకశాస్త్రులే గుంటూరు శాస్త్రుల్లని చెప్పి కేసు తేలగొడుతుంది.

## మీనాక్షీ రామప్ప పంతుల కథ

మీనాక్షి లుబ్ధావధాన్ల విధవ కూతురు. శరీర చాపల్యానికి తట్టుకోలేక చిరు తిరుగుళ్ళకు అలవాటు పడుతుంది. లుబ్ధావధాన్లు రామప్ప పంతులుతో కంటె సంగతి తనకు తెలియదన్నప్పుడు, రామప్ప మీనాక్షి ద్వారా ఆచూకీ తీయటానికి ఆమెను కలుస్తాడు. ఆమెను పెళ్ళి చేసుకుంటానని మభ్యపెట్టి కంటె విషయము అడుగుతాడు. పారిపోయిన పెళ్ళికూతురు పెట్టెలో పెట్టిందేమో తాళంచెవి లేదం టుంది మీనాక్షి. ములుకుతో తీస్తానని లేస్తాడు రామప్ప. ముందుగా పెళ్ళి చేసుకుంటా నని ప్రమాణం చెయ్యమని దీపమార్పేస్తుంది మీనాక్షి. చీకట్లో ఆమెను కౌగలించుకొని యెత్తుకొని ముద్దు పెట్టుకుంటాడు రామప్ప. ఇంతలో లుబ్ధావధాన్లు వచ్చి చీకట్లో కఱ్ఱతో రామప్ప కాళ్ళమీద కొడతాడు. మీనాక్షి కిందపడుతుంది. అతడు కుంటు కుంటూ పారిపోతాడు. లుబ్ధుడు కూతుర్నికూడా తరిమేసి తలుపులేసుకుంటాడు.

మీనాక్షి రామప్ప వెంటబడుతుంది. అతడు వెనక్కి వెళ్ళిపొమ్మంటాడు. తాను తిరిగి ఇంటికి వెళ్ళేదిలేదని, పెళ్ళి చేసుకోవాల్సిందేనని పట్టుబడుతుంది. అతడు మధురవాణి ఇంటికెళ్ళి తలుపు తడతాడు. ఆమె తలుపుతీసి కంటె తెమ్మం టుంది. మీనాక్షి రామప్ప మీద ఫిర్యాదు చేస్తుంది. నీవు పెద్దు కానిస్టేబులుతో పోతున్నావట. నిన్ను వదిలేసి నన్ను చేసుకుంటానని చెప్పి నన్ను మోసం చేస్తు న్నాడని చెబుతుంది. మధురవాణి రామప్ప మీనాక్షిని చేసుకోవాల్సిందేనని పట్టు

పడుతుంది. ఇద్దరికీ మంగళహారతి పడతానని లోపలకు పోతుంది. ఈ లోపల రామప్ప పరుగెత్తుకొని వెళ్ళిపోతాడు. తరువాత మీనాక్షి మఠంలో చేరుతుంది.

### మధురవాణీ సౌజన్యారావుల కథ

మధురవాణి వారవనితగా పుట్టినా చిన్నప్పుడు ఆమెతల్లి చేసిన ఉపదేశం వల్ల నీతి, నిజాయితీగల వ్యక్తిగా జీవితమును కొనసాగించినది. చెడనివారిని చెడ గొట్టవద్దు అని ఆమె తల్లి చెప్పిందట. ఈ మాటను సౌజన్యారావుకు చెప్పి ఆయన పవిత్రతను కాపాడినది. తొలుత గిరీశం, రామప్ప పంతులు మొదలగు వారికి ఉంపుడుగత్తెగా నుండి తరువాత వృత్తిని మానేసి సౌజన్యారావుని సంద ర్శించి ఆయన ప్రసాదించిన భగవద్గీతను శిరసావహించింది. ఈ నాటకంలో దాదాపు అన్ని ముఖ్య పాత్రలతోను సంబంధముగల పాత్ర మధురవాణి. ఒకవైపు కరటకశాస్త్రికి, లుబ్ధావధాన్లకు, బుచ్చమ్మకు ప్రత్యక్షముగనో, పరోక్షముగనో సహాయపడినది. సౌజన్యారావు ఆశీస్సులచే పవిత్రురాలైనది.

### ఈ నాల్గు కథలు— నాల్గుమూలములు

ఈ నాల్గు కథలకీ నాలుగుచోట్ల మూలాలున్నట్లు కనబడుతున్నది.

గిరీశం బుచ్చమ్మలకథకు కాళిదాసుని శకుంతలా దుష్యంతుల కథ మూలం. అయితే, దానికి ఇది Parody అని భావించాలి. కథా నిర్వహణలో మెట్లుగట్టిన పద్ధతి మాత్రం సరిగ్గా సరిపోతున్నది. గిరీశానికి దుష్యంతుడికీ పోలికలు లేక పోవచ్చుగాక. బుచ్చమ్మమాత్రం శకుంతలకు దగ్గఱగా ఉన్నట్లు గమనింపవచ్చు.

సుబ్బి లుబ్ధావధాన్లకు భవభూతి మాలతీ మాధవంలోని "మాయమాలతీ నంద నుల పెళ్ళి" మూలం. కథమాత్రమేకాదు; తత్త్వంగూడా సరిగ్గా సరిపోవటం, నిర్వహణలో మెట్లుగట్టిన పద్ధతికూడా సరిపోలటం ఆశ్చర్యకరమైన విషయమే.

మధురవాణీ సౌజన్యారావుల కథకు శూద్రకుని మృచ్ఛకటికంలోని వసంత సేనా చారుదత్తుల కథ మూలమనటానికి సందేహమేలేదు. పాత్రల నిర్వహణలోనే గాక అక్కడ కథలోఉన్న మెలికలన్నీ యిక్కడకూడా ఉండటం ఇట్టే గ్రహింపవచ్చు.

మీనాక్షీ రామప్పపంతుళ్ళ కథకు మాత్రం మూలము ఎక్కడ ఉన్నదో ఊహకు అందటంలేదు. సంస్కృత నాటకాల్లో ఉన్నదో, ఇంగ్లీషు నాటకాల్లో ఉన్నదో మరెక్కడైనా ఉన్నదో ఇంకా కనిపెట్టాల్సిన విషయమే.

కన్యాశుల్కం నాటకము - విశేషవిమర్శనము

శాకుంతలం ఛాయలు

మహాకవి డైరీలోని నోట్సును ప్రమాణంగా పెట్టుకుని గాని, అట్టి ప్రమాణం లేకపోయినా వస్తు స్థితినిబట్టిగాని కన్యాశుల్కంలో కన్పించు శాకుంతలం ముద్రల్ని గుర్తింతుము గాక.

1. కన్యాశుల్కం. ద్వితీయాంకం, ౧-వ స్థలము: బుచ్చమ్మను తొలిసారి చూసినప్పుడు గిరీశం తనలో "హా బ్యూటిఫుల్! క్వైటనెక్స్పెక్టెడ్!" అనుకొని వెంకటేశంతో "వాట్ యీజ్ షీ నీ సిస్టరా?'' అని ప్రశ్నిస్తాడు.

శాకుంతలం. ప్రథమాంకం: ఆశ్రమ వృక్షాలకు నీళ్ళుపోస్తున్న కన్యలనుచూసి దుష్యంతుడు- "అహో! మధురమాసాం దర్శనం" అనుకొని మతికా సేవటికి "కథ మియం సాకణ్వదుహితా" అని ఆ ముగ్గురు కన్యల్లో శకుంతలెవరో పోల్చుకో గలుగుతాడు. ఈ యిద్దరు తొలుత వెలిబుచ్చిన ఆశ్చర్యార్థక వాక్యాలుకాని, మలుత పలికిన అవధారణార్థద్యోతక ప్రశ్నార్థక వాక్యాలుగాని ఒకే తీరుగా ఉండటం గమనించాలి. గిరీశం పలికిన వాటిల్లో "క్వైటనెక్స్పెక్టెడ్" అని ఉన్నది. ఈ అర్థం గల మాట దుష్యంతుడు చెప్పలేదు. కారణమిది: దుష్యంతుడు ఆశ్రమం ప్రవేశించటానికి పూర్వం వైఖానసుడు ద్వారా కణ్వమహర్షి ఆశ్రమంలో లేడని, అతిథి సత్కారానికి కూతురు శకుంతలను నియమించి సోమతీర్థం వెళ్ళాడని తెలుసుకున్నాడు. అయినా "ఆమెనే దర్శిస్తాను. నేను వచ్చివెళ్ళిన విషయం తరువాత ఆమె కణ్వునికి చెబుతుందిలే" అని పలికి ఆశ్రమంలో ప్రవేశించి ఋషి కన్యలను చూస్తాడు. కాబట్టి "క్వైటనెక్స్పెక్టెడ్" అని అతడు అనుకోవాల్సిన అవసరం లేదు. గిరీశం విషయం అలా కాదు. వెంకటేశానికి బుచ్చమ్మ అనే విధవ అక్క ఉన్నదని అతనికి తెలియదు. అందుకే, ఈ కథ యెప్పుడూ చెప్పావు కాదు. మీ యింట్లోనే ఓ అన్ఫార్చ్యునేట్ బ్యూటిఫుల్ యంగ్ విడో ఉందటోయ్" అంటాడు. కాబట్టి అతడు "క్వైటనెక్స్పెక్టెడ్" అనుకోవటం సహజం

మహాకవి డైరీలలో ఈ మొత్తం ఘట్టానికి సంబంధించిన పరామర్శ ఉన్నది గాని సూటిగా ఈ ముద్రకు తగినేనోట్సు లేవు. (పుట 81). ఇలాంటి సన్ని వేశాల్లో మానవ మనఃప్రవృత్తి యెల్లప్పుడూ ఒకే తీరుగా ఆశ్చర్యచకిత మవటం సహజమనీ, కాబట్టి దానికిది ప్రతిబింబమని అనటం సబబు కాదనీ యెంత సమర్థించబూనుకొన్నా

మఱికొన్ని సందర్భాల్లో గోచరించు ఇట్టి ప్రణాళికనుబట్టి యిది శాకుంతలం ముద్రే అని చెప్పటానికి సందేహం లేదు.

2. కన్యాశుల్కం, తృతీయాంకం, 3 వ స్థలము: గిరీశం "కాముని విరి శర ములబారికి నేనేమని సహింతునే చెలి! యేమని సహింతునే" అన్న జావళీ పాడుకుంటూ ప్రవేశించి డెబ్బై పంక్తుల సుదీర్ఘమైన స్వగతం చెబుతాడు. ప్రారంభవాక్యాలివి:- "వీడి తస్సాగొయ్యా వీడి బాణాలు పువ్వులటోయి? ఆమాట యవడునమ్ముతాడు వెఱ్ఱికుట్టె యెవడైనా నమ్మాలిగాని? అనుభవవేద్యమైన దీని నిజం ఏమిటంటే మంచి పదునుబట్టిన లోహం మొనకి దయమండ్ పోయంట్ వేసి పోయిజన్‌లో ముంచి కంటికి కనబడకుండా మంత్రించి విసురుతాడు. అందుచేతనే పైకి గాయం కనబడదుగాని పోలీసువాళ్ళ దెబ్బల్లాగా లోపల తహతహ పుట్టిస్తాయి. యీ విడో బ్యూటీ చూస్తే యేమీ తోచకుండా ఉన్నది........"

శాకుంతలం, తృతీయాంకం: దుష్యంతుడు ప్రవేశించి, మదన బాధను నిరూపిస్తూ స్వగతంలో ఆఱు శ్లోకాలు, ఆఱు వచనాలు చెబుతాడు. పైన గిరీశం చెప్పిన వాక్యాలకు సరిగ్గా మూలమనిపించే యీ క్రింది శ్లోకం ముఖ్యమైనది:

శ్లో॥ తవ కుసుమశరత్వం శీతరశ్మిత్వమిందోః
ద్వయమిదమయథార్థం దృశ్యతే మద్విధేషు
విసృజతి హిమగర్భై రగ్నిమిందుర్మయూఖైః
త్వమపి కుసుమ బాణాన్ వజ్రసారీ కరోషి. (శ్లోకం 3)

ఓ కుసుమాయుధా! నీవు కుసుమ శరుడవనీ, చంద్రుడు శీతకరుడనీ చెప్పేమాటలు రెండూ నాబోంట్ల విషయంలో అబద్ధమోయీ! చంద్రుడు హిమగర్భితాలైన కిరణా లతో నిప్పులు రాలుస్తూ ఉంటే, నీవు కుసుమ బాణాలను సానబట్టిన వజ్రపు ములుకు లుగా విసురుతున్నావోయీ!

గిరీశం తన స్వగతం తరువాత బుచ్చమ్మ కోసం వరికించి తలుపు కన్నం లోంచి తొంగిచూచి "నడవలో కూర్చుని విస్తళ్ళు కుడుతున్నది'' అనుకొని తలుపు తట్టి పిలుస్తాడు. దుష్యంతుడు కూడా శకుంతలకోసం వెదుకుతూపోయి "అదిగో, సఖులతోకూడి పూలసజ్జ సమర్చిన శిలా పట్టకంపై కూర్చున్నది. వెళ్ళి వాళ్ళ మాటలు వింటాను" అని వెళతాడు.

పై రెండు ఘట్టాలూ ఎత్తుగడలో, నిడివిలో, నిర్వహణలో, ముగింపులో ఒకే విధంగా ఉన్నవి.

మహాకవి డైరీలలో ఈ శాకుంతలం ఘట్టాన్ని గూర్చిన నోట్సు వివరంగా ఉన్నవి. పుటలు. 102, 103, 104. ఈ ఘట్టంలోని దుష్యంతుని శ్లోకాలు ఒకటి రెండింటికి గురజాడవారు రాగాలు గూడా గుర్తు పెట్టారు. "తవ కుసుమ శరత్వం" అన్న యిందలి ముఖ్య శ్లోకానికి 169 పుటలో "శహన" అన్న రాగాన్ని గుర్తు పెట్టారు. కన్యాశుల్కంలో గాని, శాకుంతలంలో గాని యీ విరహ ఘట్టం సరిగ్గా తృతీయాంకంలోనే జరగటం ప్రత్యేకంగా గమనింపదగినది!

3. కన్యాశుల్కం తృతీయాంకం, ౪ వ స్థలము: పెరటిలో చెట్టుకొమ్మలు ఆవరించి ఉన్న నూతిలో బుచ్చమ్మ నీరు తోడుతూ ఉంటుంది. కొంత సేపటికి తమ్ముడు వెంకటేశంతో గిరీశాన్ని గూర్చి మాట్లాడుతూ జామిచెట్టు క్రింద నిలబడు తుంది. గిరీశం ప్రవేశించి "వదినా! ఈ చెట్టుకింద నిలబడితే మీరు వనలక్ష్మిలా ఉన్నారు" అని బుచ్చమ్మ వేపు తేరిచూచును.

శాకుంతలం, ప్రథమాంకము: శకుంతల చెట్లకు నీరుపోస్తూ కాసేపు కేసర వృక్షం దగ్గఱ నిలబడగా ప్రియంవద, "నీ విక్కడనిలుచుంటే యీ కేసరవృక్షకం లతా సనాథవలె కనబడుతున్నది" అంటుంది. అయితే గిరీశం మాటల్లో "వనలక్ష్మి" అనే పదం ఉన్నది. ఇది తరువాత శకుంతలకూ, సఖులకూ జరిగే సంభాషణలో పలుమార్లు వచ్చే "వనజ్యోత్స్న" "వనమాలిక" అనే మాటలకు ప్రతీకంగా వాడిన పదమే. ఈ సందర్భంలో శకుంతల ఇలా అంటుంది. "హలా!, రమణీయే ఖలు కాలే ఏతస్యలతాపాదమిథునస్య వ్యతికరః సంవృత్తః, యన్నవకుసుమయౌవనా వనజ్యోత్స్నా స్నిగ్ధపల్లవతయా ఉపభోగక్షమః సహకారః" ఇందలి "ఉపభోగ్య క్షమః" అన్న ప్రయోగం అప్పారావు గారికి యిష్టమైనది.

కన్యాశుల్కంలో కవి కల్పించిన పై దృశ్యమూ, గిరీశం చెప్పిన ఒకే ఒక వాక్యమూ ఈ శాకుంతలం ఘట్టాన్ని మొత్తం సులువుగా పుణికి పుచ్చుకొన్నదనటం స్పష్టం.

మహాకవి డైరీలలో నోట్సు ఇలా ఉన్నాయి: "వనజ్యోత్స్న, వనమాలిక, ఈ రంగము మహా సౌందర్యమైన కవితా రూపకల్పనలతో అలరారుతున్నది. 'ఉప

భోగక్షమ' అనే పద ప్రయోగము అర్థవంతమైనది. సాభిప్రాయము. "క్షత్రపరిగ్రహక్షమా, యదార్యమస్యామభిలాషి మేమనః'' (పుటలు 81, 82).

4. కన్యాశుల్కం, తృతీయాంకము. ౧౨వ స్థలము: ఇదే ఘట్టంలో బుచ్చమ్మ బిందెనెత్తుకొనే భంగిమ పెట్టారు గురజాడ. చెట్టుపైనుంచి వెంకటేశం పడేసిన పండు నందుకుని గిరీశం ''ఆహా! యేమి చాయ! వదినా! నీవంటి చాయన ఉంది ఈ పండు. ఇదండి'' అనగా బుచ్చమ్మ, "బిందెలో పడెయ్యండి, తమ్ముడూ దిగొచ్చి బిందెయెత్తు'' అంటుంది. గిరీశం, వాడక్కర్లేదు, నే నెత్తుతాన్లెండి'' అని యెత్తి, ఆమె వెళుతూవుంటే "ఆహా! యేమి వయ్యారము" అని ఆమెను తనివితీరా చూస్తూ ఉంటాడు.

ఇది సేచన ఘటం చేతిలో ఉన్న శకుంతలను దృష్టిలో పెట్టుకొని చేసిన కల్పనే. శకుంతలా సౌందర్యాన్ని బుచ్చమ్మలో చూపించాలని కుతూహల పడ్డారు గురజాడవారు. రెండుచోట్లా ఉన్న సందర్భాలనుబట్టి ఇరువురి బట్టలూ తడిసినవే మరి. ఇలా ఊహిస్తే ఈ ముద్రలో మహా సౌందర్యాన్ని తెచ్చిపెట్టారు అప్పారావుగారు.

మహాకవి డైరీలలో దీనికి సమర్థకంగా ఇలా ఉన్నది: శకుంతల – ''అసంబద్ధ ప్రలాపిన్" ఎంత సొగసుగా ఉన్నదీ! వృక్షములకు కలశములతో నీరు పోయుట వలన శకుంతల అలసిపోయింది. అలసిన శకుంతలావర్ణనం మనోహరం" (పుట.84)

5. తృతీయాంకంలో ఇదే ఘట్టంలో మఱికొంత పోయిన తరువాత అగ్నిహోత్రావధాన్లు ప్రవేశించి యూతాంతో నీళ్లు తోడుతున్న గిరీశంతో "గిరీశంగారూ నీరుతోడుతున్నారాండీ, అసిరిగాడు తోడుతాడే. యింగిలీషు చదువుకొన్న వాళ్ళు, మీ కెందుకా శ్రమ?'' అంటాడు. ఇక గిరీశం వ్యాయామాన్ని గూర్చి ఉపన్యాసం మొదలు పెడతాడు:

"పనివంటి వస్తువ లోకంలో లేదండి. ఊరికే కూచుంటే నాకు వూసుపోదు. మొక్కలకా మంచిది, నాకా కసరత్తూ.... షేక్స్పియర్ యేమన్నాడో విన్నారా, "డిగ్నిటీ ఆఫ్ లేబర్'' అన్నాడు. ....కాయక్లేశపడి కష్టపడే మనిషే గొప్పవాడు అన్నాడు.... యేజన్సీ కమాన్ చేస్తుంటే పెద్దపులి వస్తుందనుకోండి....''ఇత్యాది.

శాకుంతలం ద్వితీయాంకం ప్రారంభంలో శకుంతలపై కలిగిన ప్రేమాతిశయంవల్ల దుష్యంతుడికి వేటమీద విముఖత్వం కలుగుతుంది. అప్పుడు సేనాపతి

వచ్చి ఎలాగైనా రాజుగారిని వేటకు పురికొల్పాలని సంకల్పించి వ్యాయామంయొక్క ప్రాశస్త్యాన్ని ఉగ్గడిస్తాడు:

శ్లో॥ మేదచ్ఛేదకృశోదరం లఘు భవత్యుత్థానయోగ్యంవపుః
సత్త్వానామపి లక్ష్యతే వికృతిమచ్చిత్తం భయక్రోధయోః
ఉత్కర్షః స చ ధన్వినాం యదిషవః సిద్ధ్యంతి లక్ష్యేచలే
మిథ్యైవ వ్యసనం వదంతి మృగయా మీదృగ్వినోదః కుతః?

వేటవల్ల కొవ్వుకరిగి పొట్ట సన్నబడుతుంది. శరీరం తేలికబడి లేవటానికి, ఎక్కటానికి యోగ్యంగా ఉంటుంది. భయక్రోధములకు గురియైన మృగముల మనస్సు వికారం చెందటం గమనింపవచ్చు. కదలుచున్న లక్ష్యములను భేదించిన ధానుష్కులకు గొప్ప ఉత్కర్ష కలుగుతుంది. వేట నొక వ్యసనంగా చెబుతారు గాని అది మిథ్య. వేటవల్ల కలిగే వినోదం మరి దేనివల్ల కలుగుతుంది!

మహాకవి డైరీలలో ఈ వ్యాయామ ప్రసంగాన్ని చిత్తగించండి: "శరీర వ్యాయామమును కాళిదాసు కీర్తిస్తాడు. వేట దోషమే అయినా అది శరీరానికి వ్యాయామం కనుక దానిని సమర్థిస్తాడు." (పుట. 90).

6. కన్యాశుల్కం, చతుర్థాంకం, ౧-వ స్థలంలో అగ్నిహోత్రావధాన్ల రెండో కూతురు సుబ్బితో కావాల్సిన తన పెళ్ళి తప్పిపోయిన తరువాత లుబ్ధావధాన్లు రామ ప్పంతులుతో ఇక తనకు పెళ్ళి వద్దంటాడు. కాని రామప్పంతులు తన స్వార్థంకోసం వేసిన పథకం ప్రకారం అతనికి గుంటూరు శాస్త్రుల్ల కూతురు మాయ సుబ్బిని అంట గట్టాలనే ఉద్దేశంతో మరో సంబంధమైనా చూసుకొని ఒకింటివాడవు కమ్మని సలహా యిచ్చి లుబ్ధావధాన్లలో "సెంటిమెంట్స్"ను రెచ్చగొట్టి మెల్లగా ముగ్గులోకిదుస్తాడు: వాళ్ళిద్దరి సంభాషణ యిలా సాగుతుంది:

రామ- పెళ్ళి చేసుకొని కడుపు ఫలిస్తే మీ యిల్లు పదియిళ్ళౌతుంది. పెళ్ళి చేసుకోక గుటుక్కు మంటే యీ కష్టపడి ఆర్జించిన డబ్బంతా యెవడిపాలు గాను?
లుబ్ధా- అదుగో యేమో యెక్కువ ధనం వున్నట్టు శలవిస్తారు. నాకేంవుంది?
రామ- ఉన్నంత ఉంది. పరానికి యిన్ని నీళ్ల చుక్కలు వొదిలే వాడుండాలా?
లుబ్ధా- అయితే యేం జేయమంటారు?
రామ- మీరు పునః ప్రయత్నం చేసి పెళ్ళాడండి........

లుబ్ధా- నిజమైన మాటే.

ఈ విధంగా మెత్తబడిన లుబ్ధావధాన్లు గుంటూరు శాస్త్రి కూతురు మాయ సుబ్బిని చేసుకోటానికి నిశ్చయమైపోతుంది. దీనితో నాటక కథాగమనం క్రొత్త మలుపు తిరుగుతుంది.

శాకుంతలం షష్ఠాంకంలో దుష్యంతుడు శకుంతలను మాటిమాటికీ జ్ఞాపకం జేసుకొని దుఃఖిస్తూ ఉంటాడు. ఇంతలో ధన మిత్రుడనే వ్యాపారి ఓడ పగిలి సముద్రంలో మరణిస్తాడు. అతనికి పిల్లలేకపోవటం వల్ల అతని ఆస్తంతా రాజు గారి బొక్కసంలోకి చేరుతుందని మంత్రి ద్వారా దుష్యంతునికి తెలుస్తుంది. దీంతో దుష్యంతుడు "పిల్లలు లేనివారి గతి యింతే గదా: నా కిప్పుడు భార్య లేదు. పిల్లలేరు. నా తరువాత ఈ పురువంశ సంపదంతా యిలాగే పరులపాలై పోతుంది గాబోలు! నాకు తిలోదకా లిచ్చేవా రెవరూ లేకపోతారు గదా!" అని మఱింత వాపోతాడు. దుష్యంతుని యొక్క ఈ "సెంటిమెంట్స్" తన్మూలకమైన దుఃఖాన్ని, ప్రచ్ఛన్నంగా ఉండి విన్న సానుమతి యీ విషయాన్ని శకుంతలకు చెప్పి తరువాత వాళ్ళిద్దరి సమాగమానికి దోహదం చేస్తుంది. శాకుంతలంలో ఇతి వృత్త గమనానికి 'మలుపుగా' నున్న ఈ సన్నివేశమే కన్యాశుల్కం కథా గమనానికి కూడా కీలకమౌతుంది.

మహాకవి డైరీలలో ఈ ముద్రకు సంబంధించిన నోట్సు లేదు. అయినా యిది శాకుంతలం ముద్రే అని చెప్పటానికి ఎట్టి సందేహమూ లేదు.

7. డబ్బుకోసం ఆశపడి ఆడపిల్లల్ని పసితనంలోనే పెద్దవాళ్ళకిచ్చి పెళ్ళి చేయటమనే దురాచారాన్ని ఖండించటమనేది కన్యాశుల్కం నాటకంలోని ప్రధా నాంశాల్లో ఒకటి. వివాహానికి ఈడూ జోడూ ఉండాలి. ఈ అనురూపత యింకా అనేక విషయాల్లో ఉండవచ్చు. ఈ విషయం శాకుంతలం ద్వితీయాంకంలో కంఠో క్తిగా ప్రకటింపబడింది

దుష్యంతుడు శకుంతలను "అనాఘ్రాతంపుష్పమ్" ఇత్యాదిగా వర్ణించి "ఆమెను అనుభవించే అదృష్టం ఎవరికి పెట్టాడో గదా భగవంతుడు" అని విదూషకునితో అంటాడు. అప్పుడు విదూషకుడు "తేన హి లఘు పరిత్రాయతా మేనాం భవాన్. మాకస్యాపి తపస్వినః ఇఙ్గుదీతైలచిక్కణ శీర్షస్యహస్తే

పతిష్యతి'' (అయితే నీ వామెను త్వరగా ఆదుకో. లేకపోతే ఇఙ్గుదీ తైలంతో చిక్కనైన శీర్షముగల ఏ తాపసుని పాలనో యీమె పడుతుంది) అంటాడు. ఇంత అందము, యౌవనముగల ఈమె అనురూప వరునికే దక్కాలి గాని శృగారం తెలియని యే జడుడైన సన్యాసికో గాదు. అలాగైతే ఆమె జీవితం అడవిగాచిన వెన్నెలైపోతుంది అని విదూషకుని భావం. ఋషి కన్యలకు వృద్ధర్షులు భర్తలుగా దొఱకటం మన పురాణాల్లో ఉన్న విషయం గమనించాలిక్కడ.

అప్పారావుగారీ శాకుంతల ఘట్టాన్ని సమ్యక్ పరిశీలనతో చదివుంటారని భావింపవచ్చు. విదూషకుని మాటల్లో బీజప్రాయంగా ఉన్న విషయమే కన్యాశుల్కంలోని ఒక ప్రధానాంశం గావటం దీనికి కారణం.

అయితే వారు డైరీలలో వ్రాసుకొన్న నోట్సు మనమనుకొన్నదానికి సూటిగా తాకేటట్లుగా లేవు. చూడండి: కాళిదాసుకు "అనాఘ్రాత పుష్పముల వంటి కన్యల సౌందర్యమును వర్ణించుట ప్రీతి" (పుట. 81). "ఇంగుదీతైల చిక్కణశీర్షస్య" తెలుగున 'చిక్క' అనే శబ్దము "చిక్కణ'' అనే సంస్కృత శబ్దంనుండి పుట్టినదా? 'చిక్క' సంస్కృత శబ్ద భవమా? (పుట. 92)

కన్యాశుల్కంలో ఎంతసేపూ హైదరాబాదు నవాబు, బరోడా మహారాజు, ఉర్లాం బసవరాజు, సురేంద్రనాథ్ బెనర్జీ ఇలా యెవరెవరి పేర్లో వస్తాయి గాని ఎక్కడా ఆనందగజపతి పేరుగాని, ఆయన సంబంధీకుల పేర్లుగాని రావు. అప్పారావుగారీ నాటకాన్ని ఆనందగజపతికే అంకితమిచ్చారు. అసలీ నాటకం రావటానికి కారణం ఆనందగజపతి పుణ్యమే గదా? కాబట్టి ఆయన పేరు వస్తే యెంత? రాకపోతే యెంత? విక్రమార్కునికి కాళిదాసు, కృష్ణదేవరాయలకు పెద్దన లాగ ఆనందగజపతికి అప్పారావుగారలాంటివారు. రాజావారంటే వారి కపరిమితమైన అభిమానము, కృతజ్ఞత. దాన్ని వారెట్లా వ్యక్తంచేస్తారో చూడండి:

శాకుంతలం ద్వితీయాంకంలో ఇద్దఱు ముని కుమారులు ప్రవేశించి దుష్యంతుణ్ణి చూసి "అహో! దీప్తిమతోఽపి విశ్వసనీయతాస్య వపుషః, అథవా ఉపపన్నమేత దృషిభ్యోనాతి భిన్నేరాజని'' (తేనిగానున్నను ఈతని శరీర మెంతటి విశ్వాసమును కలిగించుచున్నది! అవును, రాజు ఋషికంటె భిన్నుడు గాడుగదా!) అంటారు.

మహాకవి డైరీలలో ఇలా ఉన్నది: "అహోదీప్తి మతోఽపి విశ్వసనీయ తాస్య వపుషః. అథవా ఉపపన్నమేతదృషిభ్యోనాతిభిన్నే రాజని". "ఇటువంటి గుణములు గల రాజులను కాళిదాసు శ్లాఘిస్తాడు. తనకు ఆశ్రయమిచ్చిన కవి పోషకుడైన యేలిక నుద్దేశించి కాళిదాసు ఈ పొగడ్తలను బహుశా చేసిఉంటాడు'' (పుట. 93).

## మాలతీ మాధవం ముద్ర

కన్యాశుల్కంలోని మాయ సుబ్బి పెళ్ళివంటి ఘట్టమొకటి మహాకవి భవభూతి రచించిన మాలతీ మాధవంలో కనబడుతున్నది. దీన్ని "కృతక మాలతీ వివాహ ఘట్ట'' మంటారు. మాలతీ మాధవం ప్రకరణమనే రూపక భేదం. ఇందులో ఇతివృత్తం కల్పితమై యుంటుంది. భవభూతి క్రీ.శ. 8వ శతాబ్దానికి చెందినవాడు. ఆనాటికీ నాటకం కన్యాశుల్కం వంటి సాంఘిక నాటకమని చెప్పవచ్చు. ఈనాటి మన దృష్టికిది సాంఘిక నాటకంగా కనబడదేమోగాని ఆ లక్షణాలు పుష్కలంగా ఉన్న నాటకమే. కన్యల్ని అనురూప వయస్కులైన వరులకివ్వాలే గాని వయస్సు మళ్ళినవారికివ్వగూడదన్న మానవత్వ తత్త్వమే యీ "కృతక మాలతీ వివాహ'' ఘట్టానికి ప్రాతిపదిక.

భూరివసువు కూతురు మాలతి. దేవరాతుని కొడుకు మాధవుడు. వీళ్ళిద్దరు ఒకరి కొకరు తగిన వధూవరులు. పరస్పరం లోలోపల ప్రేమించుకొంటున్నారు గూడ. వీళ్ళిద్దరికీ పెండ్లిచేసి వియ్యమందాలనే వారి తండ్రుల ఆశయం. మాలతి తండ్రి భూరివసువు పద్మావతీపురం రాజు దగ్గఱ మంత్రిగా ఉన్నాడు. ఆ రాజుకి నందనుడు అనే వేఱొక వర్మ సచివుడున్నాడు. వాడు ముసలివాడు. అందువల్ల కురూపి. అతడు మాలతిని పెళ్ళి చేసుకోవాలను కున్నాడు. రాజు ద్వారా భూరివసువును అడిగించాడు. భూరివసువు ఎటూ చెప్పటానికి మొహమాటపడి పలికిన మాటల్ని వాళ్ళిద్దరూ అతని అంగీకారంగా భావించి ఆ ప్రయత్నాల్లో ఉన్నారు. కాని భూరివసువు తన బాల్యస్నేహితురాలూ, తనతోపాటు చిన్నప్పుడు కలిసిచదువుకున్నదీ అయిన "కామందకి" అనే యోగినితో తన బిడ్డని నందనున కివ్వటం తన కిష్టంలేదనీ, ఆ మాట చెప్పలేకుండా ఉన్నాననీ, తన కూతురు నందనునకు దక్కకుండా మాధవుడికే దక్కేటట్లు పథకం వేయమనీ అతిరహస్యంగా చెబుతాడు.

ఇది మూడోవాడికి తెలీదు. తాను మాత్రం పైకి నిర్దయగా కనిపిస్తూ ఉంటాడు. కామందకి తన ప్రయత్నాలు తాను చేస్తూ ఉంటుంది. కన్యాశుల్కంలో మాయ సుబ్బి పెళ్ళి ఎంత కీలకమైందో ఈ కృతక మాలతీ వివాహ ఘట్టం ఈ నాటకంలో అంత కీలకమైంది. ప్రథమాంకంలోనే కామందకి ప్రయత్నాలు ప్రారంభమై, క్రమంగా షష్ఠాంకంలో పరాకాష్టకొచ్చి, సప్తమాంకంలో నిలబడి, క్రమంగా అవనతి చెందుతుందీ ఘట్టం. దాదాపు కన్యాశుల్కంలో గూడా ఇలాగే జరుగుతుంది. కన్యాశుల్కంలో మధురవాణి తెరవెనుక భాగోతం ఆడించినట్లు ఇక్కడ కామందకి ఆడిస్తుంది. కథ నడుస్తున్న కొద్దీ మాయమాలతి పెళ్ళిని జాగ్రత్తగా నడిపించటానికి అనువుగా లవంగిక మొదలైన చెలికత్తెలకు ఈ రహస్యం కొద్ది కొద్దిగా చెబుతూ హంగులు సమకూర్చుకుంటూ ఉంటుంది. పైకి మాత్రము మాలతిని నందనున కిస్తున్నట్లే ప్రచారం. లోపల మాత్రం ప్రయత్నాలు వేరు. మాలతికి మాత్రం తనను నందనుడి కిస్తున్నట్లే చెప్పింది. కామందకి, లవంగిక, మాలతి— ఈ ముగ్గురి సంభాషణ ఇలా నడుస్తుంది:

లవంగిక— ప్రస్తావనాఖల్వేషా కపట నాటకస్య [ఆడబోవు కపట నాటకమున కిది ప్రస్తావన]

కామందకి - (లవంగికకు మాలతిని చూపుచు)

శ్లో॥ ఇదమిహమదనస్య జైత్రమస్త్రం
సహజ విలాసనిబంధనం శరీరం
అనుచితవర సంప్రదాన శోచ్యం
విఫల గుణాతిశయం భవిష్యతీతి (అంకం 2.)

(ఈ సహజ సౌందర్యరాశి అనుచిత వరున కివ్వబడుచున్నది గదా। ఈమె జీవితము వ్యర్థమగుచున్నది గదా।)

మాలతీ— "రాజారాధనంఖలు తాతస్య గురుకం నపునర్మాలతీ."
(మా నాన్నకు రాజుగారి సేవే ముఖ్యం గాని తన కూతురు మాలతి కాదా।)

లవంగికా— "ఏవం యథాతగవత్యా ఆజ్ఞప్తమ్. అన్యథాతస్మిన్ వరే దుర్దర్శనే, అతిక్రాంత యౌవనే కిమితి సవిచారితమమాత్యేన"

(అమ్మా, తమరు సెలవిచ్చినది అక్షరాలా నిజము. అదేగాకపోతే ఆ కురూపికి, వయస్సు మళ్ళినవానికి ఏమి చూచి పిల్లనిచ్చెదనన్నా డమాత్యుడు).

ఇంగలి తత్త్వమును తెలియపరచటానికి దిఙ్మాత్రంగా ఉదాహరించాను.

ఇప్పుడు ఆరు ఏడు అంకాల్లో మాయమాలతి పెళ్ళి జరిగిన విధం చూద్దాం. మాధవుని వయస్యుడు మకరందుడు. ఇతణ్ణి నందనుడి చెల్లెలు మదయంతిక వలచింది. ఇటు నందనుడితో మాయామాలతి పెళ్ళిని, అటు మకరందుడితో మదయంతిక కలయికను ఒకేసారి జరిపించాలనుకొంది కామందకి. పెళ్ళికి ముందు అలంకరణ కోసం నందనుడి తరఫువారు మాలతికి ఆభరణాల్ని పంపారు. వాటితో మకరందుణ్ణి మాలతి వేషం వేసుకోమంది కామందకి. మకరందుడు తెరచాటుకి పోయి వేషం వేసుకొంటుండగా, మాధవుడు కామందకితో వేషధారణ సులభమే గాని కార్యనిర్వహణ కష్టమంటాడు. నీకెందుకాచింత అంటుంది కామందకి. మకరందుడు మాలతి వేషంలో వచ్చి మాధవుడితో "మిత్రుడా! నేను మాలతినైనాను" అంటాడు. మాధవుడు మాయమాలతిని కౌగిలించుకొని నందనుడెంత అదృష్టవంతుడో అంటాడు. కన్యాశుల్కంలో మధురవాణి మాయసుబ్బిని ముద్దుపెట్టుకుని పరసమాడిన ఘట్టం స్ఫురణకు వస్తుంది. ఏ ఆటంకమూ లేకుండా కృతక మాలతీ నందనుల వివాహం జరిగింది. పడకగదిలో నందను డెంత బతిమాలినా అంగీకరించక అతనిని తిరస్కరిస్తుంది మాయమాలతి. నందనుడు కోపంతో దుఃఖంతో అవమానంతో "ఇక నాకు ఈ చంధకితో పన్లే"దని బయటి కెళ్ళి పోతాడు. ఇక్కడ సరిగ్గా లుబ్ధావధాన్లు మాయ సుబ్బిని భీదరించుకొన్న వైనం జ్ఞాపకం వస్తుంది. లుబ్ధుడు మాయసుబ్బిని భీదరించుకోటానికి కారణం అది వెధవముండ, దానికి మొదటి మొగుడొక డుండేవాడు. ఇక్కడ(మాయ)మాలతి మాధవుడికిముందే మనసిచ్చిందట. అది తెలుసుకొన్న నందనుడు ఈమెను భీదరించుకొని కాలదన్నాడట. ఈ నాటకంలో దరిమిలా జరిగిన అడంగుల ముచ్చట్లవలన తేలిన సారాంశమిది.

మాయమాలతి యింకా పడగ్గదిలోనే ఉంది. మదయంతిక ఈమె నిజమైన మాలతే అనుకొని యీ జరిగిన దానికి ఆమెను ఓదార్చటానికొచ్చి మంచం మీద కొంతసేపు కూర్చుని వెళ్ళబోవుచుండగా మకరందుడామె చేతిని పట్టుకొనును. మదయంతిక ఆశ్చర్య భయలజ్జాభరితయై సంబాళించుకొని తన ప్రియుణ్ణి కలుసు

కున్నందుకు ఆనందిస్తుంది. ఈ విధంగా వీళ్ళిద్దరి సమాగమం జరుగుతుంది. ఈ కృతక మాలతీ వివాహమును దృష్టియందుంచుకొనియే గురజాడ "మాయసుబ్బి" పెళ్ళి ఘటనను సమకూర్చినారు.

## మృచ్ఛకటికం ప్రభావం

కన్యాశుల్కం నాటకం మీద శూద్రకుని మృచ్ఛకటికం ప్రభావం కూడా అమితంగా కనబడుతుంది. కన్యాశుల్కానికి వ్యాఖ్యాత లనదగిన విమర్శకు లెందరో మృచ్ఛకటికంలోని వసంతసేన పాత్ర యిందలి మధురవాణి పాత్రకు వఱవడి పెట్టిందని అంగీకరించిన విషయమే. గురజాడవారే తమ డైరీలలో 29 ఏప్రిల్ 1895 సోమవారంనాడు వ్రాసుకొన్న "వసంతసేన బోగముపిల్ల భూమిక ఆకర్షణీయము" అన్న నోట్సునుబట్టీ, కన్యాశుల్కం సప్తమాంకం 6-వ స్థలములో మధురవాణిని గూర్చి సౌజన్యారావుతో కొత్తమనిషి- "మృచ్ఛకటికం చదివిందేమోనండి" అనగా, సౌజన్యారావు "వసంతసేన లాంటి మనిషి వెఱ్ఱి కవీశ్వర కల్పనలో ఉండాలిగాని లోకంలో ఉండదు" అని అన్నదాన్ని బట్టీ గురజాడవారు మధురవాణిని వసంతసేనకు ప్రతిబింబంగా రూపొందించినట్లు నిష్కర్షగా భావించవచ్చు. మృచ్ఛకటికం సాంఘిక దృక్పధమూ, సామాజిక స్పృహ ఉన్న గొప్ప నాటకం. మఱి దాని ప్రభావం కన్యాశుల్కం వంటి సాంఘిక నాటకాలపై పడిందంటే ఆశ్చర్యపడాల్సిన పనిలేదు.

1. వసంతసేన జన్మతః బోగముపిల్ల. కాని కులస్త్రీల జీవితాన్ని గడపాలనే కోరిక గలది. ధనమున కంత ప్రాధాన్యమీయదు. ఉదార స్వభావురాలు. చారుదత్తునియందు మాత్రమే అభిమానము గలది.

మధురవాణి కూడా జన్మతః బోగము పిల్ల. జీవితములో చాలా భాగము వృత్తిలో జీవించినది. చివరికి వృత్తిని త్యజించి కులస్త్రీ జీవితాన్ని గడపటానికి తపనబడింది. కరటకశాస్త్రితో ఇలా అంటుంది: "అంతకన్న కాపుమనిషినై పుట్టి మొగుడి పొలంతో వంగ మొక్కలకూ మిరప మొక్కలకూ దోహదంచేస్తే యావజ్జీవం కాపాడే తన వాళ్ళన్నవారుందురేమో?" (షష్ఠాంకం 6-వ స్థలము). చివరికి సౌజన్యారావుని ఆశ్రయించి అతణ్ణి ఆరాధించటం మొదలుపెట్టింది.

2. వసంతసేన నగలు చారుదత్తునిపై కూనీకేసు మోపటానికి కారణమై

చివరికవే యాతని శిక్షను తప్పించుట కుపకరించినవి.

మధురవాణి "కంటె" లుబ్ధావధాన్లపై కూనీకేసు మోపటానికి కారణమై చివరికదియే యాతని శిక్షను తప్పించుటకు కారణమైనదని భావింపవచ్చును.

చారుదత్తుని రక్షించుటకు వసంతసేన స్వయముగా వధ్యస్థలికి వెళ్ళినది. లుబ్ధావధాన్లను రక్షించుటకు మధురవాణి సౌజన్యారావు కడకు పోయినది.

3. రాజశ్యాలకుడు స్వయముగా వసంతసేనను కోరెను. ఆమె తల్లికూడా అందుకు ప్రోత్సహించింది. అయినా ఆమె ఒప్పుకొనలేదు. ఆమె మనస్సు చారుదత్తుని అధీనం కావటమే యిందుకు కారణం.

డిప్టీ కలక్టరు మధురవాణిని కోరి నాయుడు ద్వారా కబురంపించాడు. కరటకశాస్త్రి అందుకు మధురవాణిని ప్రోత్సహించాడు. అయినా ఆమె ఒప్పుకోలేదు. ఆమె మనస్సు వృత్తిని త్యజించిన తరువాత అప్పుడప్పుడే సౌజన్యారావు ఆధీనమై పోతుండటమే దీనికి కారణం.

వసంతసేన రాజశ్యాలకుని వెంటపోయి ఉంటే చారుదత్తునిపై అసలు కూనీ కేసు మోపబడేది కాదు. మధురవాణి డిప్టీ కలక్టరు వెంట పోయివుంటే లుబ్ధావధాన్లపై మోపబడిన కేసు అప్పటి కప్పుడు తొలగింపబడేది.

4. శర్విలకుడు దొంగతనం చేయటానికి వెళ్లి చారుదత్తుని యింటిగోడకు కన్నం వేయటం ప్రారంభించి, అయ్యో, కొలుచుకొనే తాడు మర్చిపోయానే అనుకొని, ఫరవాలేదు, ఈ జంధ్యంతో పబ్బం గడుపుకుంటాను అని యజ్ఞోపవీతాన్ని యిలా వర్ణిస్తాడు:

యజ్ఞోపవీతం హి నామ బ్రాహ్మణస్య మహదుపకరణద్రవ్యం, విశేషతో అస్మద్విధస్య కుతః-

ఏతేన మాపయతి భిత్తిషు కర్మమార్గ
మేతేన మోచయతి భూషణసంప్రయోగాన్
ఉద్ఘాటకోభవతి యన్త్రదృఢే కవాటే
దష్టస్య కీటభుజగైః పరివేష్టనంచ. (మృచ్ఛకటికం, అంకం 3, శ్లో. 16)

"ఓహో, జంధ్యం అనేది బ్రాహ్మణునికి ఎంత పనికొస్తుంది! అందులో నావంటివానికింకాను. ఎందువల్లనంటే-

కన్యాశుల్కం నాటకము - విశేషవిమర్శనము

"గోడకు కన్నం వేసే ముందు దీన్తో కొలుచుకోవచ్చు. అభరణాల సంధుల్ని వదులు చేయవచ్చు. గట్టిగా ఉన్న తలుపు గడియల్ని ఊడదీసేయవచ్చు. తేలు, పాము వగైరా విషజంతువులు కరిస్తే బాగా బిగించి కట్టి తాత్కాలికంగా దాని దుష్ప్రభావాన్ని అరికట్టవచ్చు."

ఈ విధంగా అనుకుంటూ కన్నం వేస్తూ ఉంటాడు పాపం. ఇంతలో పాము కాటేస్తుంది. వెంటనే జందెం వేలుకి బిగించికట్టి లోపలికి ప్రవేశిస్తాడు.

కన్యాశుల్కంలో ప్రథమాంకం. స్థలము-1. పౌటిగరాప్పంతులు గారి నౌకరొచ్చి పౌటిగరాపుల కరీదు వెంటనే యిప్పించమంటాడు. కొంత సంభాషణ అయింతరువాత గిరీశం "నీకు నమ్మకం చాలకపోతే యిదిగో, గాయత్రి పట్టుకు ప్రమాణం చేస్తాను" అంటాడు. శిత్తం అని నౌకరు వెళ్ళిపోతాడు. అప్పుడు గిరీశం ఇలా అంటాడు:- "ఇన్నాళ్ళకు జంధ్యప్పోగు వినియోగంలోకి వొచ్చింది. ధియాసఫిష్టులు చెప్పినట్లు మన ఓల్డు కష్టమ్సు అన్నిటికీ యేదో బహుప్రయోజనం ఆలోచించే మనవాళ్ళు యేర్పరిచారు. ఆత్మానుభవం అయితే గాని తత్త్వం బోధపడదు."

ఇలా తులనాత్మకంగా పరిశీలిస్తూ పోతే యెన్నో వెలికివస్తాయి. దిఙ్మాత్రంగా కొన్ని ఉదాహరింపబడినాయి.

రస మీమాంస

కన్యాశుల్కం నాటకంలో రసమేది? అన్న విచికిత్సకు వాస్తవంగా అవకాశం లేదు. ఎందుకంటే, ఇది హాస్యరసప్రధానమైన నాటకంగా స్థిరపడి పోయింది కాబట్టి. అయితే బాహ్యదృష్టి కిది హాస్యరస ప్రధానమైన నాటకంగా కనిపిస్తున్నా అంతర్గతంగా కరుణరసధార ఇందులో ప్రవహిస్తున్నది. మరీ శాస్త్రీయ విశ్లేషణ చేసి చెప్పాలంటే, వత్సలరసగర్భితమైన కరుణరస మనటం సమంజసం. వత్సల కరుణ హాస్యరసాల్లో వత్సలరసం నవరసాల్లో చేరదు. అయినా దానికొక ప్రతిపత్తిని కల్పించారు లాక్షణికులు. హాస్యం నవరసాల్లో చేరినా దానికి మహాకావ్య నాటకాల్లో అంగరసంగా సేగాని అంగిరసంగా ప్రాధాన్యంలేదు. పోతే, నవరసాల్లో చేరి రసత్వసిద్ధి పొందినది కరుణరసం. కేవల కరుణ రసాన్నికి ఇందులో ప్రాధాన్యమియ్యటానికి వీల్లేదు. ఈ నాటకంలో ప్రధానంగా నాలుగు కథలున్నాయి:

గిరీశం బుచ్చమ్మల కథ, సుబ్బి లుబ్ధావధాన్ల కథ, మీనాక్షి రామప్పపంతుల కథ, మధురవాణి సౌజన్యారావుల కథ. ఈ నాల్గింటిలోను, ఈ ఫలానా కథలో వీళ్ళు కచ్చితంగా చెప్పదగిన నాయికా నాయకులు అనటానికి అవకాశం లేదు. సాధారణంగా శృంగార వీర కరుణ రసాలకు రసత్వసిద్ధి ఆలంకారిక నిర్దిష్ట లక్షణ లక్షితులైన నాయికానాయకులున్నప్పుడే. అట్టి నాయికా నాయకుల జంట ఈ కథల్లో యేదీ లేదు కాబట్టి ఇక్కడ మహారసమైన కేవల కరుణరసానికి తావులేదు. ఇదొక విచిత్ర స్థితిలో పడిపోయింది యీ నాటకం!

"ఏకోరసః కరుణ ఏవ" అన్న సిద్ధాంతాన్నిబట్టి సర్వరసాలకు మూలం కరుణరసం. "శోకః శ్లోకత్వమాగతః" అన్న మాట నుంచే యీ మాట అన్నారు భవభూతి. ఈ నాటకంలో ఉన్న వస్తు స్థితినిబట్టి యిక్కడ వత్సల రసం సరిపడుతుంది. వత్సల రసానికి కరుణ రసస్పర్శ ఆలంకారిక సమ్మతమే. అది ప్రకృతి సహజం కూడా. ఇదంతా తెలిసిన మన మహాకవి గురజాడ రసత్రయ, లేదా రసద్వయ సమ్మేళనంతో ఈ నాటకం వ్రాశారు. అందువల్ల యిది బాహ్య దృష్టికి హాస్యరస ప్రధానంగా కనపడుతున్నా అంతర్గతంగా ఇందులో వత్సలరసగర్భిత కరుణరసం, స్థూలంగా కరుణరసం ప్రవహిస్తున్నది అని చెప్పుకోవాలి. ఇలా సమాంతర రేఖలపై రెండు విభిన్న రసధారలు ప్రవహిస్తున్న ఏకైక మహానాటకం కన్యాశుల్కం! సంస్కృతంలో భాసుని స్వప్న వాసవదత్తం బాహ్య దృష్టికి శృంగారం, అంతర్గతంగా కరుణము ప్రక్క ప్రక్కనే సాగిన మహా నాటకం!

ఇప్పుడు ఈ విషయాన్ని సమన్వయ పూర్వకంగా నిరూపించటానికి ప్రయత్నిద్దాం. కన్యాశుల్కంలోని యీ క్రింది వాక్యాలు మన యీ సిద్ధాంతానికి ప్రాణ సూత్రాలు:

ద్వితీయాంకం, 1-వ స్థలము. అగ్నిహోత్రావధాన్లు తన కూతురు సుబ్బిని లుబ్ధావధాన్ల కియ్యటానికి నిర్ణయించినట్లు హఠాత్తుగా ప్రకటించాడు. కరటకశాస్త్రి మొదలైన వాళ్ళందరూ అదిరి పడ్డారు. వెంకమ్మకు పిడుగుపడినట్లయింది. తక్కిన పాత్రలు మాట్లాడిన మాటల్ని వదిలేసి వెంకమ్మ మాటల్ని మాత్రం పొందుపరుస్తున్నాను:

1. వెంకమ్మ - (అగ్నిహోత్రావధాన్లతో) పెళ్ళి కొడుక్కేన్నేళ్ళు?

2. వెంకమ్మ - (అగ్నిహోత్రావధాన్లతో) నాకు చెప్పకుండానే!

3. వెంకమ్మ - (కరట-శాస్త్రితో) అన్నయ్యా! ఈ సమ్మంధం చేస్తే నేన్నుయ్యో గొయ్యో చూసుకుంటాను. పెద్దాన్ని రొమ్ముమీద కుంపట్లాగ భరిస్తూనే ఉన్నాం. ఆయనకి యింత యీడొచ్చినా కష్టం సుఖం వొళ్ళు నాటక యీ దౌర్భాగ్యపు సమ్మంధం కల్పించుకొచ్చారు. నే ఒతికి నాగుంటా లంటే యీ సమ్మంధము తప్పించు.

4. వెంకమ్మ - (గిరీశంతో) బాబూ! అతడు మీ పెత్తల్లి కొడుకైతే మీ కాళ్ళు పట్టుకుంటాను. మీరు వెళ్ళి ఆయ్నమనస్సు మళ్ళిస్తురూ, నా చర్మం చెప్పులు కుట్టిస్తాను.

ఈ వాక్యాల్లో క్రమక్రమంగా పెరిగిపోయిన ఆమె ఆందోళన, దగ్గుతిక, స్పష్టం. ఈ నాల్గు వాక్యాలు ఈ నాటకానికి నాల్గు ప్రాణతంతువులు. ఇందులో జరిగిన నాల్గు ప్రధాన కథలకు మూలకారణాలు. ఇక్కడ ఉత్తాలమైన శోకరస ముంది. ఇది పుత్రికాగతమైనందువల్ల వత్సల గర్భితమైంది. తన బిడ్డకు జరుగ బోయే 'అనిష్టాన్ని' (కష్టాన్ని) తలుచుకోగానే ఆ బిడ్డ పుట్టినప్పటినుంచి జరిగిన అనేక సంఘటనలు కళ్ళముందు తారట్లాడినట్లుండి అమాంతము ఆమెను ఒడి లోనికి తీసుకుంటుంది తల్లి. యిద్దరూ ఏడుస్తారు. ఈ సన్నివేశాన్ని యిక్కడ నాటకంలో చూపించక పోయినా, లోక సాధారణ ధర్మంగా ఇలా జరుగు తున్నట్లు ఊహించినప్పుడు ఔరా! గురజాడ ప్రతిభ! అని అనిపించక తీరదు! వత్సల రసానికి స్థాయి వాత్సల్యము. పుత్ర భ్రాత్రాదు లాలంబనములు. వారి చేష్టలు అనుభావములు. 'అనిష్టశంక' మొదలైనవి వ్యభిచారి భావములు. వీళ్ళకి మంచి జరిగితే ఆనందం కష్టం గలిగితే శోకం, అంటే పరిణామ స్వరూపం కరుణరసమే. ఈ ప్రమాదాన్ని తప్పించటానికి ఈ నాటకంలో జరిగిన సంఘటనలు వత్సల రసగర్భిత కరుణ రసంలోనుండి పుట్టిన హాస్యరసస్ఫోరకాలు. ఇదీ వస్తుస్థితి!

ఇదేవిషయాన్ని బుచ్చమ్మ పరంగా చూద్దాం:

చతుర్థాంకము : ౧-వ స్థలము. బుచ్చమ్మ మిరపప్పు రుబ్బుచుండును. గిరీశం ప్రవేశిస్తాడు. వీరిద్దరికి జరిగిన సంభాషణలో బుచ్చమ్మ వాక్యాలు మాత్రం యివ్వబడుతున్నాయి. ఈ వాక్యాన్ని భావోద్రిక్తతను భావించాలి:

1. గిరీశం 'ఏం వదినా! కంటనీరు పెడుతున్నారా!' అంటాడు.
2. బుచ్చమ్మ – ఏవీలేదు.
3. బుచ్చమ్మ – మీకేం మహరాజులు – మా కష్టాలు మమ్మల్నే బాధిస్తాయి.
4. బుచ్చమ్మ – చెల్లికి ఈ సమ్మంధం తప్పించారు కారు గదా!
5. బుచ్చమ్మ – అయితే మీతో నాకేంపని? ఇంత సందడిగా పెళ్ళి పనులు చేయిస్తున్నారు. మా నాన్నకి తోచకపోతే మీకైనా తోచకూడదా యీ సమ్మంధం కూడదని? మీకు కూడా దానిమీద యింత కనికరం లేకపోవాలా? లుబ్ధావధాన్లు మీకు అన్నగారని కాబోలు మీకు సంతోషం.
6. బుచ్చమ్మ – మీరు చెబితే లుబ్ధావధాన్లుగారు పెళ్ళి మానుకుంటారని తమ్ముడు చెప్పాడు.
7. బుచ్చమ్మ – యేదునూన్న దాన్ని నవ్విస్తారు.
8. బుచ్చమ్మ – నా జన్మానికి మఱి ఆనందవెక్కడిది!
9. బుచ్చమ్మ నేను మీతో లేచి వస్తే మా చెల్లిలి పెళ్ళి ఆగిపోతుందీ! యేవి చిత్రాలు!
10. బుచ్చమ్మ – అమ్మ నాయనా! నా ప్రాణంపోతే నేను మీతోరాను.
11. గిరీశం – రాకపోతే నీ చెల్లెలికి యీ పెళ్ళి తప్పదు, నాకు చావూతప్పదు.

బుచ్చమ్మకు తన జీవితమే కరుణ రసానికి ఆలంబనమైంది. అది ఇప్పుడు తన చెల్లెలికి పట్టబోతున్నది. రెండూ మిశితమైన ద్విగుణీకృత శోకమిది. ఈ దుఃఖం తనకు పోవాలి. తన చెల్లెలికి రాకూడదు. చెల్లెలు పరంగా ఇది సోదరీ ఆలంబన వాత్సల్యము: పర్యవసానము కరుణము. తామిద్దరికీ పట్టిన దుఃఖాలు పోవాలంటే గిరీశంతో లేచిపోవాలి. ఇప్పటివఱకూ కుటుంబ మర్యాదకు లోబడిన తాను తెగిస్తుంది. ఇక జరుగబోయే సంఘటనలు ఈ కరుణ రసం నుండి ఉత్పన్నమైన హాస్య రసానికి దారి తీస్తాయి.

ఇప్పుడు మీనాక్షి కథలో పరిశీలిద్దాం:

పంచమాంకము. 6–వ స్థలము: మీనాక్షి లుబ్ధావధాన్ల కూతురు. బాల వితంతువు. శరీర చాపల్యం తట్టుకోలేక చిరుతిరుగుళ్ళకు అలవాటు పడింది. రామప్ప

పంతులు పెళ్ళిచేసుకుంటానంటే ఆశపడి తన శరీరాన్నిచ్చింది. అతడు మోసం చేస్తున్నాడు. ఆ విషయం మధురవాణితో చెబుతున్నది:

**మీనాక్షి:—** పంతులు నన్ను కౌగిలించుకొని యెత్తుకుంటే మా నాన్న చూసి తన్ని యిద్దర్నీ యింట్లోంచి తగిలేశాడు. నువ్వు హెడ్డు కానిస్టేబులుతో పోతున్నావు, నిన్నొదిలేసి నన్ను పెళ్ళాడతానని ఒట్టేసుకున్నాడు. నన్ను లేవదీసికొచ్చి, నన్ను పెళ్ళాడక తప్పుతుందా యేమిటి?

ఈ ఘట్టముయొక్క పూర్వాపరాలు చదివింతర్వాత యీ వాక్యాలు చదివి నప్పుడు కళ్ళవెంట నీళ్ళు బొటబొటరాల్తాయి. అంతబాగా ఉందీఘట్టం! ఇప్పటి వఱకూ దుఃఖ భాజనమైన యీమె జీవితంలో ఒక్క ఆశ చిగిర్చి మళ్ళీ వాడి పోయింది. ఇది కరుణరస పూరితం. ఆ తరువాత యిక్కడే రామప్పపంతులికి జరిగిన శాస్తి హాస్యరస పూరితం!

ఇక మధురవాణి దగ్గఱ చూద్దాం:

**తృతీయాంకము 1—వ స్థలము. రామప్పతో మధురవాణి:—** లుబ్ధావధాన్ల పెళ్ళి తప్పిస్తేగాని నేను ముద్దుపెట్టుకోనివ్వను. 2. ఈ పెళ్ళి మాన్పించకపోతే నేను మీతో మాట్లాడను.

ఇది సుబ్బిమీది వాత్సల్యంతో కూడిన సానుభూతి. వట్టి సానుభూతి కాదు ఈ పెళ్ళి తప్పించటానికి నిస్వార్థంగా తెఱవెనుక భాగోతం ఆడిస్తుంది. ఇదంతా పొర్పు, హాస్యం.

ద్వితీయాంకం 1—వ స్థలంలో వెంకమ్మ ఆర్తనాదంతో ప్రారంభమైన అంతర్గత కరుణ రసధార, షష్ఠాంకంలో 1—వ స్థలంలో, ఒక్క క్షణం ఆగి పోతుంది. ఎలాగో చూడండి: తన అన్న కరటకశాస్త్రి వేసిన పథకం పాటి, తన కూతురు సుబ్బితో గాక, మాయసుబ్బితో జరిగిపోయిన లుబ్ధావధాన్ల పెళ్ళి విషయం విన్న తరువాత ఒక తల్లిగా ఇంతకాలము క్రుంగి కూలారి ఇప్పుడు పొంగి వస్తున్న ఆనందాన్ని తమాయించుకొని, ఏమీ తెలియనట్లున్న వ్యంగ్య ధోరణితో, తన భర్త అగ్నిహోత్రావధాన్లతో వెంకమ్మ ఇలా అంటుంది:

**వెంకమ్మ—** "మన ప్రాలుబ్ధం—నేనోచిన నోములు ఇలా ఉండగా మరోలా ఎలాఅవుతుంది? యీ సమ్మంధం వొద్దని పోరితే విన్నారూ! నేను భయపడుతూనే

ఉన్నాను. బయల్దేరేటప్పుడు పిల్లి యెదురుగుండా వచ్చింది." అని.

వెంకమ్మ సూత్ర హృదయంలో గూడుకట్టిన కరుణరసం ఒక్కసారి ఆవిరై, హాస్యరసం పొగలు చిమ్ముతుందిక్కడ! మళ్ళీ లుబ్ధావధాన్లు కూనీకేసులో ఇరుక్కున్న ట్రాజెడీ ప్రారంభమౌతుంది!

అద్భుత రసము

నాటకాంతంలో అద్భుతరసముండాలని లాక్షణికుల పక్కణ. అప్పారావు గారు దీనిని చక్కగా పాటించినారు. సప్తమాంకము, 2వ స్థలము. లుబ్ధావధాన్లు ఇరుక్కున్న కూనీ కేసును మధురవాణి తేలగొట్టిన విధమిది:

మధుర:- తెల్లబియ్యం పాటిమానికా- లుబ్ధావధాన్లుగారు వివాహమైన పిల్ల ఆడపిల్లకాదు.

సౌజ:- (ఆశ్చర్యముతో) యేమిటీ!

మధుర:- కరటకశాస్తుర్లుగారు వారి శిష్యుడికి ఆడవేషంవేసి పెళ్ళి చేశారు.

సౌజ:- కరటకశాస్తుర్లా గుంటూరు శాస్తుల్లు!

దాంపత్య శృంగారం

గురజాడవారు తమ డైరీలలో 1895 ఏప్రిల్ 29, సోమవారంనాడు శాకుంతల పఠనం సందర్భంలో వ్రాసికొన్న నోట్సులో ఇలా అంటారు:

"కాళిదాసుని నాటకములు శృంగారమునకే ప్రసిద్ధి. నాటకములలో దాంపత్య శృంగారము, సంఘటనలు తక్కువ అని" (పుట. 117)

అప్పారావుగారు ఈ నాటకంలో ఆ ప్రయోగం చేశారు. తృతీయాంకం 4వ స్థలంలో, బుచ్చమ్మగనక తనతో లేచిపోయివచ్చి తన్ను పెళ్ళి చేసుకుంటే తాను ఉద్యోగంచేసి డబ్బు సంపాదిస్తాను. దాన్తో ఇళ్ళు వాకిళ్ళు, పిల్లలు. ఉయ్యాల జంపాల, ఇవ్వన్నీ ఏర్పాటుచేసుకోవాలిగదా- ఇలా కాల్పనికజగత్తులో తమ దాంపత్య శృంగారాన్ని గూర్చి ఊదరగొడతాడు గిరీశం. ఇది చాలా ఊహా రమణీయమైన రసవత్తరమైన ఘట్టం.

అగ్నిహోత్రావధాన్లు లుబ్ధుణ్ణి తన్నిన ఘట్టంలో రౌద్రము, మధురవాణి పరిణతచిత్తయై సౌజన్యారావును ఆశ్రయించి గీతను చేబట్టిన ఘట్టమున శాంతము- ఇట్లా నానా రసోల్లాసియై ప్రశాంత పరిణామము పొందిన నాటకమిది!

## కన్యాశుల్కం నాటకము - విశేషవిమర్శనము

### గురజాడ వాల్మీకి

ఇది యెప్పుడో యెవరో ఒక మహనీయుడన్నమాట, యెంత సత్యము: వాల్మీకి ముని శోకము శ్లోకమైనట్లు గురజాడ హృదయము మన సాంఘిక దురాచారములకు కుదిలి కరుణరసపుజల్లు కురిసినది. అది తొలుత పుత్తడిబొమ్మ పూర్ణమ్మను అభిషేకించినది. ఆ పూర్ణమ్మ యొక్క ఆత్మయే బుచ్చమ్మలో ప్రవేశించి, కన్యాశుల్క నాటకమున అంతర్వాహినియైన కరుణరసధారను ప్రవహింపజేసినది. ఇదీ ఈ నాటకము నందలి ఆంతరిక జీవలక్షణము!

### పాత్రచిత్రణ

పాత్ర చిత్రణలో గురజాడ వారిదొక ప్రత్యేకమైన సృష్టి. ప్రతి పాత్రలోనూ జీవకళ ఉట్టిపడుతూ ఉంటుంది. మానవ స్వభావంలో ఉన్న కీలక లక్షణాలన్నీ సమీకరించి, ఒక్కొక్క పాత్రలో ఒక్కొక్క జీవలక్షణాన్ని పొదిపి ఒక చిత్రమైన చిన్న ప్రపంచాన్ని సృష్టించారు. ఈ పాత్రలన్నీ చిరంజీవిత్వాన్ని సంతరించుకొన్నవి.

### సౌజన్యారావు

ఉత్తమ లక్షణాలన్నీ మూర్తీభవించిన పాత్ర యిది. పేరుకు తగ్గట్టు చక్కని సౌజన్యము, సత్యసంధత, ఉత్తమ శీలసంపద, దయా గుణముగల వ్యక్తి. లుబ్ధావధాన్లను కాపాడటంలో అతడు చేసిన ప్రయత్నం అతని పరోపకార పారీణతను వెల్లడిస్తున్నది. మధురవాణికి మార్గోపదేశం చేసిన మాన్యవరుడు. అతనికి భగవద్గీత నిత్య పారాయణ గ్రంథం. అసలీనాటకము గీతా మాహాత్మ్యమును వెల్లడించుటతో ముగియుట గురజాడవారి సంస్కృతీ ధర్మదీక్షను వ్యక్తం చేస్తున్నది.

### గిరీశం

ఇతడొక విజ్ఞాన సర్వస్వం. యోగభ్రష్టుడు. గురజాడ ఈ పాత్రను ఎంత అద్భుతంగా చిత్రించారంటే కన్యాశుల్కం చదివిన వారికి గిరీశం జ్ఞాపకమున్నంతగా తక్కిన పాత్రలుండవు. సకల సద్గుణ గరిష్ఠుడైన సౌజన్యారావు పాత్రకంటె ఈ యోగభ్రష్టుడే జ్ఞాపకం ఉండేటట్లు చిత్రించటంలో మన మహాకవి యొక్క అంతర్యం బోధపడదు! ఇత డెటువంటి వాడైనా ఇతడిచేత సందర్భానుసారంగా మన ప్రాచీన గ్రంథాలను ఉట్టంకింపజేసి, అందలి ప్రతిపాదితాంశాలను ఆ పాత్ర

గోరణిలో చెప్పించినట్లు కనిపించి, మరుక్షణంలో ధ్వని కక్ష్యలో వాటి సరియైన తత్త్వాన్ని మన హృదయానికి హత్తుకొనేటట్లు చేసి, సన్నివేశానికి ఒక గొప్ప దీప్తిని సేకూర్చటం జరుగుతుంది. చిత్రమేమంటే అతని మాటల్లో కలుపు మొక్క లెక్కువ. ఆ మధ్యలో ఈ ఓషధులు దాగి ఉంటాయి. ఇదొక విలక్షణమైన మహాశిల్పం ఈ నాటకంలో ఉంది!

కన్యాశుల్కంలో విరళంగా హిందీ భాష యొక్క, బహుళంగా ఇంగ్లీషు సంస్కృత భాషల యొక్క ప్రభావము, వాతావరణము కనిపిస్తుంది. విజయ నగర సంస్థానాధీశ్వరులకు మొట్టమొదటి నుండి కాశీ, జైపూర్ వంటి ఉత్తర హిందూస్థానం ప్రాంతాలతో సంబంధ బాంధవ్యాలున్నాయి. ఆనంద గజపతి తండ్రిగారైన విజయరామ గజపతి (1825-1879) 1870 ప్రాంతంలోనే తులసీ రామాయణాన్ని మండకామేశ్వర కవిచేత తెలుగులో పద్య కావ్యంగా అనువదింప జేశారు. ఆనంద గజపతి మహారాజావారు (1850-1897) తఱచుగా ఉత్తరదేశ యాత్రలకు వెళ్ళినప్పుడు వారితోపాటు అప్పారావుగారు కూడ వెళుతూ ఉండటం కద్దు. ఆ సందర్భాల్లో హిందీ భాషా ప్రభావం అప్పారావుగారికి సోకింది. అందు వల్ల కన్యాశుల్కంలో ఆ భాషా వాతావరణం కొద్దిగా కనిపిస్తుందని చెప్పవచ్చు. ఇంగ్లీషు భాషా వాతావరణం అధికంగా ఉండటాన్ని గూర్చి విశేషించి చెప్ప వలసిందిలేదు. ఒక్క ముక్కలో అది కాలప్రభావమని చెబితే సరిపోతుంది. ఇక సంస్కృత భాషా వాతావరణాన్ని గూర్చి కొంత విపులంగానే చెప్పాలి. "క్రొత్తపాతల మేలికలయిక క్రొమ్మెఱుంగులుజిమ్మగా" అన్నది అప్పారావుగారి ఆదర్శం. దానికనుగుణంగా అటు ఆంగ్ల వాతావరణాన్ని, ఇటు సంస్కృత వాతావరణాన్ని సమ్మిశ్రితంచేసి యీ నాటకాన్ని నిర్మించారు. ఆంగ్లవాతావరణం దీనికి భౌతిక సౌందర్యమైతే సంస్కృత వాతావరణం ఆత్మ సౌందర్యమని నిష్కర్ష చేయవచ్చు. అప్పారావుగారి ఆత్మజ్ఞాన సంపన్నత గాని, ఆర్ష హృదయం గాని మేధావిలసనం గాని యీ ఆత్మ సౌందర్యాన్ని నిక్షిప్తం చేయటంలోనే ఉన్నది. ఈ సౌందర్య తత్త్వాన్ని హృదయ పర్వంగా ఆస్వాదింపగల పాఠకునకు ఈ నాటక మొక సంస్కృతీ ఖండంగా సాక్షాత్కరిస్తుంది. ఆ మహా కవికి మంగళనీరాజనాలు!

*___*

కన్యాశుల్కం నాటకము - విశేషవిమర్శనము

అనుబంధము

కన్యాశుల్క నాటకంలో సజీవమైన వ్యావహారిక భాష సాక్షాత్కరిస్తుంది. ఇంతగా మెఱుగులు జిమ్మే వ్యావహారిక భాష ఆధునిక వాఙ్మయంలో మరొకచోట లేదన్నది నిష్కర్ష. నన్నయ్యయే గనుక తన వచనాన్ని వ్యావహారిక భాషలో వ్రాసి ఉన్నట్లయితే యెలా ఉండేదో అలాంటి వ్యావహారిక భాష యిదని అనిపిస్తుంది. గురజాడవారు వ్రాసిన గ్రాంథిక భాష నన్నయగారి భాషకు దగ్గఱగా ఉంటుందేమో కూడ పరిశీలించాలి. ఇలా తుల నాత్మకంగా పరిశీలించిన పిమ్మట ఈ భాషలో దాగి ఉన్న వ్యాకరణాంశాల్ని వెలికి తీయటం అవసరం.

ఈ నాటకాన్ని ప్రదర్శించే నటులు శాకుంతలం, మాలతీ మాధవం, మృచ్ఛకటికం నాటకాల్ని కూడ తప్పక చదవాలి. అప్పుడు ఈ నాటక ప్రదర్శనలో మఱెంత ఉదాత్తను తీసికొని రావచ్చునని మనవి చేయటమైనది.

---

1. ''కన్యాశుల్కంలో శాకుంతలం ఛాయలు" అన్న పేరుతో ఆభాగం మాత్రం ''ఆంధ్రప్రభ" తెలుగు దినపత్రిక, గురువారం, 1978 మార్చి 2వ తేదీ సంచికలో "సాహిత్యప్రభ" అను శీర్షికక్రింద ప్రచురింప బడింది.

2. శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ, సికిందరాబాదు వారి ఆధ్వర్యంలో "యువభారతి" అధ్యక్షులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారి అధ్యక్షతన ది. 6 మార్చి 1983 ఆదివారం సాయంకాలము 6 గంటలకు జరిగిన ''సమాలోచనం'' అను గోష్ఠిలో "గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కం" అను విషయంపై ప్రసంగింపబడింది.

3. "నందిని'' యువభారతి మాసపత్రిక ఏప్రిల్, 1983 నాటి సంచికలో "సమాలోచన సమీక్ష" అను శీర్షిక క్రింద సదరు ప్రసంగ సారాంశం సంక్షిప్తంగా ప్రచురింపబడింది.

4. "యువభారతి'' సాహితీ సాంస్కృతిక సంస్థవారు "దశరూపక సందర్శనం'' పేరుతో అక్టోబరు 15, 1984 తేదీనాడు విడుదల చేసిన ప్రసిద్ధిచెందిన పది తెలుగు నాటకాలపై ఉపన్యాస సంకలన గ్రంథంలో "కన్యాశుల్కం'' అన్న శీర్షికన ఈ సమగ్ర ప్రసంగ వ్యాసం ప్రచురింపబడింది.

ప్రాచీనకవితలో

# శృంగారము - ఔచిత్యపాలనము

మన ప్రాచీన సాహిత్యంలో అటు కవులుగాని, ఇటు ఆలంకారికులుగాని నవరసాల్లో శృంగారానికే పట్టాభిషేకం చేసినట్లు కనబడుతుంది. ఈ సృష్టికి మూలభూతమైంది శృంగారం కావటమే దీనికి కారణం. సంస్కృతంలో కాళిదాసాది మహాకవులు ఉదాత్తమైన, మధురమైన, ఔచిత్యపూరితమైన శృంగారాన్నే పోషించారు. ఆమాటకొస్తే సంస్కృతంలో ఒక్క "హర్షనైషధం"తప్ప నిలువెల్లా శృంగార రస ప్రధానమైన కావ్యాలు అంతగాలేవనే చెప్పాలి.

తెలుగులో మనకు ఆదికవి, ఆదర్శకవి అయిన నన్నయగారు, తిక్కన్న, ఎఱ్ఱన్న, నాచనసోమన్న, నన్నెచోడుడు, పోతన్న మొదలైన అగ్రశ్రేణికి చెందిన మొదటితరం కవులుగాని, వాల్మీకి వ్యాసకాళిదాసాది మహాకవుల అడుగుజాడల్లో ఉదాత్తమైన శృంగారాన్నే పోషించారుగాని అంతకుమించిన దశకు పోలేదు. ఈ నన్నయగారి పద్యం చిత్తగించండి :

ఎందలిదానవేకతమయియ్యమునానది నోడనల్పుచున్
సుందరి! నీకు నున్కియిది చూడగ దానుచితంబె? నావుడున్
మందమనోజ్ఞహాసముఖమండలమెత్తి మృగాక్షిచూచి సం
క్రందన సన్నిభున్ నృపతిఁ గన్యక యిట్లనివల్కెఁ బ్రీతితోన్

శంతనుడు సత్యవతిని మొట్టమొదట చూచినప్పుడు పల్కరించిన సందర్భమిది. ఇందులో "సుందరి" అని శంతనుడు చేసిన సంబోధనను బట్టి అతడి హృదయంలో తనపై అనురాగం అంకురించిందని గ్రహించి, "మృగాక్షి" అయిన సత్యవతి "మందమనోజ్ఞ హాసముఖమండలమెత్తి సంక్రందన సన్నిభుడైన అతణ్ణి చూసి" తన అంగీకారాన్ని తెలిపింది. వ్యంగ్యవైభవోపేతమైన ఒక్క మెఱుపుతో అద్భుతమైన శృంగార రసాన్ని వెలయించిన మహనీయుడు నన్నయ. ఈ తరం కవులందరు ఇంతే. ఇదీ ఉదాత్తమైన శృంగారమంటే. వీళ్ళు పోషించిన శృంగారాన్ని సాత్విక శృంగారమని సంకేతించటం లెస్స.

## ప్రాచీనకవితలో శృంగారము — ఔచిత్యపాలనము

నన్నయకు ఇంచుమించు సమకాలికుడైన భోజుడు తాను రచించిన రెండు అలంకార శాస్త్రగ్రంథాల్లో ఒక దానికి "శృంగారప్రకాశ" అని పేరు పెట్టటమేగాక అందులో "శృంగార ఏవ ఏకోరసః" రసమంటే శృంగార రసమొక్కటేనయ్యా అని సిద్ధాంతీకరించాడు. (అతని రెండవ గ్రథంపేరు సరస్వతీ కంఠాభరణం).

ఇది నన్నయాది మహాకవుల్ని అంతగా ప్రభావితంచేసినట్లు కాన్పించదు. కారణం వారి మానసిక ప్రవృత్తి, వారు వ్రాయటానికి స్వీకరించిన గ్రంథాలు, ఆనాటి సామాజిక పరిస్థితులు కావచ్చు.

భోజుని యీరససిద్ధాంతాన్ని నరాసరి అందిపుచ్చుకొన్న మహాకవి శ్రీనాథుడు! ఈతడు సంస్కృతంలో ఉన్న శృంగారరస ప్రధానమైన హర్షనైషధాన్ని ఆంధ్రీకరించి, దానికి భోజుని "శృంగారప్రకాశ" ను దృష్టిలో పెట్టుకొని "శృంగార నైషధం" అని నామకరణం చేశాడు. దీన్ని చూసి పిల్లలమఱ్ఱిపినవీరభద్రుడు తన కావ్యానికి "శృంగార శాకుంతలం" అని పేరుపెట్టడం గమనార్హం. ఈ విధంగా తెలుగు సాహిత్యమార్గంలో "శృంగార" శబ్దాన్ని కొట్టవచ్చినట్లు కనబడే ఒక మైలు రాయిగా నాటి పూర్వకవుల కంటె రెండడుగులు ముందుకువేసి శృంగారరసాన్ని పోషించినవాడు శ్రీనాథుడే! అయితే యితడు ఔచిత్యమనే చెలియలికట్టను దాటినట్లు కనబడదు. నైషధాన్ని ఆంధ్రీకరిస్తూ "ఔచిత్యంబు పాటించియు, అనౌచిత్యంబు పరిహరించియు" వ్రాస్తానని ప్రకటించాడు. మొత్తంమీద ఆ ప్రతిజ్ఞను నిలబెట్టుకున్నాడు గూడ. "అనౌచిత్యాన్నిమించిన రసభంగ హేతువు మఱొకటిలేదని, ఔచిత్యమేరసనిర్దేశానికి పరమరహస్యమని" ఆనందవర్ధనుడు తన "ధ్వన్యాలోకం" లోను, "ఔచిత్యమే రససిద్ధిపొందిన కావ్యానికి ప్రాణమని" క్షేమేంద్రుడు తన "ఔచిత్యవిచార చర్చ" లోను చెప్పిన యీ రెండు పారిభాషిక పదాలను ఈ విధంగా తెలుగుసాహిత్యంలోకి తెచ్చినవాడు కూడ శ్రీనాథుడే. ఏమైనా ఈతడు స్వతహాగా మంచిరసికుడు, మహాభోగికావటంవల్లను, తాను చేపట్టిన గ్రంథాలు కూడా రస ప్రధానమైనవి కావటంవల్లను, ఆనాటి సామాజిక వాతావరణం కలిసిరావటంవల్లను ఈతడి శృంగార రసపోషణలో కొంత రజోగుణం ప్రవేశించింది. ఈ తరానికి చెందిన జక్కన, పినవీరభద్రుడు, మంచన మొదలైన కవుల్లో కూడ ఈ లక్షణాలు కనబడతాయి. మరీ రాసిక్యం చిప్పిల్లే పద్యాల జోలికిపోకుండా ఒక చిన్నపద్యం

తీసుకుందాం. ఈ శ్రీనాథుడి పద్యం ఆలకించండి :

"ఆనంద బాష్పధారల । వానకు బులకముల యుద్భవమునకు దగన
మ్మానిని గదంబ లతికకు । దానెచ్చెలివోలెనుండె(దదవసరమునన్"

నలుడు దిక్పాలకుల పక్షానదమయంతి దగ్గఱికి రాయబారిగా వెళ్ళి వాళ్ళల్లో ఎవర్నో ఒకరిని చేపట్టమని నచ్చచెబుతాడు. కాదు; నలుణ్ణిదప్ప అన్యుణ్ణి వరించ నని ఆమె అంటుంది. ఇలా కొంత సంభాషణ అయినతరువాత అసలు నీవెవరవని నిగ్గదీస్తుంది. నలుణ్ణని చెబుతాడు. ఆమె వెంటనే లజ్జాభరితయై సంభ్రమంతో తెఱ చాటుకివెళ్తుంది. ఆసందర్భంలోని పద్యమిది: "ఆనందబాష్పధారలకు తడిసి ఆమె మేను పులకించిపోతుంది. వానకు తడిసి పువ్వులు విరిసిన కదంబపు తీగెకు తాను నెచ్చెలి అయిపోతుంది. రమణీయమైన ఊహ ఇది. చెప్పింది ఉపమాలంకారమే గాని, అది సహృదయుడిభావనలో ఉత్ప్రేక్షయో, రూపకమో అయిపోతుంది. ఇక్కడొక అద్భుతమైన ధ్వని ఉంది. తీగె అనంగానే అది అల్లుకోవటానికి ఒక చెట్టు డాలి. ఆ చెట్టు నలుడు. ఆకుతుంచితే పాలు గారి నంత సుళువుగా, సున్నితంగా రసం చిందించాడు మహాకవి ఇక్కడ. ఇలా సాత్త్విక శృంగారం అక్కడక్కడా ఉన్నా, ఔచిత్యానికి లోబడిన రజోగుణ రంజిత శృంగారమే యెక్కువగా పోషింప బడటం వల్ల యీ రెండవ తరం కవుల శృంగారాన్ని రజోగుణ మిళిత సాత్త్విక శృంగార మనటం సమంజసం.

ఇక ప్రబంధకవుల తరం నాటికి శృంగారం ఏవో కొన్ని సందర్భాలు మినహాయిస్తే దాదాపు పూర్తిగా రజోగుణ సంపన్నమైపోయిందని చెప్పవచ్చు. దీనికి ప్రధానంగా రెండు కారణాలు కనిపిస్తాయి, ఒకటి - రాయలనాటి రసికత. రెండు - కవులు పూర్తిగా స్వతంత్ర మార్గం త్రొక్కటం. శ్రీనాథుడి వఱకు వెలసిన కావ్యాలన్నీ ప్రాయికంగా సంస్కృత కావ్యాలకు అనువాదాలే. ప్రబంధయుగంలో వెలసిన కావ్యాలన్నీ వస్తునిర్మాణంలో, ఇతివృత్త నిర్వహణలో, పద్యశిల్పంలో, రస పోషణలో తెలుగు కవుల ప్రతిభా ప్రభావిలసితాలు. ఆలంకారికులు శృంగారం ఎన్ని విధాలుగా ఉంటుందని విశ్లేషించారో దాదాపు అన్ని విధాలైన శృంగారం ప్రబంధాల్లో పోషింపబడింది. అయితే అది ఔచిత్యపు టంచులు దాటలేదని నిష్కర్షగాచెప్పవచ్చు

పెద్దనగారి మనుచరిత్రలో శృంగారానికి ప్రతీకగా వరూధినీ పాత్రను

వైరాగ్యానికి ప్రతీకగా ప్రవరుడి పాత్రను సృష్టించి యీ రెండింటికీ జరిగిన చమత్కార జనకమైన, రమణీయమైన సంఘర్షణచే చివరికి వైరాగ్యం యొక్క గెలుపును సూచించటం జరిగింది. ఇదీ యీ ప్రబంధమందలి యితివృత్త ధర్మం. ఇక శృంగార రసపోషణలో పెద్దనగారి చాతుర్యానికి ఒక పద్యం తీసు కుందాము:

తొంగలిరెప్పలందొలగ ద్రోయుచు బైపయి విస్తరిల్లుక
న్నుంగవ యాక్రమించుకొనునో ముఖచంద్రు నటంచుబోవనీ
కంగజుడానపెట్టి కదియన్ గుణి వ్రాసెననంగజాతి సా
రంగమదంబులేజెమట గ్రమ్మెలలాటముడిగ్గి చెక్కులన్

వరూధిని ప్రవరుణ్ణి చూసిన సందర్భంలోని పద్యమిది. ఆమె పెట్టుకొన్న కస్తూరీ తిలకం చెమటకు కరిగి చెక్కుల మీదికి జారింది. దాన్ని ఉత్ప్రేక్షించాడు పెద్దన. ప్రవరుడి అందాన్ని కన్నులువికసింప కాంతి పెల్లుబికించి చూచింది అయినా తనివితీరలేదు. మరింత పెద్దవిచేసి తెలినిగ్గులు వెల్లువలు కట్టేటట్లు చూసింది, అయినా తృప్తి తీరక ముఖమంతా కళ్ళుచేసుకొని చూస్తున్నది! ఇక లాభం లేదని గ్రహించిన మన్మథుడు ఆమె కనుదమ్ములు ఇంకా మఱింత విస్తరించటానికి వీల్లేకుండా అడ్డుకట్టగా పెట్టిన గుర్తులా అన్నట్లు ఉన్నయ్యిట ఆ కరిగి చెక్కుల మీదికి జారిన కస్తూరిరేఖలు! ఇక్కడ "స్వేదము" అనే సాత్విక భావంద్వారా శృంగార రసాన్ని ఔచిత్య శోభితంగా పోషించాడు మహాకవి పెద్దన!

రామరాజభూషణుని వసుచరిత్రలో శుక్తిమతీ కోలాహలుల శృంగారం రమ్యంగా చిందులు త్రొక్కింది. నందితిమ్మన పారిజాతాపహరణంలో ఈర్ష్యా విప్రలంభ శృంగారం ఉదాత్తంగా పోషింపబడింది. పింగళిసూరన కళాపూర్ణోదయంలో అయిదు విధాలైన శృంగారం మాధుర్యాన్ని సంతరించుకొన్నది. అందులో సుగాత్రీశాలీనుల శృంగారం సహజ మాధుర్యానికి, ఔచిత్యానికి పరాకాష్ఠ అనటం మామూలు మాట! సంకుసాల నృసింహకవి "కవి కర్ణరసాయనం" లో ఒక వైపు శృంగారము, మఱొకవైపు వైరాగ్యము సమాంతర రేఖలపై ఔచిత్య శోభితంగా తీగెలు సాగింది. మొత్తంమీద ఈ ప్రబంధకవులు పోషించిన శృంగార రసం ఔచిత్యపుటంచులు దాటని రజోగుణసంపన్నమైన దనటం లెస్స.

దక్షిణాంధ్ర సాహిత్యయుగంలో పుట్టిన ప్రబంధాల్లో చేమకూర వేంకటకవి విజయవిలాసం అగ్రగణ్యమైంది. ఇందులో ఉలూపి, చిత్రాంగద, సుభద్రల వివాహాలనే మూడు విలాసాలున్నాయి. ఇవి ఒకదానికంటె నొకటి వైచిత్ర్యాన్ని సంతరించుకొన్నాయి. ఈ ప్రబంధం అతివేలమైన శృంగారానికి ప్రసిద్ధిచెందిందని భావించటం కద్దు. కాని అతి సుకుమారమైన శృంగారరసాన్ని చిందించిన సందర్భాలు కూడ లేకపోలేదు. ఈ పద్యం చూడండి:-

మ. తనకుం గౌగిలి యీవొకప్పుడును నాథా! నీకరస్పర్శనం
బున గిల్గింతలె యుంచెఁ బద్మిని కరాంభోజంబులన్ మందమం
ద సటద్వాయు చలద్దళాంగుళులు గన్పట్టంగ నవ్వేళ్లు రా
యని రారా యని పిల్చెనా దగె ద్విరేఫాద్యంత దీర్ఘధ్వనుల్

చిత్రాంగద చెలికత్తెలతో ఉద్యానవనానికొచ్చింది. అర్జునుడు కూడ తన చెలికాడైన విశారదుడితో ఆమెను వెంబడించి అక్కడికొచ్చాడు. అతడామెను చూశాడన్నది స్పష్టం. ఆమె అతణ్ణి చూసిందోలేదో తెలియదు. చూసే ఉంటుందని భావించటం లెస్స. ఆమె కాసేపు విహరించి అక్కడున్న సరస్సులో జలకమాడి వెళ్ళిపోయింది. అర్జునుడా సరస్సును సమీపించి ఆ సరోవరలక్ష్మిలో చిత్రాంగదా సౌందర్యలక్ష్మిని ఊహించుకొని ప్రక్కనే విశారదుడున్నాడన్న స్పృహకూడ లేకుండా ఒకానొక తమకంలో వ్యక్తంచేసిన భావమే యీ పద్యం.

ఇందులో "పద్మిని" అన్న ప్రయోగం మిక్కిలి కీలకమైంది. అంటే సరోవరలక్ష్మి అని యర్థం. ఈమె సూర్యకిరణ స్పర్శకు వికసించి విడివడిన తమ్మి పూరేకులు అను వ్రేళ్ళలో — మెల్లగా వీస్తున్న పిల్లతెమ్మెరల తాకిడికి కదలుతున్న వ్రేళ్ళతో — సూర్యుణ్ణి పిలుస్తూ తమపై వ్రాలుతున్న తుమ్మెదల ఝుంకార ధ్వనులనే మాటలతో నాథా! అని సంబోధిస్తూ ఎల్లప్పుడూ నీ కిరణ స్పర్శచే గిలిగింతలు పెడుదువేగాని ఒక్కసారిగూడ కౌగిలి యీయవుగదా యని వాపోవుచున్నట్లున్నదట!

మాటవరుసకి ఈ పద్యం చెప్పింది అర్జునుడే అయినా వాస్తవానికి కవి దీనిని "పద్మిని"చేత పలికించినట్లు పలికించటం గమనార్హం. పద్మిని అంటే సరోవరలక్ష్మి. ఆమెలో చిత్రాంగదా రూపసౌందర్యలక్ష్మిని ఊహిస్తున్న అర్జునుడికి ఇది చిత్రాంగదయే

తనతో అంటున్నట్లు స్ఫురించింది! తాను దానిని ప్రతిధ్వనిస్తున్నట్లు ఈ పద్య భావాన్ని వ్యక్తంచేశాడని వ్యంగ్యార్థం! అద్భుతమైన పద్యమిది. ఒకే పద్యంలో నాయికానాయకుల హృదయాల్లో యుగపదుద్భూతమైన విప్రలంభ శృంగారం మధురంగా పోషింపబడింది. ఇదీ శృంగార పోషణలో ఔచిత్యమంటే!

ఈ యుగంలోనే వెలసిన ముద్దుపళని "రాధికాసాంత్వనం"లో శృంగారం మితిమీరింది! గోదాదేవి గానం చేసిన "తిరుప్పావై"కి ఆమె చేసిన అనువాదం మాత్రం ఉదాత్త శృంగార భక్తి రసగుళిక! వీళ్ళిద్దర్నీ మినహాయిస్తే ఈయుగంలో వెలసిన శృంగారమంతా తమోగుణ భరిత మైందని నిష్కర్షగా చెప్పవచ్చు. ఇక్కడి యక్షగాన సాహిత్యంలో వెల్లివిరిసిన శృంగారం కూడ ఆస్వాదనీయమే.

గోల్కొండ కుతుబ్షాల కాలంనాటి సాహిత్యంలో శృంగార కావ్యాలుగా పేర్గొన వలసినవాటిల్లో అద్దంకి గంగాధరకవి "తపతీ సంవరణోపాఖ్యానం", పొన్నిగంటి తెలగన్న "యయాతి చరిత్ర", సారంగు తమ్మయ్య "వైజయంతీ విలాసం" ప్రధానమైనవి:

ఆవిప్రోత్తము వజ్రపంజర నిభంబై నిశ్చలంబైన స
ద్భావం బంగన సాహచర్య గుణ సంపర్కంబునన్ లోహమై
గ్రావంబై దృఢదారువై తరుణ వృక్షంబై ఫలప్రాయమై
పూవై తన్మకరందమై కరఁగెఁబోఁబో నీళ్ళకుంబల్చనై.

సారంగుతమ్మయ్య వైజయంతీ విలాసంలోని పద్యమిది. దేవదేవి విప్రనారాయణుణ్ణి లొంగదీసుకుంటున్నప్పుడు అతని మనస్సు క్రమక్రమంగా వివిధ దశల్లో ఎట్టి మనో వికారానికి గురియై సుడులుతిరిగిందో చెప్పిన రమణీయమైన మహాపద్యమిది!

ఈవిధంగా నన్నయ్యనుండి తమ్మయ్య దాకా అటనుండి చేమకూర వెంకన్న దాకా మన ప్రాచీనకవితలో శృంగార రసం ఔచిత్య భరితమై విలసిల్లింది!

---

ఆకాశవాణి, హైదరాబాదు కేంద్రంవారి సౌజన్యంతో
ప్రసారం తేది: 17-1-1986 శుక్రవారం.

రాజశేఖరః

# సంస్కృత సాహిత్యేతస్య స్థానమ్

## తెలుగు ప్రసంగ పాఠం

రాజశేఖరుడు క్రీస్తుశకం 9వ శతాబ్దం నాటివాడు. మహారాష్ట్ర ప్రాంతీయుడు. యాయావర గోత్రీకుడు. అందువల్ల యాయావరుడనే మారు పేరుకూడ ఈతనికి స్థిరపడింది. మధ్యదేశానికి రాజధానీనగరమైన కాన్యకుబ్జంలో ఆదేశపు రాజు నిర్భయ మహేంద్రపాలకుడికి ఉపాధ్యాయుడుగా ఉండేవాడు. ఆ తరువాత ఆతని కొడుకు మహీపాలుడి దగ్గఱ ఆస్థానకవిగా ఉండినవాడు. ఈతని భార్యపేరు అవంతి సుందరి. మహా పండితురాలు. సాహిత్య శాస్త్రానికి సంబంధించి యీామె కున్న అభిప్రాయాల్ని చేర్చి రాజశేఖరుడు తన కావ్యమీమాంసలో మూడుచోట్ల ఉల్లేఖించటం జరిగింది. ఇతడు మొత్తం తొమ్మిదిగ్రంథాలు వ్రాసినట్లు ప్రతీతి. అందులో "బాలరామాయణం", "బాలభారతం", "విద్ధశాల భంజికలు" అనే సంస్కృత రూపకత్రయం, "కర్పూర మంజరి" అనే ప్రాకృతనాటకం, "కావ్యమీమాంస" అనే సాహిత్యశాస్త్రగ్రంథము – ఈ ఐదు మాత్రమే యిప్పుడు లభిస్తున్నాయి. "భువన కోశము" (ఇది భూగోళశాస్త్రం) "హరవిలాసము," "కవి విమర్శనము," ఒక "నిఘం టువు" కూడ వ్రాసినట్లు దాఖలాఉన్నది. కాని అవి ఖిలమైపోయినవి. ఈతని గ్రంథాల్లో కావ్యమీమాంస చాలా గొప్పగ్రంథం. ఇందులో భారతదేశ సమగ్ర స్వరూపాన్ని, ప్రజాజీవితాన్ని, సంస్కృతిని, వివిధభాషల స్వరూపస్వభావాల్ని అద్దంపట్టినట్లు సమన్వయాత్మకంగా చిత్రించాడు. ఈ గ్రంథమొక విజ్ఞాన సర్వస్వం.

వాల్మీకియే భర్తృమేంఠుడుగాను, భవభూతిగాను, రాజశేఖరుడు గాను అవతరించినట్లు కొన్ని శ్లోకాలే ప్రచారంలో ఉన్నవి. ఈ ప్రశంస కావ్యమీమాంసను బట్టి వచ్చిందని భావింపవచ్చు. సాహిత్యానికి శాస్త్రస్థాయిని కల్పించి ఒక నూతన దృక్పథంతో ప్రతిపాదించిన మహనీయుడు. సాహిత్యానికి, సమాజానికి ఉన్న సంబంధం, "సామాజికస్పృహ" మొదలైన విషయాల్ని ఆనాడే ప్రతిపాదించిన మహానుభావుడు. స్త్రీ పురుష భేదాలు, వర్ణవర్గభేదాలు లేకుండా అందరూ సరస్వతీ

దేవి దయకు పాత్రులై విద్యావంతులుగా సాహిత్యపరులుగా రాణించాలని మంగళా శాసనంచేసిన మహితాత్ముడు. రాజశేఖరునికి తరువాత వచ్చిన అభినవగుప్త, క్షేమేంద్ర, భోజరాజాది అలంకారికులు ఈతని గ్రంథాల్ని ప్రమాణంగా శిరసా వహించారు. ఎందరెందరో మహాకవులు ఇతణ్ణి బహుధా ప్రశంసించారు. ఇతడు కవి రాజ బిరుదాంకితుడు. బహు భాషల్లో, అనేక రసాల్లో, విభిన్న సాహిత్యప్రక్రియల్లో గ్రంథాలు వ్రాసిన వ్యక్తినే కవిరాజు అంటారు. కవిరాజు మహాకవికంటె కూడ గొప్పవాడు. రాజశేఖరుడు కవిరాజు।

సంస్కృత ప్రసంగపాఠం

శ్లో॥ బభూవ వల్మీకభవః కవిః పురా, తతః ప్రపేదే భువిభర్తృమేణ్ఠతాం
స్థితః పునర్యో భవభూతిరేఖయా సవర్తతే సంప్రతి రాజశేఖరః।

వాల్మీకిరేవ అనంతరం భర్తృమేణ్ఠః, పశ్చాత్ భవభూతిర్భూత్వా, సంప్రతి రాజశేఖర రూపేణ విరాజతే, ఇతి కేనాఽపి దైవజ్ఞేన ఉక్తమితి, రాజశేఖరేణైవ కథితోఽయం శ్లోకః. అనేన శ్లోకేన ఇదం ప్రతీయతే, యత్ వాల్మీకి భర్తృమేణ్ఠ భవ భూతయః రాజశేఖర కవేః పూజాస్థానం భవంతీతి. అపిచ, స్వప్రతిభావ్యుత్పత్త్యోః, కావ్యనిర్మాణనైపుణ్యేచ రాజశేఖరస్య ఆత్మప్రత్యయోఽత్ర వ్యక్తీభవతి.

రాజశేఖరః మహారాష్ట్రాభిజనః, యాయావరగోత్రశ్చ. అనంతరకాలికైః కవిభిః యాయావరః ఇతి నామ్నైవ వ్యవహృతః. అయం కిల క్రీస్తోః పరం నవమ శతాబ్దస్య అంత్యే భాగే ఆసీదితి సాహిత్యచారిత్రకాణా మభిసంధిః. మధ్యదేశస్య రాజధానీనగరం కాన్యకుబ్జమధివసన్ తత్పరిపాలకస్య నిర్భయస్య హేంద్రపాలకస్య ఆచార్యక మన్వతిష్ఠత్. అనంతరం తత్పుత్రస్య మహీపాలస్య ఆస్థానే పండితపదవీమలం చకార. అస్య పత్నీ అవంతి సుందరీ, యా ఉత్తమశీల విద్యా సంస్కృతిసంపన్నా. సాహిత్యశాస్త్రవిషయే ఏతస్యాః మతం రాజశేఖరేణ కావ్యమీమాంసాయాం త్రిషు స్థానేషు ఉల్లేఖితం. ఇతి హేతోః అవంతి సుందర్యా కశ్చన అలంకార శాస్త్రగ్రంథః లిఖితపూర్వోభవేదితి కేషాంచిత్ విదుషాం వితర్కః. రాజశేఖరకృతం కర్పూర మంజరీ నామకం ప్రాకృతభాషారూపకం ప్రథమతః అవంతిసుందర్యాః అభిలాష మనుసృత్య రంగస్థలే ప్రదర్శితం కిల.

యాయావరేణ విరచితాః గ్రంథాః నవసంఖ్యాకాః, తేషు "బాలరామాయణం"

"బాలభారతం" (అసంపూర్ణోఽయం) "విద్ధశాలభంజికా", ఇతి సంస్కృత రూపకత్రయం, "కర్పూర-మంజరీ" నామకం ప్రాకృతభాషా నాటకం, "కావ్య మీమాంసా" నామకః సాహిత్యశాస్త్రప్రబంధః, ఇత్యేతే పంచప్రఖ్యాతాఃగ్రంథాః. "భువనకోశః" ఇతి భూగోళశాస్త్రం, "హరవిలాసః", "కవివిమర్శః" కశ్చన "నిఘంటుః" ఇతి చత్వారి గ్రంథాః అపి లిఖితాః ఇతి కథ్యతే, కింత్వేతే సంప్రతి నలభ్యంతే. ఏతేషు గ్రంథేషు కావ్యమీమాంసా సర్వశ్రేష్ఠా ఇతి విదిత చరమేవ విదుషాం.

ప్రాయేణ యాయావరస్య సర్వేష్వపి గ్రంథేషు, విశిష్య, కావ్యమీమాంసాయాం భారతదేశ సంబంధినః బహవో విశేషాః వర్ణితాః. తదానీంతనే కాలే నకేవలం సంస్కృతభాషా అపితు, ప్రాకృత,అపభ్రంశ, పైశాచీ-ప్రభృతి భాషాశ్చ కావ్య భాషాః భూత్వా ప్రచారేస్థితాః ఆసన్. కస్మిన్ ప్రాంతే కావాభాషా అధికతరం ఆద్రియతేస్మ, అథ కస్మిన్ ప్రదేశే కావాభాషా నాఽద్రియతేస్మ, తత్తత్ ప్రాంతీయానాం తత్తత్ భాషోచ్చారణాదికం కథమాసీత్, వివిధప్రదేశీయానాం స్త్రీ పురుషాణాం స్వస్థాన వేషభాషాదిమతాదికం కథమాసీత్, ఇత్యేతే సర్వేఽపి విషయాః సోదాహరణం వర్ణితాః. కావ్యమీమాంసా న కేవలం సాహిత్య శాస్త్ర గ్రంథః; కింతు విజ్ఞానసర్వస్వమేవ. అత్ర ఐతిహాసిక, భౌగోళిక, సామాజిక, సాంస్కృతిక, ఆధ్యాత్మికాదివిశేషాః సర్వేఽపి సమ్యక్ ప్రతిపాదితాః.

మధ్యదేశస్య రాజధానీం కాన్యకుబ్జనగరీం కేంద్రీకృత్య రాజశేఖరేణ ఏతద్దేశాంతర్గత వివిధ ప్రదేశానాం సీమా విభాగఃకృతః. "కుమారీ పురాత్ ప్రభృతి బిందుసరోఽవధి యోజనానాం దశశతీ చక్రవర్తి క్షేత్రమ్" ఇతి "భారతదేశం వర్ణిత వాన్." తత్ర వారాణస్యాః పురతః పూర్వదేశః.... మాహిష్మత్యాః పరతో దక్షిణా పథః.... దేవసభాయాః పరతః పశ్చాత్ దేశః ... పృథూదకాత్పరతః ఉత్తరా పథః.... ఇత్యేవం దేశవిభాగః, అథవా దిశాంవిభాగఃకృతః. తాసు తాసు దిక్షు స్థితానాం పర్వతానాం, నదీనదానాం, అరణ్యానాం, జనపదానాం, జానపదానాంచ మనోజ్ఞం వర్ణనం కృతం.

యాయావరః విశాలమనాః, ఉదార స్వభావశ్చ. పురుషాఇవస్త్రియోఽపి కవ్యః భవేయురితి తస్య ఆశంసా. కావ్యమీమాంసాయాం, దశమే అధ్యాయే

రాజశేఖరః — సంస్కృత సాహిత్యే తస్య స్థానమ్

యథోక్తం తేన - మూలమ్- "పురుషవద్యోషితోఽపి కవీ భవేయుః. సంస్కారో హ్యాత్మని సమవైతి. న స్త్రైణం పౌరుషం వా విభాగ మపేక్షతే. శ్రూయంతే, దృశ్యంతేచ రాజపుత్ర్యో, మహామాత్య దుహితరో, గణికాః, కౌతుకి భార్యాశ్చ శాస్త్రప్రహత బుద్ధయః కవయశ్చ" ఇతి.

సూక్తిముక్తావల్యామపి అనేన రచితాః కతిపయశ్లోకాః లభ్యంతే యేషు "వికటనితంబా" "శీలా భట్టారికా" "సుభద్రా" "ప్రభుదేవీ" ప్రభృతీనాం స్త్రీకవీనాం ప్రశంసా కృతాఽనేన. తస్య పత్నీం అవంతి సుందరీ మధికృత్య పూర్వమే వోఽక్తం.

సూక్తిముక్తావల్యామేవ రాజశేఖరరచితం అపరం శ్లోకద్వయం దృశ్యతే, యస్మిన్ జాతివర్ణాది భేదనిమిత్తమంతరేణ ఉత్తమసంస్కార హృదయాః సర్వేఽపి సరస్వత్యాః వాత్సల్యపాత్రం భవంతీతి ప్రకటితంతేన యథా:—

శ్లో॥ "సరస్వతీ పవిత్రాణాం జాతిస్తత్ర న దేహినాం
వ్యాసస్పర్ధీ కులాలోఽభూత్ యద్ద్రోణో భారతే కవిః"

అత్రకులాల వంశోద్భవః ద్రోణోనామకవిః మహాభారతరచనా విషయక స్పర్ధాయాం వ్యాసేన సమం ఆసీదితి ప్రశంసితః. అపిచ,

శ్లో॥ "అహో ప్రభావో వాగ్దేవ్యాః యన్మాతంగ దివాకరః
శ్రీహర్షస్యాభవత్సభ్యః సమో బాణమయూరయోః"

అస్మిన్ శ్లోకే మాతంగాన్వయసంభూతః దివాకరో నామ కవిః శ్రీహర్షస్య ఆస్థానే సదస్యో భూత్వా బాణ మయూరయోః సమం స్థానమలభత ఇతికీర్తితః.

సర్వమానవ సౌభ్రాత్రం, సమసమాజభావనా ఇత్యాది విషయాః సర్వేఽపి అస్య గ్రంథేషు సుష్ఠుప్రతిపాదితాః. అథ సాహిత్య సమాజయోః కీదృశః సంబంధో భవతి, "సాహిత్యే సామాజికస్పృహా" (భావనా) కథంవర్తతే ఇత్యాదివిషయాణాం సమ్యగవగాహనం, సమాధానంచ, అస్యకావ్యేషు లభ్యతే ఇతి యది కథ్యతే తర్హి కిమత్రాశ్చర్యం!

"కావ్యమీమాంసా" అష్టాదశేషు అధ్యాయేషు నిబద్ధా— శాస్త్రసంగ్రహః, శాస్త్ర నిర్దేశః, కావ్యపురుషోత్పత్తిః, పదవాక్యవివేకః, వ్యుత్పత్తిః కావ్యపాకశ్చ, వాక్యభేదాః, కావ్యార్థయోనయః, అర్థవ్యాప్తిః, కవిచర్యా రాజచర్యాచ, శబ్ద హరణం శబ్దార్థ హరణేషు కవిప్రభేదాః ప్రతిబింబ కల్ప వికల్పన్యచ సమీక్షా,

అర్థహరణేష్వాలేఖ్య ప్రఖ్యాదిభేదాః, జాతిద్రవ్యక్రియా సమయస్థాపనా, గుణసమయ స్థాపనా, స్వర్గ్యపాతాళీయ కవిరహస్యస్థాపనా, దేశవిభాగః, కాలవిభాగః -ఇతి వివిధాసు శీర్షికాసు విషయవిశ్లేషణా కృతా. తృతీయే అధ్యాయే "కావ్య పురుషోత్పత్తిః," "సాహిత్యవిద్యయా" తస్య పరిణయః రమణీయ కావ్యశైల్యాం వర్ణితః. ఏతత్సన్నివేశచిత్రణం రాజశేఖరకవేః అమృతరమణీయ ప్రతిభాయాః పరమోదాహరణం. అస్మిన్ప్రబంధే సాహిత్యశాస్త్రం వినూత్నమార్గేణ ప్రతిష్ఠాపితమ్ అన్య గ్రంథేషు మృగ్యాః అసంఖ్యాకాః మనోహరాః శ్లోకాః ఉదాహరణార్థం. అత్ర ఏకత్రీకృతాః.

యాయావరస్య గ్రంథేభ్యః అర్వాచీనైః ఆలంకారికైః నైకేవిషయాః స్వీకృతాః. సోమదేవ సోఢ్ఢల - అభినవగుప్త - హేమచంద్ర-ఉజ్జ్వలదత్త-వాగ్భట-క్షేమేంద్ర - అమర - వినయచంద్ర - దేవేశ్వర - భోజాది సుప్రసిద్ధానాం ఆలంకారికాణాం గ్రంథేషు అనేనప్రోక్తాః బహవోవిషయాః శ్లోకాశ్చ పరిదృశ్యంతే.

ఏనం కవిమధికృత్య తస్యసమకాలీనాః అర్వాచీనాశ్చకవయః బహుధా ప్రశంసామకుర్వన్. కృష్ణశంకరశర్మణా కథితోఽయం శ్లోకః "విద్ధశాలభంజికా" ,సంస్కృత రూపకప్రారంభే ఉల్లేఖితః —

శ్లో॥ పాతుంశ్రోత్ర రసాయనం రచయితుం వాచః సతాం సమ్మతాః
వ్యుత్పత్తిః పరమా మవాప్తు మవధిం లబ్ధుం రసస్రోతసః
భోక్తుం స్వాదు ఫలం చ జీవితతరో ర్యద్యస్తి తే కౌతుకం
తద్భ్రాతః శృణు రాజశేఖరకవేః సూక్తీః సుధాస్యందినీః

మృగాంకలేఖాకథాకర్త్రా అపరాజిత నామ్నా కవినా ప్రాకృత భాషాయాం లిఖితోఽయం శ్లోకః "కర్పూరమంజరీ" ప్రాకృతనాటకప్రారంభే పరిదృశ్యతే:—

శ్లో॥ బాలక ఈ కఇరాఓ ణిబ్భఆరా అస్సతహ ఉబజ్ఝా ఓ
ఇతి అస్స పరంపరాఓ అత్తా మాహత్త మారూఢో

ప్రథమం బాలకవిః, పశ్చాత్ కవిరాజః, అనంతరం నిర్భరరాజస్య ఆచార్యః ఇత్థం రాజశేఖరోక్రమాభివృద్ధిం గతవానితి అస్య శ్లోకస్య సారాంశః

కావ్యమీమాంసాయాం పంచమే అధ్యాయే రాజశేఖరేణ దశవిధ కవిభేదాః వర్ణితాః— కావ్యస్నాతకః - హృదయకవిః, - అన్యాపదేశీ, - సేవితా - ఘటమానః -

రాజశేఖరః — సంస్కృత సాహిత్యే తస్య స్థానమ్

మహాకవిః- కవిరాజః— ఆవేశికః - అవిచ్ఛేదీ- సంక్రామయితాచ. అత్రసప్తమో కవి రాజః. మహాకవేరపి అధికతరః. అనేకాసుభాషాసు- విభిన్నేషు రసేషు— వివిధాసుచ సాహిత్య ప్రక్రియాసు మహానిపుణః కవిరాజ ఇత్యుచ్యతే కిల। రాజశేఖరః కవి రాజః— కవిరాజబిరుదవిభ్రాజమానః. "కర్పూరమంజరీ" ప్రాకృతనాటక ప్రారంభే తేనైవ స్వయం ప్రకటితోఽయం విషయః. బాలరామాయణే, సంస్కృత రూపకే చ తేనైవ పునఃపునః పరామృష్టోయం కవిరాజబిరుదః. యథా:—

శ్లో॥ గిరః శ్రవ్యా దివ్యాః ప్రకృతిమధురాః ప్రాకృతధురాః
సుభవ్యోఽపభ్రంశః సరసరచనం భూతవచనమ్
విభిన్నాః పంథానః కిమపి కథనీయాశ్చ త ఇమే
నిబద్ధా యస్తేషాం స ఇహ కవిరాజో విజయతే.

సాహిత్యస్య శాస్త్రత్వ సమర్థన పరోఽయం కావ్యమీమాంసా ప్రబంధః విజయతే। జయతి తరాం తత్కర్తా రాజశేఖరః సంస్కృత సాహిత్యప్రపంచే।

---

ఆకాశవాణి, హైదరాబాదు కేంద్రం వారి సౌజన్యంలో
ప్రసంగం తేది 18-9-1986, గురువారం.

ఈ ప్రసంగ వ్యాసరచనకు ఎన్నో గ్రంథము లుపకరించినవి.
వానిలో ఆచార్య డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు
తెలుగులోకి అనువదించిన "కావ్య మీమాంస" మిక్కిలి ప్రధానమైనది.
వీరందరికి హృదయపూర్వక ధన్యవాదములు.

శాసనకథా వాఙ్మయము

# గోన గన్నారెడ్డి

మన శాసన వాఙ్మయములో పద్యము, గేయము, గద్యము, చరిత్ర, కథ ఇలా వివిధ ప్రక్రియలు గోచరిస్తాయి. వీటన్నిటినీ కూర్చి విడివిడిగా ఒక ప్రత్యేకమైన కృషి జరుగవలసిన అవసరమున్నది. ఆ మేరకు ఒక "నమూనా"గా ఈ కథా వ్యాసాన్ని సమర్పించటం జరుగుతున్నది.

రుద్రమదేవి క్రీ.శ. 1262 నుండి 1296 వరకు రాజ్యాన్ని పరిపాలించింది. ఆమె సింహాసనమెక్కిందే తడవు ఒక స్త్రీ రాజ్యం చేయటం ఇష్టంలేని సామంత రాజులు కొందరు ఆమెను గద్దె దింపటానికి కుట్రలు పన్నారు. వీళ్ళ ఆసరాతో ఇరుగుపొరుగు హిందూ రాజులు కాకతి సింహాసనాన్ని చేజిక్కించుకోవటానికి ప్రయత్నాలు ప్రారంభించారు. హిందూ రాజుల్లో ఇలా ఐకమత్యం లేకపోవటాన్ని అవకాశంగా భావించి ఢిల్లీసుల్తాను మూడుసార్లు కాకతి రాజ్యంపైన దాడులు చేశారు. 1267లో మొదటిదాడి జరిగింది. ఇది దక్షిణ భారతంపై ముస్లింలు చేసిన మొట్టమొదటి దాడిగా పేర్కొనవచ్చు. ఈవిధంగా ఇంటికుట్రలు బైటికుట్రలతో ఒక విచిత్రమైన కలగాపులగపు అస్తవ్యస్త పరిస్థితులేర్పడినయి!

ఈ పరిస్థితుల్ని చక్కదిద్ది, రుద్రమదేవిని బలపరచి, కాకతీయ సామ్రాజ్యాన్ని నిలబెట్టటానికి తమవంతు సేవలు చెల్లించిన స్వామిభక్తులు, దేశభక్తులునైన మహనీయులెందరో ఉండిరి. వారిలో గోన గన్నారెడ్డి ఒకడు. ఈ ఉద్యమంలో అతడు నిర్వహించిన పాత్రను దిఙ్మాత్రంగా చిత్రించటమే ప్రస్తుతాంశం.

గోన గన్నారెడ్డి మహావీరుడు. ఆత్మవిశ్వాసపూరితుడైన కార్య ఖడ్గ నిపుణుడు, ఉత్తమశీలవిద్యాసంస్కృతి సంపన్నుడు. రుద్రమదేవికి కుడిభుజంగా నిలబడిన మహాసేనాని.

రాయచూరు శాసనంలో ఈతనికి సంబంధించిన బిరుదులెన్నో పేర్కొనబడినవి. వాటిని మూడు నాల్గువిధాలుగా విశ్లేషించిచూస్తే ఆ మహావీరునియొక్క అద్భుతరమణీయమైన వ్యక్తిత్వం అద్దంపట్టినట్లు సాక్షాత్కరిస్తుంది.

అతని శీలసంపదను సూచించే బిరుదులివి:— సమస్తగుణగణాలంకార—సత్య రత్నాకర — సౌజన్యగౌరవ — సహజకార్యభరణ — మనుమకులమార్తాండ— శ్రీసోమ నాథదేవ దివ్య శ్రీపాదపద్మారాధక — నిజకీర్తిపూరిత బ్రహ్మాండకరండ ........

సాహసపరాక్రమాల్ని వర్ణించే బిరుదులివి:— అరిగండభైరవ—సాహసోత్తుంగ— వీరవితరణోత్సాహ — వీరలక్ష్మీనిజేశ్వర - మీసరగండ - ఉభయబలగండ - గండర గండ— అరిగండ భేరుండ— పరబలోద్దండ— పరబల సాధక— గళమౌళి— సమర సమయ— దుర్వార వీరావతార— అరిగండ భేరుండ— హన్నిబ్బర గండ - హది మువ్వ గండ - లాడకువర పెండార - నిరుపమ సంగ్రామరాయ........

అతడు హతమార్చిన శత్రువీరుల పేర్లమీదుగా వచ్చిన బిరుదులివి:- చోళ జగదాళ వీరకాంతికార - కోసగిమైలి తలగొండుగండ - ఉప్పుల సోమనితలగొండు గండ - వందిభూపాలుని తలగొండుగండ - మేడిపలికాచయ నాయకుని శిరసుండ. కందూరి కేశినాయని తలగొండుగండ - జూపాక భీమనిర్ధూమధూమ తేజాల కాటయదిశాపట్ట - ఏఱువతొండ భూమిఘట్టనఘరట్ట........

చేజిక్కిన శత్రువుల్ని చంపకుండ విడిచిపెట్టి వాళ్ళ అభిమానచిహ్నాల్ని మాత్రం హరించి అవమానించినట్లు వర్ణింపబడిన బిరుదులివి: బేడ చెలుకినాయని నిస్సాణహరణ - కోట పెమ్మడిరాయ కంఠాభరణ చూఱకార- చోడోదయ సూత్రపట్ట తురంగాపహార........

రుద్రమదేవికి బాసటగా నిలబడిన మహాసేనానిగా వర్ణింపబడిన బిరుదులివి: కాకతీయకటకసన్నాహ - రుద్రదేవ దక్షిణభుజదండ........

ఈ శాసనకాలం క్రీ.శ. 1284

భారతదేశంమీదకి క్రీ.శ. 11వ శతాబ్దంలో ముస్లిం దండయాత్రలు ప్రారంభ మైనాయి. మొట్టమొదట గజనీమహమ్మదుదండెత్తి వచ్చాడు. పిమ్మట గోరీమహ మ్మదు వచ్చాడు. ఆ వరుసలో మఱికొందరు ప్రవేశించారు. క్రమక్రమంగా ఉత్తర భారతంలోని అనేక ప్రాంతాలు తురుష్కాక్రాంతములయినవి. 12వ శతాబ్దంలో ఢిల్లీలో సుల్తానుల ఆధిపత్యం నెలకొన్నది. 13వ శతాబ్ది ఉత్తరార్ధంలో వారికన్ను దక్షిణ భారతంపై పడింది. తగిన అదనుకోసం ఎదురుచూస్తూ ఉబ్బూత లూగు తున్నారు!

ఆనాడు దక్షిణ భారతంలో సుదృఢము, సుప్రసిద్ధమునైనది కాకతీయ సామ్రాజ్యం. ఈ రాజన్యులలో అగ్రగణ్యుడు గణపతిదేవ చక్రవర్తి. ఈతడు క్రీ.శ. 1209 నుండి 1262 వఱకు రాజ్యాన్ని పరిపాలించాడు. ఈతని కాలంలో దక్షిణ ప్రాంతంపైకి దండెత్తిరావటానికి ఢిల్లీసుల్తానులు జంకినట్లు భావింపవచ్చు.

గణపతిదేవుడికి కొడుకులులేరు. అందువల్ల పెద్దకూతురు రుద్రమదేవినే తనకు వారసురాలుగా ప్రకటించాడు. క్రీ.శ. 1259లో యువరాణిగాను, 1262లో మహారాణిగాను పట్టాభిషేకం చేయించాడు. ఆమె పురుషవేషంలో "రుద్రదేవమహారాజు" అను పేరుతో వ్యవహరించాలన్న నియమంచేశాడు. అదే సంవత్సరంలో తాను మరణించాడు. చరిత్రలో పైతృకమైన మహాసింహాసనాన్ని ఒక స్త్రీ అధిష్ఠించటం అప్పటికొక అపూర్వమైన అద్భుతోదంతం! కాకతి కుల దేవత "ఏకవీరాదేవి" అవతారమే రుద్రమదేవి! ఈమె 1296 వఱకు రాజ్యం పరిపాలించింది.

రుద్రమదేవి సింహాసన మెక్కినదే తడవు స్త్రీ పరిపాలనను అంగీకరింపని సామంతరాజులు కొందఱు తిరుగుబాటు లేవదీశారు. వీరిలో దాయాదులు, సవతి సోదరులునైన హరిహరదేవ మురారిదేవు లొక జట్టుగ, అప్పటివఱకు ఆంతరంగికులుగాను, విశ్వాసపాత్రులుగాను ఉంటూవచ్చిన జన్నిగదేవ త్రిపురాంతకదేవ అంబయదేవులు మఱొక జట్టుగ, మంచి బలవంతులైన లకుమారెడ్డి కోటారెడ్డులు మఱొక జట్టుగ ఏర్పడి కూహకాలు ప్రారంభించారు. వీళ్ళందరియొక్క సామూహికమైన ఏకైక లక్ష్యం మొదట రుద్రమ్మను గద్దెదింపటం, పిమ్మట వీలునుబట్టి యెవరికి వారు తామే సింహాసనాన్ని చేజిక్కించు కోవటం, అది కానిపక్షంలో తమకు తాము స్వతంత్ర రాజ్యాలు ఏర్పఱచుకోవటం! ఆ మేఱకు రాను రాను కుట్రలు విజృంభించినయి. రాయచూరు శాసనంలో పేర్కొనబడిన శత్రువీరులందరు ఇందులో ఏదో ఒక జట్టుతో చేరి యీ కుట్రలో కీలకమైన పాత్ర నిర్వహించినవారే!

ఈ అంతఃకలహాన్ని ఆసరాగా చేసుకొని ఒకవైపు చోళరాజు రాజేంద్రచోళుడు, పల్లవరాజు కొప్పెరుంజింగుడు, పాండ్యరాజు జటావర్మ సుందరుడు మొదలైనవారు తెలుగునేలపైకి దాడులు మొదలు పెట్టారు. మఱొకవైపు మహారాష్ట్రదేవగిరి యాదవరాజగు మహదేవరాజు తాను సార్వభౌముడు కావాలన్న దాహంతో ఈ రాజ్యాన్ని కబళించటానికి వచ్చిపడ్డాడు. ఇతణ్ణి ఆహ్వానించింది గూడ ఈవిద్రోహులే!

వీళ్ళల్లో లకుమారెడ్డి ప్రముఖుడు. ఇతణ్ణి గూర్చి తిక్కన తన నిర్వచనోత్తర రామాయణం పీఠికలోని ఒక పద్యంలో ప్రస్తావించటం జరిగింది.

సరిగ్గా యీ పరిస్థితుల్లో ఈవిధంగా చెలరేగిన హిందూరాజుల అంతః కలహాల్ని, ఐకమత్యరాహిత్యాన్ని అవకాశంగా తీసికొని యెన్నాళ్ళనుంచో పొంచిఉన్న ఢిల్లీ సుల్తానులు కాకతీయ రాజ్యంపై తొలిదండయాత్రలు సాగించారు. రుద్రమ్మ పరిపాలించిన యీ ముప్పైఅయిదేళ్ళలోను విడతలు విడతలుగా సాగిన ముస్లిం దండయాత్రలు మొత్తం మూడు:

క్రీ.శ. 1267 సం॥ నాటి "పానుగల్లు" శాసనంలో రుద్రమదేవి సామంతుడు సారంగపాణిదేవుడు తాను తురుష్కాక్రాంతమైన ధరణిని అకాలప్రళయము నుండి ఉద్ధరించినట్లు పేర్కొనెను. బళ్ళారి జిల్లాలోని "హాలువాగలు"లో క్రీ.శ. 1272వ సం॥ నాటి శాసనంలో రామదేవుడను నాతడు తురుష్కుల బారినుండి భూసతిని తాను సంరక్షించినట్లు ప్రకటించుకొనెను। క్రీ.శ. 1295లో గుర్షాస్ప్‌మాలిక్ దేవగిరిని ముట్టడించాడు। ఇంతకు కొంచెం పూర్వమే 1265లో గోన గన్నారెడ్డి వంటి మహావీరుల సహకారంతో రుద్రమదేవి దేవగిరి మహదేవరాజును ఓడించి ఆ రాజ్యాన్ని తనకు సామంతరాజ్యంగా చేసుకొన్నది. ఈ విధంగా ఈమూడు తొలి ముస్లిం దండయాత్రలు రుద్రమదేవి పాలిస్తున్న భూభాగంలో జరిగినవే. మొట్టమొదట 1267లో జరిగిన దండయాత్రవల్ల దేశభక్తులైన హిందూరాజుల తల దిమ్మ తిరిగిపోయి ఉంటుందని చెప్పవలసిన పనిలేదు। ఈ తొలి ముస్లిందండయాత్రల్ని గూర్చి చరిత్రకారులు అంతగా పట్టించుకొన్నట్లు కనబడదు వివరాల్ని త్రవ్వితీయవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

ఈ విధంగా ఒకవైపున ఇంటి సామంతరాజుల కూహకాలు। మఱొకవైపున ఇరుగుపొరుగు హిందూరాజుల కుట్రలు। ఇంకొకవైపు క్రొత్తగావచ్చిపడుచున్న విదేశీ దండయాత్రల ఆఘాతాలు। ఇదీ ఆనాటిపరిస్థితి। ఈ ఊబినుండి కాకతీయసామ్రాజ్యాన్ని రక్షించటానికి రుద్రమదేవికి బాసటగా నిలిచి తమవంతు సేవను చెల్లించుకొన్న దేశభక్తులైన మహావీరులెందరో గలరు। వారిలో మహామంత్రి శివదేవయ్య, మహాసేనాని రేచర్ల రుద్రయ్య, రాజనీతికుశలుడు రేచర్ల ప్రసాదాదిత్యుడు, మహావీరుడు గోన గన్నారెడ్డి ప్రభృతులు ముఖ్యులు.

వీరిలో గన్నారెడ్డి నిర్వహించినపాత్ర అద్భుతవిచిత్రమైనది. ఇతడు రుద్రమ దేవి, శివదేవయ్య! రుద్రయ్య, ప్రసాదాదిత్యుల బృందంతో ప్రత్యక్షంగా కలిసి గాక, శివదేవయ్య పన్నిన రాజతంత్రాన్ని పురస్కరించుకొని వాళ్ళు నియమించిన రహస్యవీరుడుగా, గూఢచారిగా వ్యవహరిస్తూ, ఎప్పటికప్పుడు వాళ్ళనుండి స్ఫూర్తిని పొందుతూ తన సొంతపద్ధతిలో పరోక్షంగా ఈ ఉద్యమాన్ని నడిపించాడు. శాసన వాఙ్మయంలోను, సాహిత్య గ్రంథాల్లోను ఇతడొక గొప్ప రాజతంత్రజ్ఞుడుగా, యుద్ధనీతి విశారదుడుగా వర్ణింపబడ్డాడు. తనమేధలో మెఱసిన రాజతంత్రం ప్రాతి పదికగా తనచేతి ఖడ్గసృష్టిలో యుద్ధతంత్రం నడిపించి విజయం సాధింపగల మేటి! ఈ మహాలక్షణం ఒక్క ఛత్రపతి శివాజీసొత్తు. ఆ ఛాయలు కొన్ని గన్నారెడ్డిలో గోచరిస్తాయి.

వర్ధమానపురం రాజధానిగా మానువనాటి సీమను పరిపాలించిన వ్యక్తి గోన బుద్ధారెడ్డి. అతని తమ్ముడే లకుమారెడ్డి. అన్న రాజ్యంలో సేనాపతిగా ఉండేవాడు. ఈ బుద్ధారెడ్డి కొడుకులే గన్నారెడ్డి, విఠల రెడ్డులు. వీళ్ళకంటె పెద్దది కూతురు కుప్పాంబిక. వీళ్ళు చాలా చిన్నవయస్సులో ఉండగానే తండ్రి బుద్ధారెడ్డి మరణించాడు. లకుమారెడ్డి కుటిలుడు. మొత్తం రాజ్యాన్ని తానే హక్కుభుక్తంచేసుకొని అన్న కొడుకులకు అన్యాయం చేశాడు. దిక్కుతోచని గన్నారెడ్డి సోదరులు ఈ అన్యాయాన్నిగూర్చి మంత్రి శివదేవయ్యద్వారా ప్రభువులకు విన్నవించుకొనటం జరిగింది.

శివదేవయ్య గొప్పలోకజ్ఞుడు. రుద్రమదేవి యువరాణి అయినప్పుడే సామంత రాజులు కొందఱు గుజగుజలుపోవటం గ్రహించాడు. ఇకముందు ఆమె మహారాణి అయినప్పుడు ఆ అసంతృప్తి కుట్రగామారి పెల్లుబెలరేగుతుందని ముందుగానే రూఢిగా అంచనా వేసుకొన్నాడు. ఈ సంధి సమయంలో సామంతరాజుల్ని దువ్వి కూడగట్టుకోవాల్సినపరిస్థితి. లకుమారెడ్డి వస్తుతః ఉద్దండుడు. ఇప్పుడు మంచి పేరు బరి సామంతరాజుకూడ. కుటిలుడు. ఎటుతిరుగుతాడో తెలియదు. తాను గన్నారెడ్డి సోదరుల వ్యవహార పరిష్కారంకోసం తలదూర్చి యిప్పుడే పేచీపడదల్చుకోలేదు. అట్లాగని వీళ్ళను గాలికి వదిలిపెట్టదలుచుకోలేదుకూడ. మంచియేపుగా పెరుగు తున్న సమర్థులైన యువకులు. దేశకార్యానికి ఉపయోగపడతారు అని భావించాడు.

పినతండ్రిపై కక్షసాధింపమని చిత్రంగా గన్నారెడ్డి సోదరుల్ని పురికొల్పాడు. లకుమారెడ్డితోసహా పలువురు సామంతులు మున్ముందు రుద్రమ్మతల్లికి వ్యతిరేకంగా వ్యవహరించబోయే ప్రమాదం ముంచుకొస్తున్నదని వివరించాడు. స్వామిభక్తులు, దేశభక్తులునైన యువకులు తమకర్తవ్యాన్ని యేమరకూడదని హెచ్చరించాడు. అంతే! ఒకానొక అవగాహనతో "కాకతీయకటకసన్నాహుడుగా" "రుద్రదేవ దక్షిణ భుజదండంగా" పని చేయటానికి ప్రతిన బూనాడు గన్నారెడ్డి! అన్నగారి అడుగు జాడల్లో నడవటానికి నిశ్చయించుకొన్నాడు తమ్ముడు విఠలరెడ్డి!

గన్నారెడ్డి వీరశైవుడు. వీరరసంశైవానికి ప్రాణసారం. నల్లమలకొండకోనల్లో శ్రీశైలానికి పడమటిదిక్కున ఒకచీమలుదూరని చిట్టడవిని, ఒక భయంకర ప్రదేశాన్ని రహస్య స్థావరంగా ఏర్పాటు చేసుకొన్నాడు. ఒకప్పుడది శాతవాహనుల కాలం నాటిది. అక్కడొక పాడుబడిన పట్టణం, కూలిపోయిన కోటగోడలు ఉన్నాయి. దాన్ని పునర్నిర్మించి గృహప్రవేశం చేశాడు!

గొప్ప సంఘటనా కౌశల్యంగల నాయకుడు గన్నయరెడ్డి. ఓరుగల్లులో తనకు తెలిసిన యువకుల్ని కూడగట్టుకొని వాళ్లను ఈరహస్యస్థావరానికి తరలించాడు. ఇక్కడుండే కోయలు, చెంచులు మొదలైన ఆటవిక, కొండజాతివారితో స్నేహంచేసి తన సైన్యంలో భర్తీ చేసుకున్నాడు. వాళ్ళల్లో పౌరుషతరంగాల్ని రేకెత్తించి మంచి కట్టుదిట్టమైన సైనిక శిక్షణనిచ్చాడు. నాల్గుచెఱగులా గూఢచారుల్ని పంపించాడు. ఒక్క దోపిడి గూడ చేయలేదు; చేయించలేదు. కాని కావాలనే తానొక పెద్ద గజదొంగ అయినట్లు ప్రచారం చేయించుకొన్నాడు. శత్రువులపై మెఱుపుదాడులు సాగించాడు.

రుద్రమదేవిని గద్దెదింపి తాను చక్రవర్తి కావాలన్నది లకుమారెడ్డి తహతహ. కొందఱు సామంత రాజుల్ని తనవైపు తిప్పుకోవటానికి ఎన్నో ప్రయత్నాలు చేస్తున్నాడు. ఆదవాని ప్రభువు కోటారెడ్డి కూతురు అన్నాంబికను తనకొడుకు వరదారెడ్డికి చేసుకొని వియ్యమందే ప్రయత్నం అందులో నొక భాగమే. కోటారెడ్డి అంగీకరించాడు. కాని లకుమారెడ్డి కుట్రల్ని గూర్చి కూలంకషంగా తెలిసిన అన్నాంబిక ఈ పెళ్ళికి ఒప్పుకోలేదు. ఆమెకు రుద్రమదేవిపై భక్తి ప్రపత్తులు, గన్నారెడ్డిపై సానుభూతితోకూడిన గౌరవమూ ఉన్నాయి. అయినా ఈ బలవంతపు

పెళ్ళి జరుగుతున్నది. అన్ని విషయాలు ముందే తెలుసుకొన్న గన్నారెడ్డి హఠాత్తుగా ఊడిపడ్డాడు. పెళ్ళికొడుకుని యెత్తుకుపోయాడు. మళ్ళీ కొన్ని రోజులకు రెండవసారి ముహూర్తం నిశ్చయించారు. ఈసారి గన్నారెడ్డి వేసిన పథకం ప్రకారం ముహూర్తానికి కొంచెం ముందుగా అన్నాంబికే యింట్లోనుంచి మాయమయ్యింది. గన్నారెడ్డి అక్క కుప్పాంబికతో కలిసి ఓరుగల్లు చేరుకొని రుద్రమదేవిని ఆశ్రయించింది. అక్కడినుండి యీ ఉద్యమనిర్వహణలో గన్నారెడ్డికి పరోక్షంగా సహకరించి పనిచేసింది. శత్రువుల కుట్రల్ని వమ్ముజేస్తూ రుద్రమదేవి విజయాలకు తోడ్పడ్డాడు గన్నారెడ్డి. సామంతరాజులు రుద్రమ్మకు వ్యతిరేకంగా సంఘటితం కాకుండా చూడటమే గన్నారెడ్డి ప్రధానలక్ష్యం.

రుద్రమదేవి యెదుర్కొన్న విషమఘట్టాల్లో ప్రధానమైనది క్రీ.శ. 1263 సం॥ ప్రాంతంలో దేవగిరి మహదేవరాజు చేసిన దండయాత్ర. కొన్నిలక్షల సైన్యంతోవచ్చి ఓరుగల్లుకోటను పదిహేనురోజులు ముట్టడించాడు. రుద్రమదేవి స్వయంగా కత్తి చేతబట్టి అతనితో యుద్ధంచేసింది. చివరికతడు సంధిచేసుకొని తిరోముఖం పట్టాడు. మహదేవరాజు దేవగిరినుండి బయలుదేరాడు అని తెలిసిన వెంటనే గన్నారెడ్డి కొన్నివేల సైన్యంతో చౌండసేనాని వెంటరాగా ఆతణ్ణి యెదిరించాడు. దారిపొడుగునా ఎక్కడికక్కడ అతణ్ణి నిలువరిస్తూవచ్చాడు. ఎంతచేసినా మహదేవరాజు ఓరుగల్లుకోటను ముట్టడింపగలిగాడు. ముట్టడి పదిహేనురోజుల్లోను రుద్రమ్మకు సంరక్షకుడుగా ఉండి కొన్నివేల శత్రుసైన్యాన్ని నాశనంచేసి విజయసాధనలో ఆమెతోపాటు భాగస్వామి అయినాడు గన్నారెడ్డి!

రుద్రమదేవి పరిపాలనా కాలంలో జరిగిన మూడు ముస్లిం దండయాత్రల్ని యెదుర్కొనటంలో గన్నారెడ్డి నిర్వహించిన పాత్రను గూర్చి కచ్చితమైన దాఖలా కనబడదు. అయినా స్వామిభక్తుడు, దేశభక్తుడు అయిన గన్నారెడ్డి ప్రముఖ పాత్రను నిర్వహించినట్లు నిశ్చయంగా ఊహింపవచ్చు.

రాయచూరు శాసనంలో పేర్కొనబడిన శత్రువీరుల్ని గన్నారెడ్డి హతమార్చిన విధం అద్భుతావహం. అందలి చారిత్రకాంశాలివి:- చోళజగదాళవీర కాంతికార - దక్షిణచోళుడైన రాజేంద్రుడు ఆంధ్రరాజ్యంపై దండెత్తివచ్చి త్రిపురాంతకము, సిందవాడి, మార్జవాడి, పురందలూరు, కడప, నెల్లూరు, కర్నూలు

మండలాల్ని ఆక్రమించుకొని ఓరుగల్లుమీదికి వస్తున్నాడు. గన్నారెడ్డి అతణ్ణి యెదిరించి మూడు రోజులు యుద్ధంచేసి ఓడించాడు. అతడు సంధిచేసుకొని తిరోముఖం పట్టాడు. కోసగిమైలి తలగొండుగండ — కోసగినగరపాలకుడైన మైలప నాయకుడితడు. ఆదవాని ప్రభువు కోటారెడ్డికి సామంతుడు. పెళ్ళికొడుకును ఎత్తుకొనిపోతున్న గన్నారెడ్డిని పట్టుకోవటానికి వెంబడించి అతనిచేత హతుడైనాడు. ఉప్పుల సోమని తలగొండుగండ — మార్కాపురం పాలకుడితడు. గన్నారెడ్డి పెళ్ళికొడుకును ఎత్తుకొనిపోయినప్పుడు ప్రతీకారంగా వాడితల నరుకుతానని శపథంచేసినవాడు. చివరికి గన్నారెడ్డే వీడితల నరికాడు. వందిభూపాలుని తలగొండుగండ — వీడు కందనోలు ప్రభువు. కోటారెడ్డి వర్గంలోనివాడు. రుద్రమ్మను నిందిస్తే గన్నారెడ్డి అవమానించాడు. అది భరించలేక ఉరిపోసుకొని చచ్చిపోయినవాడు. మేడిపలికాచయనాయకుని శిరసుండ— గోదావరీ తీరంలోఉన్న మేడిపల్లికి రాజు కాచయనాయకుడు. నిడదవోలు ఇందుకేశ్వర మహారాజుకు సామంతుడు. కాళింగుల ప్రోత్సాహంతో రుద్రమదేవికి బదులు తానే చక్రవర్తి కావాలని కలలుగన్నవాడు. గన్నయరెడ్డి యితణ్ణి చుట్టుముట్టి యమపాశం వంటి సూత్రాన్ని విసిరి ఆ తాడుతో గొంతుబిగించిచంపాడు. కంటూరికేశినాయని తలగొండుగండ— ఇతడు లకుమారెడ్డికి సామంతుడు. దారికాచి రాజధనాన్ని కొల్లగొట్టాడు. గన్నారెడ్డి సైన్యంతోవెళ్ళి పెద్దయుద్ధంచేసి అతడితల తరిగాడు. తేజాలకాటయదిశాపట్ట— వీడు పూగినాటి పాలకుడు. పెమ్మడిరాయడితో కలిసి ధాన్యకటకాన్ని ఆక్రమించి రుద్రమదేవి చెల్లెలు గణపాంబను, ఆమెభర్త భేతమహారాజును బంధించాడు. భేతరాజును చంపటానికి ముహూర్తం పెట్టుకొన్నాడు. గన్నారెడ్డి హుటాహుటిన అక్కడికివెళ్ళి వాళ్ళను విడిపించి వీళ్ళను గణపాంబ కోరికపై క్షమించి విడిచిపెట్టాడు. ఏరువతొండ భూమి ఘట్టన ఘరట్ట — ఏరువనాడు అనగా కడప, నెల్లూరు, కర్నూలు మండలాలు. దీనికి పాలకుడు భీమన. వీడు తొండమండలపు కొప్పెరుంజింగుడు ఆంధ్రరాజ్యంపై దండెత్తి వచ్చినప్పుడు సహాయం చేసినవాడు. గన్నారెడ్డి వీడిపని బట్టాడు. వీడు సన్యాసియై దేశద్రిమ్మరి అయ్యాడు. గన్నారెడ్డి తొండమండలంపై దాడిచేశాడు.

వేదచెలుకినాయని విప్రాణహరణ— అన్నాంబిక తన పెళ్ళికి పెట్టిన రెండవ

ముహూర్తాన్ని తప్పించుకొని మాయమై కుప్పాంబికను చేరింది. ఈ స్త్రీలనిద్దర్నీ బంధించడానికి వెళ్ళినవాడు ఈ చెలుకి నాయుడు. వీడి గౌరవచిహ్నమైన ఢక్కను అపహరించి విడిచిపెట్టాడు గన్నడు. కోటపెమ్మడికాయ కంఠాభరణ చూఱకార– గణపాంబా భేతరాజుల్ని బంధించిన యుద్ధంలో వీడొకడు. రెండవవాడు తేజాల కాటయ. గన్నారెడ్డి వీడి కంఠాభరణాన్ని లాగికొని విడిచిపెట్టాడు. చోడోదయపట్ట సూత్ర తురంగాపహార– ఈ చోడోదయుడు కల్యాణనగర ప్రభువు. రుద్రమ్మ స్థానంలో తాను రాజు కావాలని కలలు కంటున్నవాడు. గన్నారెడ్డి వీడి గుఱ్ఱాన్ని చేతి పట్టు సూత్రాన్ని హరించి, ధనాన్ని స్వాధీనం చేసుకొని విడిచిపెట్టాడు.

క్రీ.శ. 1294 లో వేయబడిన మఱొక రాయచూరు శాసనం కనపడుతున్నది. దీనిప్రకారం విఠలరెడ్డి గన్నారెడ్డికి రాజ్యరక్షామణియై ఆదవాని, తుంబుళం, మానువ, హాలువ మొదలైన పన్నాలుగు దుర్గాలు సాధించి పెట్టినట్లును, గన్నారెడ్డి వర్ధమానపురం రాజధానిగ రాజ్యం పాలించినట్లున్ను తెలుస్తున్నది. రుద్రమదేవి క్రీ శ. 1259 లో యువరాణి అయినది. అప్పటికి గన్నారెడ్డి వయస్సు ఇరవై సంవత్సరాలనుకొంటే 1240 నుండి 1300 వఱకు– ఈ అరవై యేళ్ళు ఆతడు జీవించిన కాలమని కచ్చితంగా నిర్ణయింపవచ్చు. మఱికొంతకాలం జీవించియుండ వచ్చుననుకొంటే క్రీ. శ. 1303 లో ప్రతాపరుద్రుని కాలంలో అల్లావుద్దీన్ నాయకత్వాన తెలంగాణముపై రెండవ విడతలో జరిగిన మొదటి ముస్లిం దండయాత్రను కూడ అతడు చూసి ఉంటాడని భావింపవచ్చు.

రుద్రమదేవి తరువాత ప్రతాపరుద్రుడు చక్రవర్తి అయినాడు. ఈతడు క్రీ. శ. 1296 నుండి 1323 వఱకు పాలించాడు. ఈతని కాలంలో ఈతని పైనే మొత్తం ఎనిమిదిసార్లు ముస్లిందండయాత్రలు జరిగినయి. మొదటిది క్రీ.శ. 1303లో అల్లావుద్దీన్ నాయకత్వంలో జరిగింది. చివరిది 1323లో ఘియాజుద్దీన్ నాయకత్వములో జరిగింది. ఈ మధ్యలో మాలిక్‌కాపూర్ మొదలైనవారి నాయకత్వంలో జరిగినయి. ఏ ఒకటి రెండుసార్లో తప్ప దాదాపు అన్ని తడవలు ప్రతాపరుద్రుడు ఓటమిచెందాడు. ప్రతాపరుద్రుని పొరపాట్లతోబాటు హిందువుల అనైక్యత, ముస్లిముల పట్టుదల దీనికి కారణమని చరిత్ర సాక్ష్యమిస్తున్నది. ఘియాజుద్దీన్ దండయాత్ర ధాటికి తట్టుకోలేక ప్రతాపరుద్రుడు బందీకృతుడై మరణించాడు. దీనిలో

కాకతీయ సామ్రాజ్యం పతనమైనది!

దరిమిలా దక్షిణ భారతంలో వచ్చిన పరిణామం రెండు పాయలుగా ప్రవహించింది. 1345 లో గుల్బర్గా రాజధానిగా బహమనీ రాజ్యం ఏర్పడింది. అది కాలక్రమంలో ఈ ప్రాంతంలో కుతుబ్షాహీగాను, నిజాంషాహీగాను మారి 1948 వఱకు కొనసాగింది. ఇదొక పెద్ద దుష్పరిణామం!

తురుష్కాక్రాంతమైన ఓరుగల్లు రాజ్యాన్ని తిరిగి హిందువుల చేతికి తెచ్చుకోవటానికి తొలుత ముసునూరి ప్రోలయనాయకుని నేతృత్వంలోను, మలుత ముసునూరి కాపయ నాయకుని నాయకత్వంలోను ఒక పెద్ద విముక్తి ఉద్యమం జరిగింది. కాపయ నాయకుడు మిక్కిలి నేర్పుతో కొందరు రాజులను, సంస్థానాధీశ్వరులను కూడగట్టుకొని ఈ ఉద్యమం నిర్వహించాడు. అతని కోరికమేఱకు సర్వాత్మనా సహకరించినవాడు హొయసల వీర బల్లాలరాజు. ఈతడు సైన్యంతోసహా వచ్చి శత్రువుల్ని చెండాడి విజయసాధనలో తోడ్పడ్డాడు. ఏమైనా అనతికాలంలోనే ఓరుగల్లు బహమనీసుల్తాన్ల ఏలుబడిలోకి వెళ్ళింది. అయినా ఆ విముక్తి ఉద్యమం దేశభక్తులకు స్ఫూర్తిదాయకమై నిలిచింది. కాపయ నాయకుడు ప్రాతఃస్మరణీయుడు.

హొయసల వీరబల్లాలుడు చాలాగొప్పరాజు. తమ ప్రాంతంలో జరిగిన ముస్లిందండయాత్రల్ని ఎదిరించి నిలబడినవ్యక్తి. ఈతని సామంతుడు సంగముడు. సంగముని కొడుకులే హరిహరరాయ బుక్కరాయ సోదరులు. ఈ యిద్దరు మొదట ప్రతాపరుద్రుని దగ్గఱ సేనానులుగాఉంటూ తరువాత కాంపిలి చేరుకొన్నారు. శ్రీమట్శ్రీ విద్యారణ్యమహర్షుల ఆశీస్సులతో విజయనగర సామ్రాజ్యాన్ని నిర్మించిన మహనీయులు. హరిహరుడు 1336 నుండి 1356 వఱకు, బుక్కరాయలు 1357 నుండి 1377 వఱకు ఈ సామ్రాజ్యాన్ని పరిపాలించారు. ఇది హిందూధర్మ సామ్రాజ్యంగా విలసిల్లిందన్న విషయం జగద్విదితమే.

ఇక పేర్కొనవలసింది అద్దంకిరెడ్డి రాజ్యాన్నిగూర్చి. ముసునూరి కాపయ నాయకుని బృందంలోనివాడే ప్రోలయనాయకుడు. ఈతని కొడుకులే వేమారెడ్డి మల్లారెడ్డులు. ఈ తండ్రికొడుకులు మువ్వురూకలిసి ఈ రాజ్యాన్ని స్థాపించిన మహనీయులు. కాకతీయ సామ్రాజ్యం పతనమైన వెంటనే, 1323-24 లోనే దీన్ని నెలకొల్పారు. వేమారెడ్డి పరిపాలనలో హిందూధర్మ రక్షణకృషి చాలా నిర్మాణాత్మ

కంగా జరిగింది. తెలుగు సంస్కృతీ సాహిత్య పోషణద్వారా వీరు హిందూ సంస్కృతిని ప్రోదిచేసినవిధం చిరస్మరణీయం. కవిత్రయంలో నొకడైన ఎఱ్ఱాప్రగడ యీతని ఆస్థానకవియే. గోన గన్నారెడ్డి తెగకు చెందినవారే వేమారెడ్డి వంశీయులని చెప్పి విరమించటమైనది.

---

"జాగృతి" అక్షయ దీపావళి ప్రత్యేక సంచిక
సంపుటి: 39 సంచిక: 1. 27 అక్టోబరు 1986.

ఉపయుక్త గ్రంథములు :-

1. కాకతీయ సంచిక. 2. రెడ్డి సంచిక.
3. ప్రాచీన దక్షిణ భారతచరిత్ర-
డా॥ నందూరి రామకృష్ణమాచార్య ఎమ్.ఏ.పిహెచ్.డి.
4. గోన గన్నారెడ్డి - నవల - శ్రీ అడవి బాపిరాజుగారు.
5. రుద్రమదేవి — నవల —
కవిసమ్రాట్ శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు.
6. సమగ్రాంధ్ర సాహిత్యం — కాకతీయ యుగం.
శ్రీ ఆరుద్రగారు.
7. రామగిరి చరిత్ర — కీ.శే. యరబాటి బాబురావు,
ప్రచురణ — రామగిరి దేవాలయ నిర్మాణ ధర్మకర్తలసంఘం,
ప్రతులకు : ఆర్. బాలప్రసాదు,
ఇం. నెం. 4-4-104, శివాలయం వీధి, పో॥ తా॥ పెద్దపల్లి,
జి॥ కరీంనగరం. (ఆం.ప్ర)
8. హక్క — బుక్క — బి. పుట్ట స్వామయ్య,
భారత - భారతి పుస్తక సంపద, బెంగుళూరు — 19.

## మరికొన్ని రచనల పరిగలు - నామమాత్ర పరిచయము

ఈ "ఓగేటి వ్యాసపీఠి"లో చేర్చబడిన వ్యాసములేగాక పరిగలవంటి మఱి కొన్ని చిన్నచిన్నరచనలు మిగిలిపోయినవి. అవి యిందులో చేర్చుటకు అంతగా వీలుగానివి; విడిగా నొకపుస్తకముగా వేయుటకు సంఖ్యలో చాలనివి. అందువల్ల వాటికొక గతిని కల్పింపవలయునన్న తలంపుతో ఈ శీర్షికక్రిందకు తెచ్చి నామమాత్రముగ పరిచయముచేయబడుచున్నది. అశ్రద్ధవల్లను, అజాగ్రత్తవల్లను పోయినవి పోగా అదక్కిన కొన్నింటినిగూర్చి మాత్రమే యిట ప్రస్తావింపబడుచున్నది:.

వ్యాసములు

"సమాజము" ఇదొక లఘువ్యాసము. 1967 ఏప్రిల్ నెల "నవప్రభాత్" అను పత్రికలో ప్రచురింపబడినది.

గ్రంథ సమీక్షలు

"శ్రీకోలాచలం శ్రీనివాసరావు నాటక సాహిత్య సమాలోచనము" డా॥ ఎస్. గంగప్ప గారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమునుండి పిహెచ్.డి. చేసి డాక్టరేట్ పట్టముపొందిన సిద్ధాంత గ్రంథమునుగూర్చిన సమీక్షా వ్యాసము. 1978 సెప్టెంబరు నెల "ఆంధ్రప్రదేశ్" తెలుగు మాసపత్రికలో ప్రకటింపబడినది. ఇది రాష్ట్రప్రభుత్వం ప్రకటించు పత్రిక.

"ఆర్యచారుదత్తము" మఱి రెండు ఇతర గ్రంథములు- ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంనుండి ది. 7-4-1978 నాటి రాత్రి 8-30 గం॥లకు "పుస్తకపరిచయము" అను శీర్షికన ఈ క్రింది గ్రంథములను గూర్చి పరిచయము చేయబడినది. (1) కీ.శే. కోట వీరాంజనేయ శర్మగారు వ్రాసిన "ఆర్యచారుదత్తము" అను నాటకము (2) కీ.శే. రావూరి వేంకట సత్యనారాయణ రావుగారు వ్రాసిన ఒక నవల (3) శ్రీ పైడిపాలగారు వెలయించిన స్వీయ కవితా సంకలనము,

### ఆకాశవాణి ప్రసంగములు

ఆకాశవాణి హైదరాబాదు కేంద్రమునుండి మఱికొన్ని చిన్న చిన్న ప్రసంగములు చేయబడినవి. వానిలో "సుభాషితములు" "మహనీయుల మహితోక్తులు" మొదలైనవి గలవు. ఆ వివరములివి:-

### సుభాషితములు

"వివేకానందునివి" వివేకానందుడు సెలవిచ్చిన సుభాషితములవంటి మహావాక్యములను వివరించుచు వేఱువేఱుతేదీలలో ఉదయం 6-30 గం॥లకు మొత్తము నాల్గు లఘుప్రసంగములు చేయబడినవి. ఆ తేదీల వివరములివి: 6 7-1978, 13-7-1978, 20-7-1978 మఱియు 27-7-1978.

### మహనీయుల మహితోక్తులు

త్యాగరాజుగారివి:- ది. 17-8-1979 నాడు ఉదయం 6-30 గం॥లకు.

అరవిందమహర్షివి:- ది. 7-6-1980 నాడు ఉదయం 6-30 గం॥లకు.

వీరబ్రహ్మేంద్రస్వామివారివి:- ది. 4-11-1980 మఱియు 21-12-1980 నాడు.

పోతన్నగారివి — ది. 26-7-1982 నాడు, మఱియు 8-9-1982 నాడు.

అరవిందమహర్షివి — ది. 12-10-1983 నాడు, మఱియు 28 10-1983 నాడు.

కాళిదాసువి — ది. 11-7-1984 నాడు, మఱియు 11-7-1984 నాడు.

తిక్కన్నగారివి — ది. 17-7-1985 నాడు, మఱియు 2-9-1985 నాడు.

### గ్రంథపీఠికలు

"శ్రీవిద్యాస్తవమ్" అనేక శ్లోకముల సంకలన గ్రంథము. సంపాదయిత: శ్రీ కూరాడ రామచంద్రరావుగారు. ప్రచురణ — శ్రీవిద్యాపీఠం. 4-2-180, సుల్తాన్ బజారు, హైదరాబాదు — 500 001. ఈ గ్రంథమునకు ది. 21-1-1986 నాడు పీఠిక వ్రాయబడినది.

"మహాభారతకథలు" — (అరణ్యపర్వము) రచన — శ్రీ కామరాజుగడ్డ రామచంద్రరావుగారు. పి.జె. 49 పంజగుట్ట కాలనీ. హైదరాబాదు 500482. ఈ గ్రంథము జూన్ 1986 నాడు వెలువడినది. దీనికి ది. 6-6-1986 నాడు విపులమైన పీఠిక వ్రాయబడినది.

# డా॥ ఓగేటి గ్రంథములు - దిఙ్మాత్రపరిచయము

1. "శంకరాచార్య" — పద్యకృతి, 1958.
2. "బందాబైరాగి" — చారిత్రక నాటిక, 1959.
3. "సంస్కృత నాటక ప్రయోగరంగము" - పరిశోధన గ్రంథము, 1975. ప్రచురణ: సంస్కృతథియేటరు, హైదరాబాదు. పుటలు : 132. వెల- పది రూపాయలు. క్రీ.శ. 1874-1975 మధ్యకాలములో ఆంధ్రప్రదేశ్‌లో ప్రవర్తిల్లిన వంద సంవత్సరాల సంస్కృతనాటక ప్రయోగరంగ చరిత్ర యిందు పొందుపరుపబడినది. అప్పటి రాష్ట్ర సాంఘిక సంక్షేమం, సాంకేతిక విద్యామంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారి పీఠికయు, శ్రీ గుండేరావు హర్కారేగారి అభిప్రాయమును ఈ గ్రంథమునకలంకారములు.
4. "స్నేహబంధనమ్" — సంస్కృతములో వ్రాయబడిన సాంఘిక నాటిక, 1978. ప్రచురణ: సంస్కృతథియేటరు, హైదరాబాదు. పుటలు: 36, వెల- రెండురూపాయలు. ఇందులో మొత్తము ఐదు ప్రేక్షణకము లున్నవి (దృశ్యములు) నాల్గు పురుష పాత్రలుగలవు. ఐదవ పాత్రయగు కథానాయకుడు అసలు రంగస్థలమున కనిపించడు. అతనిచుట్టూ నాటకము తిరుగును. స్త్రీపాత్ర లేదు. ఎన్ని అపార్థములు వచ్చినను నిజమైన స్నేహమునకు చరలంటదని నిరూపించు నితివృత్తము. పాత్రలన్నియు హానిహానిగ జీవితమును గడపు మధ్యతరగతి కుటుంబములకు చెందినవే. "ఇతివృత్త" పరముగను, "ప్రయోగ విజ్ఞాన" పరముగను ఇదొక "Experimentel Play అని ప్రశంసల నందుకొన్నది. "భారతీ నిరుక్తి" ప్రణేతలైన హరి సోదరులలో నొకరగు శ్రీ లక్ష్మీ నరసింహ శర్మగారు "జీయాదచ్యుతరామః" అను శీర్షికన వ్రాసిన అయిదు శ్లోకముల ఆశీః ప్రసాదము, సంస్కృతముల్లో

"యశోధరా మహాకావ్యము", "పరీక్షిన్నాటకచక్రము" మొదలైన పలు గ్రంథములు వ్రాసినవారును, మహారాష్ట్ర ప్రభుత్వములో తెలుగుభాషాధికారి ఉద్యోగమునందున్నవారును, ఈ గ్రంథకర్తకు అగ్రజులును అయిన శ్రీ ఓగేటి పరీక్షిత్‌శర్మగారు ''మమ అనుజః'' అన్న శీర్షికన వ్రాసిన మూడు శ్లోకముల ఆశీః ప్రసాదము, ఉస్మానియా విశ్వవిద్యాలయమున భూత పూర్వ సంస్కృతశాఖాధ్యక్షులు ఆచార్య డా॥ బి. ఆర్. శాస్త్రిగారు "ప్రస్తుతిః" అను శీర్షికన సంతరించిన పీఠికయు ఈ నాటకమునకు వెలలేని యాభరణములు.

5. "హిమకిరీటిని" తెలుగులో స్వీయ కవితా సంకలనము. 1981. ప్రచురణ. పావని పబ్లికేషన్స్, హైదరాబాదు. పుటలు, 48. వెల మూడు రూపాయలు. ఇందు 1960-1980 మధ్యకాలములో వివిధ పత్రికలలో ప్రచురింపబడిన గేయ, పద్య ఖండికలు పొందుపరుపబడినవి. జాతీయ సాహిత్యపరిషత్ స్థాపకులు, అధ్యక్షులు అయిన శ్రీ భండారు సదాశివరావుగారు సంతరించిన "భూమిక"యు, మహాకవి, శతావధాని, శివభారత ప్రబంధకర్త డా॥ గడియారం వేంకట శేషశాస్త్రిగారును, ''సరస్వతీ పుత్ర'' — ''పద్మశ్రీః'' డా॥ పుట్టపర్తి నారాయణాచార్యులు గారును నెలవిచ్చిన ప్రశంసలు ఈ గ్రంథమునకు అమూల్యాభరణములు.

6. "స్వామీవివేకానంద కవితావైభవం" — అపూర్వ సాహిత్యవిమర్శ గ్రంథము. 1983. ప్రచురణ : యువభారతి, సికిందరాబాదు. పుటలు 48. వెల: నాలుగు రూపాయలు. ఇందు మూడు భాగములు గలవు. ఒకటి- ఈ గ్రంథకర్త వివేకానందునిగూర్చి అపూర్వ విశేషములతో వ్రాసిన "భూమిక", రెండు- వివేకానందుడు సంస్కృతములో "అంబాస్తోత్రం" "శివస్తోత్రం" "రామకృష్ణ స్తోత్రం" అను శీర్షికలతో వ్రాసిన 26 శ్లోకములకు ప్రతిపదార్థ తాత్పర్యవిశేషాంశములు, అలంకారము, రసము, ధ్వని మొద

లైన కవితా గుణములు, సమకాలీన రాజకీయ సామాజిక పరిస్థితులు మొదలైన విషయములు చర్చింపబడినవి. మూడు— వివేకానందుడు వ్రాసిన ఆంగ్లకవితల నుండి 12 కవితలను స్వీకరించి అందలి విశేషాంశములు మొదలైనవి వివరింపబడినవి. యువభారతి అధ్యక్షులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారు "మామాట" అన్న పేరుతో సంతరించిన పీఠిక దీనికొక చక్కని అలంకారము.

7. "హైదరాబాదునగర తెలుగుభాషా సాహిత్యవికాస చరిత్ర." 1985. ప్రచురణ: "శ్రీ బాబాసాహెబ్ ఆప్టే స్మారకసమితి — ఇతిహాస సంకలన సమితి" హైదరాబాదు. పుటలు: 160. వెల- ఇరువదియైదు రూపాయలు. క్రీ.శ. 1518లో ప్రారంభమైన గోల్కొండ కుతుబ్షాల కాలమునుండి 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన నాటి వఱకు, దాదాపు 450 సంవత్సరముల సుదీర్ఘ కాలఖండమున, హైదరాబాదు నగరములో మాత్రమే ప్రవర్తిల్లిన తెలుగు భాషా సాహిత్యముల వికాస చరిత్ర సర్వతోముఖముగ చర్చింపబడినది. కళాప్రపూర్ణ డా॥ దాశరథి, డి.లిట్ గారు "భాగ్యనగర భారతి" అనుశీర్షికన సంతరించిన పీఠికయు, హైదరాబాదు నగర గ్రంథాలయసంస్థ అధ్యక్షులు, మాన్యులు శ్రీమామిడి భోజిరెడ్డిగారు "ఆశీస్సులు" అన్న పేరుతోను, ఆంధ్ర సారస్వత పరిషద్రథసారథులు, మాన్యులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు "శుభాకాంక్షలు" అను పేరిటను. నెలవిచ్చిన అభిప్రాయములు ఈ గ్రంథమునకు శ్రీరామ రక్ష. ఈగ్రంథము మాన్యులు శ్రీ శ్రీరామ్ శ్రీపాద సాఠే గారికి అంకితమీయబడినది.

8. "ఓగేటి వ్యాస పీఠి" అను "వేంకటేశ్వర తత్త్వమే తిక్కన హరిహరనాథ తత్త్వము" అనునది ప్రస్తుత గ్రంథము.

9. "ఎఱ్ఱన అరణ్య పర్వశేషము—" పి.హెచ్.డి. సిద్ధాంత గ్రంథము.

*—*



## డా॥ ఓగేటి అచ్యుత రామశాస్త్రి,

ఎం.ఏ; పిహెచ్.డి.

ఆంధ్రోపన్యాసకులు-విజయనగర్ కాలేజి ఆఫ్ కామర్సు

విజయనగర్ కాలనీ, హైదరాబాదు-500 457.

జననం : 2 ఆగస్టు, 1932.

ఆంధ్ర-సంస్కృత-హిందీ-ఆంగ్ల భాషల్లో సమ్యక్ పరిచయం. వక్త. కవి, రచయిత, పరిశోధకుడు, గ్రంథకర్త.

2-9-94

7-4-1970లో "సంస్కృత థియేటర్" అను సంస్కృత నాటక ప్రయోగ సంస్థ స్థాపకులు, అధ్యక్షులు, నాటక ప్రయోక్తలు, దర్శకులు, నటులు, గాయకులు.

రంగస్థలంమీద ప్రదర్శించిన, ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంనుండి ప్రసారం చేసిన అనేక సంస్కృతాంధ్ర మహా నాటకాల్లో నాయక ఉపనాయక పాత్రధారులు.

హైదరాబాదులో 1974లో ప్రారంభింపబడిన తొలి సంస్కృత పత్రిక "సంస్కృత భారతీ" సంస్థాపక సంపాదకులు.

హైదరాబాదులో కేశవనగర్ కాలనీలో 1976నుండి నెలకొనియున్న ఉన్నత పాఠశాలా స్థాపకులలో, దాని సర్వతోముఖాభివృద్ధికి కృషి చేసినవారిలో నొకరు. ఈ హైస్కూలు ఇటీవల సరస్వతీ విద్యాపీఠమునకు అనుబంధితమై వర్ధిల్లుచున్నది. విద్యా ప్రచారకులుగా, సామాజిక కార్యకర్తగా మన్ననలు పొందినవారు.

1978లో రాష్ట్ర ప్రభుత్వంచేత ఉత్తమ ఉపాధ్యాయులుగా గుర్తింపబడి "స్టేట్ అవార్డు" పొంది అప్పటి ఆం. ప్ర. గవర్నర్ శ్రీ కె. సి. అబ్రహామ్‌గారిచే సన్మానింపబడిరి.

సంస్కృత నాటక ప్రయోగోద్ధారక, నటరాజరాజ, ఆశ్చర్య కుశలవక్త, మహోపాధ్యాయ, రాష్ట్ర కవి—ఇత్యాది లక్షణాభిధేయులు.

వీరి సాహిత్య రచనలనుగూర్చిన వివరములకు ఈ "ఓగేటి వ్యాసపీఠి" లోని 238, 239, 240 పుటలను చూడగలరు.